# గౌతమీ కోకిల
# వేదుల సాహిత్య వసంతం

( వేదుల సాహిత్య సమీక్ష )

ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి 1990లో
డాక్టరేట్ పట్టం పొందిన సిద్ధాంత గ్రంథం

రచయిత :

భాషా ప్రవీణ

**డా॥ పంపన సూర్యనారాయణ,**

ఎం.ఏ., ఎం ఫిల్., పిహెచ్.డి.,

మహారాణీ కళాశాల

పెద్దాపురం

Goutami Kokila - Vedula Sahitya Vasantam
*By Dr. P. Suryanarayana*, M.A., M.Phil., Ph.D.,

ప్రథమ ముద్రణ : 1992

ప్రతులు : వేయి

వెల : సాదాప్రతి రు. 70-00
మేలుప్రతి రు. 80-00

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయం నాలుగు వేల రూపాయలు

ప్రతులకు:

**పంపన నవభావన**
శ్రీపాదవారి గృహం, ప్రభుత్వ ఆసుపత్రి వద్ద
పెద్దాపురం - 533 437 (తూ. గో. జిల్లా)

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435 విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీట్
హైదరాబాద్ - 500 001
మరియు అన్ని బ్రాంచీలు

ముద్రణ : తారక ప్రభు ప్రింటర్స్, పెద్దాపురం

# అంకితం

# పంపన సత్యం గారికి

అన్నా!

నీ బ్రతుకు పుస్తకం చిరిగిపోయినా
నా పుస్తకం బ్రతుకులో చెరిగిపోవు



అన్నా! నీదు శరీరకష్టమున విద్యావంతునింజేయ నా యౌన్నత్యాధ్వమునన్ విరుల్ విదిర్చి మ్రోడైపోతివే! అరునే కన్నీర్గార్చిన గుండెమంట, కనుకన్ కైమోడ్పుతో నా శ్రమన్ త్వన్నామాంకితముంబొనర్తు మది కొంతన్గొంత చల్లారగన్.



# వేదుల దంపతులు

# తెలుగు విశ్వవిద్యాలయం

## TELUGU UNIVERSITY

**Prof. C. Narayana Reddy**
M.A. Ph.D.,D.Litt
VICE-CHANCELLOR

Lalitha Kala Kshetram
Public Gardens
HYDERABAD - 500 004
Andhra Pradesh

Date - 6. 8. 1992

## అభినందనలు

భావకవిత్వ యుగంలోని ప్రథమగణ్య కవుల్లో వేదులవారిది భద్రాసనం. ఆర్ద్రభావన, అందమైన అభివ్యక్తి వేదులవారి జీవ గుణాలు. ఆయన సురుచిర ప్రతిభాశిఖా విలసనానికి 'దీపావళి' సముజ్జ్వల సాక్ష్యం. ఆయన పద్యంలో పాటతనం పీటవేసుకుంది. అందుకే నన్నయలాగా, కృష్ణశాస్త్రిలాగా ఆయన పద్యాలు అపార మధుర మకరంద నదాలు.

లోగడ అనేక మౌలిక గ్రంథాల ద్వారా తెలుగుజాతికి పరిచితులైన డా॥ పంపన సూర్యనారాయణగారు వేదుల సత్యనారాయణశాస్త్రిగారి సాహిత్య మూల్యాలను పరిశీలించి ఈ గ్రంథంగా రూపొందించారు. ప్రత్యంగ సమీక్షణ పాటవంతోపాటు, రమణీయ శైలి పట్టుపడడం వల్ల ఈ గ్రంథం ఉత్తమస్థాయిని అందుకుంది. వేదులవారి రచనా సర్వస్వానికి నిలువుటద్దం పట్టిన డా॥ పంపన కృషికి నా అభినందన.

సి. నారాయణరెడ్డి

# కోమల కావ్య కౌశల కళా లీలావతి

## వేదుల కవిత్వం

సాధారణంగా ఉత్తమకవులు అగ్నిని దానం చేస్తారు. కవిత్వ పరమైన అగ్ని సర్వథా ఉష్ణధారలనే వెలువరించదు. అది విద్యుత్తు వంటిది; దానిలో నిబిడీభూతంగా ఉష్ణముంటుంది. ఆ ఉష్ణంవల్ల అపక్వములైన జగదనుభవాలు పక్వానుభూతులుగా అందుతాయి. ఖాద్యాలవుతాయి. అనుభోక్తవ్యాలవుతాయి. దానికి అంతర్లీనంగా కాంతి పుంజాలుంటాయి. అవి అజ్ఞాతాంశాలను జ్ఞాత మొనరిస్తాయి. తమోయవనికల అభ్యంతరాలను కూలుస్తాయి. సమస్త వస్తు సంచయ నాన్ని సమీప మొనరిస్తాయి. మానవుల మనోనేత్రాలకు దర్శన భాగ్యం కలిగిస్తాయి.

దర్శనంద్వారా మనిషి ద్రష్టగా మారగలడు. విషయజ్ఞతతో సత్యాన్ని మథించగలుగుతాడు. అపూర్వ జ్ఞానాన్ని ప్రసరించగలుగు తాడు. జ్ఞానం అమృతం వంటిది. అది మథనం ద్వారానే ఉత్పన్న మవుతుంది; దానికి జననమేగాని, మరణం ఉండదు. అది నిరంతరమూ తరంగితమవుతూ — తరం నుండి తరానికి పరంపరాయమాణం కాగలదు.

ఇంత క్రమానుగత పరిణామానికీ కవి ప్రాథమికంగా అందించే అనలమే మూలద్రవ్యం. ఆ అనలదాతలే పురోహితులు. జాతి భవిష్యత్తు పట్ల నిష్ఠతో పూచీకత్తు తీసుకుంటారు. అవిశ్రాంతంగా పరిశ్రమిస్తారు.

ఈ అనలం స్పర్శకు వేడిగా ఉండదు. మునివ్రేళ్ళను కాల్చదు. లోలోపల కుమిలిస్తుంది. వేదుల కవిత్వం ఈ రకానికి చెందుతుంది.

నా ఆరంభ యౌవనాన్ని అతివేలంగా ప్రభావితం చేసిన మహాకవులు కృష్ణశాస్త్రి, వేదుల. వీరిరువురినీ నేను ఆమరణాంతం విడువనేలేదు. కృష్ణశాస్త్రి ప్రభావం తొలకరి మేఘాచ్ఛాదనవంటిది. వేరే వెలుగు కనిపించనీయదు. ఉరుములు, మెరుపులు-ఉటాపు తీగలు-భయం కలిగిస్తూంటాయి. కన్నులు మిరిమిట్లు కొలుపుతాయి. బెంగ ముసిరేది. దిగులు దిగుడు బావుల్లో దింపేది. వేదుల ప్రభావం లోలోపల దొలిచేసే వేదనలా సోకేది. చల్లగా ప్రసరించే కార్తీక జ్యోత్స్న నిభృతశోభ వెన్నంటి వచ్చేది. గుండెల్లో బొట్లు బొట్లుగా ఉగేది. చిట్ట చివర గాటపు అమావాస్య అంధకారంలో పర్యవశించేది. దీపాల సత్కాంతుల నాకస్మికంగా ప్రసరించేది. ఏదో పోల్చుకోలేని అనల్పానుభూతిని గుండెల్లో నింపేది.

కృష్ణశాస్త్రి గురించి ఏదేనా రాదామనుకుంటే చాన్నాళ్ళు కలానికి కంపరం కలిగేది. చివరకు రాయకనూ తప్పిందికాదు. వేదుల గురించి రాదామంటే ఒక ఆవేదన ముప్పిరి గొంటుంది. ఒక గ్రంథం రాదామని ఎన్ని సార్లు అనుకున్నా అభ్యంతరం ఎదురయ్యేది. ఇన్నాళ్ళకు నా కోరిక 'పంపన' కృషివల్ల సఫలమైంది.

ఆషాఢమేఘం వంటి పద్యాలు మళ్ళీ మళ్ళీ ఎన్నివందలైనా రాయగల శక్తి వేదుల సొత్తు. వ్యుత్పన్నత కీడైన ఇంత అమోఘ సాహిత్య సంపదను యివ్వగలిగి — ఆయన కొడిగట్టి పోయాడు. వేదుల ఉదాత్త కవితా ప్రతిభను అవిరళంగా నివేదించడానికి వారు మనకిచ్చి వెళ్ళిపోయిన కవితా సామగ్రి చాలదా! నిజానికదే చాలు, పదివేలు! ఐనా తృప్తి ఎక్కడ? ప్రతి కవీ ఒక రవీంద్రుని రీతిగా చివరి నిముషం వరకూ కవితా రచన చేస్తూ కవిగానే జీవించాలి. ఈ కాంక్ష సక్రమమైనదే! ఈ అవిశ్రాంత కృషికి కవి ధనాఢ్యుడే

కానక్కరలేదు. మరి మక్సీమ్ గోర్కీ మాటేమిటి? విక్టర్ హ్యూగో మాటేమిటి? షెల్లీ, కీట్సులు కవులుగా బ్రతికిందెన్నాళ్ళు? నిండా పదేళ్ళయినా ఉంటుందా? మరి వాళ్ళెందుకంత అమేయ సాహిత్యం సృజించ గలిగారు? కనక ఒక కవి విరివిగానూ అనుస్యూతంగానూ కవిత్వ రచన చేయడానికి, చేయకపోవడానికి ఏవో బాహ్యమైన భౌతిక కారణాలు చెబితే నేను సహించను. కవి గుండెల్లో అహరహం పరిభ్రమించే ఒక డైనమో, ఒక జనరేటరు ఉండాలి. అది నిరాఘాటంగా విద్యుత్తును ఉత్పత్తిని చేస్తూనే ఉండాలి. ఆ డైనమో శక్తి ననుసరించే ఒక కవి రచించే కవిత్వపు విరివీ, పురీని! కవి బాధ్యత ఆ జనరేటరును సదా సంచలనశీల మొనర్చడమే. అదే విస్మరించి లోకయాత్ర సాగించుకుంటూపోతే, కవి బ్రతుకు నిరర్థక మవుతుంది. పక్షులు ఎగరగలవని నిష్ప్రయోజకంగా ఎన్నడూ ఎగరవు.

ఆంధ్రకవిత్వ చరిత్రకు — అపూర్వ ఓజస్సునూ, జీవకళనూ సంతరించిపెట్టిన భావకవిత్వం గురించి - దురదృష్టవశాత్తూ గత ఆరు దశాబ్దాలుగా ఎన్నో అపవాదుల నీలినీడలే వ్యాప్తమయ్యాయి. దీనికి కారణం కొంత కవుల పక్షానా జరిగింది. అధికతరంగా సమగ్రావగాహనలేని విమర్శకుల అశ్వావలోకన పాండితీవల్లనూ విస్తరించింది. సాహిత్య రంగంలోకూడ కొన్ని ఏకకణ జీవులుంటాయి. అలాంటి వాటికి చుట్టుచూపు లోపిస్తుంది. ముందు కలిగిన ఆలోచనను పునర్విచారణ చేయడమంటూ ఉండదు. అలాంటివారు భావకవితా యుగం సాధించిన అపూర్వ విజయాలను అంచనా వేయలేక పోయారు. దీని ఫలితంగా భావకవులంతా జీవన వాస్తవికతను విడిచిపెట్టి దూరంగా పలాయనం చేసిన పారుబోతులన్న అభియోగం వ్యాపించింది. లేనిపోని ఊహాప్రేయసిని పట్టుకొని దేవులాడిన బాధ్యతారహితులన్న నింద విస్తరించింది. భావకవులనగానే ఊహాప్రేయసీ విప్రయోగ విషాద భాజనులనుకోవడం ఒక రొడ్డకొట్టుడు!

19వ శతాబ్దం చివరి వరకూ తెలుగు కవిత్వం దేవతలతోనో పితృదేవతలతోనో నిండిపోయింది. వారి గాథలతోనూ బాధలతోనూ పిష్టపేషణమైంది. ప్రధానంగా ద్వితీయ పురుషార్థానికే ప్రాణాధారమైంది. ఫలశ్రుతిగా మాత్రం చతుర్థ పురుషార్థాన్ని ప్రబోధిస్తున్నట్లు నటించింది.

లోతుగా ఆలోచిస్తే ఇరవైయో శతాబ్దంలోనే - అదన్నీ ఆధునిక కవిత్వానికి అద్యుడైన గురజాడతోనే వర్తమాన జీవన ప్రమాణాన్ని కవిత్వం స్వీకరించింది. ప్రేమ అనే హార్దిక ధాతువును నేర్పేందుకు ఒజ్జలెవ్వరూ యీ దేశంలో లభింపక - పాశ్చాత్య కవుల కృపవల్ల మనకవులు నేర్చుకోగలిగారు. ఆ విషయం గురజాడ వాచ్యం చేశారు కూడ.

ఆనాటి యువతీ యువకులు హైస్కూళ్ళ పైతరగతులకో; కళాశాలలకో చేరే సమయానికి ఆరంభయౌవనులై - పరస్పరం చూసుకొని, ఆకర్షించుకొని, కల్సుకొని - ప్రేమించుకో నారంభించారు. కాని వారిలో అధిక సంఖ్యాకులకు బాల్యంలోనే వివాహమైపోయిన సంగతి వారికి హృదయ స్పృహ లేదు నూత్న ప్రేయసుల వియోగాలు అనివార్యమై _ వివాహబంధం బలీయమై పోయింది. కవులకు వియోగ దుఃఖమూ నిర్నిరోధకమైంది.

"ప్రబల తాప విదీర్ణమై బాష్ప వారి - పదను వారిన యెద ప్రేమ పాదుకొన"గా అది స్వేచ్ఛగా కావ్యవస్తువై భాసించింది. ఆ ధైర్యాన్ని ఇరవయ్యో శతాబ్దపు కొత్త విద్యా విధానం కలిగించింది. పరిస్థితులు స్వేచ్ఛా పిపాసతో కళవళ పడుతున్నాయి. ఆ భావ సాంద్రత కవుల స్వీయాభివ్యక్తిగా పరివర్తించింది. సహృదయ కవులు భావనా పారవశ్యాన్ని రసించారు. అంతేతప్ప అదేదో ఊహాత్మకమని నిరసించడం ఎలా సంగత మవుతుంది?

అదేదారిలో వేదుల వేదన సాగింది. గానంగా పర్యవసించింది. "ఆమె నవనీత హృదయ, నా అంతరంగ శాంతి దేవత" అన్నప్పుడు పాఠకుడు సహృదయతతోనే దాన్ని అనుభవించాలి. సమభావుకత్వంతోనే రెక్కలల్లార్చాలి. లేకపోతే శూన్యమే లభిస్తుంది. సహృదయత నిహితమైనపుడే - "Art is the truth in the form of imagery" అనే ఉదాత్త నిర్ణయం-నూత్న తీరానికి చేరుకుంటుంది.

వేదుల పేదరికపు పసివాళ్ళు పడిపడీ - గుండెల నిండా కవితా మాధుర్యాలను ఒక తెరపిగా నింపుకున్న సిద్ధుడు. అష్టంగానూ అర్ధ్రంగానూ దరిచేరి తన బాధా గాథల్ని విన్నవించుకుంటాడు. విన్నపాలతోపాటే - కవితా విద్యుదేఖల వెలారుస్తున్నట్లు ద్యోతకమవుతాడు.

Mikhail lifshitz అనే కవిత్వవేది ఉద్ఘాటించునట్లుగా "Poetry is the art of real and true ideas, and not false sensations" అనే అవగాహనకు మనల్ని సునాయాసంగా చేరుస్తాడు.

అలాంటి వేదుల కవీశ్వరుడు, గౌతమీకోకిల కవితా హృదయాన్ని లోలోతుల పరిశీలించి యింత ఉదాత్త గ్రంథమందిస్తున్న డాక్టరు పంపన సూర్యనారాయణ అభినందనార్హుడు. మన పరిశోధనా సాహిత్య భాండారానికి ఒక ఉజ్జ్వల మణిదీపాన్ని కైసేస్తున్నాడు. నా మాటను పాటించి పునర్నిర్మించిన సిద్ధాంత వ్యాస ముద్రిత ప్రతిని యిప్పుడే - ఆహ్లాదంతో ఆమూలాగ్రంగా చదివి ముగించాను. అవిరళ పఠనోత్సుకత కలిగించిన ఈగ్రంథ విజయం ప్రధానంగా ప్రశంసనీయం.

సాహిత్య ప్రియంభావుకు లందరికీ అవశ్య పఠనీయ గ్రంథాన్ని అందిస్తున్నందుకు ఈ మిత్రునికి శుభాశంస లందిస్తూ-

కళాకేళి నికేతన్
పిఠాపురం

సోమసుందర్ ఆవంత్స
15 - అగస్టు 1992

# ఆద్యంతాలు

కాపుర మెక్కడున్న గతకాలము, వాణి కటాక్షమబ్బి పె
ద్దాపుర వాసినై సుకవితా పరిశోధన జేయువేళ వే
రే పయివారి దీసికొన నేలని వేదుల నెన్నుకొంటి త
ద్దీప సమూహ ముక్తఝరి దీప్తుల నాంధ్రి నలంకరింపగన్

నాకు ప్రాతఃకాల స్మరణీయులు ఒకరు శ్రీ మూర్తి రాజు గారు; రెండవ వారు శ్రీ సత్యనారాయణరావుగారు. ఒకరు విద్యను, మరియొకరు ఉద్యోగాన్ని కడుపులో చల్ల కదలకుండా కల్పించిన మహాపురుషులు. ఎలాగంటే - ఇంటిలో భోజనం, ఇంటి ముంగిట ప్రాచ్యకళాశాల నేర్పాటు చేసిన మహాత్ములు ప్రథములు కాగా పాండిత్యం కొలమానంగా, తక్కినఅన్నింటికి అతీతంగా వ్యవహరించిన మహానుభావులు ద్వితీయులు. ఈ విధంగా నేను పత్తేపురం నుండి పెద్దాపురం చేరుకున్నాను.

పరిశోధనాంశం ఎంచుకునే సమయానికి "ఉన్నయూరు కన్నతల్లియు నొక్క రూపన్న" శ్రీనాథుని సూక్తి గుండెకు పట్టిఉంది. అందుచే ఎక్కడో పుట్టి, ఎక్కడెక్కడో తిరిగి ఉద్యోగమే పాథేయంగా సాహిత్య జీవనయాత్ర సాగిస్తూ పెద్దాపురంలో స్థిరపడి, తత్ పౌరునిగా తుది శ్వాస విడిచిన వేదుల ఎదలో మెదిలారు. అదీకాక భావకవితా ప్రపంచంలో కవల కవీశ్వరుల్లో ఒకరైన దేవులపల్లి వారి గూర్చి సిద్ధాంత వ్యాసం రావడం, రెండవ వారైన వేదులవారి గురించి ఒకరిద్దరు పరిశోధన ప్రారంభించి చేతులెత్తేయుడం విని మనసు చివుక్కు మనిపించింది. ఒరులు చేయలేనిది చేయాలనేది నా జీవలక్షణం మీదుమిక్కిలి "స్వార్థము తీర్థముం

గలిసివచ్చు విధంబున" ఇటు పరిశోధనకు, విమర్శకు సంకేతమైన పిహెచ్.డి కి, అటు చోటిచ్చిన పెద్దాపురం ఋణం తీర్చుకోవడానికి బాగుంటుందనిపించింది. అంతే - పైపద్యం హృదయంలో నుండి ఉద్వేగంతో ఉబికి వచ్చింది. ఇది సముద్రంలో ఉప్పు అడవిలో ఉసిరిక వంటి కలయిక. ఈ పద్యాన్ని విన్న సిద్ధాంత వ్యాస పర్యవేక్షకులు సౌజన్యమూర్తులు జాతీయాచార్యులు డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు గారు సరే కానిమ్మని తమ ఆమోదముద్ర వేశారు. నా నిర్ణయాను సారంగా వేదులవారి శ్రీమతి కృష్ణవేణమ్మ గారు తమ వంతు పాత్రను నిర్వహించారు.

వేదుల వారితో సన్నిహిత సాహిత్య సంబంధమున్న ఆధునికాంధ్ర కవీంద్రులు శ్రీ ఇంద్రగంటి, ఆవంత్స వారల రచనల సూచనల ప్రభావం వల్ల బుచ్చిబాబుగారి 'చివరకు మిగిలేది' నవల లోని "భావకవిత్వాన్ని విమర్శించడం లాంటిది సుశీల మనస్సు కనుక్కోవడం" అనే వాక్యం నా మార్గం నుండి ప్రక్కకు ఒత్తిగిలి పోయింది.

వేదుల జీవిత చరిత్ర విషయంలో కొంతలో కొంత సమాచార మందించినవారు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో పనిచేస్తున్న శ్రీ పి. యస్. భట్టుగారు. కథల విషయంలో కొంత బాటవేసి ఉంచిన వారు ఇజ్జాడ వేంకటరావుగారు. మరికొంత విషయ సేకరణలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు, గౌతమీ గ్రంథాలయం, వేటపాలెం, కుముదవల్లి గ్రామాలలోని గ్రంథాలయాలు చాలవరకుపయోగపడ్డాయి

ఈ సాహిత్య యజ్ఞ దిగ్విజయానికి చేయూత వాయూత లందించిన సహృదయులు డా॥ జి. చిరంజీవులుగారు, జె. సి. పద్మ నాభంగారు, శతావధాని సత్యకవిగారు, పోచిరాజు శేషగిరిరావుగారు, అల్లంరాజు లక్ష్మీపతి గారు, డొంకాడ సత్యనారాయణమూర్తి గారు,

మధునాపంతుల వేంకట పరమయ్యగారు; మిత్రులు పోలా రామకృష్ణమూర్తిగారు, జి. పి. మావుళ్ళయ్యగారు, పడాల సత్యనారాయణమూర్తి గారు, దాట్ల బలరామరాజుగారు, సన్నిధానంవారు, పృథ్విగారు, భాస్కర కుమార్‌గారు; సోదరులు శీలం వేమనరావు, వై. సూర్యనారాయణ, అప్పలు యం. వి. శర్మ గారు, కె. పోతరాజు గారు పెద్దాపురం శాఖా గ్రంథాలయ సిబ్బంది ముఖ్యంగా భాస్కరరాజు గారు మున్నగు పరోపకార పరాయణు లెందరో!

శ్రద్ధాభిమానాలతో గ్రంథ ముద్రణ గావించిన తారకప్రభు ప్రింటర్స్ యజమానురాలు చిరంజీవి సోదరీమణి జయంతి లక్ష్మి ప్రసన్నకు, అలాగే కవరు పేజీని అందంగా అందించిన రాంషా శిరీషా పబ్లికేషన్స్ అధినేత శ్రీ పూషా గారికి ప్రత్యేకాభినందనలు.

పుస్తక ముద్రణకు ఆర్థిక సహాయమందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి ధన్యవాదాలు.

ఆదిలో చెప్పవలసిన మాట. అసలాయన వారణాసివాసులైతే ముగింపు పర్యవేక్షకత్వ బాధ్యతని వహించిన సహృదయ సమ్రాట్టులు ప్రాచార్య యస్వీ. జోగారావుగారు. నా కృషికి డాక్టరేటు డిగ్రీని ప్రసాదించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి, ముఖ్యంగా తెలుగుశాఖ వారికి, పరీక్షకులుగా వ్యవహరించిన డా॥ టి. సుశీలగారికి, డా॥ బి. రుక్మిణిగారికి, డా॥ ఎన్. శివరామమూర్తి గారికి సప్రశ్రయ ప్రణామములు.

తెలుగు సాహిత్య సరస్వతి దౌర్భాగ్యమో, వేదుల దరిద్రాణమో, నా దురదృష్టమో కాని ఓ పరీక్షకునికి తన నిర్ణయాన్ని పంపడానికి రెండు సంవత్సరాలుపైన దాటింది. శివుడు తమోగుణాన్ని వీడటానికి శ్రీ జగన్నాథ బ్రహ్మాదిదేవతలు పూనుకోవలసి వచ్చింది. నాకు డిగ్రీ రావడానికి సుమారు మూడు సంవత్సరాలు పట్టింది. 'సారీ'

చెప్పినంత మాత్రాన భారీనష్టం పూడుతుందా! నేను క్షమ వహించినా సాహిత్యలోకం ఆయన్ని క్షమిస్తుందా!

పెద్ద పదవుల్లో కుదురుకున్న మస్తకాలకు నా పుస్తకం ఆనక పోయినా, ఔన్నత్యాన్ని గుర్తించే సాహిత్య హంపీరులకు తెలుగు దేశం గొడ్డుపోలేదనే ధైర్యం ముద్రణకు ముందుకు గెంటింది; అప్పు చేసి పప్పుకూడుకు పురిగొల్పింది.

సామాన్యపు రైతుబిడ్డ తండ్రికి వ్యవసాయంలో సాయపడుతూ, రెక్కల కష్టంతో చదువుకొని పిహెచ్.డి వరకు రావడం, అందునా తెలుగులో పండితుడు కావడం నా గొప్పతనం కాదు; మా అమ్మ నాకు పంచిపెట్టిన ఓర్పు ప్రభావం. ఇది దేశంలో వచ్చిన చైతన్యానికి అభివృద్ధికి నిదర్శనం.

న తితిక్షా సమమస్తి సాధనమ్

## కొసమెరుపు

'స్పందన' అడిగితే నందించి 'అభినందనల' నందించిన పలుకెల్లా బంగారం, నిలువెల్లా చైతన్యవంతులైన జ్ఞానపీఠ బహుమతి గ్రహీతలు, కులపతులు, ప్రభుత్వ భాషా, సంస్కృతి సలహాదారులు ప్రొచార్య సి. నారాయణరెడ్డిగారికి అభివందనలు.

వాసిగ స్వీయ వేదనల భావ కవిత్వరుచిన్ వెలార్చి ఈ
వ్యాసము సర్వమున్ విని సమంచితమౌ సలహాలనిచ్చి నా
చేసిన చేతకున్ మురిసి జీవన శైలికి సూత్రధారియై
భాసిలు సోమసుందర కృపా ప్రతిభాఢ్యునకున్ కృతజ్ఞతల్

వినాయక చవితి, 1992 } రచయిత



# విషయ సూచిక

# గౌతమీ కోకిల వేదుల సాహిత్య సమీక్ష

## I. వేదుల సాహిత్య నేపథ్యము

### వేదుల వైశిష్ట్యం:-

ప్రగాఢమైన ప్రతిభాప్రాభవం, పారంలేని పాండితీ పాటవం, ఈ రెండింటితో పొత్తు కుదరని క్రియాశీలమూలక సంఘ సంస్కర ణాభిలాష ఏకత్రరాశీభూతమైన త్రివేణీ సంగమం గౌతమీ కోకిల వేదుల సత్యనారాయణశాస్త్రి. జీవన గానముల రెండింటి యందు కోయిలను తలపించే ప్రస్థానం వారిది.

రెడ్డికం వేసికొని మహాకావ్యమేదీ వ్రాయకపోయినా, వారి ఖండ కావ్యాలలో ప్రథమం, ప్రఖ్యాతం అయిన 'దీపావళి' తెలుగు సాహిత్యనగరిలో భావ కవితావీథికి నిత్య దీపావళి. దీనికి కీస వెలితిగా తులతూగే ఇంకొక ఖండకావ్యం ముక్తఝరి.

వంగభాషను కొల్లగొట్టి ధర్మపాలుడు, వినోదిని మొదలైన నవలల్ని తెలుగు వారి కందించి ఆంధ్ర నవలా సాహిత్య పరిపుష్టికి దోహదం చేశాగు. 'రాణాప్రతాపసింహ' నాటకం రచించి తెలుగు ప్రజల్ని స్వాతంత్ర్య సముపార్జనానికి పురిగొల్పారు. 'కాలేజి గరల్' అను సాంఘిక నాటకాన్ని వ్రాసి దురాచారమైన కన్యాశుల్కాన్ని తెగనాడారు. కథా కథనకౌశలం దీపింపగా 'ఆర్తనాదము' మొదలైన కథలతో 'వెలి' మున్నగు సాంఘిక దురాచారాల్ని తూర్పారబట్టారు.

శిల్పభూములైన భాస నాటకాలలోని కల్పనా సౌందర్యాన్ని తేటతెలుగు గుబాళింపుతో తెలుగువారి కందింప యత్నించినారు. రవీంద్రుని బాలసాహిత్య కిరణావళిని తెలుగు సాహిత్యాకాశంలో ప్రసరింప చేశారు. యోగిశ్రేష్ఠుడైన 'రామకృష్ణ పరమహంస' జీవిత చరిత్ర వ్రాయుడం ద్వారా వేదాంత వ్యాప్తికి నడుం కట్టారు.

'కొండ యద్దమందు కొంచెమై యుండు' నట్లు భారతాన్ని 'విజయప్రభ' పేరుమీద బాల బాలికలకు కరతలామలకం గావించారు.

'జానపదవాఙ్మయం' మొదలైన విమర్శన వ్యాసాలు రచించారు. పీఠికలు వెలయించారు. ఆకాశవాణి ద్వారా సాహిత్య ప్రసంగాలు చేశారు. ఉపాధ్యాయత్వానుభవాన్ని పురస్కరించుకొని విద్యార్థులకు వాచకాల్ని సంతరించారు.

నూనూగు మీసాల నూతన యౌవనంలో అవధానాలు నల్లేరుపై బండినడకగా సాగించి శతావధానిగా వాసికెక్కారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిచే 'మహాకవి' బిరుదంతో సన్మానింప బడ్డారు. రాష్ట్ర, రాష్ట్రేతర సాహిత్యాభిమానులచే సత్కరింప బడ్డారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వంతో గౌరవించ బడ్డారు.

కనక ఇట్టి మహానుభావుని సాహిత్య విశిష్టతని పర్యాలోచన చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. అందుచే అలా చేయడానికి ముందు వారెదిగి వచ్చిన కాలపరిస్థితుల్ని, తన్నే పథ్య సాహిత్యాన్ని తెలిసికోవడం ముఖ్యం.

## ఆధునికాంధ్ర కవితా యుగోదయం:-

19వ శతాబ్దం ప్రారంభం నాటికి భారతజాతి నిర్వీర్యమై, నీరవమై, నిస్తేజమై, నిద్రాణమై కొడిగట్టిన దీపంలా ఉంది. ఇట్టి భారతజాతి పునరుజ్జీవనరూపంలో ఆధునికాంధ్ర కవితాయుగోదయానికి ఆంగ్ల ప్రభుత్వం, ఆంగ్ల విద్యాభ్యాసం, క్రైస్తవ మిషనరీలు, విజ్ఞానశాస్త్ర పురోభివృద్ధి, పత్రికావ్యాప్తి, చరిత్ర పరిశోధన, ద్రావిడ భాషావాదం, సంఘసంస్కరణోద్యమం, జాతీయోద్యమం ఇత్యాదులు ఓహరి సాహరిగా హేతుభూతాలయ్యాయి.

వీటిపై రాజా రామమోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, విలియం బెంటిక్, రామకృష్ణ వివేకానందులు, స్వామి దయానంద సరస్వతి, అనిబిసెంటు, విలియంకారీ, కాల్డ్వెల్, ఎల్లిస్, సి. పి. బ్రౌన్, అక్టేవియస్ హ్యూమ్, తిలక్, గోఖలే, వీరేశలింగం పంతులూ మొదలైన రథసారథుల ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కొంచెమో, గొప్పో లేకపోలేదు.

## కందుకూరి:-

పైన పేర్కొన్న వ్యక్తుల్లో రాజా రామమోహన్‌రాయ్ భారతదేశం యొక్క పునరుజ్జీవన భాగ్యవిధాత. ఆంధ్రదేశ రాజా రామమోహన్‌రాయ్ - కందుకూరి వీరేశలింగం. ఈయన ఒక చేత్తో సాంఘిక విప్లవాల్ని, మరియొక చేత్తో సారస్వత విప్లవాల్ని గావించిన సవ్యసాచి.

బాల్య వివాహం, కన్యాశుల్కం, వర్ణవ్యవస్థ మొదలైన మూఢాచారాలతో ఆంధ్రమాత ఎంత విలపిస్తుందో; చర్విత చర్వణ ప్రబంధ వర్ణనాలు, పాండిత్య ప్రకర్ష నిరూపక ఖడ్గచక్రాది బంధాలు మొదలైన వాటిచే రసహీనమై ఆంధ్ర సరస్వతి అంత శుష్కించి పోతుంది. ఆ శుష్కించిపోవు ఆంధ్ర సరస్వతి పడుతున్న వేదనయే కందుకూరి 'సరస్వతీ నారద సంవాదము.'

ఇట్టి తరుణంలో వీరేశలింగం ఆంగ్ల సారస్వత ప్రక్రియాఝురుల్ని ఆంధ్ర వాఙ్మయ క్షేత్రంలో ఓతప్రోతముగా ప్రవహింపజేసి సాంఘిక ప్రయోజనకర సాహిత్యానికి అపర భగీరథుడైనాడు.

## గురజాడ:-

వీరేశలింగం స్థాపించి పురోగమింప జేసిన సంఘ సంస్కరణోద్యమ సాహిత్యానికి కన్యాశుల్కం నాటకం ద్వారా దోహదం

చేశారు గురజాడ. ఈయనే దేశీయచ్ఛందస్సును పునరుద్ధరించి ఆధునిక కవితా బీజావాపనంగా ఉదాహరణ మాత్రాలైన గొప్ప కవితల్ని వెలయించి గురజాడ వాల్మీకిగా కీర్తి పొందారు.

1910 తెలుగు కైత పొలం మలుపులో ఒక మైలురాయి. ముత్యాల సరములు వెలువడటం ప్రారంభమైంది ఈ సంవత్సరమే.

ఇందలి నవ్యతాగుణాలు మూడు. అవి ఛందస్సు, భాష, వస్తువులు. గురజాడ విడిచిపెట్టింది గణ యతి ప్రాసలతో కూడిన ఛందస్సు. చేపట్టింది మాత్రాచ్ఛందస్సు. ఈ నూతన చ్ఛందస్సున కాయన పెట్టిన పేరు ముత్యాలసరములు. ఈ పేరు గురజాడ ఉపజ్ఞ.

సమాసాడంబరం, వ్యర్థ కఠిన పద దూరమైన తేట మాటల కూర్పు రెండో గుణం. ఇందు వాడింది అసలు సిసలైన తెలుగు పలుకుబడి. దీనితో గురజాడకు వాడుకభాషకు పట్టం గట్టిన కీర్తి లభించింది.

అస్పృశ్యత, కన్యాశుల్కం వంటి సాంఘిక సమస్యలు ముత్యాల సరాలలోని వస్తువులు. ఒక్కమాటలో సామాజిక స్పృహకు నిలువుటద్దం.

అంతేకాక, ఖండకావ్య రచనకు, ఆత్మాశ్రయ కవిత్వానికి మార్గదర్శకుడు గురజాడ.

"విరిగి పెరిగితి; పెరిగి విరిగితి
కష్టసుఖముల పారమెరిగితి"[1] అనే దానిలో భావ వస్తువును ఖండకావ్య కవితా సామగ్రిగా గైకొన్నాడు.

---

1. గురజాడ రచనలు - కవితల సంపుటం-పుట 69.

అందుచే కృష్ణశాస్త్రిగారిలా అన్నారు.

"ఈ నవ్య కవితోద్యమం అంటే 1915 తరువాత ఎక్కువగా విజృంభించిన ఆత్మపరమైన కవిత్వానికి చెందినదని కొందరంటారు. నా అభిప్రాయం ప్రకారం ఈ కవిత్వ గోపురం పునాది గురజాడవారే వేశాడని, 'పెరిగి విరిగితి' వంటి కావ్యంలో దానిమీద రాయప్రోలూ, బసవరాజూ కొంత నిర్మాణం సాగించారు. నాయని ప్రభృతులు శిఖరం కట్టారు. కాని మా కాలపు కవులందరూ ఆత్మపరమైన కవిత్వం కొంచెమయినా వ్రాశారు."1

ఇటు ఉటంకింపబడ్డ వారందరికీ గురజాడ మార్గదర్శకుడవడం చేతనే సాహిత్యవేత్తలాయన్ని ఆధునికాంధ్ర కవితా యుగకర్త పీఠాన్ని అధివసింప జేశారు.

## రాయప్రోలు:-

ఆదిలో ఆశుకవితా ప్రవాహంలో కొట్టుకపోయి, జంటకవుల సుడిగుండంలో ఇరుక్కొని, అదృష్టవశాన ప్రవాహమాగిపోగా, ఆంగ్ల కాల్పనిక కవితా శాఖాలంబనంతో రమ్యాక్షరక్షోణికి కొట్టుకువచ్చి, అమలిన ప్రేమసిద్ధాంతం నీడలో సేదదీరి, రాటుదేరి భావకవితాపథ నిర్దేశకుడై దేశభక్తి ప్రబోధం గావించారు రాయప్రోలువారు.

దేశభక్తి, సంఘసంస్కరణ, వస్తునవ్యత, సంవిధాన నవ్యత, ప్రేమ, ఆత్మాశ్రయధోరణి, అస్పృశ్యతనివారణ వీరి రచనల్లో కన్పించే నూతన విశిష్ట లక్షణాలు. వీరు ఈ కవితకు 'అభినవకవిత' యని పేరు పెట్టగా గాడిచర్ల వారు 'భావకవిత్వము' అన్నారు. చివరకి చివరదే రూఢి అయింది.

1. పాతికసంవత్సరాల తెలుగుకవిత్వము-సారస్వత వ్యాస. పుట 365

**మార్గదర్శకులు:-**

ఈ నూతన మార్గాల్ని ఆకళింపు చేసికొని వేదులవారు తమ కవితా పథాన్ని నిర్మించుకొన్నారు. ఈ విషయాన్ని వారే ఇలా అన్నారు.

"గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు మొదలైన వారు అప్పటికే ఒక విధ మయినటువంటి మార్పు మొదలెట్టారు. అసలు వస్తువులో కానీ, పద బంధంలో కానీ దేంట్లో నైనప్పటికి ఎక్కువగా చదువుతూండే వాడిని."[1]

దీన్నిబట్టి గురజాడ, రాయప్రోలు ఇరువురూ వేదులకు మార్గదర్శకులవడం స్పష్టం. ఇందు 'అప్పటికే' అంటే 1919లో వేదుల కాకినాడలో ఉన్నప్పటికే అని అర్థం. 'మొదలైనవారు' అనే పదానికి ముఖ్యంగా వేంకట పార్వతీశ్వర కవుల్ని, కృష్ణశాస్త్రిని గ్రహించాలి. ఎంతోకొంత నవ్యత్వానికి కారకులైన వీరి ప్రభావం వేదులపై ఉండడమే అట్లనడానికి కారణం.

**వేంకట పార్వతీశ్వర కవులు:-**

వీరు నవ్యకవుల్లో ప్రథమ శ్రేణికి చెందిన వారనడం నిర్వివాదాంశం. 1902 నాటికే ఒకటీ, రెండు పద్యాలలో ఏకవస్తు వర్ణనం చేసి దానికి సాహసంతో ఖండకావ్యమని పేరు పెట్టారు. నవ్య కవిత్వ ప్రభాత ప్రాంగణంలో నిల్చొండి మధుర భక్తి గీతాల్ని మృదు మధురంగా ఆలాపిస్తూ 'ఏకాంతసేవ' గావించా రీజంట కవులు.

**దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి:-**

విశ్వనాథ వారన్నట్లు "ఉల్లోక మగు కూర్పు టుదుకులో

---

1. నా సాహిత్య యాత్ర - అముద్రితము పుట 3

కూటస్థుడైన"[1] కవి కృష్ణశాస్త్రి. సాంఘిక నియమాల నుండి, భాషా బంధనాల నుండి స్వేచ్ఛకై కలం పట్టిన వ్యక్తి. దుఃఖంలోని సౌఖ్యాన్ని తెలిసికొన్న మనిషి. యథార్థ ప్రేయసికి ఊహానామ మిచ్చి విప్రలంభ శృంగారాన్ని ఆరాధించిన ఆద్యకవి.

## జీవిత చరిత్రావశ్యకం:-

కృష్ణశాస్త్రి వలెనే వేదులకు ప్రణయ మాధుర్యం, ప్రకృతి సౌందర్యం, వేదన, దైవాన్వేషణం మొదలైనవి కవితా వస్తువులు. ఆత్మాశ్రయంగా సాగిన వీటి సమగ్రావగాహనానికి కవిగారి జీవిత చరిత్ర తొట్టతొలుత తెలిసికోవడం అవసరం.

ఆధునిక కవి జీవిత చరిత్ర అవసరాన్ని గూర్చి ఖండవల్లి లక్ష్మీ రంజనంగారిలా చెప్పారు.

"పూర్వకవి యొక్క నామ రూప రహస్యములు మన కవిదిత మైనను అతని కావ్యములను మన మన్వయించి యానందింప గలము. భావకవి యొక్క జీవిత యవనిక తొలగించి చూడక మనమాతని కృతి యందలి రసమును సమగ్రముగ నొక్కొక్కప్పుడు చర్వణ చేయజాలము."[2]

మీదు మిక్కిలి వేదుల సాహిత్యం పడుగుపేకవోలె వారి జీవనంలో కలిసిపోయి ప్రవృద్ధమైంది. ఇట్టి అవినాభావ సంబంధ మున్న వారి జీవన సాహిత్య వికాస ప్రస్థానాన్ని తెలిసికుందాం.



---

1. కేదారగౌళ - పుట 18
2. లక్ష్మీరంజన వ్యాసావళి - పుట 239

## II. జీవిత ప్రస్థానము - వ్యక్తిత్వము

### వేగుబోకలో గౌతమీ కోకిల:-

"ఇరువదియవ శతాబ్ది యుదయింపనున్న వేగుబోకలో నక్షత్రమువలె మన సారస్వతాకాశమున నవ్య కాంతులతో ఆవిర్భవించిన నూత్నాంధ్రకావ్యము."[1] అని పింగళి లక్ష్మీకాంతం గారిచే కొనియాడ బడింది కట్టమంచి రామలింగారెడ్డి గారి 'ముసలమ్మ మరణం'. ఈ నవ్యకాంతుల వేగుచుక్క 1889లో వ్రాయబడింది. కాని పందొమ్మిదవ శతాబ్దాంతమునందే (మార్చి 1900) ప్రచురింపబడింది. ఇదే వత్సరంలో, ఇదే నెలలో (20-3-1900 వికారి నామ సంవత్సర, ఫాల్గుణ బహుళ షష్ఠి) గౌతమీ తీరంలో (భద్రాచలం తాలూకాలోని గొల్లగూడెం) ప్రవాస జీవితం అనుభవించి, భావ కవితా రసాల శాఖ నధిరోహించి, తియ్యని వేదనారూప రాగాలాపన గావించి, తెలుగు యెడదలకు పులకింపుల కానుక లిచ్చిన కోకిల జన్మించింది. అది గౌతమీ కోకిల. ఆ గౌతమీ కోకిలయే వేదుల సత్యనారాయణశాస్త్రి.

### వేదుల పూర్వులు:-

అధ్యయన పరులైన వేదుల పూర్వుల్లో ఒకరు, తలపై నిమ్మకాయ పెట్టుకొని, దానికి మంగలి కత్తి చేర్చి, శిరఃకంపనం కాకుండా వేద పనసలు చెప్పి అన్వర్థ గృహనామధేయు లయ్యారు. శాస్త్రిగారి తాతగారైన సుబ్బయ్య గారు 'బళి బళీ! మీ తాత బళ్ళెమ్ము చేబూని పుల్లాకు తూటుగా బొడిచినాడు' వంటివాడు కారు. ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం అనే కోవలోవారు. శనివారపుపేట జమీందార్ల

---

1. గౌతము వ్యాసములు - పుట 185

తరపున కత్తి, బల్లెం పట్టి, అడవుల్లో మన్నెదొరల వద్ద పన్నులు వసూలు చేసిన సాహసి. తండ్రిగారైన కృష్ణయ్యగారు తృతీయ కళత్రంగా గురులక్ష్మమ్మగారిని వివాహం చేసికొన్నారు. వీరి అయిదో సంతానమే మన సత్యనారాయణశాస్త్రి గారు. శాస్త్రిగారు తమ ఏడవ ఏట తల్లిని కోల్పోయిన దురదృష్టవంతులు.

## ప్రాథమిక విద్యాభ్యాసం

లోతైన గౌతమీనది. ఆ నది నానుకొని ఎత్తైన కొండలు. ఆ కొండలమధ్య ప్రకృతి సౌందర్యాన్ని పండించుకొన్న ప్రదేశం. ఆ ప్రదేశ ప్రాంతంలో నున్న గొల్లగూడెం గ్రామం గురించి వేదులే ఇలా అన్నారు.

"ఆ గ్రామం చిన్నదైనా చాల అందమైంది. ఒక ప్రక్క గౌతమీ ప్రవాహం, మరోప్రక్క అడవులు, కొండలు, వాగులు ఉండి ఎంత చూచినా చూడాలనీ, ఎంత తిరిగినా తిరగాలనీ అనిపించేది. ఆ అందమైనచోటు పుట్టడమే, ఆ అందాన్ని చూచి ఆనందించటమే నా కవితాత్మ మేలుకొనటానికి కారణమై ఉంటుందని నా నమ్మకం."[1]

ఈ గ్రామ ప్రాథమిక పాఠశాలలో అభ్యస్తలిపి ప్రపంచులు వేదులవారు. కనుకనే ప్రకృతి సౌందర్యాన్ని తిలకించి పులకించే స్వభావం వెన్నతో పెట్టిన విద్య అయింది.

## అన్నగారి సంకల్పం

శాస్త్రిగారి పెద్దన్నగారు ముక్తేశ్వర శర్మగారు మంచి విద్యాప్రియులు. 'పితృసమోజ్యేష్ఠః' అనే సూక్తికి తగినవారు. తమ్ముడ్ని పండితుడ్ని చేయాలని ఈయన సంకల్పం. ఆ సంకల్పంతోనే చిరుత కూకటి నాటి నుండి శబ్దమంజరి, అమరం, ఆంధ్రనామ సంగ్రహం,

---

1. నా ఆత్మకథ – పుట 1

భారతం, రామాయణం వీటి యందలి పద్యాలు జిహ్వాగ్రమందు ఉండేటట్లు వల్లె వేయించారు. రోజున కిన్ని పద్యాలని వల్లించటం నియమం. దీనితో జ్ఞాపకశక్తి పెరగ నారంభించింది.

## గురు పరంపర

ఆ తరువాత భద్రాచలం పాఠశాలలో రెండవఫారం పూర్తిచేసి ఆంగ్ల విద్యకు స్వస్తి పలికారు. అనంతరం సాహిత్య విశారదులు, పాఠ ప్రవచనంలో బహు ప్రజ్ఞావంతులైన శ్రీమాన్ గొట్టుపుళ్ళ శ్రీనివాసా చార్యులు గారి వద్ద గురుకుల క్లిష్టంగా కావ్య నాటకాలంకారాలు అధ్యయనం చేశారు.

ఈ సమయంలో వారికలవడ్డ పఠనశక్తి, పఠనాసక్తుల గురించి వారే ఇలా చెప్పారు.

"నాకు సాహిత్యజ్ఞానానికి అదే పునాది అని నా నమ్మకము. అప్పటికి నాకు 14 ఏండ్లు వచ్చాయి. ఏక బిగిని 15, 20 పద్యాలు గుక్క తిప్పుకోకుండా చదివే శక్తినీ, చిన్న అనుష్టుప్ ఛందస్సులో అల్లిన నా శ్లోకాలను చూచి కొందరు ప్రోత్సహిస్తే శాస్త్రాభ్యాసం చేయాలనిపించింది."[1]

పన్నెండు వత్సరాలకే అనుష్టుప్ శ్లోకాలల్లడం వారి ప్రతిభకు నిదర్శనం. పువ్వు పుట్టగనే పరిమళిస్తుందనడానికిది తార్కాణం. ఇంటి పేరు క్షీరసాగరం, ఇంట్లో మజ్జిగచుక్క లేదు - అన్నట్లు కాకుండగా బ్రహ్మశ్రీ చల్లా వెంకట నరసయ్యగారితో పంచదశకర్మలు చెప్పికొని గృహనామధేయాన్ని సార్థక్యం చేశారు.

భద్రాచలంలో ఉన్నంత కాలం గోదావరిలో ఈత, రామ దర్శనం, సంస్కృతాభ్యాసం వేదుల నిత్యకృత్యాలు.

---

1. నా ఆత్మకథ అముద్రితము - పుట 2

## గురు వరణం:-

ఇటుపై జీవితాన్ని గూర్చి వారే ఈ విధంగా అన్నారు.

"అది 1915వ సంవత్సరం. తిరుపతి వేంకట కవులు, వేంకట రామకృష్ణ కవుల పేర్లు మారుమోగుతున్న రోజులవి. అందుచేత నాకు ఎక్కడికైనా వెళ్ళి పాండిత్యం సంపాదించి కవిత్వం చెప్పాలీ అని కోరిక కల్గింది. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి దగ్గరకు వెళ్తే బావుంటుంది; మనకు రాజమండ్రి దగ్గర కూడాను అని చెప్పేసి నేను ఎలాగో కష్టపడి ప్రయాణం చేశాను. అక్కడ ఒక గూడ్సు మీద బయల్దేరి డోర్నకల్ వచ్చి అక్కడ నుండి రాజమండ్రి రావలసి వచ్చింది. 14, 15 రోజులు పట్టింది రావడానికి. శాస్త్రిగారి దగ్గరకు వెళ్తే సరే చదువు చెప్తాను నీకు అన్నారు."1

అద్యత నాంధ్ర కవి ప్రపంచ నిర్మాతలైన తిరుపతి వేంకట కవులు శతావధానాలు చేస్తున్న రోజులవి. వారి మృదూక్తి మరంద ధారలు తెలుగునాడు నభిషేకిస్తున్నాయి. అవధాన విద్యామృతాన్ని గ్రోలని సాహిత్య రసపిపాసకు లానాడు లేరు. వీరికి ముందు పద్యం దీర్ఘ సమాస భూయిష్ఠం. పండితైకవేద్యం. కేవల రాజ సభా భవన విరాజితం. ఈ జంట కవుల సారళ్యధారాశుద్ధి ప్రభావంతో పద్యం పండిత పామర జనవేద్యం కావడమే కాకుండా హృద్యానవద్యమై అలరారింది. కనకనే వీరి కాలంలో ఇది ఊరూర పెండ్లి పందిరి వేయించుకుంది. 1914 సంవత్సరం నాటికే వీరికి కొప్పరపు కవులకి పొరపొచ్చాలు పుట్టుకొచ్చాయి. అలాగే రామకృష్ణ కవులతో స్పర్థ లేర్పడ్డాయి. వీటి ఫలితంగా అధిక్షేప కావ్యాలైన గుంటూరి సీమ, గిరతం మొదలైనవి ప్రాదుర్భవించాయి. అప్పటికే మయూరభంజి ఇత్యాది సంస్థానాలలో నల్లేరుపై బండి నడకలా అవధానాలు

---

1. నా సాహిత్య యాత్ర - అముద్రితము పుట 1

గావించారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు. రాష్ట్ర రాష్ట్రేతరాల్లో ప్రతిధ్వనిస్తున్న వీరి ప్రతిభాదుందుభి ధ్వనులు కర్ణ పరంపరగా కర్ణపర్వంగా తాకి వేదుల్ని అవధానవిద్యకు పురికొల్పాయి. దీనితో తీపి నీటికి ఎగబడ్డ చేపలా శ్రీపాద వారి వద్దకు చేరారు.

## శ్రీపాదవారి అంతేవాసిత్వం

ఈ శిష్యత్వం గురించి వేదుల ఇలా వివరించారు.

"కృష్ణమూర్తిశాస్త్రి గారి వద్ద నేను చదివింది తక్కువే అయినా' అచ్చవుతున్న కృష్ణభారతం ప్రూఫులు దిద్దడంవల్లా, వ్యాసభారతమూ, నన్నయ భారతమూ, కృష్ణభారతమూ పరిశీలన చేసి, వాట్లలోని మార్పులూ, కూర్పులూ మొదలైనవి ఉటంకించటం వల్లనూ, నా కవిత్వానికి గొప్ప మేలు చేకూరిందనే చెప్పాలి."[1]

అంటే భారత త్రయ తులనాత్మక పరిశీలనం సాగిందన్న మాట. అందుచే ఆంధ్ర కవిత్వంలోని మౌలికమైన మర్మాలు ఆకళింపుకి వచ్చి ఉంటాయి. దానితో పద్యరచనకి ఆ జానజమైన భావుకత్వం వల్ల ఉల్లముల్లాసపడి ఉంటుంది.

## వేదుల తొలి పద్యం

పద్య రచన ఎలా ప్రారంభమైందీ వారే ఇలా చెప్పారు.

"రాజమహేంద్రవరంలో చదువుతున్నాను. డబ్బు లేదు. వారాలు చేసుకొనే వాణ్ణి. ఒకసారి రెండు మూడు రోజులు ఉపవాసం చేయవలసి వచ్చిన సమయంలో ఏమిటో చదువుకు అర్థం అని ఒక గదిలో పడుకొని ఉన్నప్పుడు నాలోంచి ఆకస్మికంగా

బంధువులను బాసి పరదేశ వాసినై
కూడు లేక మొలను గుడ్డలేక

1. నా సాహిత్య యాత్ర - పుట 3

విద్య నేర్వ నేల వెతలు పొందగనేల
మరణమైన రాదె మ్రందుటకును - అని పద్యం వచ్చింది.

శోకంవల్ల వచ్చిన పద్యం వల్లనే నేను కూడా కవిని కాగల నను ధైర్యం ఏర్పడింది. తరువాత ఏడుపు కవిననే పేరు వచ్చిందను కోండి. అప్పటికి నాకు 16 ఏళ్ళు."[1]

బాల్యంలో, ప్రవాస జీవితంలో కూడుగుడ్డల కెంత అలమటించి పోయారో, ఎంత నిరుత్సాహ పడ్డారో ఆయన కార్చిన వేడి కన్నీళ్ళ కరళ్ళు గర్భీకరించుకొన్న ఈ పద్యం సాక్ష్యం చెప్పక చెప్తుంది. ఇలాటి పరిస్థితుల్లో ఎవరికైనా మడతకుడుములు, శేష పాన్పులు తప్పవు

అయితే వాల్మీకి శోకం శ్లోకమైనట్లే వేదుల వేదన పద్యమైంది.

మలు పద్యం

అవికృష్ణ భారతాన్ని గూర్చి వాదోపవాదాలు చెలరేగుతున్న రోజులు. ఆ సాహితీ సమరాంగణంలో ఉద్దండపండితు లెందరో అడుగు పెట్టారు. ఆ సమయంలో గురువుగారి ప్రత్యర్థుల్ని ఉద్దేశించి వేదుల వ్రాసిన పద్యం.

పలుకగ వచ్చు వే నుడులు భారతమట్లు కవిత్వమల్లుటల్
సులభము గాదికేమనిన నూరులు నేర్తురు కాని దమ్మిడీ
వెలయును చేయజాలని కవిత్వము చెప్పెడు వారలేగతిన్
పలికిన నేమి లాభమగు భారత కావ్య సమాఖ్య తగ్గునే.

ఈ పద్యాన్ని గురించి వారే ఇలా అన్నారు.

"ఇది రాసి పెట్టుకొంటే - కృష్ణమూర్తిశాస్త్రి గారు రాసికొనే చోటు పడిపోయింది. దాన్ని వారు చూచి 'కవిత్వంకూడా చెప్తావా'

1. నా సాహిత్య యాత్ర - పుట 4

అన్నారు. అప్పటి నుంచి ఒక విధమైన అభిమానం నామీద ఆయనకి కలిగింది.

'దమ్మిడీ వెలయును చేయజాలని' అన్నది వెనక పెట్టి 'దమ్మిడీ విలువయు చేయజాలని' అని కరెక్టు చేశారు."[1]

యథాగురుః తథా శిష్యః. ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేయదు. రంగం లోనికి గురువుతోపాటు శిష్యుడూ దుకాడు. ఈ శిష్యుని సవాలుకు కృష్ణభారత ప్రత్యర్థి విమర్శకులు నిరుత్తరులు కావల్సిందే. ఈ యుద్ధానికిది 'ధర్మదార' వంటిది కావడమే గాక గురువుగారిపై గల అభిమానానికి, కవితావేశానికి అద్దం పడుతుంది. ఇంతకీ ఈ పద్యం విని గురువుగారెంత మురిసిపోయి ఉంటారో!

## కవితా స్రవంతి కానకట్ట

ఒండు రెండు పద్యాలు గిలకటమే కాదు; కవితా రచనకు వేదుల వేగిర పడుతున్నట్లు భావరాజు వేంకట కృష్ణారావు గారి మాటల్ని బట్టి తెలుస్తుంది.

"అక్కడ ఒక మూల ఏదో గొణుగుకుంటూ, చూడటానికి వికృతంగా - కాదు వింతగా కానుపించే బాలుడొకడు పుస్తకములు చేతితో పట్టుకొని, తలవంచుకొని, ఎవరో కోపగిస్తే అలిగినట్లున్న వైఖరితో కానిపించినాడు. సహజమైన వాత్సల్యంతో శాస్త్రిర్లుగారు. "ఇతగాడా అండి - చదువుకోనడానికి వచ్చాడు. చక్కగా కవిత్వం చెప్పుతాడు. కాని ఇంకా అప్పుడే తొందరపడి కవిత్వం చెప్పవద్దన్నాను. ఇంకా కొంతకాలం గ్రంథాలు గురుముఖంగా చదవాలని నా అభిలాష. నా మాట లెక్కపెట్టకుండా ఉన్నాడు బుద్ధిహీనుడు." అంటూ"[2]

---

1. నా సాహిత్య యాత్ర - పుట 6
2. ప్రతిభ నవ్యసాహిత్య పరిషత్తు నవమ వార్షికోత్సవ సంపుటం - పుట 319. దీనికి సంగ్రహరూపం-న.న. సం

పుస్తకాలు చేత్తో పట్టుకుని వింతగా కనిపించే బాలుడు వేదుల. ఇందలి శాస్త్రుర్లుగారు శ్రీపాద వారు. కవిత్వపు పిచ్చిలో పడితే గ్రంథ పఠనాసక్తి తగ్గుతుంది. కేవల కవిగా కాక విద్వత్కవి కావాలని గురువుల ఆశంస. కనక పరవళ్ళు తొక్కడానికి వెల్లుబుకుతున్న శిష్యుని కవితా స్రవంతికి ఆనకట్ట కట్టారు. వెన్ను ముదిరిన తరువాతే పెళ్ళి చెయ్యాలి; పాండిత్యం బలిసిన పిమ్మటే కవిత్వం చెప్పాలి. అప్పుడు చూడాలి అసలు పస.

## ప్రబుద్ధ ప్రతిభ

శ్రీపాదవారు జగ్గయ్యపేట బయలుదేరితే వేదుల — వారిని అనుసరించాడు. అక్కడ బ్రహ్మశ్రీ పిరాట్ల మృత్యుంజయ శాస్త్రిల వారి వద్ద అలంకార శాస్త్రం జొన్నచేలో పడుచు దూడ పడ్డట్లు అధ్యయనం చేశాడు. తరువాత శ్రీపాదవారి వద్దనే విద్యాభ్యాసం సాగింది.

భారత త్రయాన్ని పోల్చి చూడటంలో లక్ష్యజ్ఞాన మూలక మైన లక్షణ శాస్త్ర పరిజ్ఞాన మబ్బింది. మధ్య మధ్య పద్యాలు గిలకటంతో చిలుకు బొలుకు సాధన ప్రారంభమైంది. ఈ సాధనమే ఆలంకారికులు చెప్పిన అభ్యాసం. దానితో ఓ విధమైన ధార ఏర్పడింది. అది గిరిగర్భపుం జెర నుండి వెలువడ్డ ఝరి అయింది. తానింత వరకు అన్నగారి వద్ద, భద్రాచలం లోను, శ్రీపాద వారి అంతే వాసిత్వం లోను చదివిన చదువు వ్యుత్పత్తిగ రూపొంది అంతర్గతమైన ప్రతిభ ప్రబుద్ధ మవడానికి హేతువైంది.

## అవధానాలు

శాస్త్రి కలవడ్డ ధారతో పాటు ధారణాశక్తి పుష్కలంగా ఉంది. అవధాన విద్య కాయువు పట్టులీ రెండే. అక్కడక్కడ అష్టసన్యాసాలు జరుగుతున్నా అవధానాలింకా గజారోహణ చేస్తూనే ఉన్నాయి.

ఎప్పుడో మనసులో అంకురంగా ఉన్న అవధానం చేయాలన్న కోరిక పల్లవించింది. అవధాన విద్యా ప్రదర్శనానికి పెద్దాపురంలో తొలి జేగంట మ్రోగింది.

## పెద్దాపురం

పెద్దాపురంలో జరిగిన అవధానాన్ని గురించి శాస్త్రిగారి మాటల్లో

"అవధాన కాలం అది. నాకు శతావధానం చేయాలనే కోరిక కల్గింది. నేను చెప్పుకో గూడదు కానీ జ్ఞాపక శక్తి ఎక్కువగా ఉండేది. ఒకసారి విన్నది నాకు గుర్తుంటూ ఉండేది.

పదిహేడేళ్ళు వెళ్ళినయ్యేమో. పెద్దాపురంలో అవధానం చేశాను. మొట్టమొదటి పద్యం నాకింకా గుర్తుంది.

ఏ పురమందొ చేయుటది ఎంత ముదంబొ! కవిత్వ ధారణా
టోపము ఏమొ! బాలుడితడున్ గరుణింపుము శారదాంబ! పె
ద్దాపుర వాస పండిత సదస్యుల దాపున పేరు నిల్ప....

పేరుకు శతావధానాలే తప్ప 50, 60 మంది కంటె పృచ్ఛకులుండే వారు కారు "[1]

ఒకసారి వింటే చాలు గుర్తుంటేనే శతావధానం సాగుతుంది. ఏక సంధాగ్రాహి కానివాడు శతావధాని అనిపించుకోలేడు.

## భద్రాచలం

తరువాత శాస్త్రిగారు భద్రాచలంలో అవధానం చేశారు. వీరి కచ్చుట ఆంధ్రీకరించమని చంద్రాలోక కర్తయైన జయదేవుని ప్రసన్న రాఘవం లోని ఈ శ్లోకాన్నిచ్చారు.

యేషాం కోమల కావ్య కౌశల కలా లీలావతీ భారతీ
తేషాం కర్కశ తర్క వక్ర వచనోద్గారేఽపి కిం హీయతే?

1. నా సాహిత్య యాత్ర - పుట 8

యైః కాంతా కుచమండలే కరరుహాః సానంద మారోపితాః
తైః కిమత్ర కరీంద్ర కుంభ శిఖరే నారోపణీయాః శరాః।[1]
దీనికి వేదుల ఆశూక్తానువాద పద్యం.

కృతులందున్ సుకుమార కల్పన కలా హేలాఢ్యులౌ వారి భా
రతి, దుర్దాంత కఠోర తర్క వచనార్భాటమ్మునం దగ్గునే?
కుతుకంబొప్ప నఖాగ్రమింతుల మెరుంగుం జన్గవన్ మోప నా
చతురుల్ మత్తకరీంద్రకుంభముల జీల్చన్ వేయరే బాణముల్

ఇట్టి శ్లోకానువాదం కుదురుగా కూర్చుండి వ్రాయవలసిందే కాని ఆశువుగా చెప్పడం సామాన్యం కాదు. అందునా! అవధానంలో చెప్పడం. సొంతంగా పద్యాన్ని చెప్పడం వేరు. అవధానుల కది కొట్టిన పిండి. అనువాద మనగానే సందర్భం, శ్లోకార్థం అవగతం కావడం ఒకటి; అందలి భావాన్ని అటునిటూ బెసగకుండా పద్యంలో పొదగడం మరొక్కటి. ఈ రెండూ క్లిష్ట సమస్యలే. శ్లోకం కంఠస్థం రాని అవధానికి శోకం వచ్చి తీరుతుంది. అందుకే

"ఒక గీర్వాణపు శ్లోకముం దెనుగుగా నూహించి పద్యంబు పొం దికతో జెప్ప ప్రయాసమౌ"[2] నంటాడు అల్లంరాజు రంగశాయికవి.

చక్కని శైలితో సాపుదనాన్ని సంతరించుకుని తీర్చి నట్టుంది పై అనువాద పద్యం. ఇది వేదుల శతావధాన యజ్ఞ నిర్వహణ సామర్థ్యానికి గీటురాయి.

**తుని**

భద్రాచలం పిమ్మట తునిలో అవధానం. ఈ అవధానాన్ని గురించి శాస్త్రిగారి మాటల్లో

---

1. ప్రసన్న రాఘవం – 26, 27
2. ఆంధ్ర రచయితలు – పుట 167

"తుని సంస్థానంలో అవధానం చేసినప్పుడు మార్జా నల్లపరాజు అచ్యుత రామరాజుగారు శ్రీనాథాది కవులు పూరించిన యీ సమస్య మీరెట్లా పూరిస్తారో అని.

'ఇంకన్ గస్తురి బొట్టు పెట్టకుము తల్లీ! ఫాలభాగంబునన్' అనే సమస్య యిచ్చారు. రెండు నిమిషాలు ఆలోచించి యిలా పూర్తి చేసాను.

పంకేజానన! తొందరేల అపుడే ప్రాణేశుడున్ రాడు నే
డింకన్ నీ తల దువ్వునప్డు మొగమందెంతే వికారంబు త్రై
లాంకంబంటెను దాని తుడ్వగ జలంబందింతు నుండుండు మీ
వింకన్ గస్తురి

తునిలోనే చిలుకూరి సోమనాథ శాస్త్రిగారి వద్ద కౌముది ప్రారంభించాను. కాని సంవత్సరం గడవక ముందే కవితాదయిత నన్ను అక్కడ నిలవనీయక పోవటం చేత అక్కడ నుంచి కాకినాడలో అడుగు పెట్టాను."[1]

కాకినాడ

కాకినాడలో అవధానం అప్పటి కలెక్టరు కన్నడిగుని ప్రశంస అందుకుంది. ఆ అవధాన ప్రశంసల కారణంగా శాస్త్రిగారికి 'మెక్లారిన్' హైస్కూలులో పండితోద్యోగం ప్రాప్తించింది.

ఆ అవధానంలో ఇచ్చిన సమస్య

"ఇభవరయాన రైక సడలించి మహాసుఖమందె మామతోన్"

శాస్త్రిగారిలా పూరించారు.

ప్రిభుత దలిర్ప వాయుజు డరణ్యమునం దమి మైహిడింబినిన్
రభసము మీర మార నమరంబున బిట్టలయింప నాశ్రమా

1. నా ఆత్మకథ - పుట 4

రభటి నిరంతరమ్ముగ దొరంగెడి చెమ్మట కోపలేక, య
య్యిభవరయాన

దీనికి మూలం కావ్యకంఠ గణపతి ముని పూరించిన శ్లోకం.

హిడింబా భీమదయితా నిదాఘే ఘర్మ పీడితా।
స్తనవస్త్రం పరిత్యజ్య వధూః శ్వశుర మిచ్ఛతి॥

హిడింబ భీముని భార్య. ఆమె వేసవిలో ఉక్కకు తట్టుకోలేక మామ గార్ని (అనగా వాయుదేవుడ్ని) కోరి స్తనవస్త్రాన్ని తొలగించింది.

పద్యంలో చెమట పట్టడానికి కారణం మార సమరం. ఈ విషయం శ్లోకం కంటె భిన్నం.

తిరుపతి వేంకట కవులు శతావధానానికి శ్రీకారం చుట్టింది కాకినాడలో. ఆ కాకినాడలోనే శతావధానం చేసి పుర ప్రముఖుల మన్నన పొందటం వేదుల ప్రతిభా అదృష్టాల కలయిక.

## ఆశు కవితా తిలోదకం

అవధానాలు చేయటం మానుకొమ్మని వేదుల వారికి పలువురు హితోపదేశం గావించారు. వారిలో శివశంకరశాస్త్రి గారొకరు. దానికి కారణాన్ని వారే ఇలా వివరించారు.

"అవధాన — ఆశువులంటే నాకు ప్రసన్నత లేదు — అవి సభా రంజనానికి మాత్రము సరిపోతవనీ, తాటాకుల మంటవలె తాత్కాలిక దీప్తి కలవనీ, ఉత్తమ కావ్య రచనకు అత్తగారి వంటివనీ మాదృశుల మతము. అవి మానుకోవడము మంచిదని చెప్పినాను."

వేదుల అవధానాలు మానుకోవడానికి ఇదొక కారణం. రాజ మహేంద్రవరంలో గిడుగు రామమూర్తి గారికి సన్మానం. ఆ సన్మాన సభలో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు 'మీరవధానాలు చేయకూడదు, ప్రతిజ్ఞ పట్టాలి' అని అంటే అప్పటికే తలపోటు

వస్తున్న శాస్త్రిగారు వారి మాటని శిరసావహించి అవధానాలకి, ఆశుకవితలకి తిలోదకా లిచ్చేశారు. మొత్తం మీద పది పన్నెండు శతావధానాల వరకు చేశారు.

## కృష్ణశాస్త్రి గారితో స్నేహం

వేదుల కాకినాడలో ఉండగనే భావకవితా శాఖా కనిష్ఠికాధిష్ఠుడైన దేవులపల్లితో పరిచయ మేర్పడింది. అది క్రమంగా స్నేహంగా మారి కవిగారి సాహిత్య జీవన యాత్రలో పుణ్యక్షేత్ర మైంది. కనక వారిద్దరి స్నేహాన్ని గూర్చి తెలిసికోవడం సమంజసం.

ఆ అనుబంధాన్ని చెప్తున్న వేదుల మాటలు.

"శ్రీ శాస్త్రిగారూ నేనూ చిరకాల మిత్రులము. అవధానాలతో ఆశు కవిత్వాలతో పరుగులెత్తు తున్నప్పుడే నాకు వారితో స్నేహము లభించింది. మేము ఇద్దరమూ నీవు నీవని పిలుచుకొనే మైత్రి సన్నిహితులము. రాజమహేంద్రవరము వీథులలో మేమిద్దరము పోతూ ఉంటే "అదుగో కవల కవీశ్వరులు" అని అందరూ మమ్మలిని వేలెత్తి చూపించేవారు. సారస్వతములో కూడా మేమిద్దరమూ 'ఏడుపుగొట్టు కవులము' అయినాము. తిట్లలోను, దీవనలోను ఏ విమర్శకులూ మమ్మలిని ఇద్దరినీ విడదీయ సాహసించ లేదు. చాలా కాలము ఇద్దరమూ ఆకలిని, అన్నాన్ని సమానముగా అనుభవించాము."[1]

ఇదే సందర్భంలో కృష్ణశాస్త్రి గారి మాటలు కూడ వినాలి.

"1917లో వేదులతో నాకు ప్రేమానుబంధము కలిగింది. వేదనా బంధము మా యిద్దరికీ సమానము. నేను కవి కుటుంబములోవాణ్ణి కావడం వల్ల వేదులను అభిమానించాను. కవిత్వం ఎక్కడ ఉన్నా, కవి ఎక్కడ ఉన్నా నా హృదయం అక్కడికి అప్రయత్నంగా వాలు

1. ప్రతిభ. న.న. సం పుట - 342

తుంది. వేదుల నావాడు. మేమిద్దరం కవలలు వలె ఉండే వాళ్ళము, కొన్ని సంవత్సరాలు ఒకరి నొకరు అంటి పెట్టుకొని."[1]

ఈ పై ఇరువురి వాక్యాలు పరస్పర స్నేహ వాత్సల్యాలకు తీపి గుర్తులు.

## మన మార్గం మారాలి

కాకినాడ జీవితం వేదులకు ఒక మైలు రాయి. వారికిచ్చటనే నండూరి, బసవరాజు, చింతా, దేవులపల్లి మున్నగు వారి ఆంగ్ల సాహిత్య చర్చల్ని వినే అవకాశం కలిగింది. వీరందరూ ప్రతీ రోజూ సాయంత్రం ఊరు బయట సమావేశం. ఈ సమావేశాలవల్ల తమలో కలిగే పరిణామాన్ని గూర్చి కవిగారిలా చెప్పారు.

"నాకు మిత్రులందరూ కూడా ఇంగ్లీషులో పండితులయినటు వంటి వారే. ఇంగ్లీషు కవిత్వంలో ఉండే వాటిని గురించి వాళ్ళు చేసేటటువంటి విమర్శలు - వాళ్ళు చెప్పేటటువంటి మాటలు వింటూ వుంటే నాకు కూడా, మన మార్గం కూడా సరైనటు వంటిది కాదు, మార్గం మారాలి అని మనసులో కల్గింది.

కవిత్వంలోకి వచ్చి నేనేమి అనుభవించాను, ఈ సృష్టి అంతా కూడా పంచ భూతాత్మక మైనటువంటిది. పంచ భూతాలకు పంచ గుణాలున్నాయి. వాటిని గ్రహించడానికి మనకు పంచేంద్రియా లున్నాయి. అందుచేత ఈ సృష్టిని చూచి ఏమి అనుభవించాను, ఏమి చూసాను, ఏమి ఆనందించాను, ఏమి దుఃఖించాను, నా అనుభవం నా కవిత్వంలో రావాలి అనే నిశ్చయం ఏర్పడింది."[2]

హృదయం స్పందించే అనుభవానికే అక్షర రూప మీయా లన్నది వేదుల నిశ్చయంగా కన్పడుతుంది. అంటే ఇది ఆత్మాశ్రయ

---

1. ప్రతిభ న. న. సం. - పుట 140 2. నా సాహిత్య యాత్ర-పుట8

కవిత్వం వైపు మొగ్గుదల. ఇది భావ కవితా విశిష్ట లక్షణాల్లో ఒకటి. ఆంగ్ల భాషా పండిత కవి మిత్రుల వల్ల కలిగే లాభం. పసుపూ సున్నం కలిస్తే పారాణి అవుతుంది. సంస్కృతాంధ్ర పాండిత్యానికి ఆంగ్ల సాహిత్య పరిచయం తోడయింది. దానితో వేదుల కవితాకాంత పాదాలు లక్తుకతో మిలమిలా మెరవడం ప్రారంభమయ్యాయి.

## రాజమహేంద్రి శారదా వైభవం

తునిలో అయితే, కాకినాడలో అయితే మొత్తం మీద మూడు సంవత్సరాల అనంతరం 1922లో మరలా రాజమండ్రి చేరుకున్నారు శాస్త్రిగారు. రాజమండ్రిలో వారిగది సాహిత్య నందనోద్యానవనం. శ్రీపాద కామేశ్వరరావుగారు, జయంతి గంగన్నగారు, భమిడిపాటి కామేశ్వరరావు గారు, భావరాజు కృష్ణారావుగారు మొదలైన ప్రముఖులూ, శివశంకర శాస్త్రిగారు, రామశేషయ్యగారు, దీక్షితులు గారు వంటి యువకవులు గోదావరి ఒడ్డునగాని, శాస్త్రిగారి గదిలోగాని సమావేశం. వారికి సాహిత్య గోష్ఠులే నిత్య జీవనం.

నన్నయ్యాదుల నాటి రాజమహేంద్రి జీవనం ఆయన హృదయ ఫలకం మీద కొట్టిన సాహితీ ముద్రకు ప్రతీక ఈ పద్యం.

ఆంధ్ర వాఙ్మయ నందనారామ సీమకై
నన్నయ్య తొలిమొక్క నాటెనిచట
భారత కృతి పతిత్వమ్ము నభ్యర్థించి
చాళుక్య నృపతి చేసాచె నిచట
కావ్యేందిరకు నలంకార చూడామణి
పెద్దన్న తొలిసారె పెట్టె నిచట
కవిసార్వభౌముని కస్తూరికాభిక్ష
మించు వేడుక గుబాళించె నిచట

ఎడతెగని యాంధ్రజాతి వేయేండ్ల చరిత
వృద్ధ గౌతమివోలె విప్పించు నిచట
నాడు నేడాంధ్ర శారదానంద లాస్య
రంగమైనదీ రాజ్మహేంద్ర వర పురము.

తొలినాడే కాదు, ఈనాడు కూడ ఆంధ్ర శారదా లాస్యానికి రాజమహేంద్రి రంగస్థలమైందని వేదుల భావన.

నన్నయ నాటిన తొలి మొక్క ఆంధ్ర మహాభారతం. భారత కృతి పతిత్వాన్ని అభ్యర్థించిన చాళుక్యరాజు రాజరాజ నరేంద్రుడు. నన్నయ భారతానికి రాజ రాజ నరేంద్రుడు కృతి పతియా! యని సందేహం రావచ్చు. ఆశ్వాసాద్యంత పద్యాలు రాజ రాజ నరేంద్రుని ఉద్దేశించి రచింప బడ్డాయి. అదిగాక భారత శ్రోత కనక అతడే కృతిపతి. కావ్యలక్ష్మికి కావ్యాలంకార చూడామణిని తొలి సారె పెట్టిన వాడు విన్నకోట పెద్దన. తెలుగులో కావ్య రచనకి సంబంధించిన అన్ని విషయాల్ని వివరించిన లక్షణ గ్రంథాలలో ఇదే మొదటిది. కవిసార్వభౌముడైన శ్రీనాథునికి కస్తూరికా భిక్షా దానం గావించినవాడు విజయనగర దేవరాయ ప్రభువుకి సామంతుడైన తెలుగు రాయడు. ఆంధ్ర జాతి యొక్క వేయేండ్ల చరిత్రను విప్పిస్తున్నది రాజ మహేంద్రి.

నిత్య నూతనమైన ఈ పద్యరత్నం రాజమహేంద్రికి శిరోభూషణం.

కాకినాడలో స్వంత గొంతుక కొద్ది కొద్దిగా పెగులుతున్న వేదుల కవితా కోకిలకి రాజమండ్రి రావడం రమణీయ వసంతోదయమైంది. తనలో పొటమరించిన వేదనానుభవాల్ని కవితలో తీసుక రావడం లోను, పద్యానికి నగిషీ చెక్కి సాపు సంతనలు చేకూర్చడం లోను కృతకృత్యులు కాజొచ్చారు. తత్ఫలితంగా 'సంధ్యాన్వేషణము,

ప్రణయమూర్తి, ముక్తావళి, పూర్ణిమ' ఇత్యాదులు ఆంధ్రపత్రిక ఉగాది సంచిక మున్నగువాటిల్లో ప్రకటింపబడటం, పలుమంది ప్రశంసలకు పాత్రమవడం.

## నడకుదుటి వారి ప్రశంస

శాస్త్రిగారి కవిత నభిమానించి, అభినందించిన విశిష్ట ఘట్టాలలో ఒకటి నడకుదుటి వీరాజు పంతులు గారింటిలో జరిగింది.

వేదుల మాటల్లో

"పిఠాపురంలో నడకుదుటి వీరాజు పంతులు గారని గొప్ప విమర్శకులుండేవారు. ఆ రోజుల్లో ఆయన పేరు చెప్తుంటే మాట్లాడ్డానికి భయం. వెంకట్రావుగారు, పార్వతీశంగారు ఇంకో యిద్దరు ముగ్గురు అందరూ కూర్చున్నారు. 'ఈయనెవరో తెలుసునా' అన్నారు పార్వతీశంగారు. వీరాజు గారు వారికి మేనమామ అవుతాడు. 'రా' అని నన్ను కూర్చోబెట్టి వీరాజుగారు తన కొడుకుల్ని కూతుళ్ళని పిలిచి నా పద్యాలన్నీ వాళ్ళచేత ఒప్ప చెప్పించారు. వీరాజు వంటి విమర్శకుడు నా పద్యాలు తన పిల్లలకి చెప్పించి విని ఆనందించి నన్ను మెచ్చుకొన్నాడంటే నేను చాల గర్వపడ్డాను."[1]

కాంతకు కొప్పు, కవితకు మెప్పు కదా కావలసింది.

వీరాజు గారంతటి విమర్శకుడు వేదుల పద్యాల్ని తన పిల్లల చేత కంఠస్థం పట్టించాడంటే ఆయనకెంతగా నచ్చి ఉండాలి!

## గోదావరి సంఘటన

ఇట్టి ప్రశంసలకు తావలమైంది మరొక విచిత్ర సంఘటన. ఇదీ వారి మాటల్లోనే.

"బ్రహ్మాండమైన ఎండాకాలం. నా దగ్గర జేబులో ఒక దమ్మిడీ

1. నా సాహిత్య యాత్ర - పుట 9

లేదు. మార్టేరు నుండి నడిచి బయలు దేరాను. పోడూరు అని జ్ఞాపకం. అక్కడికి చేరేటప్పటికి 12 గంటలయింది. మండిపోతుంది ఎండా కాలం. ఎక్కడ చెట్టు వుంటే ఆ చెట్టు క్రింద కూర్చున్నాను. ఊళ్ళోకి వెళ్ళి మంచినీళ్ళు త్రాగివద్దాం అనుకొన్నాను. ఆ వూరంతా రాజులు. ఎక్కడ తలుపు తెరచిలేదు. మంచినీళ్ళు కూడా అడగటానికి వీలు లేకపోయింది. ఒకచోట పేకాడ్తున్నారు. ఏమండి కాసిన్ని మంచినీళ్ళు యిప్పించగలరా అన్నాను. ఎవరు మీరు అన్నారు. మేము బ్రాహ్మలం అన్నాను. లోపలికెళ్ళి వస్తూ ఆయన ఏమిటి యింత ఎండలో బయలుదేరారు, మీపేరేమిటి అన్నారు. చెప్పాను. సాష్టాంగ నమస్కారం పెట్టారు. మిమ్మల్ని చూడాలని ఎంతో కాలంగా అనుకొంటున్నాను అంటూ ఎంతో మర్యాద చేశారు. ఈలోగా ఇరవై ముప్పయి నిమిషాల పాటు కాలక్షేపం చేశాను. 80 రూపాయలు పళ్ళెంలో పెట్టి యిచ్చారు."[1]

దుర్భర దారిద్ర్యంతో ప్రవాస జీవితం గడుపుతున్న వేదుల జీవితయాత్రలో ఇలాటి సంఘటనలు చలివేందరాలు.

## నిరాశా నిస్పృహలు

ఆరోజుల్లో ఆయన ఆర్థికంగానే కాదు; అనురాగ విషయంలో కూడ ఆవేదన పడుతుండేవారు. ఈ ఆవేదన భావరాజు వేంకటకృష్ణ రావుగారి మాటల్లో

"కవిగారికీ నాకు స్నేహవృద్ధి అయినకొద్దీ ఆయన కష్టసుఖాలు నాతో చెప్పుకొంటూ ఉండేవాడు. తండ్రి, సోదరులు, అక్కచెల్లెండ్రు, ఎవరో కొందరు బంధువులున్నా, ఆప్తులయినవాళ్ళు, కడుపులో పెట్టుకొని ఆదరించేవాళ్ళు ఎవరూ లేనట్లు ఆయన ఒక విధమైన

1. నా సాహిత్య యాత్ర - పుట 10

దైన్యము, విచారము ప్రకటిస్తూ ఉండేవాడు - అప్పుడప్పుడు, ఏదో విచారం కలిగి కండ్లు వాచిపోయేటట్లు ఒంటరిగా దుఃఖిస్తూ ఉండడం నాకు తెలుసును....ఆయన నిస్పృహ, నిర్వేదం ప్రకటించి దైన్యంలో పడి కొట్టుకొనిపోతూ ఉంటే ప్రతిరోజూ ఆయనను కలుసుకొని, ఆ అధైర్యము, ఆ విషాదము, ఆ దుర్బలత్వం ఆయన్ని వశపరచుకోకుండా చేయుటకు ఎన్నో ప్రయత్నములు చేసినాను.[1]

## సాహితీ సమితి సభ్యత్వం

రాజమండ్రిలో ఉండగా శాస్త్రిగారు సాహితీ సమితి సభ్యులయ్యారు. దీనితో వీరికీర్తి యావదాంధ్రం వ్యాపించింది. నూతక్కి రామశేషయ్యగారు ఈయన్ని 'గౌతమీ కోకిల' అని పిలిచేవారు. హాస్య ప్రియులయిన ఇతర మిత్రులు 'గోదావరి గోరువంక' అని వెటకారమాడే వారు. 1924లో సమితి ద్వితీయ సమావేశం మొక్కపాటి నరసింహ శాస్త్రిగారితో కలిసి మహా వైభవోపేతంగా జరిపించారు.

## గుంటూరు

1927లో గుంటూరు క్రైస్తవ పాఠశాలలోని ఆంధ్రోపాధ్యాయ పదవి శాస్త్రిగారిని వరించింది. అటు స్వల్పకాలంలోనే శివశంకరశాస్త్రి గారి వద్ద వంగ భాష నేర్చుకున్నారు. ఆ కృషి బలంతో బెంగాలీ నవలానువాదానికి పూనుకొన్నారు. కథా రచనకు ఉపక్రమించింది కూడా ఇచట నుండే.

## వివాహం

**13-2-1930**న కవిగారికి వివాహమయింది. వివాహం విషయంలో వీరు చేసిన సాహసం అప్పట్లో ఏటికెదురీదడం వంటిది.

---

1. ప్రతిభ. నవ్య వార్షికోత్సవ సంపుటము — పుట 20

కనక దాన్ని గురించి కొంచెం వివరంగా తెలిసికోవలసిన విశేషాలు వున్నాయి.

జగద్విదిత పండితులు, ధర్మవేత్తలు, విద్యారణ్యభాష్యానుసార చతుర్వేదానువాద కర్తలైన బ్రహ్మశ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు పర్లాకిమిడి వాస్తవ్యులు. వారి యేకైక పుత్రిక కృష్ణవేణి. ఆమెను తమవద్ద చదువుకుంటున్న దగ్గర బంధువైన ఒక బాలునకిచ్చి ఆనాటి ఆచార ప్రకారంగా బాల్యవివాహం జరిపించారు. అయితే దురదృష్ట వశాత్తు సామాన్య అనారోగ్య కారణం చేతనే హఠాత్తుగా ఆ బాలుడు ప్రాణాలు విడిచాడు. ఒక్కగాని ఒక్క కుమార్తె గుండెపై కుంపటై నందులకు బెంబేలు పడిపోయారు మల్లయ్య శాస్త్రిగారు. అన్నెం పున్నెం తెలీని ఒక అమాయిక జీవితం కట్టుబాట్లకిలోనై బలి అవడం సహించలేక పోయారు. శాస్త్రాల్ని పరిశోధించారు. వివాహ నిబంధనాల్ని పరిశీలించారు. పండితులకి తమ వాదాన్ని వినిపించి ఔననిపించారు. ఆ వాద సారాంశం గిడుగు వేంకట సీతాపతిగారి మాటల్లో

"గర్భాధానం గూడా జరిగితేనేకాని పిల్లదాని వివాహం పూర్తి అయినట్లు చెప్పడానికి వీలులేదనిన్ని, వివాహం పూర్తికాకుండా భర్త చనిపోయినప్పుడు పిల్ల విధవ కాదనిన్ని, మరల వివాహం చేసికో డానికి అర్హత కలదనిన్ని కాని, ఆమెను ఒక్కసారి ఒకరికి దానం చేసి వుండడం వలన కన్యాదానం చేసే హక్కు మాత్రం ఆమె తల్లి దండ్రులకు ఆమె విషయంలో మరి వుండదనిన్ని శాస్త్రిగారు తెలియ జేశారు; అందుకు కావలసిన ప్రమాణ వాక్యాలు చూపించారు."[1]

ప్రమాణవాక్యాల బలంతో, పూర్వాచార పండితులతో తలపడి

1. గత కాలపు స్మృతులు – కృష్ణాపత్రిక మే, 1960

అపరిధృష్యులుగా నిలబడ్డారు. ఈ సందర్భంగా రజస్వలా వివాహం, హరిజనోద్యమం, అక్షత కన్యా పునర్వివాహం శాస్త్ర సమ్మతమని పండిత సభల్లో ఉపన్యసిస్తూ దక్షిణదేశమంతటా ప్రచారం గావించారు.

ఈ ప్రచార సందర్భంగా వరాన్వేషణం కూడ గావిస్తూ గుంటూరు వచ్చారు. ఈయనకు శిష్యవర్గం లావు. మల్లయ్యశాస్త్రి గారు తమయింట భోజనం పెట్టి ఎందరికో చదువు చెప్పారు. అట్టి శిష్యుల్లో ఒకరైన తెలికిచర్ల వెంకటరత్నం గారు, వారి సోదరులు — వేదుల పని చేస్తున్న పాఠశాల్లోనే పండితోద్యోగాల్ని నిర్వహిస్తున్నారు. జాతక మార్తాండులైన మల్లయ్యశాస్త్రి గారు తమ శిష్యుల జాతకాల్ని చూస్తున్నప్పుడే సత్యనారాయణ శాస్త్రి జాతకాన్ని కూడ చూడటం తటస్థించింది. జాతకం ప్రకారం కొంత భూమి ఉండాలని మల్లయ్య శాస్త్రిగారు, నాంకసలు ఏ ఆస్తి లేదని వేదుల. మొత్తంమీద ఆ జాతకంలో ఏం చూశారో కాని మల్లయ్య శాస్త్రిగారి దృష్టి మన శాస్త్రిపై బడింది.

రాకపోకలు సాగాయి. పెళ్ళిచూపు లయ్యాయి. అంగీకారాలు కుదిరాయి. కాని వేదుల జాతకంలో అప్పుడు శనిదశ నడుస్తుండడం వల్ల వివాహం సంవత్సరంపైగా వాయిదా వేశారు. ఈలోపున పండుగ పబ్బాలకు శాస్త్రిగారిని ఆహ్వానించడం, వీరు వెళ్ళటం జరుగుతుండేది. కాబోయే శ్రీమతికి ఉత్తరం వ్రాయడానికి మల్లయ్య శాస్త్రిగారి నుండి అనుమతి ఉంది. వారి లేఖల్లో పద్యాలు గూడ దొర్లుతుండేవి.

8-9-29న గుంటూరు నుండి వ్రాసిన లేఖాంశం.

"ఆ ముహూర్తము వచ్చినదాకా, నీ మనస్సు నా మనస్సు తహతహలాడు తుంటవి. తప్పదు ఉన్నది వ్రాస్తున్నాను. చదివి బాగా అర్థము చేసుకో నేను ఎందుకట్లున్నానో తెలుస్తుంది.

తనువు కృశింపవచ్చు, దయితా పరిరంభ సుఖంబులేమి, భా
మిని క్షణమేని గానబడమిన్ కనులశ్రులు రాల్పవచ్చు, ఏ
మని తపియింతువో హృదయమా! యిటు, లేయెడ, తన్మృగీవిలో
చన నెడబాయ క్రొత్త సుఖసన్నిధి సన్నిధివయ్యు నీవయో!"

పాపం! పరితాపం తీరే దారిలేదని హృదయానికి నచ్చచెప్పుకోవడం తప్ప చేసేదేముంది?

తరువాత ఆ ముహూర్తం రానేవచ్చింది. మల్లయ్య శాస్త్రిగారు మాత్రం కన్యాదానానికి అంగీకరించలేదు. వారు శాస్త్ర నిర్ణయాన్ని అతిక్రమించరు. కన్యాదానం చేసినవారు గిడుగు రామమూర్తి దంపతులు.

ఇట్టి వీరి వివాహం ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఒక మరపురాని ఘట్టం. స్మృతి శాస్త్రనిష్ణాతులైన బంకుపల్లి మల్లయ్య శాస్త్రిగారు తమ కుమార్తెకు ద్వితీయ వివాహం చేయ బూనుకోవడం కందుకూరి మహోద్యమానికి ఒక విజయ పతాక. సనాతన పండిత పరంపర నుంచి వచ్చిన వేదుల వితంతు పునర్వివాహానికి అంగీకరించడం గొప్ప సాహసం. పెళ్ళి కుమార్తెను కన్యాదానం చేసే బాధ్యతను భాషా సంస్కరణోద్యమ పితామహులైన గిడుగు రామమూర్తి పంతులుగారు స్వీకరించడం అపూర్వ సన్నివేశం.

అయితే ఈ సత్కార్యానికి సత్కారాల సంగతి ఎలావున్నా చీత్కారాలు పూత్కారాలు మాత్రం వేదుల స్వకులం వారి నుండి అనేకం ఎదుర్కోవలసి వచ్చింది. పంక్తిభోజనంలో చెవులు కొరుక్కోవడం, సీలాప నిందలు భరించవలసి వచ్చింది. అవసరమయితే అయన తృణీకత బ్రహ్మపురందరులు గాబట్టి సరిపోయింది. వెనక కేవలం ఒక రజస్వలా వివాహం కారణంగా పేరూరు ద్రావిళ్ళు అనే శాఖ నుండి దివిలి ద్రావిళ్ళు అనే మరో శాఖ ఏర్పడిందంటే ఇక

మన కవిగారి వివాహం ఆనాడు ఎంత సంచలనం సృష్టించి ఉంటుందో ఊహించుకోవాలి.

## గుంటూరు నుండి పెద్దాపురం

వివాహం అయిన తరువాత గుంటూరులో ఉండగనే వేదుల 'ఉభయ భాషాప్రవీణ' ఉపాధిని సంపాదించారు. అప్పటికే చదువుకీ, జ్వరానికి డిగ్రీల లెక్క వచ్చేసింది కదా! 1933, 34 సంవత్సరాల్లో 'నవ్య సాహిత్య పరిషత్తు'కి కార్యదర్శిగ పనిచేశారు. అప్పుడధ్యక్షులు రాయప్రోలువారు. వేదుల సాహిత్య స్థాయికి చిహ్నం కార్యదర్శి పదవి. 1935లో పెద్దాపురంలో ఉన్న మిషన్‌వారి ఉన్నత పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా ప్రవేశించారు. గుంటూరులో ఒక ఇంటివారైన కవిగారు పెద్దాపురంలో ఒక యింటికి యజమాని అయ్యారు. ఇక్కడ నుండి శాస్త్రిగారికి చిరుసత్కారాలు, సిరిసన్మానాలు ప్రారంభమయ్యాయి. అందుకే చదువుల చెట్టుకి వేళ్ళు చేదైనా పండ్లు తీపి అంటారు.

## సొంత యిల్లు

శాస్త్రిగారి కవితా పాండిత్యాల కానందించిన జయపుర సంస్థానాధిపతులు శ్రీ విక్రమ దేవవర్మగారు సన్మానించడమే కాదు; వీరికి స్వగృహం లేదని తెలిసికొని తగిన గృహనిర్మాణానికై దివానుగారిని పురమాయించారు. అంతకు కొద్ది ముందే కృష్ణవేణమ్మ గారు తాముద్దెకుంటున్న గృహాన్ని పదిహేను వందల రూపాయలకి బేరమాడి పుట్టింటి వారు పెట్టిన ఆభరణాల్ని అమ్మి కొంత, అప్పుచేసి కొంత పోగుచేసి సొంతయిల్లనిపించారు. ఈ సంగతి తెలిసికొన్న దివానుగారు గృహ మూల్యాన్ని అంద జేశారు. ఈ గృహ మింకా ఉంది.

## దీపావళి ముద్రణం

తాము రచించిన ఖండికల నన్నింటిని ఒక సంపుటంగా కూర్చి

స్వీయ ధనంతో ముద్రించి మిత్రులైన శ్రీ నూతక్కి రామశేషయ్య చౌదరి గారికి అంకిత మియ్యాలని శాస్త్రిగారి చిరకాల వాంఛ. కోరిక కోరికగానే ఉండిపోయింది. కాలం గడిచి పోతుంది. ఇది గమనించి ఇతవరియైన కందుకూరి రామభద్రరావు గారు మిత్రుల ధన సహాయంతో ముద్రించడానికి శాస్త్రిగారిని అంగీకరింప జేశారు. రావు గారు వేదుల్ని తమ ఇంటికి తీసికొని వెళ్ళి అటు ఖండికల నన్నింటిని క్రమ పద్ధతిలో కూర్పించినారు. వాటిని 'దీపావళి' అనే గ్రంథ శీర్షికతో ముద్రించారు.

22-3-37న కవిగారికి సన్మాన సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో పుట్టినరోజు కానుకగా 'దీపావళి'ని సమర్పించారు. ఆంధ్ర సాహిత్య సరస్వతికి 'దీపావళి'తో నీరాజన మీయడంలో దోహద పడ్డారు. ఈ విధంగా వేదుల వారికి కందుకూరి రామభద్రరావుగారు మహోపకారం గావించారు. రామభద్రరావు గారు చేసిన పని బంగారు పళ్ళానికి గోడ చేర్పు వంటిది. వీరు కూడ కవులే. ఈయన ఖండకావ్య సంపుటి తరంగిణి.

## కృతి సమర్పణం

రామభద్రరావుగారు ముద్రించి యొసంగిన 'దీపావళి'ని శాస్త్రి గారు శ్రీ నూతక్కి రామశేషయ్య చౌదరి గారికి అంకిత మిచ్చారు. వేదులకు వీరు చిరకాల మిత్రులు. కవులు, పండితులు, న్యాయ వాదులు. జయపుర సంస్థాన దివానులు. అంతేకాదు; భావకవి భాస్కరులలో ఒకరు. వీరి కావ్యం 'కాపుపెండ్లి'. ఈ సాహిత్య మనీషికి శాస్త్రిగారన్నా, వారి కవిత్వమన్నా అత్యంత ప్రీతి. వేదుల వేదనా తాపానికి గురియైనప్పు డాదుకొని, ఓదార్చి సేద దీర్చిన మహానుభావుడు.

అది 1932వ సంవత్సరం. గుంటూరులో జిల్లాబోర్డు భవనంలో

నవ్య సాహిత్య పరిషత్ ఆధ్వర్యవంలో 'దీపావళి' కృతి సమర్ప ణోత్సవ సభ. సభకు కవితా పాండిత్యాలలో ఉద్దోలులైన కాటూరి, మొక్కపాటి, ముద్దుకృష్ణ, కృష్ణశాస్త్రి మొదలైనవారు విచ్చేశారు. సభాధ్యక్షులు కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. వేదుల అంకిత పద్యాలు చదివారు. ఇవి మూడు మాత్రమే. అయితే నేమి? అణి మెరుంగు ముత్యాలు.

'దీపావళి'ని చౌదరిగారికి అంకిత మీయడానికి గల కారణాల్ని చెప్తున్న పద్యం.

నా కవితా వనీ వికసనమ్మున కామని పంటవైన సు
శ్లోకుడ వంచు కావ్యకళ లోతులు ముట్టిన మేటి శిల్పి వం
చీకృతి నీకొసంగితి సుహృద్వర! కొంచెమొ గొప్ప 'గౌతమీ
కోకిల' పాట నీ యెడదకుం బులకింపుల కాన్కలీయదే![1]

కృతిపతి కావ్యకళ లోతులు ముట్టిన మేటి శిల్పి అవడం బంగారానికి తావి అబ్బడం.

## గౌతమీ కోకిల

పై పద్యంలో వాడిన 'గౌతమీ కోకిల' కాలం గడిచిన కొద్దీ నల్గురి నోటిలో నాని బిరుదుగా స్థిరపడిపోయింది.

"అల గౌతమీ కోకిలాఖ్యయా కవి పంచ
మస్వరంబున మాటు మాటునాడు"[2] అని

విశ్వనాథ వారిచే అభినుతం.

దీని అసలు సంగతిని గూర్చి వేదుల మాటల్లో

"మిత్రులు నన్ను 'గౌతమీ కోకిల' అంటున్నారు. అది బిరుదుకాదు. నా మిత్రుడు నూతక్కి రామశేషయ్య అనురాగముతో

1. దీపావళి అంకిత పద్యాలు. 2. కేదారగౌళ పుట 18

నన్ను పిలిచే పేరు. మా మైత్రికి గుర్తుగా 'దీపావళి' అనే సంపుటాన్ని ఆయనకు కృతి ఇస్తూ "గౌతమీ కోకిల పాట నీయెడదకుం బులకింపుల కాన్కలీయుదే" అని అన్నాను. అది మొదలు నాకది పేరైపోయింది. గోదావరి జిల్లాలో కవిగారనే గాసి మొదట నా పేరు చాలా మందికి తెలియదు."

జననంతో వెలసిన పేర్లు మరణంతో వెలవెలాపోతాయి. పని గట్టుకొని గౌరవంగా ఇచ్చిన బిరుదులు ఒక్కొక్కప్పుడు బరువైపోయి వెక్కిరిస్తాయి. గుణ వైశిష్ట్యాన్ని బట్టి పిలిచిన పిలుపు అన్వర్థమై కీర్తి నామమై అలరారుతుంది.

ఈ పిలుపులోగల ఔచిత్యాన్ని నోరి నరసింహశాస్త్రి ఇలా వివరించారు. "కవులకు కోకిల అనే పేరు వాల్మీకి నాటి నుంచీ వస్తున్నది. ఎవరో ఒక కవి "కూజంతం రామ రామేతి .... వందే వాల్మీకి కోకిలమ్" అన్నాడు. శ్రీ వేదులకు గోదావరి విశేషణము, అతను గోదావరి జిల్లా వాడయినంత మాత్రానే రాలేదు. అతని గీతాలకు గోదావరీ నినదము ఆధార శ్రుతి."[1]

## మహాకవి బిరుదు

29-8-43న సామర్లకోటలో జరిగిన విద్వత్సభలో 'మహాకవి' బిరుదుతో వేదుల సత్కరింపబడ్డారు. ఈ సభకు అధ్యక్ష్యం వహించిన వారు కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు. కనక నే తరువాతి కాలంలో

"గురుదేవుడెద మెచ్చుకొని 'మహాకవి!' యన్న
బిరుదమ్మొసంగి దీవించునాడు" అని సంతోషంగా చాటుకొన్నారు.

---

1. సారస్వత వ్యాసములు పుట - 588

## పేరూరు - కావలి - పెద్దాపురం

ప్రకరీ ప్రకారంగా ఉద్యోగ విషయం కూడా తెలిసికోవడం అవసరం. 1945లో పెద్దాపురం మిషనుస్కూలు విడిచిపెట్టి పేరూరు హైస్కూలులో చేరారు. తరువాత 47లో సామర్లకోటకు బదిలీ అయ్యారు. 49లో కొద్దికాలం రామచంద్రపురంలో పనిచేశారు. 54 వరకు సామర్లకోటలో ఉండి కావలి విశ్వోదయ కళాశాల యాజమాన్యం కోరికపై ఆంధ్రోపన్యాసకులుగా ప్రవేశించారు. పదవీ విరమణ పర్యంతం కావలిలో ఉండి 64లో పెద్దాపురం స్వగృహానికి చేరుకొన్నారు. కావలిలో ఉండగా భాసనాటకానువాదం ప్రారంభించారు. 67లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వేదుల వారిని యావజ్జీవ సభ్యులుగా ఎన్నుకుంది.

వీరు పదవీపరంగా విశ్రాంతులైనప్పటికీ సాహిత్యపరంగా అవిశ్రాంతంగా కృషి చేస్తూనే ఉన్నారు. తత్ఫలితంగా నవల్లూ, నాటకాలూ, వ్యాసాలు మొదలైనవి వెలువడ్డాయి.

## సంసార సుఖం

గిల్లిన పాలుగారు ప్రాయం నుండి ప్రవాసంలో ఉన్న శాస్త్రిగారి జీవితం ఉత్తరోత్తరం మూడు పూవు లారు కాయలుగా విరాజిల్లింది. క్రమంగా అన్ని విధాల సంసార సౌఖ్యాన్ని రెండు చేతులా జుర్రుకో సాగారు. ఒకప్పుడు గుప్పెడు మెతుకులు కోసం అల్లాడిపోయిన ఆయనకు పిత్రార్జితమైన స్థిరాస్తి ఉందన్న సంగతి చాలకాలం వరకు తెలియకపోవడం విధి విలాసమే. చివరి దశలో వారు తమ జన్మభూమియైన గొల్లగూడెం సమీపంలో గల తోటపల్లి గ్రామంలో ఏబది ఎకరాల భూస్వామి. అర్ధాంగి కృష్ణవేణమ్మగారు ఉంటే ఉగాదీ, లేకుంటే శివరాత్రి చేయకుండా సంసారాన్ని ఒబ్బిడిగా చేస్తూ చేదోడు వాదోడుగా ఉండడం వల్ల జీవితరథం ఒడిదుడుకులు

లేకుండా సాగింది. యథా హ్యేకేన చక్రేణ రథస్యన గతిర్భవేత్ (ఒక చక్రంతో రథానికి గమనం కలుగనేరదు). వీరికి ఇద్దరు కుమారులు, ఐదుగురు కుమార్తెలు.

వీరు లోకం తరిస్తరించే పండిత పుత్రులు కారు. ఉన్నత విద్యాధురంధరులు. మీదు మిక్కిలి సాహిత్యాది కళల్లో కలం కదుపుతున్నవారు. చక్కని ఉద్యోగాల్లో కుదురుకుని వర్థిల్లుతున్నవారు.

శాస్త్రిగారి సంసార విషయంలో

సుగుణవంతురాలు సుదతియై యుండగా
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గమేటికయ్య సంసారికింకను అను వేమన పద్యం

పూర్తిగా అన్వయిస్తుంది.

## అనారోగ్యం

అయితే రాను రాను శాస్త్రిగారు జీవితపు పొద్దు వాలే కొద్దీ అనారోగ్యానికి గురై కొంత వేదన పడ్డారు. కనకనే మనసులోని 'వేణూదయం' మొదలైన కావ్యాలు వ్రాయాలనే సంకల్పం నెరవేర లేదు. కాటూరి వంటివారు మహాకావ్యం వ్రాయించాలని యత్నించి నప్పటికీ ఆంధ్ర సరస్వతీ కావ్యగర్భం ఫలించలేదు.

తప్పని పరిస్థితిలో కృష్ణవేణమ్మగారు శ్రీకాకుళం కూతురింటికి వెళ్ళారు. శాస్త్రిగారి ఆరోగ్యం అప్పటికి బాగుగానే ఉంది. రెండు రోజులకి హఠాత్తుగా పరిస్థితి విషమించింది. వేణమ్మగారికి కబురు వెళ్ళింది. మృత్యువు సమీపిస్తుందని తెలిసికున్నట్టున్నారు. ఈ గేయం వ్రాశారు.

## తుది రచన

రమ్మ నా ప్రియతమా! రమ్మ నా దైవమా!

ఆరవిచ్చినట్టి పీయడవి బూసిన పూలు
అసలు పరిమళ లేశమైన లేనివే కాని
అంద చందము చూసె ఆదరించెదవంచు
కోసి తెచ్చితి, దండగుచ్చి ఉంచితినోయ్
జాగు చేయక రమ్ము నీ గళమ్మున వైచి
కన్ను మూసుకపోక మున్నె చూతును నిన్ను
రమ్ము నా ప్రియతమా! రమ్ము నా దైవమా!
కోరి రెక్కలు కట్టుకొని వేగరమ్ము *

ఇది వారి అర్థాంగి నుద్దేశించి వ్రాసిందనుట స్పష్టం. ఆమె రాకకై ఆయన పడ్డా వేదన వ్యక్తమౌతుంది.

అనూచానంగా స్త్రీకి పాతివ్రత్యం బోధించడం, పతినే దైవంగా భావించమనడం భారతీయ సంప్రదాయం. పురుషాధిక్య సమాజం ఏర్పడిన నాటి నుంచీ ఇది నిరాటంకంగా సాగుతుంది. ఈ ఆచారాన్ని ఖండిస్తూ మొట్టమొదటుసారిగా గురజాడ

"మగడు వేల్పన పాత మాటది;
ప్రాణ మిత్రుడ నీకు, నీ నెనరు
కలుగక యున్న, పేదను; కలిగినను

నా పదవి వేల్పుల రేనికెక్కడ?[1] అని కాసులలో నిష్కర్షగా ప్రాచీనాచారాన్ని పరాస్తం చేశారు. తదాదిగా వీరేశలింగం, గురజాడల ప్రభావంతో ప్రవర్తిల్లిన భావకవులందరూ కళత్రాన్ని ప్రేయసిగాను, నెచ్చెలిగాను భావిస్తూ వచ్చారు. చిరంతన దాంపత్య బాంధవ్యంతో పెనగిన కృష్ణవేణమ్మ గారిని మన వేదుల ప్రియతమగాను, దైవతమగాను ఏకదేశంగా భావించడం ఈ హంసగీతిలో స్పష్టమవుతుంది. దీనితో ఆయన ఒక అద్వైత సిద్ధిని భజించారు.

---

* 'Swan Song' ని తలపింపజేస్తున్న రచన ఇది.

1 గురజాడ రచనలు - కవితల సంపుటం - పుట 10

## తుది ఘడియలు

కృష్ణవేణమ్మగారు శ్రీకాకుళం నుండి వచ్చారు. కంటికి రెప్పలా చూసుకుంటున్నారు. కాని ఆరోగ్యం అంతకంతకూ దిగజారి పోతుంది. ఆ పరిస్థితిని చూస్తున్న వేణమ్మగారికి ఆందోళన మొదలైంది. పొంగివస్తున్న దుఃఖాన్ని అణచిపెట్టుకొని కన్నీళ్ళను కళ్ళల్లోనే కుక్కుకుంటూ రెట్టించిన శ్రద్ధతో సేవ చేస్తున్నారు. ఆమె పడుతున్న వేదన గ్రహించినట్టున్నారు. అప్పుడు తెచ్చిపెట్టుకున్న ఓపికతో 'నేనెప్పుడూ నీ మనసులో నుండువాడనే. ఈ శరీరం పిప్పి. అట్టి వట్టి పిప్పిని గూర్చి నీవు కలత చెందవద్దు. కనక జాగ్రత్తపడమ'ని హితోపదేశం చేశారు.

అస్తగిరి వాసినియైన మరణదేవత పాదమంజీర ఆహ్వాన ధ్వని వారి చెవుల పడిందేమో! తమ చేతి యుంగరాన్ని జీవిత భాగస్వామిని హస్తాంగుళికి అలంకరించారు. ఆ వెనువెంటనే మూయబడుతున్న కన్నులు చెమ్మగిల్లాయి.

## శాశ్వత నిద్ర

కిందెట్టు, మీదెట్టు వైఖరి కాక, శాస్త్రిగారిది అనాయాసమరణం.

అది 7-1-76. ఆరోజు బుధవారం. ఆయన అంతకు ముందు రెండు రోజుల నుంచి ఆహారం ముట్టుకోవడంలేదు. జ్వరం తగ్గింది. ఉల్లాసంగానే ఉన్నారు. అందుచే కొంచెం ఎంగిలి పడ్డారు. కొంత సేపటికి నెమ్మదిగా నిద్రాదేవత ఒడిలోకి చేరుకున్నారు. ఆ చేరుకోవడమే శాశ్వత సుషుప్తిలోకి జారుకోవడం. 'దీపావళి'ని వెలిగించిన వేదుల దీపం ఆరిపోయింది.

76 వసంతాలకు 76 రోజులు తక్కువైన పంచభూతాత్మకమైన దేహాన్ని మాత్రమే అగ్ని దహించి వేయగలిగింది. అజ్ఞానాంధకార లోకానికి ఆయన అందించిన దీపావళి కాంతి అక్షరమై అలరారుతుంది.

# వ్యక్తిత్వం

## ఆత్మ ప్రత్యయం

స్వీయ జీవనం సంపూర్ణంగా ప్రతిబింబించేటట్లు వేదుల వ్రాసి కొన్న పద్యం.

నిరత వేదాభ్యాస నియముండు కౌండిన్య
సంయమీంద్రుడు కులస్వామి నాకు
నరజాతి కాదర్శ పురుషుడౌ శ్రీరాము
డున్న భద్రాచలమ్మునికి నాకు
శ్రీకృష్ణభారత వ్యాకోచ కీర్తియౌ
శ్రీపాద సుకవి దేశికుడు నాకు
పూర్వజన్మార్జిత పుణ్య సంప్రాప్త క
విత్వమే యభిమాన విద్యనాకు

సత్యపూర్వ నారాయణ శాస్త్రిపేరు
పద్మగంధుల కుచశాటి పరిమళమ్ము
లొలయు కవితతో మెప్పింపగలను నేను *

ఇది సర్వం సత్య సుందరం. కనక ఇందులో ఉండేది ఆత్మ ప్రత్యయమే కాని అహంభావం మాత్రం కాదు.

## భౌతిక స్వరూపం

శాస్త్రిగారి భౌతిక స్వరూపాన్ని గూర్చి ఆవంటు జానకీరాం గారి మాటలు.

"వేదుల సత్యనారాయణను చూడగానే, ఆయన 'భావకవి' అనుకోరు ఎవరూను, ఎన్నడూ ఏవేవో కలలు కంటూన్నట్లు ఉండడము, శరీరంలోను, మనిషి తీరులోను అతి సుకుమారత్వం

* అముద్రితం.

ఆశించడము, కొంత అలసత్వము, కొంత పరధ్యానము – ఇటువంటి 'భావకవి లక్షణాలు' ఆయనలో లేవు. బొత్తిగా, మీదుమిక్కిలి, ఆయన నల్లగా పొట్టిగా ఉంటారు. ముఖాన స్ఫోటకపు మచ్చలుంటాయి కూడా. కాని, కళ్ళల్లో ఉంటుంది: విపరీతమైన తీక్ష్ణత. అదే ఎంతో అనుభవసంపద, ఎంతో స్నేహంతో పలుకరించే అందమూ, ఇక ఆయన చిరునవ్వూ, నవ్వూ - ఒకపేటంటే, అనగా, అవి, ఆయనకు విశిష్టమైనవి - ఎవరూ అనుకరింప లేనివి.''[1]

## ఆయన హృదయం

అయన హృదయాన్ని గూర్చి స్వామి శివశంకర శాస్త్రిగారి వాక్యాలు.

"శాస్త్రిగారిది అర్ద్రహృదయము. మైత్రి చాలా పవిత్రముగా ఎంచుతారు ఈయన. అన్ని సంవత్సరాలు కలిసి ఉన్నాము. ఈయనకు కోపమురాగా నేను ఎన్నడూ చూడలేదు. తనకు సుఖము లేనపుడు కూడా చిరునవ్వుతో కనబడడమూ, చమత్కారంగా మాటలాడడమూ, ఎదటి వారిని ఎలాగో నవ్వించి సంతోష పెట్టడమూ ఈయనకు సహజము''[2]

ఇలా సన్నిహితుల విషయంలోనే కాదు ఇంట్లో పిల్లల విషయంలో, బళ్ళో విద్యార్థుల విషయంలో కూడ కోప్పడేవారు కారని వారి సంతానం, వారి వద్ద చదివినవారు చెప్పిన అనుభవాల పెట్టె ల్లోని మాటల మూటలు.

## ఉపన్యాస పద్య పఠనాలు

శివశంకరశాస్త్రిగారే వీరి ఉపన్యాసం, పద్య పఠనాన్ని గూర్చి

---

1. సాగుతున్న యాత్ర - పుట 146
2. ప్రతిభ న. న. సం. - పుట 335

ఇలా చెప్పారు.

"శాస్త్రిగారు బహిరంగ సభలలో ఉపన్యసిస్తూ ఉంటే చాలా హృదయంగమముగా ఉంటుంది. పోడి మాటలతో కాక, చక్కని శయ్యలో ప్రసంగము చేస్తూ ఉంటే శ్రోతల హృదయాలు ద్రవీభూత మవుతవి. విసుగు కలగనీయకుండా ఈయన సదస్సుకు చక్కిలిగింతలు పెట్టుతాడు చమత్కార ప్రియభాషణములతో. సంగీతము పాడలేక పోయినప్పటికీ ఎటువంటి పద్యమయినా ఈయన నోట వింటే అరటి పండు ఒలిచి నోటిలో పెట్టినట్లు ఉంటుంది. పద్యము ఈయన వలె అనగల కవులు అరుదు."[1]

ప్రత్యేకంగా పద్యపఠనాన్ని ఇలా ప్రశంసించారు జానకీరాం గారు.

"వేదుల సత్యనారాయణ పద్యం ఎంతో చక్కగా చదువుతారు భావగర్భితంగా, అర్థగౌరవంగా. ఒక్కొక్క మెట్టు అతిశయించే ఆ ఆరాధనా వాక్యాలు వింటూ ఉంటే నేను ఏమో, ఏమో అయిపోయాను. అతని చెయ్యి గట్టిగా పట్టుకోవలసి వచ్చింది పొరలు కన్నీటిని అపు కోవడానికి బలం కోసం."[2]

## చమత్కార ప్రియత్వం

ఈయన బహు చమత్కార ప్రియుడు. ఈ చమత్కార ప్రియ త్వాన్ని చాటి చెప్పే సంఘటనలు కోకొల్లలు. ఇవి అన్నీ హాస్యరస స్ఫోరకాలు.

ఒక పెద్దమనిషి - సుదీర్ఘ నామంవాడు. శాస్త్రిగారిని మీ పేరేమిటండీ అని అడిగితే_సోల్లుంఠన సమాధానం చూడండి. శ్రీమత్

1. ప్రతిభ న న. సc. - పుట 136
2. సాగుతున్న యాత్ర - పుట 149

పాతాళభైరవ కనకదుర్గ వరప్రసాద హనుమద్వీర వేంకట సత్య నారాయణ శాస్త్రి

ఇది విన్న వెంటనే ఆవ్యక్తి ముఖం వెలవెలబోవలసిందే శాస్త్రి గారు తమ మిత్రులతో 'గోదావరి రైల్వేవంతెన మీద నుంచి ఏడో స్తంభం దగ్గర క్రిందకు దూకగల'నని సాహసం ఉట్టిపడేటట్లునొక్కి నొక్కి చెప్పేవారు. ఆయన మాటలందరికి ఆశ్చర్యం గొల్పాయి. సరేయని మిత్రులందరూ నిజం తెలిసికోవడానికి అక్కడికి వెళ్ళారు. వెళ్ళితే ఏముంది! ఆ స్తంభం దగ్గర ఇసుక మేటవేసి ఉంది. మొదట చకితులయ్యారు. తరువాత పొట్టలు చెక్కలయ్యేటట్లు నవ్వుకున్నారు.

## నవమన్మథులు

కొంటె కోణంగులైన వేదుల, మునిమాణిక్యం అందంలో ఒకరి కొకరు తీసిపోయేవారు కారు. కోకిలా వర్ణులు. రాజమండ్రిలో వీరిరువురు ఒకే గదిలో నివాసం. ఆ ఇంటి యజమానిని ఆటపట్టించా లని ఒక పథకం వేశారు.

ఇకపై ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి మాటల్లో

"తెల్లవారేసరికి యిద్దరూ తీరుబడిగా కూర్చుని మాటల్లో వివాదం ప్రారంభించి కేకల్లోకి పాకి కొట్టుకోవడంలోకి దిగారు.

ఇంటాయన హడలిపోయి పరుగెత్తుకుంటూ వచ్చి 'బాబ్బాబూ అన్నదమ్ముల్లా ఉండేవారు, ఎందుకీదెబ్బలాట చెప్పండి? అంటే 'బాబూ మీరే చెప్పండి - ఇతడికంటె నేనందమైన వాణ్ణి అవునా, కాదా? అట్లాంటప్పుడు తానే అందగాడినని తెగ గింజుకుంటున్నాడు.' అని వేదుల అంటే, మునిమాణిక్యం 'బాబుగారికి కళ్ళులేవా ఆయన్నే చెప్పమను' అని లేచాడు.

బాబుగారికి కళ్ళుంటే ముని మాణిక్యం అందమైన వాడవడం ఖాయం, లేకపోతే వేదుల -

బాబుగారు తెల్లబోయి తేరుకుని, కళ్ళు మూసుకుని 'ఇద్దరూ నవ మన్మథులురా నాయనా! ఇక కొట్లాడకండి' అని విడదీసి వెళ్ళి పోయారట!"[1]

కర్ణాట కలహం అంటే ఇదేనేమో! ఇదీ కవ్వించి వివదించడమే కదా!

## పద చమత్కారాలు

ఆయన బహు చమత్కార ప్రియుడనే మాటకు కొన్ని సంఘటనల్ని తెలిసికొన్నాం. ఇక వారి అమ్ముల పొదిలోని పద చమత్కారాస్త్రాలు.

'అసలే మతి లేనివాడికి బహుమతులెందుకు?'

'తిమ్మాపురమున కెనయె త
తిమ్మాపురములు'

శుక్లపక్షం - సారస్వతారిష్టం అనే శుక్లనష్టం'

'తారకంగారు వట్టి కంగారు మనిషి'

'చారుగా చారుగా చారుగా' (రుచిగా చారు కాచినారనడానికి)

'కోడివా కాక కారపు పకోడివా నీవిట కుక్కుటేశ్వరా!'

## గురుభక్తి

ఏలూరులో తమకు జరిగిన సన్మాన సందర్భంగా గురువుగారిని గురించి ఇలా చెప్పుకున్నారు.

"కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారే నాకు కవితా గురువులు. ఆయన నన్ను శిష్యునిగానే కాకుండా పుత్రునిగా కూడా ఆదరించారు. ఈ సన్మానానికి వారు వచ్చివుంటే ఈ శిష్య పరమాణువునకు కల్గిన గౌరవానికి ఎంతో ఆనందించి ఆశీర్వదించి

---

1. గౌతమీ గాథలు - పుట 141

ఉండేవారు.

"అది కవిత్రయంబొక మహాకవిగా జనియించి యొక్క కేల్
మీద సమస్త భారత సమీకరణం బొనరించినట్టి శ్రీ
పాద కవీంద్రు శిష్యుడను" అని సభలో గొప్పగా చెప్పుకొనే వాణ్ణి. వారి శుశ్రూష వల్లనే నాకు కవిగా సన్మానము లభించింది నేడు."[1]

అన్నవరం సత్యనారాయణ స్వామి వారి కళ్యాణోత్సవ సమయంలో శ్రీపాదకు, చెళ్ళపిళ్ళకు, వేదులకు నూటపదార్లతో సన్మానం జరుగుతుండేది. గురువుగారితో సమానంగా నూటపదార్లు తీసికోవడం సమంజసం కాదని కొంతకాలం అర్ధనూటపదార్లే పుచ్చుకొనేవారు. అంటే వారి గురుభక్తి 'అర్థస్య పురుషోదాసః' అనే వాక్యాన్ని అధిగమించిందన్నమాట.

కేవలం గురువుగారినే కాదు; విద్వాంసులైన పెద్దల్ని ఎవరినైనా గౌరవించడం వారి హృదయ లక్షణం.

కాకినాడలో వేదులకు సన్మానం. సూత్రధారులు కృష్ణశాస్త్రి గారు. విద్యామంత్రి అధ్యక్షులు. ప్రారంభకులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు. ఆ సభలో తనకు కప్పిన కాశ్మీరు శాలువాను అనంత కృష్ణ శర్మగారికి కప్పి నమస్కారం చేశారు. పెద్దల యెడ గౌరవం అంటే ఇది.

## బోధనాపటిమ

గౌతమీ కోకిల అడుగు పెట్టగానే కావలి విశ్వోదయ కళాశాలకు కవితా వసంతం ప్రాప్తించింది. భ్రమరకీటన్యాయంగా విద్యార్థులు కవికోకిలలైపోయారు.

---

1. ప్రతిభ న.న. సం. పుట - 342

ఒక విద్యార్థికోకిల ఇలా పాడుతుంది.

"విరుల 'విశ్వోదయా' కల్పవృక్షశాఖ
లందు గూర్చుండి కుహూకుహూ యనుచు బాడు
గౌతమీ కోకిలా! నీదు గాన మహిమ
పరవశమ్మున గరగిపోయిరి రసికులు"

విద్యార్థి కవితాకళ వెనుక ప్రేరణ ఎవరిది అనే విషయం చెప్పనవసరం లేదు. ఆయన బోధనా పటిమను గూర్చి మరో పిల్ల కోకిల -

"ఎట్టి పాఠ్యము నైన నిరవొంద గైకొని
చక్కగా బోధించు సాధుశీలి
ప్రేమను నిరతమ్ము విద్యార్థి బృందమ్ము
నాశీర్వదించు విద్యాపయోధి"[1]

"యుక్తి యుక్త వచోగ్రాహ్యం బాలాదపి సుభాషితమ్" అనే సూక్త్యను సారం వీటిని ఉదహరించాను.

## మచ్చలేని ద్రోణాచార్యుడు

ఇట్టి స్వయం విద్యార్థులనే కాక వేదుల గురుత్వం ఎంతోమంది ఏకలవ్య శిష్యుల్ని కవితాపథంలో పయనింప జేసింది. ఆయనే ఒక చోట ఓ సందర్భంలో ఇలా అన్నారు.

"ఎందరెందరో గలరు నాకేకలవ్య
శిష్యు లద్భుత కవితా విశేషమతులు" ముక్తఝరి 48

వారిలో శ్రీ పుట్టా సూర్యనారాయణ

ఏకలవ్యుని మాడ్కి నా హృదయ మందు
భక్తితోడ వేదుల కవీశ్వరుని నిల్పి

---

1. విశ్వోదయ కల్చరల్ మాగెను పుట - 64

బాల్య చాపల్యమున వీని వ్రాసినాడ
కరుణ జూడుడు రసికాగ్రగణ్యులార!
ఆ సుధాకరు నమల పాదాంశు తతిని
కలువ కన్నె వికాసమ్ము గాంచునటులె
ఓ గురూ! నీ పదాబ్జ పరాగమునను
నా నిరర్థక జన్మ ధన్యత వహించె.[1]

అని కృతజ్ఞతను చాటుకున్నారు.

మరో ఏకలవ్య శిష్యుడు శ్రీ పి. అన్నాజీరావు. వీరి నోటివెంట వెల్వడు ప్రతీమాట వేదులదేనట.

ఈ నోటంబలికించు మాటలివి మీవే, పాటలున్ మీవె స్వా
మీ! నా గీసిన యక్షరాక్షరము మీదే, నాకు ప్రత్యక్ష వి
జ్ఞాన జ్యోతిగ మీరె చిత్తమున నుంటన్ లౌకికారాధనా
ధీన ప్రాకృత భక్తిగొల్తు కవితా దివ్యైకలవ్యుండనై[2]

శాస్త్రిగారు హరిజన శిష్యుల్ని కూడ ఆదరించిన అభ్యుదయ హృదయులు. ఆ శిష్యుల్లో ఒకరైన శ్రీ చోడగిరి చంద్రరావు గురువు గారిని గూర్చి 'హృదయవీణ'లో ఇలా అన్నారు.

ఎందరు లేరొ? ఆచరణ * యోగ మొకింతయు లేని నీతులన్
అందము లొల్కబల్కు కవులాంధ్ర కవిత్వ చరిత్రలోన మీ
చందము నాదిమాంధ్రులను ఛాత్రులుగాగొని యింట నుంచిరే?
అందుకు గుండె కావలయు నన్యము కాదుగదా మహాకవీ!

చంద్రరావుగారన్నట్లు చెప్పిన నీతుల్ని ఆచరణలో పెట్టడానికి చేవ గల గుండె కావాలి. శిష్యుని సాహిత్య జీవన యాత్రలో గురువర్యుని సాన్నిహిత్యం కొంగు బంగారంలా ఉపయోగపడి ఉంటుంది.

---

1. 2, అముద్రితం. * యతి తప్పిందిది

## ఔదాత్త్యం

శిష్యుని గురుపూజ కాశీస్సుగా వేదుల పల్కిన పద్యాల్లో ఒకటి

ఏదొ పురాకృతమ్ము ఫలియించి లభించెను నీకు నీ సుధా
స్వాదు కవిత్వమే గురువువల్ల లభించిన దెంత మాత్రముం
గాదయినన్ ననుం గురువుగా మదినెంచెడి నీ హృదంబు జా
మోదమునే గ్రహించితిని మున్నె యశోలత పూచినట్లుగన్.[1]

నా శిష్యుడు నా వల్లనే గొప్పవాడయ్యాడనే వాళ్ళని చూస్తున్నాం. కాని ఈయన మాత్రం శిష్యుని కవితావిర్భావంలో తన ప్రమేయం లేదంటున్నారు.

మరో శిష్యునికి 'దీవన' అందిస్తూ ఇలా అంటారు

ఒజ్జగ నన్ను జెప్పుకొనుచుందువు విద్యను నేర్వకున్న నా
పజ్జను, నీకు జేకురిన పాండితియున్ రసవత్కవిత్వ సం
పజ్జయమున్ స్వయంకృషినె ప్రాప్తిలెనైనను నన్ను గొల్చు నీ
హృజ్జలజాత గౌరవ పరీమళ మేనెపుడో గ్రహించితిన్[2]

శిష్యుల కవితా పాండిత్యాల పాటవానికి పురాకృతఫలం, స్వయంకృషి కారణాలుగా జెప్పడంలో వేదుల ఉదాత్తగుణం వెల్లడవుతుంది.

## జీవితాశయం

ఒక మహా కావ్యం వ్రాయాలని ఆయన సంకల్పం. ఆ కావ్యం ఎలా ఉండాలో భావించిన వారి మాటలు.

“ఇప్పుడు ఊహలో ఒక మహాకావ్యమున్నది. అదే నా రచనా పరమావధి అని ఇప్పటికీ అనుకొంటున్నాను. ఉదాత్తమైన కథా వస్తువు. ఆ కథలోని పాత్రలన్నీ సజీవాలు. వాటి చేత నవ్వించాలి, ఏడిపించాలి, ఉన్నతాశయాలతో మహోన్నతాదర్శాన్ని సాధింప

---

1. హృదయవీణ, 2, ముక్తఝరి - పుట 110

చేయాలి. కాలము గడచిన కొద్దీ ఆ పాత్రలు నా జాతి జీవితానికి సన్నిహితాలవుతూ ఉండాలి. నన్నయ భట్టారకుని ఔచితీ, శ్రీనాథుని పదగుంభనమూ, తిక్కన తెనుగుదనమూ, పింగళి సూరన కల్పనా గౌరవమూ కలబోసి భాషలోను, భావములోను, సంఘటనలోను, సన్నివేశములోను 'క్షణే క్షణే యన్నవతా ముపైతి' అనే సూక్తికి లక్ష్యముగా ఒక రచన చేయాలి. ఆ రచన ఉషస్సువలె నిత్యనూతనమై

'భూత కాల దినాంతాను భూతితోడ
భావి యుదయాల కళ్యాణ పథము బట్టి
వెలుగు నీడల జీవన వేణువూది' నా గొప్ప రచన కావాలి"[1]

ఇది మహాకవులు కాగల వారికెవరికైనా ఉండవలసిన ఆశయం.



# గౌతమీ కోకిల వేదుల సాహిత్య సమీక్ష

## III పద్య సాహిత్యము

వేదుల పద్యసాహిత్యాన్ని మూడు భాగాలుగా విభజింపవచ్చు.

అ తొలి రచనలు  ఆ దీపావళి-ముక్తఝరి  ఇ శేషకవితలు

### అ తొలి రచనలు

**ఉనికి**

అది 1912వ సంవత్సరం. ఈ వత్సరంలోనే వేదుల కాకినాడ మెక్లారిన్ హైస్కూల్లో పండిత పదవి నలంకరించారు. కాకినాడ వారికి నూతన చైతన్యం కలిగించింది. ఆనాటి కాకినాడ నూతన వైభవాన్ని గూర్చి సోమసుందర్ గారి మాటలు.

"అప్పటి కాకినాడ నూత్న భావాలకు పసిడి ఊయల. కృష్ణ శాస్త్రి గానమాధుర్యంతో కాకినాడ దిక్కులు మారు మ్రోగుతున్నాయి. బ్రహ్మ సమాజ ప్రవక్త రఘుపతి వేంకటరత్న దేశికుని ప్రసంగ సౌరభాలు విస్తరిస్తున్నాయి. ఆ నాటి నుంచి వెలువడుతున్న 'అనసూయ' పత్రిక క్రొత్త కవితలను ఆదరిస్తోంది. ఇన్ని కలిసి ఒక్క ప్రభాత జంఝగా ముంచెత్తాయి. వేదుల కవితా హృదయానికి క్రొత్త తెన్నులందించాయి."[1]

ఈ చైతన్య వాయువుల ప్రభావంతో వేదుల కలం క్రొత్తపాళీ తొడుగుకోవడానికి ప్రయత్నించింది. ఆ ప్రయత్నమే తొలిరచనలు.

పై జెప్పిన 'అనసూయ' పత్రిక శ్రీమతి వింజమూరి వెంకట రత్నమ్మ సంపాదకత్వంలో వెలువడుతుంది. దానిలో కాలాంతరంలో 'ఏకాంత సేవ'గా రూపొందింపబడ్డ వేంకట పార్వతీశ్వరకవుల కావ్య

---

1. మరపురాని కావ్యం - ఆంధ్రభూమి 24-4-1986

ఖండికలు వెలువడుతున్నాయి. అలాగే 'కృష్ణపక్షం'గా రూపుదిద్దుకున్న కృష్ణశాస్త్రి కావ్య ఖండికలు ప్రకటింపబడ తున్నాయి. వీటితో పాటే వేదుల తొలి రచనలైన సుభద్రార్జునులు, చందమామ, కరుణాదేవి, చినుకు అను కావ్యఖండికలు చోటు చేసికున్నాయి. కాని ఇవి తరువాత కాలంలో ముద్రిత ఖండకావ్యాల్లో చేర్చబడలేదు. ఇవి ఆ ఖండకావ్య రచనలతో తులతూగక పోవడం కారణం కావచ్చు. ఏమైనప్పటికీ, వేదుల ముద్రిత రచనల్లో ఇవే మొదటివి.

## 1. సుభద్రార్జునులు

ఇది తేటగీతి మాలిక. ప్రేమకోసం తహతహ లాడిపోయే సుభద్రార్జునుల్ని హెచ్చరించడం ఇందలి విషయం.

కైతవయోగి రూపంలో ఉన్నాడు అర్జునుడు. అతన్ని ఓర జూపుల చూస్తుంది సుభద్ర. అప్పుడామెను కోయిలసని వెక్కిరిస్తుంది. తేటులు వలదు, వలదని గద్దిస్తున్నాయి. పండుటాకులు నవ్వి చప్పట్లు కొడ్తున్నాయి. సాహసం రామ రామ యని చిలుకలు భయపెడ్తున్నాయి. హంసలు మందహాసంతో పిలుస్తున్నాయి.

అపుడు ప్రేమ ఇలా ఉద్బోధించింది.
"చెలియ! యేటికి పెడమోము జేసెదింక
కావలసినది నీ కరగ్రహణమొకటి;
అదియు నెరవేరెగాదె? నిత్యంబు మేన
బావ బావయటంచును పల్వరించి
ప్రణయ భంగంబులను విహారంబొనర్చి
జీవిత సుమంబు నరుని చేజేతబెట్టి
సమయమున నేటి సిగ్గు? విజయుడు గాడొ?

.... .... ....

సిరికి మోకాలు నొడ్డ నిష్ఠురము సుమ్ము
చిత్తమున భావి సుఖము యోచించుకొమ్ము"

అదే సమయంలో ఒక ప్రక్క భయమిలా ప్రబోధించింది.

"లజ్జయే భూష యదియె విలాసమదియె
ధనము హైందవ కాంతావతంసములకు
దాని విడనాడుటలు నీకధర్మమగును
ముదిత, ముగ్ధవు; ఏమెరుంగుదువు? పెద్ద
ఉన్న వారని తప్పించుకొన్న మేలు"

వెళ్ళిపోతున్న సుభద్ర హస్తాన్ని పట్టుకున్న అర్జునుడ్ని కవిగారే ఈ విధంగా హెచ్చరించారు.

"అర్జునా! ముద్దరాలు భయంబునొంద
నెంత యనురాగమున్న, నెన్నెన్ని వావి
వరుస లుండిన, స్వాతంత్ర్య గరిమయున్న,
వలపుగొనియున్న, మోహసంబంధమున్న
ధీరుడవు 'ఏమి పనియది'

.... .... ....

అకట చాలించు మింక నీ యాగడంబు."

చివర కిరువురికీ కంకణక్వణ రూపంలో ఆయురారోగ్యాలు కలుగునని దిక్కులాశీస్సు పలుకుతున్నాయి అనడంతో ముగిసింది.

సుభద్ర స్థితిని జూచి పండుటాకులు నవ్వి చప్పట్లు కొట్టా యనడంలో వేదుల భావుకత వ్యక్తమవుతుంది. ఆకుల పండుదనం నవ్వడానికి గుర్తు. అవి క్రింద పడినప్పుడైన, ఎగిరినప్పుడైన కలిగిన గలగల చప్పుడులే చప్పట్లు.

కొంకు మునుమున్న లౌల్యంబు, కేళ్ళు ద్రిప్ప మెచ్చులిచ్చు పాటొప్పజేయ, రెప్పలల్లార్ప. ఈ పద సముదాయం పెద్దన గారి "మునుమున్ బుట్టెడు కొంకు లౌల్యంబు నిడన్" అనే పద్యం నుంచి దిగుమతి అయింది. మొత్తం మీద సుభద్రార్జునుల తొందర

పాటుని ఆపి, ధర్మమార్గాన్ని ప్రబోధించడం ఇందలి వైశిష్ట్యం.

## 2. చందమామ

నవ్యతను పుణికిపుచ్చుకున్న భావుకత ఇందులో కన్పిస్తుంది. ప్రతి పద్యానికి 'చల్లనైనట్టి తెల్లని చందమామ' అనే మకుటముంది.

చంద్రోదయం నుండి చంద్రాస్తమయం వరకు గల విశేషాలు వ్యంగ్యంగా చెప్పబడ్డాయి. ఇందలి మొదటి పద్యం

గగన రంగంబునందున కారుమబ్బు
తెరను సగమోర జేసియు కరముసాచి
లే నెలంతకు ముద్దు లర్పించినావె

ఆకాశం రంగస్థలం, నల్లని మేఘం తెర. కారుమబ్బు తెరను సగమోర జేసి యనడంలో మేఘాన్ని తప్పించుకొని చంద్రుడుదయిస్తున్నాడనేది వ్యంగ్యం.

చంద్రుడు రావడంతో కలువలు వికసించాయి. ఆ విషయాన్ని ఇలా చెప్పాడు కవి.

ప్రణయ సరసిని మోద ప్రవాహమందు
అలల నుయ్యాల లూగెడు కలువ చెలిని
ప్రేమ సౌరభమొప్ప నవ్వించి నావె ॥చల్ల॥

చంద్రుడ్ని వేగుచుక్క పిలుస్తుందంటున్న పద్యం.

సైగ జేయుచు నుండె నీ సహచరుండు
పిలుచు చున్నది మెలమెల్ల వేగుజుక్క
పులుగులకు పాఠముల జెప్ప బోవవేమి?

వేగుజుక్క మెల్లగా పిలుస్తుందనడంలో చంద్రాస్తమయ, సూర్యోదయాలు వ్యంగ్య మౌతున్నాయి.

## 3. కరుణాదేవి

కరుణాదేవి అనే స్త్రీ రణరంగంలో అక్బరు నెదిరించినిల్వడం ఇందు వర్ణింపబడింది.

అక్బరుతోగాని, అతని వారితో గాని యుద్ధం చేసిన స్త్రీలిరువురే చరిత్రలో కనిపిస్తున్నారు. ఒకరు రాణీ దుర్గాదేవి; మరియొకరు చాంద్ బీబి. కరుణాదేవి మాత్రం కాదు. అయితే మహమ్మదు ఘోరీ యొక్క సైన్యాధీశుడైన కుతుబుద్దీన్‌ని ఓడించిన స్త్రీ పేరు కరుణాదేవి. ఈమె సమరసింహుని భార్య. సమరసింహుడు 12వ శతాబ్దంవాడు.

"అగ్బరంతటి యోధు డదరి నీధాటికి
నాగలేకొక్క జోహారుసేయ" అని అనడాన్ని బట్టి ఆమె అగ్బరునే గడగడ లాడించినట్లుగా తెలుస్తుంది.

ఖండింపబడ్డ మ్లేచ్ఛ నాయకుల శిరస్సులతో హిందూ రాజ్య రమాసతికి మేల్మి సింగపుగద్దె నెక్కడానికి మెట్లు గట్టిందట.

ఖండిత మ్లేచ్ఛ నాయక గణశిరముల
హిందు రాజ్య రమాసతి యెక్కునట్టి
మేల్మి సింగపు గద్దెకు మెట్లు గట్టి
నట్టి భార్గవివీవె మాయమ్మ కరుణ!

కరుణాదేవి యనుమాట పేరునందే కాని యుద్ధభూమిలో రాజుల దర్పమణచునప్పుడు మాత్రం కాదట. ఈమె పుట్టుకతో కోశ మందున్న అబలాపదం నిరర్థకమైన దనడం సముచితం. ఇందు స్త్రీ ఔన్నత్యాన్ని చెప్పడం కవి ఆశయం.

## 4. చినుకు

ఇది ద్విపదలో సాగింది. కవి భావ పరంపరతో చినుకు బహు రూపాల నెత్తింది. ప్రతిరూపం చివర

"అస్తమించెడి నాకు అందమేమిటికి
క్షణ వైభవమున విచారమేమిటికి" అని తలంచినది. అనగా మకుటంగా సాగింది.

కనుగొల్కు లందున జననంబు నొంది
తళుకు చెక్కులపైన తాండవమాడి

ముగుద వక్షము నందు ముత్యాల పేరునై
యస్తమించెడి నాకు నందమేమిటికి
క్షణవైభవమున విచారమేమిటికి

ఇది కవి భావనయే. ఆత్మాశ్రయ కవిత్వానికి వేదుల ఆదిలోనే అంచు లందుకొన్నారనడానికిది తార్కాణం.

ఈ చినుకు జలధి గర్భంలో పుట్టింది. మలయానిలునితో కలిసి తూగాడింది. మింటి చుక్కలతో మేలంబు సలిపింది. చిన్ని చంద్రుని తోడ చెలగాట మాడింది. జలద మాలికలతో ఉయ్యాల నూగింది. మెరుపుతో కలహించి ధరణిపై దూకింది. పూవుల్లో మధుభావంబు పొందింది. అళిగీతికలతో శ్రుతి గలిపి పాడింది. ఇలా చిను కనేక రూపాలనెత్తింది.

## నవ్యకవితా ప్రమేయం

ఈ ఖండికలన్నింటిలో భావ పటుత్వమున్నప్పటికీ, రచనలో బిగింపు లేదు. ఈ రచనా శైథిల్యమే. ఇవి ప్రాథమిక రచన లనే విషయాన్ని ప్రస్ఫుటం చేస్తుంది.

చందమామ, చినుకు పీటిల్లో భావకవితా ప్రధాన లక్షణమైన ఆత్మాశ్రయత్వం తొంగి చూస్తుంది. వేదులకి కృష్ణశాస్త్రి మొదలైన భావకవులతో కలిగిన సాహచర్యమే దీనికి కారణం. ఈ సాహచర్యం లేకపోతే శాస్త్రిగారు కృష్ణశాస్త్రి మార్గంలో కాక కృష్ణమూర్తి శాస్త్రి ఒరవిడిలో కొట్టుకపోయేవారే.

అప్పుడు గోదావరి ఇటుగాక అటు తిరిగితే అరబియా సముద్రంలో కలిసిపోయేటట్లు అయ్యేది.

కనకనే కాటూరి వారిలా అన్నారు.

"కృష్ణశాస్త్రి ప్రభృతుల సాహచర్యమూ, వారి కావ్యములతో పరిచయమూ కలుగక పోతేనూ, కలిగినప్పటికి చక్కని భావుకత్వము

కొరవడితేనూ వేదుల వారికి నవ్య సాహిత్యంలో ప్రమేయమే లేకపోయేది.”

ఇక నవ్య సాహిత్యంలో వారి ప్రమేయం తెలిసికుందాం.

## ఆ దీపావళి - ముక్తఝరులు

వేదుల తమ కవితల నన్నింటిని రెండు ఖండకావ్య సంపుటాలుగా ప్రచురించారు. మొదటిది దీపావళి. రెండవది ముక్తఝరి. 'దీపావళి'లో కవితావస్తువుని బట్టి కొంత వరకు 'ముక్తఝరి'ని జోడించి అందలి ఖండికల్ని ఈ క్రింది విధంగా విభజింప వచ్చు.

**1 దేశభక్తి 2 ప్రణయ మాధుర్యం 3 ప్రకృతి సౌందర్యం 4 దైవాన్వేషణం 5 వేదన 6 మానవత**

## 1 దేశభక్తి

**భావకవులు - దేశభక్తి**

భావకవితా వృక్షానికి పరిఢవిల్లిన గాఢ ప్రయోజన పరమైన శాఖ దేశభక్తి. భావకవి కోకిలలు చాల వరకు ఈ శాఖ నధిరోహించి కమ్మని కంఠాలనెత్తి వైతాళికత్వం నిర్వహించాయి. గౌతమీ కోకిల కూడ సుధాగళం సవరించి తనవంతు పాత్రని పోషించింది.

కనకనే కరుణశ్రీ ఇలా అన్నారు.

“తెలుగు సాహిత్యంలో దేశాభిమానం వీరేశలింగం పంతులుతో సన్నని జాలుగా బయలుదేరి గురజాడా, రాయప్రోలూ, బసవరాజూ యిచ్చిన పరపుష్టినందుకొని 'విశ్వనాథ, వేదుల, కొడాలి, తుమ్మల ఇత్యాదుల్లో వాహినిగా ప్రవహించింది.”[1]

---

1. ప్రతిభ న. న. సం. పుట - 211

వీరందరి దేశాభిమానానికి ప్రధాన ప్రేరణా, వెన్నెముక వందేమాతరం ఉద్యమం. 1905లో రాజప్రతినిధియైన కర్జన్ బెంగాలు రాష్ట్రాన్ని విభజించడంతో ఆంగ్లేయులకు అసలు, సిసలైన ముసలం ప్రారంభమైంది. వంగ ప్రజల్లో దేశాభిమానం పెల్లుబికి, 'వందే మాతరం ఉద్యమం' వ్రేళ్ళూనింది. అటు రేగిన ఉద్యమాగ్ని జ్వాలలు యావద్భారతాన్ని వేడెక్కించాయి.

ఈ సమయంలో కవిసింహాలు జూలుదులిపి ఆవులించాయి. 1907లో బిపిన చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా ఆవులించి గర్జించిన ప్రథమ కవి సింహం చిలకమర్తి లక్ష్మీ నరసింహం. ఆ గర్జన 'భరతఖండంబు చక్కని పాడియావు' పద్యం. తరువాత కవీంద్రులు కొందరు భారతదేశ పూర్వ పుణ్యౌన్నత్యాన్ని శ్లాఘించారు. మరి కొందరు దేశభక్తుల జీవిత చరిత్రల్ని ఇతివృత్తాలుగా గ్రహించి కావ్యాలు సంతరించారు. ఇదేవిధంగా పలుమంది కవులు భరతమాత, జాతీయ పతాకం, రాట్నం, పరాయి పాలకుల దౌర్జన్యాలు, స్వాతంత్ర్యోద్యమంలోని ముఖ్య ఘట్టాలు, హరిజనోద్యమం మున్నగువాటిని కవితా వస్తువులుగా గ్రహించారు. వీరందరి లక్ష్యం జనంలో దేశాభిమానాన్ని పురిగొల్పి తద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించడం.

దీపావళిలో దేశభక్తికి సంబంధించిన ఖండికలు ముచ్చటగా మూడు. అవి జయగీతి, కాగడా, కాంక్ష.

## జయగీతి

వేదుల 1924లో 'రాణా ప్రతాపసింగు' అనే నాటకాన్ని రచించారు. ఈ నాటకంలో ఒక పాత్రయైన 'పృథ్వీరాజు' అక్బరు ఆస్థానంలో కవి. ఏ బలవత్తర కారణంచేతనో అక్బరాస్థానంలో చేరినా, ఇతనికి స్వాతంత్ర్యాభిలాషియైన ప్రతాపుని దేశభక్తి అన్నా, మాతృదేశమన్నా మిక్కిలి గౌరవం. అక్బరు మోచేతినీళ్ళు తాగుతు

కిష్టపడని ప్రతాపుడ్ని ఇతడు చూడటానికి వస్తూ మాతృదేశాన్ని గేయరూపంలో ప్రస్తుతించాడు. ఆ గేయమే ముందు వెనుకలు పెంచబడి 'జయగీతి' అనుపేర 'దీపావళి'కి తొలిదివ్వె అయింది. ముత్యాల సరం దీని ఛందస్సు.

అంటే వేదుల కవితాకన్య ముత్యాల సరం ధరించి జయగీతిని పాడుకొంటూ దీపావళీ కావ్య గేహ దేహళిపై అడుగు పెట్టి వేకువ కాంతకు స్వాగతం చెప్తుంది.

కావి ముసుగల్లాడ వేకువ
కాంత దివసాంగణము చేరెను
గాలిలో వన పాళిలో సుమ
గంధ మలమికొనెన్

తరుణ తరణిద్యుతుల రోదో౦
తరము రంజితమయ్యె ద్విజ సం
తాన గళ కాహళుల ప్రాభత
స్తవము మారోమ్రోగెన్

తృణము తృణమున శాంతి విరిసెను
దిక్కు దిక్కుల కాంతి మెరసెను
దేవళమ్ముల మొరసె జయ ఘం
టా వితానమ్ము.

ఈ మొదటి మూడు గేయాల్లో ఉదయసంధ్యా వర్ణనం కావింపబడింది. ఇందు దేశాన్ని గురించికాని, దేశ ప్రజల్ని గురించికాని వాచ్యంగా చెప్పిందిలేదు. అయితే నాలుగవ గేయంలో జాతీయ పతాక ప్రస్తావన ఉంది.

అదె త్రివర్ణ ధ్వజ పటాంచల
ముదయ పవనోచ్చలిత మయ్యెను

వదలె జయ శంఖారవమ్ముల
నిదుర మైకమ్ము

ఈ తీగ పట్టుకుంటే పై డొంకంతా కదుల్తుంది.

ఇందు జాతీయ పతాక ఎగురుతుందని, జయశంఖారావాలచే భారతజాతి నిదురమైకం వీడిందని చెప్పబడింది. ఈ నిదురమైకం సామాన్యమైంది కాదు. మనదేశపు దీనదశ, మన అసహాయత్వం, భావదాస్యం సమ్మిళ్రితమై క్రమ్మిన మైకం. స్వాతంత్ర్యం రాకుండగా త్రివర్ణ పతాకం ఎగురుచున్నదనడం, నిదురమైకం వీడిందనడం జనాన్ని మేలుకొల్పడానికే; జాతీయాభిమానాన్ని పెంపొందించడానికే. ఈ త్రివర్ణపతాకం రెపరెపలాడడానికి వెనక కొంత జాతీయోద్యమ చరిత్ర ఉంది. ఆ చరిత్ర మొదటి మూడు గేయాలు ఉదయ సంధ్యావర్ణనలో దాగి ఉండడం విశేషం. అనుక్త మన్యతో గ్రాహ్య మన్నట్లు ఇక్కడి వాచ్యాన్ని బట్టి వెనుకటి వాటిలోని వ్యంగ్యాన్ని గ్రహించాలి.

దివసాంగణంలో చేరిన వేకువ కాంతయే ఈ శతాబ్ది ప్రారంభంలో కలిగిన జాతీయ చైతన్యం. గాలిలో వనపాళిలో అలముకొన్న సుమగంధమే వంగదేశం నుండి వ్యాపించిన వందేమాతరం ఉద్యమం. తరుణ తరణి ఎవరో కాదు; 1921 లో జాతీయోద్యమంలో ప్రవేశించి స్వరాజ్య భావకిరణాల్ని అధోజగత్సహోదరుల హృదయక్షేత్రాల్లో కూడ ప్రసరింప జేసిన గాంధీ మహాత్ముడు. ద్విజ సంతాన గళ కాహళులే భారతీయుల స్వాతంత్ర్యరావాలు. ఈయన రాకతో తృణము తృణమున శాంతి విరిసింది. ఇక్కడ తృణం సామాన్య జనానికి ప్రతీక. అంటే జాతీయోద్యమంలో గాంధీ ప్రవేశంతో సామాన్యులకి ఊరట కలిగిన విషయం ప్రస్తావించబడింది. దిక్కుదిక్కుల కాంతి మెరయుడ మంటే దేశమంతా స్వాతంత్ర్యోద్యమ చైతన్యం వ్యాపించడం. అలాగే దేవళమ్ముల జయ ఘంటా వితానం

మోగడం ఒకటి. ఇవి దేవాలయాల్లో హరిజన ప్రవేశాన్ని ద్యోతకం చేస్తుంది.

ఈ గేయాల ప్రకృతి వర్ణన వెనక ఈ చెప్పిన జాతీయోద్యమాది భావాలు లేకపోతే ఈ ఖండికలో అవి నిస్తేజంగా పేలవంగా కనబడతాయి. ప్రకృత వస్తువుని ద్యోతకం చేయలేని కేవల ప్రకృతి వర్ణన తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం వంటిది. వేదుల వంటి ప్రతిభావంతుడు ప్రకృత వస్తువు ప్రతిబింబింపని ప్రకృతి వర్ణన చేయడు.

1921లో గాంధీజీ ప్రేరణతో పింగళి వెంకయ్య రూపొందించిన రాట్నం విశిష్టమైన మూడు రంగుల పతాక నెగుర వేయాలని వాడ వాడలా ప్రజల్లో పట్టుదల ప్రబలింది. స్వాతంత్ర్య కాంక్ష పురుషులందేకాదు; స్త్రీల మనస్సుల్లో కూడ నాటుకుంది. ఇందు పాల్గొన్నవారికి పేదలూ, ధనికులూ అనే భేదం లేదు. అబాలవృద్ధం పాలు పంచుకుంది. వీరందరిలో నూత్నావేశం పొంగి పొరలింది. కనుకనే కవి ఇలా అంటాడు.

వీర శౌర్యము సతుల తేజము
పేద భక్తియు సాధు దీక్షయు
వృద్ధ పౌరుష మొక్క నూత్నా
వేశమున వెలుగన్

కాల ధూమోద్గత మహాగ్ని
జ్వాలికా మాలికలో జంఝా
నిల విఘూర్ణిత నీలవారాం
నిధి తరంగములో

అగ్ని జ్వాలల్లా, సాగరతరంగాల్లా జన సమూహాలు లేచాయంటే స్వాతంత్ర్య ఫలం వచ్చి ఒళ్ళో పడిందన్న మాటే. లేడికి లేచిందే

పరుగన్నట్లు జన సమూహాలు జృంభించిన వేళే జయోత్సవ ముహూర్తమని కవి తలంపు.

వెలువడియె నా సేతు శీతా
చలము నర నారీ సమూహము
నీ ప్రభాతోత్సవ ముహూర్తము
నేడు జనయిత్రీ!

మరియు భారతావనికిక పారతంత్ర్యం లేదని ఇలా ప్రశంసించారు.

వేద ధాత్రివి జ్ఞాన దాత్రివి
పేదపాలిటి యన్నపూర్ణవు
వీర రాజ్ఞీ! లేదు నీకిక
పారతంత్ర్యము

స్వతంత్ర భారతదేశంలో నీ మహోన్నతిని గూర్చి పాడుకొంటాం, దిగంతాలలో నీ కేతనం నాటుతాం, నీ పాద పీఠికపై ధన, ప్రాణాల్ని పూజా ప్రసవాలుగా సమర్పిస్తాం అంటూ ప్రతిజ్ఞ చేసి భారతమాతని కీర్తించారు.

మొత్తం మీద 'జయగీతి' ద్వారా ప్రజల్ని స్వాతంత్ర్య కాంక్షోద్దీప్తుల్ని కావించడం, తత్సిద్ధికై సర్వస్వాన్ని ధారపోయడానికి సంసిద్ధుల్ని చేయడం కవి ఆశయం. కాలక్రమంలో ఆయన ఆశయం నెరవేరింది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత భారతమాత గురించి తనివితీరా పాడుకున్నారు. అంచేతనే దేశభక్తికి పతాకస్థాయియైన జయగీతి వేదుల క్రాంత దర్శిత్వానికి గీటురాయిగా నిలిచింది.

ఇక దీన్ని మద్దూరి సుబ్బారెడ్డిగారి ప్రశంసతో ముగిస్తున్నాను.

"వేదుల వారి 'దీపావళి' ఖండకావ్యంలో 'జయగీతి' భారత మాత సంస్తవాన్ని మహోన్నత శిఖరాలకు తీసుకపోయే రచన. పురాప్రశస్తితోపాటు 'బంధనముల విదిల్చి' దిగంతాల భారత పతాక

ఎగుర వెయ్యాలన్న కాంక్ష కనిపిస్తుంది."[1]

**కాగడా**

వేదుల దేశభక్తి ఖండికల్లో మరొకటి 'కాగడా'. ఇది మంజరీ ద్విపదలో వెలువడ్డ భావమంజరి.

దీన్ని కురుగంటి సీతారామయ్యగారిలా ప్రశంసించారు.

"వేదుల తాను ప్రపంచంలో మంచినే చూడలేదనీ, ప్రజలు వెనకటి ఔన్నత్యాన్ని స్మరించుకుంటూ నెమరువేసే పశువుల వలె వున్నారనీ, రాజులు మత్తులైయున్నారనీ, దేవుడు విగ్రహాల్లో చిక్కుకుని పోయినాడనీ, ప్రజలకు దారి దొరకడం లేదనీ, కాబట్టి యీ పూర్వ నాగరికతనంతా నశింప జేయడానికి ప్రయత్నించమని ఉద్బోధించి, ఈ నాశనం లోనించే సుందరమైన భవిష్య త్ప్రపంచం పుడుతుందనీ, మొదలైన భావాలతో

'వెలిగించు .... ఫాలభాగమ్ము నందు' అంటూ వక చక్కని గూఢార్థ గీతాన్ని రాశాడు."[2]

ఇందలి గూఢార్థాన్ని తెలిసికోవాలంటే ఈ గీత రచనకి ప్రేరేపించిన సంఘటన ఏదో గుర్తించాలి.

అసలీ గీతం ఆవిర్భావాన్ని గూర్చి ఆవంత్స సోమసుందర్ గారిలా అన్నారు.

"జలియన్ వాలాబాగ్ దురంత హత్యల అనంతరం కొద్ది నాళ్ళకా గాఢ విషాదోద్రేకంతో తానీగీతం రచించానని వేదుల చెప్పారు."[3]

---

1. తెలుగులో జాతియోద్యమ కవిత్వం - పుట 219
2. నవ్యాంధ్ర సాహిత్య వీథులు పుట 354
3. మరపురాని కావ్యం. ఆంధ్రభూమి 24-4-86

కవిగారి హృదయంపై ఇంత గాఢముద్రకు కారణమైన ఆ దురంతం ఇది.

అమృతసర్ నగర మధ్యలో ఎత్తైన ఇళ్ళ ఆవరణ గోడలే ప్రాకారంగా ఉన్న ఖాళీస్థలం పేరు జలియన్ వాలాబాగ్. దానికొకే ఒక ప్రవేశ ద్వారం. అదైనా, సీసాకంఠంలా ఇరుకైన సందు.

అది 1919వ సంవత్సరం. ఏప్రియల్ 13న హిందువుల ఉగాది పండుగ. జలియన్ వాలాబాగ్‌లో బహిరంగ సభ. ఇరవై వేల మంది స్త్రీ పురుషులు తమ బిడ్డలతో సమావేశమయ్యారు. ఆనాటి ఉపన్యాసకుడు 'హంసరాజ్'. ఆయన ఉపన్యసిస్తున్నాడు. ఆ సమయంలో డయ్యర్ అను బ్రిటీషు సేనాని వందమంది భారతీయ సైనికులతో, యాభైమంది ఆంగ్ల సైనికులతో కాలకింకరుడిలా ప్రవేశించాడు. కేవలం రెండు మూడు నిమిషాల వ్యవధి నిచ్చి 1600 గుండ్లు పేల్పించాడు. 500 మంది మరణించడం, రెండు వేల మంది దాకా గాయపడటం జరిగిపోయింది. పైపెచ్చు మన భారతీయ సైనికులతో కాల్పించడం. మందు సామగ్రి అయిపోయే వరకు కాల్చారు.

ఈ సంఘటు కవి హృదయసముద్రాన్ని కలంచి వేసింది. ఎడతెగకుండా లేచిపడు భావతరంగాల నుండి చాలా కాలానికి వెలువడ్డ అక్షర రూపం 'కాగడా'. 'కాగడా' చైతన్యానికి ప్రతీక.

వెలిగించు కాగడా వెలిగించవోయి
ప్రళయ రుద్రుని ఫాల భాగమ్మునందు
అతని నిశాత శూలాగ్రమ్ము నందు
అతని నేత్ర గోళాంతమ్ము లందు
జ్వలియించు శిఖిశిఖా జ్వాలమ్ముతోడ
వేడిగా వాడిగా వెరపు గొల్పేదిగా
వెలిగించు కాగడా వెలిగించవోయి! దీ. ప్రట. 5

సృష్ట్యాదిలో సృష్ట్యంతంలో ప్రకృతి పురుషు లిద్దరే నిలిచి ఉంటారు. ప్రకృతి కాళరాత్రి. పురుషుడు మహేశ్వరుడు. ప్రకృతి పురుషునిలో ఐక్యమయితే మహాప్రళయం. విడివడితే సృష్టి. ప్రకృతిని తనలో ఇముడ్చుకొన్న పురుషుడే ప్రళయరుద్రుడు. అట్టి ప్రళయరుద్రుని ఫాలభాగ, శూలాగ్ర, నేత్ర గోళాల్లో మండుతున్న అగ్నిజ్వాలల్తో వేడి, వాడి, వెరపు కలిగేటట్లు కాగడా వెలిగింప మంటున్నారు కవి గారు.

ఈశ్వరుని ఫాలభాగం వేడినీ, శూలాగ్రం వాడినీ, నేత్ర గోళాంతాలు వెరపునీ కలిగి వుంటాయి. కనక ఆ విశేషణాలు మూడూ క్రమ విలసితాలు.

ప్రళయం నుండే సృష్టి ప్రాదుర్భవించునట్లు త్యాగశీలురైన వీరుల ఆత్మబలిదానం వల్లే నవ చైతన్యశక్తి పెల్లుబుకుతుంది. కాబట్టి ప్రళయ రుద్రుని ఎన్నుకోవడం జరిగింది. అంటే ఈ సంకేతం స్వాతంత్ర్యోన్ముఖమైన ప్రజాశ్రేణుల జాగృతికి ప్రతీక.

ఏ తద్గీయ రచనకి ప్రేరకమైన జలియన్ వాలాబాగ్ దురంతం ప్రజల్లో ప్రతీకార జ్వాలలు రేపింది. స్వాతంత్ర్య పిపాసను మరింతగా పాదుకొల్పింది. బ్రిటీష్ అధికారులు తలచిన దానికి భిన్నంగా లాహోర్, అమృతసర్‌లలో ఆత్మరక్షణ దళా లేర్పడ్డాయి. ప్రజల్లో చైతన్య స్రవంతి వెల్లువయై పారిందనడానికి ఆత్మరక్షణ దళాలు ఏర్పడడం చక్కని దృష్టాంతం. ఈ చైతన్యాన్ని మనసులో పెట్టుకుని వేదుల ఇంకా వేడిగా, వాడిగా, వెరపుగొల్పేదిగా కాగడా వెలిగింపు మంటున్నారు. అంతేకాదు

"ప్రాత దన్నది యెల్ల పైకి తోడుచును
నెమరు వేయుట పశుత్వము పాడి" యని బోధించారు.

అంటే గతానుగతికంగా మన జాతికి ప్రాచీన స్మృతులలో వెలిగి

పోవడమే గాసి వర్తమాన దురవస్థల్ని అవగతం చేసికొని చర్యాత్మకంగా ముందడుగు వేయడం మరిచి పోయింది. కనక ప్రాతల నెమరువేతలు పశుత్వానికి చిహ్నమని తీవ్రంగా హెచ్చరించారు.

ఈ సందర్భంగా వారు చూపిన దృష్టాంతాలు చారుతా శోభితాలు.

తొడిమ వీడిన పూవు తోవ చూడదు తీవ
ధూళి రాలిన పండుతో పోదు పాదపము
గాలి గలిసిన పాటకై పక్షి వెత పడదు
తరగ విరిగిన మహోదధి తీసిపోవదు. ది. పుట. 6, 7

గుండె కోతగా మిగిలిపోయిన ఈ దుస్సంఘటన్ని మర్చిపోయి అదే పునాదిగా ప్రజల్లో చైతన్యశక్తి పుట్టాలని కవి ఆశయం.

పూవు వీడినగాని పుట్టదు ఫలము
ఫలము రాలక జనింపదు నవాంకురము
.... .... ....
ముది శిశిరమ్మాకు చిదిమిన పట్లు
పూల కారు చివుళ్ళ పురిటి పొత్తిళ్ళు.

దీన్ని గురించి సోమసుందర్ గారి మాటలు.

"అదే వేదుల దర్శనం. అదే పరంపరాభివృద్ధి పొందే జీవలక్షణం. త్యాగశీలురై మృత్తికావాసం చేసే వీరులతో పుడమి సారవంత మవుతుంది. నవ చైతన్యశక్తిని ప్రసవిస్తుంది. అందువల్లనే ఈ గీతం జాతి జనుల గుండెల్లో నవజయ ఘంటానాదా లుప్పతిల్ల జేసింది."[1]

నేటికీ జలియన్ వాలాబాగ్ దుస్సంఘటనకి ప్రతిద్వంద్వంగా 'కాగడా' గీతం లోని నవజయ ఘంటానాదం ప్రజల గుండెల్లో ప్రతి

1. మరపురాని కావ్యం. ఆంధ్రభూమి 24-4-1986

ధ్వనిస్తూనే ఉంది.

కాంక్ష *

వేదుల దేశభక్తికి కలికితురాయి 'కాంక్ష' అనే ఖండిక. ఇందు ఆవేశం. అభినివేశం సమతూకంలో అభివ్యక్తమయ్యాయి.

దీనిపై హిందీ ప్రభావాన్ని గురించి నారాయణరెడ్డిగారు ఇలా వ్రాశారు.

"కవిగారు పేర్కొనలేదు గాని దీనికి మాఖన్ లాల్ గారి ఫూల్ కీ చాహ్ అను హిందీ గేయము మాతృక."[1]

నిజానికి 'కాంక్ష' పై 'ఫూల్ కీ చాహ్' ప్రభావం ఉందని మొదట చెప్పినవారు జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు. వీరు 1942 లోనే 'నవ్యాంధ్రకవులు - నవ్యహిందీ కవులు' అనే వ్యాసంలో ఈ విధంగా వివరించారు.

"రహస్యవాదంతో కూడిన రాష్ట్రీయ భావనలు చిత్రించడంలో 'మాఖన్‌లాల్ చతుర్వేదీ' సమర్థుడు. ఈయన 'ఏక్ భారతీయ ఆత్మా' అనే పేరుతో తన రచనలు ప్రకటించుకున్నాడు. ఈ కవి 'పుష్పకీ చాహ్' అనే కావ్యంలో మాతృభూమి కోసం ఆత్మార్పణం చెయ్యడానికి తహతహలాడే భారతీయాత్మ ఎలా తొంగి చూస్తున్నదో చూడండి. .... ఈ ఖండ కావ్యానికీ వేదుల వారి కాంక్ష అనే ఖండ కావ్యానికీ పోలిక విశేషంగా కనిపిస్తుంది. కాంక్షలో కవి స్వయంగా పుష్పమై ఇలా ఆకాంక్షిస్తాడు."[2]

---

* ఈ ఖండిక 1933లో గిడుగు వేంకట రామమూర్తిగారి సప్తతితమ జన్మవాసరోత్సవ సభలో చదువబడింది. ఈ సందర్భంగా ప్రకటింపబడిన సంచికలో ముద్రింపబడింది. ఇది మరలా 1935 ఏప్రియల్ కృష్ణాపత్రికలో వచ్చింది.

1. ఆధునికాంధ్ర కవిత్వము - పుట 386 2. ప్రతిభ న.న.స. పు.211

'కాంక్ష' పై 'ఫూల్ కీ చాహ్' ప్రభావ ముండడం తేటతెల్లం. అయితే వేదులకు హిందీ రాదు. అంతేకాదు; కొంత మంది ఆప్తులతో ఆయనే దీనిపై హిందీ ప్రభావం లేదని చెప్పినట్లు వినికిడి. బెంగాలీ ప్రభావముందని చెప్పినట్లు కవిగారి జ్యేష్ఠ పుత్రులు ఉవాచ. పోనీ; 'సంవాదినో్య మేధావినాం బుద్ధయః' అని సరిపెట్టు కుందామంటే హిందీ ప్రభావం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. సభా ముఖంగా గాని, పత్రికాముఖంగా గాని దీన్ని ఖండించినట్లు ఎక్కడా దాఖలా లేదు.

1942లో వేదుల సన్మాన సందర్భంగా వారి ప్రత్యక్షంలో సభాముఖంగా శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారిలా అన్నారు.

"కాంక్ష అనే ఖండ కావ్యం చూడండి. దీనికి హిందీ మూల మున్నది. అయినా ఇది భాషాంతరీకరణ మన్నమాట తెలియదు."[1]

ఈ వాక్యాన్ని ఆ సభలో కవి ఖండించక పోవడమే హిందీ ప్రభావ ముందనడానికి బలవత్తరమైన ఉపపత్తి. వేదులకు హిందీ రాకపోయినా సందర్భవశాత్తు ఏ హిందీ పండితుని నోటివెంటనో వింటే విని యుండవచ్చు. ఆ భావం హృదయంలో గుప్తమై 'కాంక్షా' రూపమున వెలువడి యుండవచ్చు. ఒకవేళ ఈ రెంటిండికి మూల విరాట్టుగా ఆది మూల మొకటి 'బెంగాలీ'లో ఉండినా ఉండవచ్చు. అది మృగ్యం.

మొత్తంమీద ఏ భాషా మూల మున్నా ఇది మూల ముట్టుగా వేదుల ఉపజ్ఞకమా అనునట్లు లుండడం ఆయన ప్రతిభా పాటవానికి కొండగుర్తు కాదు; కొండంతటి గుర్తు.

వేదుల సాధించిన స్పృహణీయ గుణాన్ని తెలిసికోవాలంటే మూల విషయాన్నీ చూడాలి. మూలము

చాహ్ నహీ సుర బాలాకే గహనోఀమే గూంథా జావూఀ

1. "కవి - సన్మానాలు" ప్రతిభ న. న. స. పుట 332

చాహ్ నహీ ప్రేమీకీ మాలామే బింధ్ ప్యారీకో లల్చావూం
చాహ్ నహీ సమ్రాటోంకే శవపర్ హేహరిడాలా జావూం
చాహ్ నహీ దేవోంకే సర్‌పర్ చఢూం భాగ్యపర్ ఇఠ్లావూం

అనువాదం

నాకు అప్సరసల ఆభరణాల్లో అలంకరింపబడాలనే ఆకాంక్ష లేదు. ప్రియుడి ప్రేమ మాలికలో ఒక పుష్పాన్నై ప్రియురాలిని పులకింప జెయ్యాలనే కోరికా లేదు. చక్రవర్తుల శవాలపై చల్ల బడాలనే వేడుకా లేదు. దేవాలయాల్లోని దేవతల తలలెక్కి కులకా లనే ఉత్కంఠా లేదు. మూలము

ముఝే తోడ్ లేనా బన్ మాలీ
ఉస్ పథ్‌పర్ దేనా తుం ఫేంక్
మాతృ భూమిపర్ శీర్ష్ చఢానే
జిస్ పథ్ జాయేం వీర్ అనేక్

అనువాదము

ఓ వనమాలీ! నన్ను త్రుంచి మాతృభూమి కోసం శిరస్సు లర్పించటానికి వీరులు నడిచి వచ్చే మార్గంలో పడవెయ్యి[1]

వేదుల 'కాంక్ష' ఖండిక సారాంశమిది.

ఒకనాటి జీవన పరిమితి కల్గిన ఈ పువ్వు పుట్టుక నాకెట్లో ప్రాప్తించింది. నా అందాలు, పరిమళాలు క్షణికాలైనా విచారించను. వసంతకాలపు వేడి పొంగులచే నామనస్సు నందేదో క్రొత్త కోరిక మొలకెత్తుతుంది. రాతి బొమ్మల కలంకారమవడంలో కాని గండు తుమ్మెదల ఆటపాటలు మొదలైన వాటిపై గాని, స్త్రీల కొప్పులు మున్నగు వాటియందు అలంకారాలుగా ఉపయోగపడటం గాని, ప్రభువుల కాళ్ళ క్రింద నలగాలని కాని నాకు కోరిక లేదు. 'మాతృ

1. నవ్యాంధ్రకవులు - నవ్య హిందీ కవులు ప్రతిభ న.న.న. పుట 212

దేశ స్వాతంత్ర్యానికై ప్రాణాలర్పించిన వీరుల రక్తకాంతులచే వికసించి. పరిమళాలు వెద జల్లుతూ వారి సమాధుల మట్టిపై రాలి పోవాలి' అని ఉంది.

ఈ ఖండికకు ప్రారంభ పద్యం

ఈ సుమ జన్మ మెట్లొ ఘటియిల్లెను నాకొకనాటి పాటిదై
వాసన లీను సోయగము వాయని తీయని పోడుముల్ క్షణం
బో, సగమో, విచారపడబోనయినన్ విడివడ్డ నా యెదన్
మోసులు వారు నూతన మనోరథ మామని వేడిపొంగులన్.

పుష్పానికి కొత్త కోరిక కలగడానికి కారణం వసంతకాలపు వెచ్చదనపు పొంగు లనడం మూలంలో లేని నిండుదనం.

రాతి బొమ్మలందు తపించిపోయే పాడు బ్రతుకు నిమేషమైన సహించనంటుంది పుష్పం.

పేదల రక్తమాంసముల బెంపు వహించి దయా సుధా రసా
స్వాద దరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ముకై మతో
న్మాదము పెంచు దేవునికి మారుగ నిల్చిన రాతి బొమ్మలం
దూదరపోవు పాడు బ్రదుకొక్క నిమేషము సైప నాయెదన్

ధనవంతుల్ని దయా సుధా రసా స్వాద దరిద్రులనడం, దేవుడు ధనవంతుల పెద్దరికానికి మతోన్మాదం పెంచు వాడనడం మూలంలో లేని గడుసుదనం.

ఈ పద్యాన్ని ఉద్దేశించి సోమసుందర్ గారి అభిప్రాయం

"ఈ పద్యంలోని మనోజ్ఞభావం, ఈ శతాబ్దపు ఆరంభ దశాబ్దాలకే కాదు, చివరి దశాబ్దాలకు చేరుకుంటున్న నేటికిసైతం ఎంత ఆధునికమై నిగనిగలాడుతుందో వేరుగా వివరించ నక్కరలేదు.[1]

---

1. మరపురాని కావ్యం. ఆంధ్రభూమి 24-4-1986

ఇది ఆధునికమై నిగనిగలాడడానికి కారణం పేదల రక్తమాంసాలవల్ల ధనవంతులు పెద్దవాళ్ళవుతున్నారన్న భావం ద్వారా నవతకు మానవతకు పట్టం కట్టడం ఒకటి. రెండు - అప్రియత్నసిద్ధ యతి ప్రాసలతో కూడి, అవిచ్ఛిన్న వాక్య విన్యాసభరితమై సానలదీర్చిన జాతిరత్నంలా పద్యం హృద్యం కావడం.

కొంచెమైనా మూలభావ స్పృశ్యలేనిదీ క్రింది పద్యం.

తేనెల కోసమై కొదమ తేటుల దాటు లొనర్చు నృత్య గీ
తానునయమ్ముగాని, మలయానిలు కౌగిట బుల్కరించు సౌ
ఖ్యానుభవమ్ము గాని, తరుణారుణ రాగ కదుష్ణ చుంబన
శ్రీనవకమ్ముగాని పరితృప్తి యొసంగవు నాకొకింతయున్

తేటుల నృత్య గీతాదులు పువ్వు జీవితంలోని సాధారణ విషయాలు. ఇవి ఏవీ తనకు తృప్తినీయవట.

ఈ పద్య రచనలో ఒక సొగసున్నది. అది పద్యంలోని అసమాపక వాక్యాలన్నీ ఒకేచోట ఆగుట. ఇది పువ్వుయొక్క నిశ్చయాన్ని మరింత దృఢతరం చేస్తున్నది.

అంతేకాక పద్యానికి క్రమత సంబంధమైన సౌందర్యం లభించింది. భావానికి పద్య రచనకి లంకె కుదరడమంటే ఇదే.

మూల భావాన్ని కొంత గ్రహించినా, స్వకపోల కల్పనచే మిగిలిన భాగాన్ని పూర్తిచేసి, ఎక్కడా వెల్తి రానీయకుండా, స్వయం సమృద్ధంగా తీర్చి దిద్దడంలో ఆయన కలానికి గల బలానికి ఈ క్రింది పద్యం తార్కాణ.

నాకు దలంపులేదు లలనా జనతా కబరీ భరైక భూ
షా కలనన్, సతీమృదు భుజాంతర తల్ప కుచోపగూహ బి
బ్బోకమునన్, వధూసిత కపోల గళచ్ఛ్రవణావతంస శో
భాకమునన్, విలాసినుల పాపట చెందిర కావి పూతలన్.

ఇందు విలాసవతులైన స్త్రీలు పుష్పాన్ని ఎలా, ఎలా వాడు కుంటారో చెప్పబడింది. వాటిపై నాకు తలంపు లేదంటూ వైముఖ్యాన్ని కంఠోక్తిగా ప్రకటించింది పువ్వు.

ఈ పద్యంలో పూర్వపాదాలలోని సమాసాల కొసలంటే భూషా కలనన్, బిబ్బోకమునన్, హేవాకమునన్ అనేవి ఉత్తరపాదాల ప్రాసల లోకిని చొచ్చుకొని పోవడం రచనా సౌందర్య విశేషాల్ని ఇనుమడింప చేస్తుంది.

అందుకే హనుమచ్ఛాస్త్రి గారిలా అన్నారు.

"ఆరోజుల్లో కొరడా కొసల్లా ప్రాసలోకి విసురుతూ ఈయనలా వృత్తం వ్రాయడం ఒక ఫాషన్"[1]

ఇంకా, పుష్పం తన కష్టాల్ని హృదయ విదారకంగా ఇలా వెళ్ళబోసి కుంటుంది

కానుకనై ధరాధిపుల కాళ్ళకడంబొరలాడి వాడిపో
లేను, ధరాపరాగ పటలీ మలినమ్మగు ద్వార తోరణా
స్థానమునం దురింబడగజాలను, దోసిటిపేరి ఘోర కా
రా నరకమ్మునం దుసురు రాల్పగలేను నిమేషరక్తికై

కాళ్ళ కడ పొరలాడటం, ఉరిలోబడటం, నరకంలో ఉసురు రాల్చటం ఈ కష్టాలు ఉత్తరోత్తర బలీయాలు. కనక ముందుకు వెళ్ళేకొద్దీ మన ఎడద బీటలు వారుతుంది.

ఇంతవరకు తన నూతన మనోరథాన్ని గుప్పిట్లో కప్పిపుచ్చి చిట్టచివరగా ఇలా విప్పి చెప్తుంది.

నీచపు దాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వా చరణమ్ము నందసువు లర్పణ జేసిన వారి పార్థివ
శ్రీ చెలువారు చోట, దదసృగ్రుచులన్ వికసించి, వాసనల్
వీచుచు, రాలిపోవగవలెం దదుదాత్త సమాధిమృత్తికన్

---

1. గౌతమీ సాహిత్యం - భావాభ్యుదయ రేఖలు. తూ. గో. జిల్లా రచయితల ప్రత్యేక సంచిక - పుట 29

వికసించడం, పరిమళాలు వెదజల్లడం, రాలిపోవడం అనేవి పూవు జీవితంలోని దశలు. ఇవి మాతృదేశ సేవా పరాయణుల కంకితం కావాలనడం స్వాతంత్ర్య కాంక్షకు పరాకాష్ఠ. మానవుని పుట్టుక, పెరుగుదల, చావు ఈ మూడును వీరరక్తముచేతనే పునీతం కావాలని ధ్వని.

ఈ ఖండ కావ్యంలో ఉన్నవి ఆరు ఉత్పలాలు. ప్రతి ఉత్పల మాలలో ఉత్తమ మానవజీవిత పరీమళం గుబాళించింది ఆ పరీమళమిది.

అనంతమైన కాలంలో అత్యల్ప మానవ జీవిత పరిమాణాన్ని గూర్చి విచారించడం నిష్ప్రయోజనం. ధనవంతుల పెద్దరికానికి, మతోన్మాదానికి వ్యర్థపుచ్చు పాడుబ్రదుకు వద్దు. భౌతిక సుఖాలకు ప్రలోభపడరాదు. తరుణీమణుల తళతళలకు తత్తరపడరాదు. నీచమైన సేవకావృత్తికి పాల్పడరాదు.

ఇందలి ఉత్తమ మానవత్వ చీక్షిర అట్లుండగా "నాకు దలంపు లేదు" అనే పద్యంలో వాడిన 'బిబ్బోకం, హేవాకం' అనే పదాలు అన్వర్థాలు కావని కొందరు పండితుల్లో అసంతృప్తి ఉంది.

'బిబ్బోకం' అనే పదం గురించి హనుమచ్ఛాస్త్రి గారేమంటు న్నారో చూడండి.

"కాంక్షలో 'బిబ్బోకము' అను మాట అన్వర్థంగా ప్రయుక్తం కాలేదు. 'మనా క్ప్రియ కథాకలాపే బిబ్బోకో,ఒనాదర క్రియా' (ప్రతాపరుద్రీయం). కేవల స్త్రీ శృంగార విలాసమన్నా యిక్కడ కుదరదు."[1]

ఇటు శాస్త్రీయార్థం కుదరక పోవచ్చు. విలాసార్థం కూడా ఇంద్రగంటి వారంతటివారు కుదరదనడం మనసు చివుక్కుమంటుంది.

నాయిక పుష్పాల్ని కౌగిలించుకుంది. ఎలా అంటే చాలా

1 వేదులహారి దీపావళి - భారతి - ఏప్రియల్ 1938

చెప్పవలసి వస్తుంది. ఆమెకది విలాసం; సౌఖ్యం. అందులో పాలు వద్దంటుంది పుష్పం. కవి ఇక్కడ బోడితలకీ, మోకాలికీ ముడిపెట్టలేదే.

కుచోపగూహ బిబ్బోకమునన్ - కుచ=స్తనముల యొక్క, ఉప గూహ=కౌగిలింత యందలి, బిబ్బోకమునన్=విలాసమునందు (తలంపు లేదు) అని చక్కగా అర్థం చెప్పుకోవచ్చు. కౌగిలించుకొను విలాస మందని స్పష్టము. శృంగార చేష్టయందు గాని అని చెప్పుకుంటే గొడవే లేదు. 'ఆప్టే' నిఘంటువులో కూడ ఈ అర్థం ఉంది Amorous gesture.

అలాగే 'హేవాకం' గురించీ సంశయిస్తున్నారు కొందరు. హేవాకానికి ఆప్టేలో Intense desire అని అర్థం ఉంది. శ్రవణావతంస హేవాకమునన్ = కర్ణభూషణమగుటలో అత్యంత కుతూహలమునందు అని చెప్పుకుంటే చక్కగా కుదురుతుంది.

ఇక ఈ ఖండిక ప్రాశస్త్యాన్ని ఉగ్గడించే మద్దూరి వారి వాక్యాలతో ముగిస్తున్నాను.

"'దీపావళి' సంకలనంలోని 'కాంక్ష' అనే దేశభక్తి సంబంధించిన రచన నాటి నుండి నేటి వరకు ఆంధ్రుల రసనాగ్రాల మీద నాట్యమాడుతూనే ఉంది. ప్రజానాయకుల జీవన పావిత్ర్యమును ఇంతగా పొగడిన రచన కనుపించదు, ప్రతి పద ప్రబోధమై నిలిచింది.... మాతృదేశము పట్ల గల భక్తిని అసిధారా సదృశమైన ఆవేశంతో వెల్లడించారు వేదులవారు. ఇది తెలుగులో విలక్షణమైన భావతీవ్రత గల రచన."[1]

## ముక్తఝరి - దేశభక్తి :-

ముక్తఝరిలో వేదుల దేశాభిమాన వాహిని పలుప్రాయలై

---

1 తెలుగులో జాతీయోద్యమ కవిత్వం. - పుట 219

ప్రవహించింది. అది అవశ్యకమైన అభిమానమే కాని దురభిమానం మాత్రం కాదు. ఏ సందర్భంలో ఏమి వ్రాసినా వారి చూపు ప్రధానంగా జాతీయ చైతన్యం వైపే ప్రసరిస్తుంది. కర్తవ్య ప్రబోధం వారి లక్ష్యం. అలాగని కవితాకళా వైదగ్ధ్యం బీరుపోదు.

ముక్తఝరి, మా తల్లి, ప్రియ భారతావనీ!, జయపతాక, శ్రావణి మూడవ వసంతం, ఓ ప్రభూ!, ప్రార్థన, మా బాపూజీ, తెలుగుతల్లి, కుమారా! తిక్కనాధ్వరి, క్షేత్రయ్య, సత్కారము, విశాలాంధ్ర మనేవి దేశభక్తికి ఆటుపట్టులైన ఖండికలు.

ముక్తఝరి:-

'ముక్తఝరి' సంకలనంలోని తొలిబుగ్గ 'ముక్తఝరి'. దీని ఆవిర్భావాన్ని గూర్చి వేదులే ఇలా అన్నారు.

"దేశ కాలముల ప్రభావంవల్ల స్వాతంత్ర్యం లభించటవల్ల నాలో ఒక విధమైన విశ్వ జనీనమైన దృష్టి కలిగింది. స్వతంత్ర దేశంలో పుట్టక పోయినా, స్వతంత్రదేశంలో చనిపోయే అదృష్టం కలిగి నందుకు నా హృదయం పొంగిపోయింది.

అప్పుడు రాసిన ఒక ఖండిక 'ముక్తఝరి' వినిపిస్తా.

గిరి గర్భపుచెరలో చిక్కువడి బంధవిముక్తి చెందిన సెలయేటి గొంతుకతో దాస్యము తొలగిన, స్వాతంత్ర్యము లభించిన భారతీయ జీవయాత్ర ధ్వనించే కావ్య ఖండిక యిది."[1]

కవిగారు చెప్ప లేదుగాని దీనిపై రవీంద్రుని 'ప్రభాతసంగీత్' లోని 'నిర్ఝరేర స్వప్నభంగ' అను కవితాఖండిక ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మూలం

---

1 నా 'ఆత్మకథ' అముద్రితం - పుట 10

ధర ధర కరి కాంసి ఛే భూధర,
శిలా రాశి రాశి పడిఛే ఖసే.
పులియా పులియా ఫేనిల సలిల
గరజి ఉఠిచే దారుణ రోషే

అనువాదం

.... క్షోణీ ధరంబు
గడ గడ వడంకు చున్నది, గండ శిలలు
రాశి రాసులుగా నూడి రాలుచుండె;
గర్జనము చేసె నురుగులుగ్రక్కు జలము
పొంగి దారుణ రోష ముప్పొంగి పొరల *

వేదుల పద్యం

భూమి కంపించినదియొ! ఝుంఝూమరున్మ
హోద్యమను సాగి ఉగ్రూచి ఊడ్చినదియొ!
నన్ను బంధించియున్న మహోన్నతాద్రి
పిడు గడచినట్టు లామూల భిన్నమయ్యె!

వేదుల మూలభావాన్ని ఆలంబనంగా గ్రహించి, అంటే రవీంద్రుని కవితను బాగుగా పఠించి అనుభవానికి తెచ్చుకుని తమ సొంత గొంతుకతో ముక్తఝురిని వినిపించారు.

ఈ రెండింటిలో ధ్వని వేరైతే కావచ్చుగాని వస్తువొక్కటియే. గిరి గర్భం నుండి వెలువడ్డ ఝురియే రెండు కావ్యాలకు వస్తువు. రవీంద్రుని కవితలో స్వీయ కవితా ప్రతిభా సమున్మేషం, వేదుల కవితలో భారతదేశ స్వాతంత్ర్యోద్భవం ధ్వనిస్తున్నాయి. అయితే రెండింటికి స్వేచ్ఛయే ఆయువుపట్టు.

గిరి గర్భం నుండి బయటపడ్డ ఝురి ఇలా అనుకుంది.

---

* ఏకోత్తరశతి_అనువాదం త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి పుట 21

కదల లేకేండ్లు పూండ్లు ఈ కటికరాల
పాడు చెరనుండి నేడెటో బయటుపడితి!
తేలిపోయి దుస్స్వప్నమ్ము తెలివిగన్న
నా యెడద పొంగుచున్న దానంద జలధి! ముక్త్యఝరి. పుట 1

కటిక రాళ్ళ చెరలో కదల్లేక పెక్కువత్సరాలుండి నేటికి బయటుపడ్డాను. ఇక నేనొక స్వేచ్ఛా జీవిని. స్వేచ్ఛా మారుతాహ్వాన గీతాకోలాహలం నా హృదయాన్ని ఉత్సాహంతో ఊగిస్తుంది. నా జాతి శక్తి గమనింపకుండా ఇప్పటివరకీ గిరిగర్భంలో ఎట్లు పడియుంటినో గదా!

ఇంకా జరిగిపోయిన చీకటి జీవితాన్ని గురించి ఇలా వాపోయింది.

ఊపిరి యాడనీని కఠినోపల బంధములో కలాకలా
లాపముగాని నర్తన విలాసముగాని ధరా పరీమళా
వాపముగాని లేని పుటపాకపు చీకటి జీవితమ్ము నె
ట్లోపితినో గదా! అవలి యొడ్డగుపింపని కాలమీదుచున్

తనప్రాణాల్ని ఏతలంపుతో నిలుపుకున్నదో ఇలా వెల్లడించింది.

ఎన్నడు సోకునో తరగలెత్తగ తెమ్మెర కమ్మయూర్పు నా
యన్నువమేన ఎన్నడు దయారుణ రాగ మనోజ్ఞతల్ జగా
వన్నె పసిండి పూత చెలువమ్ముల నాపయి కుమ్మరించునో
యన్న తలంపె నా యుసురు నాపిన దాగిరి గర్భపుం జెరన్.

తరువాత ఎంతో ఉత్సాహంతో స్వేచ్ఛా జీవనంలోని భవిష్యత్తు కార్యక్రమాన్ని ఈ విధంగా వ్యక్తీకరించింది.

నాలాగ శైల బంధనాల్లో చిక్కి సుక్కెడువారి స్వేచ్ఛకోసం సాగర యాత్ర కుపక్రమిస్తాను. ప్రపంచమెల్ల నాదేయని పరుగు పెడ్తూ పురోగమనావరోధాల్ని తుడిచివేస్తాను. దిక్కు, దిక్కుల శాంతి

సందేశ గీతాన్ని వార్ధిఘోషతో శృతి గలిపి పాడతాను. హేలగా మూల మూలల్ని ఒరసికుంటూ సంచరిస్తాను.

ఇట్లు ఆత్మాశ్రయంగా, స్వేచ్ఛ అనేది జీవన లక్షణంగా సాగిన ఈ ఖండికలో నదీ ప్రాశస్త్యాన్ని ప్రకటిస్తున్న పద్యమిది.

ఋషులు పాడిన వేద ఋక్కులు వినిపించు
　　గంగాపగా వీచికా స్వరమ్ము
నడకలో వేణుగానపు హొయల్ పచరించు
　　యమునా నదీ తరంగముల రవళి
ఆంధ్రభారతికి కావ్యాలాప మెరిగించు
　　గౌతమీ సరిదూర్మికారవమ్ము
కత్తి గంటముల కొక్కటు నర్ఘ్యమిచ్చెడు
　　తుంగభద్రాధునీ భంగరవము

నా స్వతంత్ర తరంగ గానమున గలసి
గొంతు సవరింప ఈ చతురంత ధాత్రి
దూరదూరాల తీరోపతీరములకు
మోసికొని పోదు స్వేచ్ఛా ప్రమోదవార్త　　ము. పుట 6

స్వేచ్ఛాప్రమోద వార్తను మోసికొని పోవుటలో గల అంతర్యాన్ని ఉగ్గడిస్తున్న డా॥ శొంఠి సూర్యనారాయణరావుగారి మాటలతో దీనికి భరతవాక్యం పలుకుతున్నాను.

"స్వేచ్ఛ అనేది వ్యక్తిగతమైన సమస్య మాత్రమే కాదని, సంఘం యావత్తుకు చెందిన విషయమని వేదులవారు గుర్తించి "దూర దూరాల తీరోపతీరములకు మోసికొనిపోదు స్వేచ్ఛా ప్రమోదవార్త" అనడమే కాకుండా 'ముక్తఝురి' చేత 'సాగర యాత్ర కుపక్రమింతు నా త్రోవకు నడ్డమౌ గిరితతుల్ గహనమ్ములు ఛిన్నభిన్నమైపోవ" అని ప్రతిజ్ఞ చేయించారు."

**మాతల్లి**

"ఏదేశ మేగినా, ఎందుకాలిడిన
ఏ పీఠ మెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లి భూమి భారతిని" అనిన రాయప్రోలు వారితో భారతదేశం మాతృమూర్తిగ ఆధునికాంధ్ర కవితా పీఠాన్ని అధిష్ఠించింది. వారి అనుయాయుల్లో ఒకరైన వేదుల రచించిన 'మాతల్లి' అనే ఖండిక భరతమాతకు కవితా కంఠహారం.

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అను రామాయణ సూక్తిలో గల జననీ, జన్మ భూముల కేకత్వ మీ ఖండిక.

పసితనంలో కన్న తల్లిని కోల్పోయిన దురదృష్టవంతుడు వేదుల. తల్లిలేని వేదుల హృదయ వేదన కీ కవిత రసమయ ప్రతిబింబం.

తల్లి వద్దనే పొందగల జీవన శాంతి నిర్ఝరులు, స్తనదుగ్ధ మాధురులు కవికి భరతమాత యందు లభించాయి. ఆ కారణంగా తనను వీడిపోయిన కన్నతల్లి పుణ్యాకృతిని భరతమాతాకృతిలో పోల్చుకొన్నారట.

నీకడ కాళులందె హిమనిర్మల జీవన శాంతి నిర్ఝరుల్
నీకడ కన్నులందె జననీస్తన దుగ్ధ విముగ్ధ మాధురుల్
నాకు లభింప శైశవమునన్ నను వీడిన కన్నతల్లి పు
ణ్యాకృతి బోల్చుకొంటి భవదాకృతిలో నిపుడో కళావతీ!

ఆమె అమృత స్వరూపం హృదయంలో నిల్చినంతనే వీడని కాంక్షలు మటుమాయ మయ్యాయి. కవి దృష్టిలో ఆమె పేదలపాలిటి అన్నపూర్ణ. దుర్బలుల రక్షణకై అభయ ప్రదానం చేసేశక్తి. పృథ్వీదయితుని భిక్షువుని జేయ, భిక్షువుని రాజ్యధురంధరుని జేయ సమర్థురాలు. కనుక నావంటి పేదల్ని కృపతో భరింపుమంటున్నాడు.

అట్లు భరిస్తే ఆమె కృపావనికి కోకిలనై కొనియాడు కొందు నన్న పద్యరత్నం.

ఆరని మంటగా బ్రతుకునందు రగుల్కొనుచున్న దొక్కటే
కోరిక, నీకృపావనికి కోకిలనై కొనియాడుకొందు మం
దార సుమారుణ ద్యుతి వితానము గొల్పెడి నీ మనోహరా
కారముతో మధూదయ వికాసము నింపుము తల్లి! నాయెదన్.
ప్రియభారతావనీ!

1947 ప్రాంతంలో హిందూ ముస్లింల మధ్య ప్రజ్వరిల్లిన దారుణ మారణ హోమాగ్ని జ్వాలల కారణంగా వెలువడిందీ ఖండిక. అంచేత ఆ జ్వాలల వెనక ఉన్న వాతావరణపు వేడి ఎట్టిదో తెలిసికోవడం అవసరం.

బెంగాలు, పంజాబ్, సింధు, బెలూచిస్తాన్ వాయవ్య సరిహద్దు రాష్ట్రాల్లో ముస్లింలు అధిక సంఖ్యాకులు. వారు స్వతంత్రభారతంలో హిందువుల పాలనలోనికి రావడానికి అంగీకరింపలేదు. 'పాకిస్తాన్' అను ప్రత్యేక రాజ్యం ఏర్పడడమే ముక్తిసాధనమని భావించారు. అందులకువారు బెంగాల్లోని హిందువుల్ని, పంజాబులోని హిందువుల్ని సిక్కుల్ని లక్షల సంఖ్యలో దారుణంగా హత్య చేశారు. దీని ప్రతిక్రియగా బీహారులో హిందువులు ముస్లింల్ని హత్య గావించారు. ఇదియే అంతర్యుద్ధానికి దారితీసింది. దేశ విభజనతో సద్దుమణిగింది.

ఆ హిందూ ముస్లింల దారుణ మారణ హోమాగ్ని జ్వాల వేదుల హృదయాన్ని జ్వలింప జేసింది. నిజమైన జాతీయకవి గాబట్టి ఏక సంతతిలో రేగిన జ్వాలకు చలించిపోయి భారతమాతను

ప్రియ భారతావనీ! విశ్వైకపావనీ
జయశాలినీ! మమ్ము దయజూడుమా జననీ! అని ప్రార్థిస్తూ తమ వాంఛితార్థాన్ని ఇలా వెలిబుచ్చారు.

తెగలు తెగలై చీలి వగచు నీ సంతతిని

తెగని స్నేహమున బంధించి ఏకము చేసి ॥ప్రియ॥
కలుషితాచారమున కుల జాతి మత ద్వేష
ములబాపి నీ సేవ సలుపు భాగ్యంబిచ్చి ॥ప్రియ॥
చెలిమితో జాతీయ బలముతో వైభవో
జ్జ్వల జీవనముతో విలసిల్ల దీవించి ॥ప్రియ॥ ము. పుట 54

కుల, జాతి, మత ద్వేషాల్ని పోగొట్టి ఏకసంతతి వారైన హిందూ ముస్లింల్ని ఒకటి జేయు మన్నారు. అలా ఉండిన నాడు ఆసియా ఖండంలో భారతదేశ కేతనం తలమానికం కాగలదని ఆశించారు.

## జయపతాక

1947 ఆగష్టు 15 రాత్రి 12 గంటలకు పేరూరులో చదివిన గేయం. అంటే తొలి స్వతంత్రోత్సవ సభ ఇప్పటివలె గాక అప్పుడర్ధ రాత్రి జరిపి ఉండవచ్చు.

లాల్ ఖిల్లాపై త్రివర్ణ పతాక ఎగరడంతో ప్రారంభమైందీ గేయం. మతం విడిచి, ద్వేషం మరచి స్వతంత్ర భారత జయ పతాకకు మొక్కమంటున్నాడు కవి.

పవిత్ర భారత సవిత్రికోహో
స్వతంత్రోత్సవం సాగింది
లాల్ ఖిల్లాపై అశోక చక్రపు
త్రివర్ణ కేతన మెగిరింది ॥ప॥
మతం తలవక గతం తడవక
ద్వేషం రోషం సకలం మరచి
స్వతంత్ర భారత జయపతాకకు
సోదరులారా! మ్రొక్కండి ॥ప॥ ము. పుట 55

అంతే కాకుండగా స్వతంత్రయోధుల్ని స్మరించుకుంటూ,

హృదంబుజార్పణ చేయుమని, సమైక్యంతో హిమాలయం మొదలు కన్యాకుమారి వరకు భారత విజయాన్ని పాడుమని చక్కని సందేశ మందించిన ముగింపు గేయాలివిగో!

పోరుల మందిన కారలకుందిన
స్వతంత్ర యోధుల సర్మించుకొంటూ
ముదశ్రు తర్పణ హృదంబుజార్పణ
సోదరులారా! చేయండి ॥ప॥

అమోఘ శక్తుల సమీకరించుక
సమస్త భారత సమైక్య మెంచుక
హిమాద్రి మొదలుగ కుమారి వరకు
భారత విజయం పాడండి ॥ప॥ ము. పుట 56

ఇట్లు మంచి ఉత్సాహాభరితంగా సాగిన రచన ఇది.

శ్రావణి

నేటి నుండి ముమ్మాటికి నిజముగ
సుస్వతంత్రులము సుమండి మనము
నేడే జాతికి నిజమగు పండుగ
ఇన్నాళ్లకు ఇదే శ్రావణము
స్వతంత్ర మహిళా జనపార్వణము

అను గేయాన్ని బట్టి ఏతద్రచన కూడ స్వాతంత్ర్యం వచ్చిన వత్సరంలోనే వ్రాయబడిందనుట స్పష్టం.

శ్రావణ మాసంలో వచ్చు వరలక్ష్మీ వ్రతాన్ని పట్టే వనితల్ని పిలుస్తున్న ప్రారంభ గేయం.

నోములు నోచిన భామల్లారా!
వ్రతాలు పట్టిన వనితల్లారా!

పుణ్యము పండిన పురంధ్రులారా!
పేరంటానికి రారండమ్మా! ము. పుట 57

కవిగారిలా పిలవడానికి కారణముంది. నేడు వచ్చె శ్రావణ లక్ష్మికొక విశిష్టత ఉంది. అదేమిటంటే రెండు వందల వత్సరాలకు స్వాతంత్ర్యశ్రీ సహచారిణిగా శ్రావణ వరలక్ష్మి రావడం. దీన్నే శాస్త్రిగారిట్లు ప్రశంసించారు.

ఇన్నాళ్ళు రేండ్లకు ఈనాడిదిగో
భారత మహిళల భాగ్యలక్ష్మిగా
స్వాతంత్ర్యశ్రీ సహచారిణిగా
వచ్చెను మన శ్రావణ వరలక్ష్మి ము. పుట 57, 58

ఓ ప్రభూ!

వివిధ కుల జాతి మత భాషలతో సతమత మవుతున్న దేశ ప్రజలకు మేలు చేయమంటూ భగవంతునిలా ప్రార్థించాడు కవి.

వివిధ కులముల వివిధ భాషల వివిధ జాతిమతాలతో
సవిధ భూముల రణగుణధ్వని సలుపు శత్రుదళాలతో
నివురు కోసము పంటకుప్పకు నిప్పుపెట్టు మురాలతో
మివుల కీడ్పడు భరతధాత్రికి మేలు చేయవయా ప్రభూ!

అంతేకాదు; స్వాతంత్ర్యం కోసం ప్రాణా లర్పించిన వారి ఆత్మల శాంతికై ప్రార్థించిన దేశ భక్తాగ్రగణ్యులు వేదుల.

వీర మాతలు వీర పత్నులు వీను లెన్నో యేండ్లుగా
కోరి, యెందరొ చెరలపాలై ఘోరశిక్షల కగ్గమై
భారతావని స్వేచ్ఛ కోసము ప్రాణముల్ బలిచేసిరో
వారి యాత్మల కిమ్ము శాంతిని! వరము మాకదియే ప్రభూ!

ఇంతటితో ఊరుకోలేదు "పరుల కండగ నిల్చి స్వజనుల ప్రతిఘటించిన వారలన్" "కరుణ జూడుమ! యెల్లరద్దులు గారె నీ

దయకో ప్రభూ!" అని ప్రార్థించడంతో ఆయన విజ్ఞత వ్యక్తమవుతుంది

## ప్రార్థన

విశ్వజన కళ్యాణ ప్రదుడైన ఆ జగదీశుని భారత ప్రజా స్వామ్యం సమృద్ధమౌనట్లు ప్రోవుమని ప్రార్థించడం ఇందలి విషయం. ఈ ప్రార్థనలో దేశస్థితి ఎట్లున్నదో చెప్పిన పద్యం హృదయావర్జకం.

'ప్రజల నెత్తుటితో కొవ్వు బలసి యాడు
పారతంత్ర్య పిశాచమ్ము వదలె నన్న
సంబరము తప్ప ఇంటు దీపంబు పెట్ట
లేదు; ప్రమిద స్నేహము లేదు; లేదు వత్తి. పుట 65

మన దేశంపై చైనా, పాకిస్తాన్‌లు దండెత్తే సందర్భాలలో 'ప్రబోధము', 'సందేశము', 'పిలుపు' శీర్షికలతో భారతీయుల నుత్సాహపరుస్తూ రచనలు చేశారు.

"జన్మభూమి గౌరవమ్ము స్వాతంత్ర్యము కాపాడగ
నరనారీ తతులారా! నడుముకట్టి లేవండి!
మువ్వన్నె పతాక నీడ మోహరించి నిల్వండి! పుట 78

## మా బాపూజీ

కొందరు భావకవులు జాతీయ నాయకుల్ని కీర్తిస్తూ తమ దేశ భక్తిని వెల్లడించుకొన్నారు. అలా గాంధీజిని కీర్తించిన వారిలో వేదులా ఉన్నారు.

వేదుల దృష్టిలో బాపూజీ భారత భాగ్య విధాత. బుద్ధుని అహింసా మహస్సు, జీససు రక్తధారల త్యాగ మహిమ, మహమ్మదు జీవితంపు నమ్మకపు బలం, రామానుజుని భక్తిరసం వెరసి గాంధీజీయని శాస్త్రిగారి విశ్వాసం.

సేద గొన్న శ్రమ జీవికి శరణము
పల్లెవాకిటికి పచ్చ తోరణము
అంధ జగతి కాశారుణ కిరణము ము. పుట 100
జయ మహాత్మజీ జయ బాపూజీ! అని కొనియాడారు.

### తెలుగు తల్లి

శాస్త్రి గారు తెలుగు తల్లిని ప్రశంసిస్తూ తమకు కలిగిన ఆనందాన్ని ఇలా వక్కాణించారు.

తెలుగు నేలపైన తిరుగాడు నప్పుడు
తెలుగు మాట నోట బలికి నపుడు
తెలుగు వారి కథలు తలపోసి నపుడు
పొంగిపోదు గర్వమునను నేను ము. పు. 80

ఇది తెలుగుదనంపై వారి అభిమానాతిరేకాన్ని తెలుపుతుంది.

### కుమారా!

ఇందు తెలుగువారి పూర్వపు ఔన్నత్యాన్ని ఉగ్గడించారు. దేశ దేశాలకు సంస్కృతిని ప్రసాదించిన ఆంధ్ర విజ్ఞానాన్ని, కుంచాలతో ముత్యాలు కొలిచిన ఆంధ్ర మహైశ్వర్యాన్ని యోచింపుమన్నారు. ఇట్టి జాతికి దాయాదివి కావడం ఎంతో భాగ్యమంటున్న పద్యం.

తెలి గొడుగు నీడ మగధ సీమలకు గూడ
శాంతి జేకూర్చిన మహాంధ్ర జాతి పౌరు
షోదయ చరిత్రకీవు దాయాది వగుట
యెంత భాగ్యమ్మొ గ్రహియింపుమీ కుమార! ము. పు. 81

### తిక్కనాధ్వరి

దాస్యాంధకారంలో మ్రగ్గుతున్న ఆంధ్రులకు పగుల ననుక రించడం పరిపాటైపోయింది. వారు గొప్పవారు మన మల్పుల మను

భావం పాతుకుపోయింది. దానితో వ్యక్తిత్వం చచ్చిపోయింది. ఆ వ్యక్తిత్వాన్ని నిలబెట్టి చైతన్యవంతుల్ని జేయడానికి భావకవులు మన వారి కళాప్రాభవాన్ని ఉగ్గడించడం ద్వారా నడుం కట్టారు.

వేదుల శిల్పపు తెనుగు తోటయైన తిక్కన్నని, రససిద్ధ వాగ్గేయ కారుడైన క్షేత్రయ్యని, విశ్వగాన సుధా వేణికలు విరియించిన ద్వారము వెంకటస్వామి నాయుడ్ని ప్రశంసించారు.

నెల్లూరులో 'తిక్కన జయంతి' సందర్భంగా వేదులకు సత్కారం. ఆ సత్కార సభలో 'తిక్కనాధ్వరి' అనే శీర్షికతో తిక్కన వైశిష్ట్యాన్ని వక్కాణించారు.

ఆయన దృష్టిలో తిక్కన "భారతామ్నాయ మాంధ్రదేవి కుడుగర యిడిన పుంభావవాణి". బంగరు పూలతో పూజ చేసినా తిక్కన ఋణం తీర్చుకోలేమంటున్న పద్యం.

వ్యాసుని భారతాగమము నందలి పాత్రలనెల్ల వేష భా
షా సుచరిత్రలం దెలుగు జాతి హొయల్ మెరయంగ దీర్చి కై
సేసిన యట్టి నీ తెలుగు సేతకు బంగరు పూల పూజలం
జేసియు తీర్చికోగలమె నీ ఋణ మెన్ని తరాల కేనియున్.

## క్షేత్రయ్య

రస రాజ్య పట్టభద్రుడు, ఆంధ్ర వాగ్గేయకారుడైన క్షేత్రయ్యనిలా ప్రస్తుతించారు శాస్త్రిగారు.

కవివి గాయకుడవు భక్తుడవు నటుండ
వోయి రసమూర్తి! యేమి కానోపవీవు
మువ్వ గోపాలు కెమ్మోవి మురళి వీవు
శారదాపాద నాట్య మంజీర మీవు ము. పు. 42

క్షేత్రయ్య మధురభక్తిని గుర్తించలేక, ఆయన పదాల్ని అసభ్యతా మలీమసము లన్న వారిని అరసికులంటూ నిరసించిన పద్యం.

రసికత చచ్చి భక్తి మధురత్వ మెరుంగక నృత్తగీత సా
ధ్వసులగు సాము లయ్యుదువతంసునికై తపియించి పోవు ప్రే
యసి వయినీవు పాడిన రసార్ద్ర పదమ్ము లసభ్యతా మలీ
మసము లటందు రెంత కసుమాలపు కాలము దాపురించెనో?

## సత్కారము

1949లో చెన్నపురిలో శ్రీ ద్వారము వెంకటస్వామి నాయుడు గారికి జరిగిన సత్కార సందర్భంలో వ్రాసిన గేయమిది.

ఎచ్చట ప్రతిభ ఉంటే అచ్చట ముచ్చటను ప్రకటించే సహృదయ సమార్త్రుటు వేదుల. సమకాలము వారని మెచ్చక పోవుట ఉండదు. వారికి ప్రత్న ప్రత్యగ్రముల భేదభావం లేదు. కనకనే

ఓ గాయకోత్తమా! ఓ కళావిత్తమా! అని ప్రారంభించి
గోపాలు పిల్లనగ్రోవి యూదిన హాయి
 నీ వాయులీన తంత్రి తానమే నోయి
తెలుగు గాణల యశోలలన నెన్నుదుటి శ్రీ
 తిలకమ్ము వంక లొత్తినదోయి నీ చేయి-

అని ద్వారం వారిని కొనియాడారు.

ఇట్లు తెలుగుదేశ విశిష్ట వ్యక్తుల కళాప్రతిభను ప్రశంసించారు. తద్వారా ప్రజల్లో ఆత్మప్రత్యయాన్ని, దేశాభిమానాన్ని పెంపొందించారు.

## విశాలాంధ్రము *

స్వాతంత్ర్యసిద్ధితోపాటు చిరకాల వాంఛ - ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతుందని ఆంధ్రు లాశపడ్డారు. నెహ్రూగారు కూడ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి అసాధ్యమైన అవరోధాలు లేవని ప్రకటించారు.

* 2-1-49 దీని రచనా కాలం.

అందుచే ఆంధ్రులలో విశాలాంధ్రోద్యమం పునరుజ్జీవితమైంది. కవులు వైతాళికత్వం నిర్వహించారు. ఆ వైతాళికత్వమే వేదుల విశాలాంధ్రము.

ఇందు సకలాంధ్రం ఒకరాష్ట్రం కావాలని కవిగారు ఆశించారు. తెలుగుతల్లి పూర్వపు ఔన్నత్యాన్ని కీర్తిస్తూ జోహారు లర్పించారు.

అలా కీర్తించిన పద్యాలలో ఇదొకటి

మగధేశ్వరుని కోట మొగలి గోపురముపై
  ఆంధ్రధ్వజము నాట్యమాడినపుడు
చెక్కిన శిలకెల్ల జీవమిచ్చిన యాంధ్ర
  శిల్పము కృష్ణ ఘోషించినపుడు
నన్నయ భారతామ్నాయములో కవి
  తా దేవతా వేణు వూదినపుడు
అఖిల దేశమ్ముల కాంధ్ర సంస్కృతి పోయి
  తొలి భిక్ష యిడి యాజ్ఞ గొలిపినపుడు
శౌర్య శిల్ప కళాజ్ఞాన చతురిమమ్ము
చతురుదధి వీచికలు జయస్తుతు లొనర్ప
భారతావనీ హీర కోటీరమట్లు
అలరిన తెలుంగు తల్లి! జోహారులమ్మ  ము. పు. 85

ఆంధ్రుల శౌర్య శిల్పకళా జ్ఞాన చతురిమమ్ముల నుగ్గడిస్తున్న ఈ పద్యం తెలుగుజాతి పూర్వపు ఔన్నత్యాన్ని కీర్తించిన రాయప్రోలు, విశ్వనాథ వారల పద్యాల్ని తలపింప జేస్తుంది.

మగధేశ్వరుని కోటపై నాట్యమాడిన ధ్వజం ఆంధ్రరాజైన హస్తివర్మది. కృష్ణఘోషించిన ఆంధ్రశిల్ప మమరావతిది. ఇట్లు

"తొంటి పేర్వాసి తర్విప్వి యెత్తుటయెగాని
నేటి దైన్యస్థితి కెడంద బీటువారు!" అని బాధపడ్డారు.

### ఉగాది

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తొలి ఉగాదికి ఆయన హృదయం పొంగి వెలువడిన పలుకులివి.

ఏనాటి ఎడబాటో ఈనాడు తీరి
మాటలో మనసులో మమతలు వారి
జనని కౌగిట హత్తుకొను తెల్లువారి
పాలి కుగాది సంబర మొకేసారి. ము. పు. 91

ఎప్పుడో విడిపోయిన వివిధ ప్రాంతాల తెలుగువారు తల్లి కౌగిటికి చేరారు. అందుకు తమ ఆనందాన్ని వెలిబుచ్చారు వేదుల. ఇదీ వారి దేశభక్తి.

## 2 ప్రణయ మాధుర్యం

### భావకవులు – ప్రణయం

ప్రణయ కవిత్వం భావకవిత్వానికి పర్యాయపదం వంటిది. భావకవిత్వం పరిక్రమించడానికి, పరిణతికి, పరిక్షతికి ప్రణయ కవిత్వం ప్రబల కారణం కావడంలోనే దాని ప్రాధాన్యమెంతో తెలుస్తుంది.

"భావకవిత్వం ముఖ్యంగా ప్రణయ కవిత్వమే"[1] అని అమరేంద్ర గారు, "భావకవిత్వం అనగానే 'ప్రణయ కవిత్వం' అని స్ఫురిస్తుంది సాధారణ పాఠకులకు"[2] అని ముకురాల రామారెడ్డిగారును వ్రాయడంలో అంతర్యమిదే.

భావకవులు వియోగ శృంగారంలోని మాధుర్యాన్ని గ్రహించి దానికే పట్టం గట్టారు. వియోగదశలో ప్రణయాన్ని మధురాతి

1. నవ్యాంధ్ర సాహిత్యంలో భావకవితా విన్యాసం
తెలుగులో పరిశోధన పుట 290
2. భావకవిత–ప్రణయం–తెలుగుసాహిత్యవికాసం పుట 40,41

మధురంగా వర్ణించారు. ఆ విప్రలంభస్థితిలో వీరు ప్రకృతిని ద్వేషించరు; దూషించరు. పైపెచ్చు ప్రకృతిగతాలైన చంద్రుడు, మేఘం ఇత్యాదులు ఆప్తమిత్రాలై చిత్తోపశమనాన్ని కలిగించునట్లుగా కనిపిస్తాయి.

ఈ ప్రణయ కవిత్వంలో శారీరకమైన రెపరెపలు కనిపించవు. లిప్సాత్మకమైన అంగాంగ వర్ణన కంచు కాగడా పెట్టి వెదకినా కానరాదు.

"ప్రబంధాలలో శృంగారం సంభోగావధి కలది. భావ కవిత్వంలో ప్రణయం వియోగావధి కలది."[1] అని వెల్చేరు నారాయణరావుగారు అనడానికి హేతువిదియే.

ఈ వియోగంలో వీరు స్త్రీని ప్రణయదేవతగా ఆరాధించారు. ఆ ఆరాధనా భావం పెరిగిన కొద్దీ పురుషుని స్వాతిశయం సన్నగిల జొచ్చింది. అందుచే స్త్రీకి విశిష్టస్థానం లభించి, రాబోవు కాలంలో నవ్యమానవతా సాహిత్య దృక్పథానికి నాంది పలికింది.

భావ కవులు తాము దర్శించిన, ప్రేమించిన, ఊహించిన స్త్రీలను గూర్చి ఉదాత్తరమణీయంగా ప్రణయగీతాలు పాడుకొన్నారు. వీరు ప్రేయసిని అలౌకిక మూర్తిగ చిత్రించి ఆమెకై వేదనా భరితులయ్యారు. ఆమె పవిత్ర పాదాల సన్నిధిలో వసించడానికి తహతహలాడారు. ఆ ప్రణయ దేవతలో ఐక్యమైపోయి ఆనందానుభూతిని పొందాలని ఆకాంక్షించారు. తమ జీవన దేవత కటాక్షానికై ఆశ నిరాశల మధ్య ఊగిసలాడారు. వారు విషాదంతో కృంగిపోతున్నా, తమ ప్రేయసి మాత్రం ఆనంద డోలికల్లో తేలియాడాలని భావించారు. ప్రేమ దేవత చిరునవ్వుకై బ్రతుకు వెలిగించి నివాళి పట్టారు. ఇట్లు పరిపరి విధాల ప్రణయస్వరూపిణికై పరితపించారు.

---

1. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం పుట 144

ఈ కవుల్లో కొందరు తమభావనా ప్రపంచంలో ప్రాదుర్భ వించిన ప్రేయసులకు నామకరణాలు కూడ గావించారు. అయితే వేదుల మాత్రం వారి ఊహా ప్రేయసికి పేరు పెట్టలేదు. ఊహా ప్రేయసిని గూర్చి ఆయనన్న మాట లీ సందర్భంలో వినదగ్గవి.

"మామూలు మానవుల వలె తనకు దొరికిన దానితో తృప్తిపడడు కవి. ఏదో తీరని కోరిక, ఏదో ఉన్నతాశయము అతని ముందు నిల్చి ప్రశ్నిస్తూ ఉంటుంది. ప్రతి క్షణమూ, కంటికి కాన్పించే సృష్టిలో తన ఆశయాలకూ, ఆదర్శమునకూ దప్పి తీర్చే సౌందర్య సుధ లభించనప్పుడు కవి, ఒక భావనా ప్రపంచాన్ని సృష్టించుకొంటాడు. ఆ ప్రపంచము వాస్తవ ప్రపంచము కంటె వాస్తవము. నిత్య నూతనము. సౌందర్యమయము ఆ ప్రపంచానికి అధిదేవత స్త్రీ. ఆమె కామ తృప్తికి ఆధారమయ్యే వ్యక్తికాదు. ఆమె ప్రేమ స్వరూపిణి. కలామయి. శక్తిరూపిణి. జీవన దేవత. ఆమె కటాక్ష దీప్తి సోకిన కొద్దీ కవి హృదయములో అమర గానము ఆరంభ మవుతుంది. అదే కావ్య సృష్టికి ఆరంభ లక్షణము."[1]

భావ కవుల ఊహాప్రేయసి యొక్క సమగ్రస్వరూపాన్ని ప్రతిబింబించే నిలువుటద్దమిది.

వేదులన్నట్లు భావకవుల భావనా ప్రపంచానికి అధిదేవత స్త్రీ. ఆమెను వారమరగానంతో ఆరాధించారనడం చర్విత చర్వణం. అలా రమణీయ ప్రణయ గీతాలతో ఆరాధించిన గణనీయులైన భావకవు లెందరో ఉన్నారు. ఆ గణనా ప్రసంగంలో మొదటి ఇద్దరిలో వేదుల ఒకరనడం అతిశయోక్తి కాదు నేనిలా అనడానికి

1. ప్రవేశిక - కళ్యాణ కింకిణి పుట. XII

"నేటి కవులందరూ స్త్రీని భోగ్య పదార్థంగా కాక ఆరాధ్యదేవతగా మాతృమూర్తిగా దర్శించారంటూరు. కనుకనే నేటి కావ్యములలో మొదటి రకపు శృంగార మున్నదంటూరు. ఇదియే ఉత్తమ శృంగార మైతే నాయని సుబ్బారావుకు వేదుల వారికీ ఈ విషయంలో అగ్ర తాంబూల మివ్వవలసి ఉంటుంది."[1] అని పలికిన కాటూరి వారి వాక్యాలు.

"తెనుగు కవులలో ప్రియురాలిని శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి గార్లవలె ఆదరించిన వారు మిక్కిలి యరుదు."[2] అని చెప్పిన దేవులపల్లి రామానుజరావుగారి వాక్యాలు ప్రోద్బలకాలు.

ఇపుడిక దీపావళిలో వేదుల చిత్రించిన ప్రణయ మాధుర్యాన్ని పరిశీలించడం కర్తవ్యం.

## ప్రణయమూర్తి

ఇట కవియే ప్రణయ మూర్తి. అతనికడ చాతక పక్ష్యాదులు జీవనానంద గీత్యాదుల్ని నేర్చుకోవడం ఇందలి విషయం.

ప్రణయ తంత్రుల విశ్వ విపంచి నేను
శైల హృదయమ్ములోని నిర్ఝరము నేను
వసుమతీ గర్భతల సరస్వతిని నేను
నా గళమ్మె వియోగ సంయోగ మురళి. దీ. పు. 11

ప్రణయ తంత్రుల విశ్వవిపంచియైనారు కనకనే ప్రకృతికి ప్రణయ పాఠాలు ప్రవచింపగల్గడం. అందుచే ఆయన వద్ద ఆషాఢ మేఘం చెంత ధన్యవాదమ్మొలాడు చాతక వధూటి జీవనానందగీతిని, కాచ పాత్రాంతరమున వెలుగు దీపిక వలగొను శలభకాంత ఆత్మార్ప ణాన్ని, ప్రణయ దుఃఖాగ్ని మండి నీలమై వంగి వాపోవు నింగి

1 "కవి-సన్మానము" ప్రతిభ, న.న.స. పుట 326
2 సారస్వత నవనీతము - పుట 137

నెలత ప్రణయ ప్రణామ నియతిని, తొడిమ వీడిన పూవ్వులై పడుచు తేటి విధుర గీతాకలనాన్ని, పవన పరిరంభ పులకితాలైన అంబుజ కైరవాలు ప్రణయ హేవాక కేళిని, మధుప్రవాస ప్రయాణవేళ వీడుకోలుపు పాడగ గొంతు విడని పికము మౌనగాన ప్రవృత్తిని నేర్చుకొన్నాయి.

వీటిలో మచ్చుకొక ముచ్చటైన పద్యాన్ని వివరిస్తాను.

పలుక దెలియగ దలపగా వలను గాక
ఆత్మను దహించు ప్రణయ దుఃఖాగ్ని మండి
నీలమై వంగి వాపోవు నింగి నెలత
నా కడనె నేర్చె ప్రణయ ప్రణామనియతి

వర్షకాలంలో సాధారణంగా నింగి నీలంగా ఉంటుంది. నీటితో ఉన్న మేఘాలతో కూడి యుంటుంది కాబట్టి. అపుడు మెరుపులు, శబ్దాలు మామూలే. కవి ఇక్కడ మెరవడాన్ని ప్రణయ దుఃఖాగ్నిచే మండడ మంటున్నాడు-మండిందంటే నల్లబడుతుంది కదా! దాన్నే కవి ఇలా అంటున్నాడు. నింగి నెలత ప్రణయ దుఃఖాగ్నిచే మండి నీలమైంది. అంతేకాక వంగి వాపోతుందంటాడు కవి. నిజానికి నీటిచే నిండిన మేఘాలు క్రింది కుంటాయి. వాపోవడ మంటే దుఃఖించడం. అపుడు కన్నీళ్ళు కారతాయి. అదే వర్షించడం.

ఇలా ప్రకృతికి ప్రణయాన్ని ముడిపెట్టడం ఈ ఖండిక వైశిష్ట్యం.

## యాత్ర

తర తరాల ప్రేమ స్వతంత్రులు పోవుదారిలో పయనించడానికి కవి తన ప్రేయసి నాహ్వానించుట ఇందలి విషయం.

పైరగాలి తరంగాలపై పరిమళాలు వెల్లి విరియసాగాయి. కవి హృదయంలో ఆనంద ప్రపూరం పొంగుతుంది. అపుడు ప్రేయసితో అలంకార వైముఖ్యాన్ని ఇలా వ్యక్తం చేశాడు.

ముంగురుల పైని పూవులు ముడువ వలదు
వలదు తిలకమ్ము; కైసేత వలదు మేన
విడిన కబరీభరము ముడివేయ వలదు
కాలమిదికాదు మన యలంకారములకు

సహజ సౌందర్యం శాశ్వతమైంది. అలంకారాలవల్ల కలిగే సౌందర్యం తాత్కాలికమైంది. అందుచే తాత్కాలిక సౌందర్య చిహ్నాలైన అలంకారాల్ని నూతనాధ్వగులమైన మనల్ని పరిహసించు పాడు ప్రపంచానికే పారవేయు మన్నారు. అంతేకాక మూఢ విశ్వాస శృంఖలాల్ని విదల్చి, వలపు కౌగిట పట్టువడిన యెడల నవజీవన మనుభవింప వచ్చని ఉగ్గడించారు.

చివరకు కోరికల నెల్ల మరచి జన్మ జన్మాల యాత్ర సాగించడానికి ప్రేయసి నిట్లాహ్వానించినారు.

కోరికల నెల్లమరచి, నా కొరకు నీవు
నీ కొరకు నేను తొలి వేగు బోకరాలు
పూల జతవోలె నీ సుధా పూరమందు
తేలి పోదము జన్మ జన్మాల యాత్ర.

తన ఊహా ప్రేయసితో అలౌకిక సామ్రాజ్యంలో జన్మ జన్మాల యాత్ర చేయాలని కవి సంకల్పం.

## ప్రేమ

ఎట్టి హృదయాన ప్రేమ పొడుకొనునో ఇందు చెప్పబడింది. ఇందొక పద్యమే ఖండ కావ్యంగా రూపు దిద్దుకుంది. అయితే వేదుల ఒక పద్యమునే ఖండ కావ్యంగా వ్రాసినప్పటికీ దానికి సంపూర్ణత్వం కొరవడదు. ఆయన ప్రజ్ఞావిశిష్టత అట్టిది.

దీనిని దృష్టిలో ఉంచుకొనే శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు "ఈ సంపూర్ణత్వ మీయన రచనల కొక విశిష్టగుణము"[1] అని నొక్కి వక్కాణించారు.

ప్రబల తాప విదీర్ణమై బాష్పవారి
పదను వారిన యెద ప్రేమ పాదు కొనును
కరుసం జేల్చి బోదె నీర్గట్టుకున్న
నారెటుల నాటు కొనును కేదార మందు దీ. పు. 20

ఎదలో ఎంతగా తాప మతిశయిస్తే అంతగా ప్రేమ పాదు కుంటుంది. ఈ విషయం చక్కని దృష్టాంతంతో చిక్కని పదజాలంతో చిన్ని పద్యంలో వ్యక్తం చేయబడింది.

## పెంపుడు నెమలి

శ్రావణ మేఘాన్ని జూచి నెమలి పురివిప్పి ఆడడం సహజం. ఆ విధంగా ఆడని పెంపుడు నెమలి తన వలెనే విరహస్థితిలో ఉన్నదని కవి భావించడం ఇందలి విషయం.

మేదుర వినీల మేఘాల మేలి ముసుగు
వేసికొని వచ్చె శ్రావణ మాసలక్ష్మి
ధారుణి ధరించె తొలకరి సొరెయిడిన
యార్ద్ర పురుగు పూవుల శాద్వలాంబరమ్ము. దీ. పు. 25

అది శ్రావణ మాస లక్ష్మి వర్ణన. ఆమె వినీల మేఘాల మేలి ముసుగు వేసికొని వచ్చింది. ఆ నీల మేఘాలను జూడగానే సహజంగా హృదయ ముప్పొంగు తుంది. ఏవో కోరికలు చెలరేగుతాయి. ప్రణయం ఫలించకపోతే జీవితం నందనవనం కావలసింది పోయి విషాద జ్వాలలతో కమ్ముకుంటుంది. అందుచేతనే కవి ఇలా అను కున్నాడు.

---

1 'కవి - సన్మానము' ప్రతిభ, న. న. స. పుట 381

ఏల యింతటి చక్కదనాల వేళ
ఎగురులాడ రెక్కలురావు హృదయమునకు దీ. పు. 25

మహానందం పొందవలసిన డెందం విచారంతో క్రుంగి పోయింది. పెంపుడు నెమలి కూడ ఆయనతో విషాద శ్రుతి గలిపింది. అది మబ్బుల వంక చూడదు; పురి విప్పియాడదు.

ఆడకున్నను మానె గొంతైన విప్పి
కేక వేయ దాశల గిలిగింత లడర
కోడె తాళ్ళచుల నరగించు కొనగజాలు
ప్రకృతి కెటు గల్గెనో యెడబాటు బరువు దీ. పు. 26

దానిని పెంచుకున్న ప్రేమ కవిని కన్ను తడియని మూక శోకమున ముంచి బాధించింది.

కుండ పోతగ వర్షం కురిస్తే మేఘాల మింటి నీలి ముసుగు తేలి పోక తప్పదు. కాని కవికి, మయూరికి విరహ దుఃఖంపు బరువు తీరుట సమస్యగా మిగిలి పోయింది.

తనపై సానుభూతి చూపిన ప్రకృతికి కూడ విరహతాపాన్ని ఆపాదించి కవి తన ప్రవాస వేదనను వ్యక్తీకరించడం ఇందలి విశిష్టత.

భావకవి ప్రవాస స్థితిలో ప్రాచీనాంధ్ర కవుల్లా ప్రకృతిని పడతిట్టడు. పైపెచ్చు ప్రకృతిలోని సమస్తాన్ని తనకు చిత్తోప శమనాన్ని కలిగిస్తున్నట్లుగా భావిస్తాడు. అట్టి దానికిది గట్టి మూదలిక.

మేఘాల మేలి ముసుగుతో ఆరంభమైన ఈ ఖండిక అది తేలి పోవడంతో అంతమయింది. అంటే ఆద్యంతాల కేకత్వం చేకూరింది. ఇలా తీర్చిదిద్దడం ఆయన ప్రత్యేకత.

## కృతజ్ఞత

తాను వలచి విసిగిస్తున్నందులకు మరణ పర్యంతం ప్రేమ

గాయకుడు నయ్యేదనని కవి తన ప్రేయసికి కృతజ్ఞతను వ్యక్తం చేయడం ఇందలి విషయం.

ప్రణయ దేవతపై గల ప్రేమ కవి హృదయ కశ్మలం నుండి ప్రాణశక్తి రగిల్చింది. కనకనే ఆ ప్రేమ భాగీరథీ జలంతో పోల్చబడింది.

భస్మరాసుల నుండి పావనత మేలు
కొలిపినట్టి భాగీరథీ జలము వోలె
జన్మ జన్మాల హృదయ కశ్మలము నుండి
ప్రాణ శక్తి రగిల్చె నీపైని ప్రేమ దీ. పు. 27

ప్రేయసితో తన హృదయ లక్ష్యమెట్టిదో ఇలా చెప్పుకున్నాడు కవి.

అలరునకు బోలె నా హృదయమ్మునకును
జన్మమున కొక్కటే వికాసమ్ము సకియ
వలపు వెదజల్లి సుఖ దుఃఖములకు వెలిగ
ధాత్రి గర్భాన గాంచు నాత్మ ప్రశాంతి

పుష్పానికీ జన్మానికీ ఒక్కటే వికాసం. సుగంధాన్ని వెదజల్లడం దాని లక్షణం. అలాగే వలపు వెదజల్లడం కవి హృదయ లక్షణం.

కవి ప్రేయసిని వలచి విసిగించాడు. అందుకు ఫలంగా మరణ పర్యంతం ప్రేమ గాయకునిగా నుందు నని తన నిశ్చయాన్ని ఇలా చెప్పాడు.

వలచి నిను విసిగించి నందులకు ఫలము
ఆ మరణ మేను ప్రేమ గాయకుడ నగుదు
నీవు మాత్రము పూల వెన్నెలల రేల
చైత్ర నృత్యోత్సవమ్ముల సలుపు కొనుము.

చిట్ట చివరగా తన కృతజ్ఞత నిట్లు వ్యక్తం చేశాడు.

నా హృదయ రక్తమే లలనా విలాస

లాక్షగా, నీ పదాల కలంకరింతు
నీ వసంత కల్యాణైక నృత్యమందు
నన్ను మనసార గాన మ్మొనర్పనిమ్ము. దీ. పు. 28

తాము విషాద భరితు లైనప్పటికీ తమ ప్రేయసి మాత్రం సుఖ సంతోషాలతో తుల తూగాలని భావకవుల తలంపు ఆమె కిసుమంత కష్టం కలిగినా వీరు భరింపలేరు.

ఈ కారణం చేతనే వేదుల ప్రేయసిని వలచి విసిగించి నందులకు బాధపడిపోయారు. విసిగించి నందుకు ప్రతి ఫలంగా ఆమరణం ప్రేమ గాయకుడ నయ్యెదనని కృతజ్ఞతను ప్రకటించారు. హృదయ రక్తాన్ని లలనా విలాస లాక్షగా ప్రియురాలి పాదాల కలంకరింతు నన్నాడు కవి దీన్ని బట్టి ఆయన హృదయ పీఠంపై ఆమె కెటువంటి స్థానముందో తెలుస్తుంది.

## ప్రతీకారము

తన విషాదాంత కావ్యాన్ని చించి కట్టిన గాలి పటాన్ని ఆశా మృణాళ తంతువున గట్టి ఎగుర వేశాడు కవి. అది తెగిపోతే భగ్న హృదయ శకలాల కాష్ఠముపై భస్మమొనరించి ప్రతీకారము తీర్చికొందు ననుట ఇందలి విషయం.

అశ్రుపూరితమై తనవలెనే విచారించు మబ్బుకన్నెలతో పరుగులిడుతున్న గాలి పటాన్ని జూచి తృప్తి పడెద నన్న పద్యం.

అశ్రు పూరితమై. బరువైన హృదయ
పాత్రికను వంపలేక నావలెనె వగచు
మబ్బు కన్నెలతో మౌన మలిన గతుల
పరుగు లిడు దీని గని తృప్తిపడుదు నేను దీ. పు. 29

"కృత్రిమ ప్రేమగతుల లిఖించుకొనిన యీ విషాదాంత కావ్యమ్ము"నుటలో కవిగారి 'విషాదాతిశయం', వ్యక్త మవుతుంది.

"ఆశ తెగి పోయెనా"యని పలుకుటలో ఆయన పొందే నైరాశ్యం గోచరిస్తుంది.

ఈ విషాదాతిశయం, నైరాశ్యం అనేవి భావకవులు తమ ప్రేయసికై తపించి పోయేటప్పుడు పొందే అవస్థలు. ఇది ఆత్మార్పణ తత్త్వానికి ఉదాహరణం.

## నిరసనము

కవి తనను నిరసించే ప్రియురాలి ప్రేమకై వేగిపోతూ, ఆమె కోరిక తీర్చడానికి ఎదురు చూడటం ఇందలి విషయం.

విరిగి సమయుటే ఫలమని యెరిగి కూడ
దరి నెనయ బాడుచును బోవు కెరటమట్లు

మరణాంతకమని తెలిసీ కూడ ప్రియురాలి ప్రేమకై తన బ్రతుకు వేగిపోతుందట. ఆమె చిరునవ్వ కొరకే బ్రతుకు వెలిగించి వలపు నివాళి ఇచ్చారట.

నన్ను బ్రేమించువారి యానందమునకు
నేను విడువలే దొక్క యూర్పైనగాని
నన్ను నిరసించు నీ చిరునవ్వ కొరకె
బ్రతుకు వెలిగించి వలపు నివాళి యిడితి. దీ. పు. 32

పైది ప్రకృతి సహజం. ఇది లోక సహజం. మనల్ని ప్రేమించిన వారికై మనం ఆలోచించం. మనల్ని నిరసించే వారి కోసం ప్రాకులాడతాం. ఈ సత్యాన్ని తన ప్రేయసిని అడ్డుపెట్టుకొని వెల్లడించాడు కవి.

చివరగా తన ఎదురుతెన్నుల గూర్చి ఇలా అన్నాడు.

పంట బరువున వ్రాలిన పైరువోలె
కోతకై చూచు చుంటి నీ కోర్కె దీర్ప దీ. పు. 32

ఇది కవి ఆరాధన తత్త్వానికి గుర్తు.

ఇందు కవి ప్రేయసికై పడే తహతహ ఎంత గాఢంగా ఉందో వ్యక్తమౌతుంది. దీన్ని గుర్తించిన శ్రీకాంత శర్మగారి మాటలు.

"ఒక వియోగ దశను దాటి కవి కనీసం ఊహలోనైనా ఒక సంయోగదశను చేరుకోవాలని తహతహ లాడడం భావ కవిత్వ నూతన సంప్రదాయంగా మనం వర్ణించుకోవచ్చు. ఈ ధోరణికి ఒక దశలో అతి స్పష్టప్రతిపత్తి కలిగించిన కవి సత్యనారాయణశాస్త్రి."[1]

## సముద్ర తటాన

అది 1928వ సంవత్సరం. వేదుల గుంటూరు నుండి పర్లాకిమిడి పెండ్లి చూపులకు బయలు దేరారు. దారిలో వారి యెదలో చిన్న సంశయం తలెత్తింది. అది సంకోచంగా మారి మనసుని పట్టి పీడించ సాగింది. అందుచే పర్లాకిమిడి ప్రయాణం విశాఖ పట్టణంతో ఆగి పోయింది. అక్కడ మిత్రులు తెన్నేటి రామమూర్తిగారికి తమ సందేహాన్ని వ్యక్తం చేశారు. తా నందముగా లేక పోవుటచే పెండ్లికూతురు తిరస్కరిస్తుందేమోయని ఆ సందేహం. తీరా వెళ్ళినపిమ్మట నచ్చలేదని పెండ్లికూతురంటే ప్రాణం చివుక్కు మంటుంది. అందుచే తమ రూపు రేఖల గూర్చి ముందుగానే పెండ్లికూతురికి చెప్పించి ఆమె అభిప్రాయం తెలిసికోవడం మంచిదనుకున్నారు. ఆ కారణంగా రామమూర్తిగారిని పర్లాకిమిడి పంపించారు.

వేదుల ఆ సాయంకాలం విశాఖపట్నం సముద్ర తీరానికి వాహ్యాళికి వెళ్ళారు. వారికక్కడ ఒక బెంగాలీ అమ్మాయి కనిపించింది. ఆమె విరహావస్థలో ఉండి, ఎవరికోసమో ఎదురు చూస్తున్న విరహోత్కంఠిత వలె అగుపించింది. అప్పుడు వేదుల హృదయం నుండి ఈ గేయం వెలువడింది.

ఓ విరహ వేషానుభావ మధురాకృతీ

---

1. సాహిత్య పరిచయం - పుట 69

యౌవనోన్మిషిత లజ్జావకుంఠనవతీ
జాలి తొలుకాడు, నీ
వాలు తెలి చూపులను
నాలో వియోగ క
ల్లోలమ్ము రేపుచును
ఈ సముద్ర తటాన ఏ సఖుని కోసమై
గాసి జెందుచు నుంటివో సఖీ! ప్రియసఖీ! దీ. పు. 60

ఆమె జాలి తెలి చూపులు కవిగారిలో వియోగ కల్లోలాన్ని రేపాయి. ఇక ఆ సమయాన్ని

తూర్పు వాకిటి గూట తొలి దివ్వె వెలిగించి
తొగరు పావడ సంజ తొలగిపోయెడు వేళ. అంటాడు కవి.

ఆమె ఒంటరిగా ఉంది. వేడి నిట్టూర్పు లెగబోస్తుంది. అందుచే జంటబీడిన చక్రవాకి పక్షిలా అగుపించిందాయనకు. ఏనాటి అనుభవమో, ఏ కఠిన హృదయమో గుర్తు వచ్చింది కాబోలు ఆమె ఉన్నత వక్షం ఎగయూర్పులతో పైపైకి లేస్తుంది. కపోలాలపై వ్రాలు నీలాలకలేవో రహస్యాలు చెవి నూదుతున్నాయి.

పాలిపోయిన నీ కపోలాలపై వ్రాలి
నీలాలకలు రహస్యాలెవో చెవి నూద
రాలిపోయిన పూల
తేలిపోయిన కలల
కోలాహల మ్మెడద
మూల మూలల మ్రోగ
ఈ సముద్ర తటాన నే సఖుని కోసమై
గాసి జెందుచు నుంటి వో సఖీ! ప్రియసఖీ!

వినరాని ఘోషతో విరిగిపడే కెరటాలే విరహగీతా లాలపించి వేధించునేమోయని కవి తన సానుభూతిని ప్రదర్శించాడు. ఆమె

హృదయంలో పొంగే ప్రేమ వార్ధికి ప్రక్కనున్న సముద్ర మొక నీటి బొట్టు.

వేదుల తనకు కాబోయే అర్ధాంగి నూహించుకొనుచున్న సమయమది. ఆ సమయంలో లోకమంతా వియోగాకులంగా కనిపించడం సహజం. అదీగాక అది సముద్రతీరం. మీదు మిక్కిలి బెంగాలీ అమ్మాయి. పైపెచ్చు ఒంటరిగా ఉండటం. ఇవి యన్నీ కవి హృదయాన్ని నుండి ఈ చక్కని గీతం రావడానికి దోహదపడ్డాయి.

ఇందు 'సఖీ, ప్రియసఖీ!' అనేవాటికి కేవలం స్నేహితురాలనియే మనం గ్రహించాలి. ఇంతకు ముందు ఖండికల్లో ప్రస్తావింపబడ్డ ప్రేయసికిని, ఈమెకును సంబంధం లేదు. ఇద్దరినీ ఒకే రాటకు కట్టడానికి వీలులేదు. తన ప్రేయసి గురించి అయితే 'ఏ సఖుని కోసమై గాసి జెందుచునుంటివో సఖీ!' అని ఇంకొక సఖుని గూర్చి ఆమె ఆలోచిస్తున్నదనే ప్రస్తావన తేవడం ఉండదు. మొత్తం మీద భావకవితా ప్రేయసికి ఈ బెంగాలీ అమ్మాయికి సంబంధం లేదు.

**ఆరాధన** *

భావకవితా వృక్షాన్ని అధిరోహించి ప్రణయ కవితా శాఖను స్పృశించిన విమర్శకుల్లో వేదుల 'ఆరాధన' ఫలాన్ని పాఠకులకు రుచి చూపింపని వారరుదు. ఆ ప్రణయ గీతాఫల విశిష్టత అట్టిది. అట్లు రుచి చూపించిన వారి అభిప్రాయాల్లో కొన్ని

"వారి 'ఆరాధన' అనే అనురాగ గీతా సముచ్చయము. నేను సభలో చదువుతూ భావోదయము వల్ల గాద్గద్యము కలిగి ఆపివేసి

---

* ఎమెస్కోముద్రణలో మాత్రమే 'ఆరాధన' పద్యాలు 'దీపావళి'లో ప్రవేశించాయి. మొదట ఇవి ముక్తఝరిలో ముద్రింపబడ్డాయి. ఈ 'ఆరాధన'నే పెంచి 'వేణూదయము' అనే కావ్యం వ్రాయాలని ఆయన ఆశయం. కాని నెరవేరలేదు.

నాను."[1] శివశంకరశాస్త్రి.

"భవభూతి 'ఇయంగేహే లక్ష్మీ రియ మమృత వర్తిర్నయ నయో:" అంటూ స్త్రీమూర్తిని చాలా ఉదాత్తంగా చిత్రించాడు. అంత కంటె కూడా ఉదాత్తంగా వేదుల వారు చెప్పారనిపిస్తుంది.

ఆమె నవనీత హృదయ, నా యంతరంగ
శాంతి దేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము, ప్రేమ జీవన విభాత
కైశికీగీతి, నాతపః కల్పవల్లి!
ఆమె జగదీశ మకుటాగ్రసీమ నుండి
యుర్విపై జారిన సుధామయూఖరేఖ! అన్న పద్యం

చూడండి.[2] కాటూరి.

"హృదయేశ్వరి ప్రణయం కంటె ఇక్కడ ప్రేమ ఇంకొక మెట్టు పైకెళ్ళింది. పైగీతంలోని విశేషణాలే ఆమె యందు తనకు గల పవిత్ర భావాన్ని వ్యక్తం చేస్తున్నాయి."[3] గొడవర్తి సూర్యనారాయణ

"షెల్లీ తెలుగులో వ్రాస్తే స్త్రీని గురించి ఇలా వ్రాస్తారను కొంటాను, వేదుల వ్రాసినట్లే."[4] ఆచంట జానకీరాం.

"చెప్పదలచిన దానిని, నిష్కృష్టముగ అసందిగ్ధమగు భాషలో చెప్పుట వారిప్రత్యేకత. వారిప్రేయసీ వర్ణన మిందులకు నిదర్శనము.

ఆమె నవనీత హృదయ .... సుధామయూఖ రేఖ. ఇట్టి సౌందర్యరాశి, ఇట్టి పవిత్రశీల వీరి ప్రేయసి.[5]" కె.వి ఆర్. నరసింహం

---

1. కవి-సన్మానము ప్రతిభ, న.న.స. - పుట 339
2. అదే గ్రంథం - పుట 336
3. నవ్యసాహిత్యం-ప్రణయము - భారతి, ఫిబ్రవరి 1937
4. సాగుతున్న యాత్ర - పుట 149
5. ఆధునికాంధ్ర కవితా సమీక్ష - పుట 235

"ఆరాధన ఖండికలో తన ప్రేయసిని గురించి వేదులవారు చెప్పిన రీతి భావకవులు స్త్రీని గౌరవించిన విధానానికే మచ్చుతునక"[1]

టి. యల్. కాంతారావు

కవిగారే ఒకానొక సందర్భంలో దీన్ని గూర్చి

"ఆమె జగదీశ మకుటాగ్రసీమ నుండి........ మహా మహోన్నతి వహింతు" అనే 'ఆరాధన'లో పద్యాలు రచించినపుడు ఇంతకన్నా గొప్పరచన లేదని గర్వపడ్డాను.[2] అని అనుకోవడంలో దీని వైశిష్ట్యం మరింత స్పష్టపడుతుంది.

'ఆరాధన' ఖండిక ప్రాశస్త్యాన్ని ఉగ్గడించడానికే పై ఉద్ధరణాలు. అయితే ఈ పద్యాలు వ్రాస్తున్నప్పుడు వేదుల మనః పీఠాన్ని అలంకరించిన స్త్రీ ఊహా ప్రేయసి కాదు; వారి అర్ధాంగి. ఒకానొక సందర్భాన్ని పురస్కరించుకుని కృష్ణవేణమ్మగారిని గురించి వ్రాసినవి. వీటిని ఊహా ప్రేయసి నుద్దేశించి రచించినట్లుగా పలువురు విమర్శకులు భావించారు.

వారిలో పాలగుమ్మి పద్మరాజు గారొకరు.

"ఆమె నవనీత హృదయ........ కైశికీ గీతి - వేదుల
ఆమె కన్నులలో........ కలవు - దేవులపల్లి
మత్పురానేక పుణ్య........ అందుకొంటి - నాయని

....పై పద్యాలలో ప్రేయసి ఆకాశం దిగి భూమి మీదికి రాదు. ఆమెకు భూస్పర్శ అసలే లేదు. ఆమె ఎంత సేపూ 'అప్రాప్త మనోహరి' గానే ఉండిపోతూ వచ్చింది."[3]

---

1 వేదుల వారి వేదన — ఆంధ్రపత్రిక 2-11-1985
2 నా గొప్ప రచన-భారతి. జ. 1944. పుట 28
3 "కవిత్వము- వైచిత్రి" ప్రతిభ, న. న. స. పుట 39

పై పద్యాలలో ప్రేయసికి 'భూస్పర్శ అసలే లేద'ను పద్మ రాజుగారి మాటలు వేదుల ప్రేయసి కెంత మాత్రమూ వర్తింపవు. ఇలా అనడానికి గల కారణ మిది.

ముందు పెళ్ళి విషయంలో వేదుల స్థితిని తెలిసికోవడం అవసరం. ఆయన కసలు పెళ్ళి అవుతుందో లేదో అని దిగులు పడుతుండేవారు. ఈ క్రింది భావరాజు వెంకట కృష్ణారావుగారి మాటలు వింటే ఈ విషయం తెలుస్తుంది. "మీకు వివాహం అవుతుంది. సంసారం ఏర్పడు తుంది. కమనీయ మైన మూర్తులవతరించి మీ యిల్లు సుఖానంద దాయకం చేస్తారు. అని హెచ్చరిక కలిగేటట్లు భవిష్యత్తును గురించి చెప్తూ ఉండేవాడిని."[1] ఇట్టి నిరాశతో నున్న వ్యక్తికి సర్వవిధాల మెచ్చుకోతగ్గ స్త్రీ అర్ధాంగిగా లభించింది. ఎలా లభించిందో తెలిసికొందాం.

97వ పుటలో చెప్పినట్లు 'మామ కాగమన వార్త' లాంటి వార్తను గైకొని తెన్నేటి రామమూర్తిగారు పర్లాకిమిడి వెళ్ళారు. వేదుల గురించి అన్ని విషయాలు చెప్పి పెండ్లికూతురి అంగీకారాన్ని పుచ్చుకొన్నారు. ఆయన తిరిగి వచ్చి వేదుల్ని పెళ్ళి చూపులకు తీసుక వెళ్ళారు. వీరిరువురూ పర్లాకిమిడి వచ్చి మల్లయ్యశాస్త్రి గారింటి వీధి గుమ్మంలోకి వెళ్ళేటప్పటికి వీణానాదం వినిపిస్తుంది. హృదయా వర్జకంగా ఉంది. ఆ అవ్యాహత నాదాన్ని వింటూ గుమ్మంలో నుండి చావడి లోనికి ప్రవేశించారు. ఇంతలో వీణపై జిలిబిలి పాట ఆలాపింపబడుతుంది. ఆ పాట వినిపిస్తున్న దిక్కునకు ముందు నడుస్తున్న తెన్నేటి తేరిపార చూడటం, హఠాత్తుగా ముందుకు వేయబోయిన అడుగు నాపివేయడం, వెంటనే తన వెంట బిక్కు బిక్కు మంటూ వస్తున్న వేదుల్ని చేసైగతో నిల్పడం ఏక కాలంలో జరిగిపోయాయి. వారి కెదురుగా

1. "కవి-సన్మానము" ప్రతిభ, న న.స. - పుట 323

పెరటి వైపున తులసికోట వద్ద అటు తిరిగి కూర్చుని వీణ వాయిస్తూ పాడుతున్న అమ్మాయి. రసజ్ఞులు కాబట్టి రసవత్తరమైన పాటకు రసభంగం కలిగించకుండా అక్కడే స్థాణువుల్లా ఉండిపోయారు. వీరు రావడం ఆమెకు తెలియదు. అలాపగతిజొక్కి యుండడం చేత ఆ సారసలోచన సాలోచన కాలేదు. పరమానందాను సంధానంగా పాట పాడుతునే ఉంది. ఆమెయే పెండ్లికూతురని వేదుల చెవుల్లో పడింది. అనురాగ భారంతో ఆయన ఉక్కిరి బిక్కిరైపోయారు. ఆ పాడు తున్న పాట త్యాగయ్యకృతి. అది ''నను పాలింప నడచి వచ్చితివో''* అను మోహన రాగకృతి.

ఆమె పాడటం కాని, అదే సమయంలో వారు రావటం కాని, మీదు మిక్కిలి ఈ త్యాగయ్య కృతిని ఆలపించటం కాని యాదృచ్ఛికంగా జరిగినవే. ఈ అసంకల్పిత సన్నివేశం సమయానుకూలంగా ప్రవర్తించుటచే కవి హృదయంలో కేవలం దైవ కల్పనగా చిరస్మరణీయమైంది. అందువల్లనే కావ్యత్వం సిద్ధించింది.

శ్రీ తులసి చెంత వేదికాసీన యగుచు
''నన్ను పాలింప నా ప్రాణ నాథ! నడచి
వచ్చితే'' యను త్యాగయ్య వారి కృతిని
మోగునది తంత్రియో గళమ్మో ఎరుంగ
రాని యట్టుల శ్రావ్య స్వరమ్ము తోడ

---

* త్యాగరాజు కుమార్తె పెళ్ళికి శిష్యులు తమకు తోచిన బహుమతుల్ని తీసుక వచ్చారు. వారిలో ఒకరైన వేంకటరమణ భాగవతారు నల్లని ఎల్లయ తయారు చేసిన కోదండ రామస్వామి తైలవర్ణ చిత్రపటాన్ని వాలాజ పేటనుండి తిరువైయారుకు తలపై పెట్టుకొని తీసుక వచ్చాడు. దానిని చూడగానే త్యాగరాజునకు భక్త్యావేశం పొంగి పొర్లింది. ఆ ప్రభావమే ఈ మోహన రాగ కృతి.

వీణపై తన్మయత నాలపించు చున్న
ఆమె పద సన్నిధాన" దీ. పుట 72

ఈ పద్య పాదాల వెనుక ఇంత హృద్యమైన సంఘటన ఉంది. అది గనుక తెలియకపోతే ఇవి నిస్సారమై పోతాయి. పాఠకుల్ని అయోమయంలో పడవేస్తాయి. ఊహా ప్రేయసి లోకం లోనికి నెట్టుతాయి, అలా నెట్టబడడం చేతనే పద్మరాజు గారంతటివారు ఇందలి ప్రేయసిని 'అప్రాప్త మనోహారి' అన్నారు.

అది అట్లుంచితే; ఆనాటి పాట అంటే ఆ త్యాగయ్య కృతి ఆయన్ని అద్భుతానంద పారవశ్యుని జేసింది. అప్పటి వారి యనుభూతి నిలా వెలిబుచ్చారు.

పాట వినుచును నే నిలంబడిన యపుడు
శారదా కరుణా కటాక్షమ్ము గన్న
చిర దరిద్రుని ప్రజ్ఞా విశేష మట్లు
సభ్యతాపూర్ణ సౌమనస్యమ్ము గాంతు దీ. పు. 72

ఆ శుభసమయంలో వెలువడ్డ ఆ కృతి ప్రభావ మేమిటోగాని ఎన్ని ఆటంకా లెదురైనా ఆమె వారి అర్థాంగి అయింది. జీవితాంతం ఆయనకు ఆమె ఆరాధనమే ఏకైక ప్రతిపత్తిగా నిలిచింది. మరువరాని, మరపురాని ఈ శుభ సమయం నేపథ్యంగా వెలువడ్డ ఈ భావమే చిట్ట చివరి అంతస్తై నాలుగంతస్తుల 'ఆరాధనా' భవనం రూపు దిద్దుకొంది. వేదుల ఈ భవనాన్ని కట్టి అందులో తమ అర్థాంగియైన కృష్ణవేణమ్మ గారికి శాశ్వత నివాసం కల్పించారు.

ఇక తక్కిన అంతస్తుల్లో వారి ఆరాధన స్వరూపం.

ఆమె వారికి అంతరంగ శాంతి దేవత. ఆశా పథాంతరాళ పారి జాతమ్ము. నిజానికి వేదనతో ఒంటరి బ్రతుకీడుస్తున్న వేదుల

హృదయానికి ఆమె శాంతి దేవతయే. అంతే కాదు; ఆమె వారి జన్మ జన్మాల పుణ్యాలు పండి లభించిన భాగ్యలక్ష్మి యట.

ఆమె నాజన్మ జన్మ పుణ్యములు పండి
ప్రాప్తమైన పద్మాసీన భాగ్యలక్ష్మి
ఆమె పద సన్నిధాన దివ్యస్థలాన
భక్తి నమ్రుడనై నిలంబడిన యపుడు
తలపునకు వచ్చు, నా పేదతనము నాకు.

ఆమె పద్మాసీన భాగ్యలక్ష్మి. అతడు భక్తినమ్రుడై నిలంబడిన పేదవాడు.

ఇది వారి మనః పీఠాన అర్ధాంగికి కట్టిన పూజ్య స్థాన పట్టం. ఏ దేవి ఆశీః ప్రభావమో కాని తపస్సిద్ధి వోలె వారిరువురి మనోరథాలకు ఏక ఫలం సిద్ధించింది.

చెలియ! ఏదేవి మంగళాశీస్సుమములు
పరిమళించినవో మన శిరము లందు
ఒక తపస్సిద్ధి వోలె నేటికి లభించె
నిరువురి మనోరథమ్ముల కేక ఫలము                దీ. పు 70

అని అతడంటే ఆమె తారళ్య విస్తారి తాక్షియై

'స్వామి! మన తోటలో నీవసంత వేళ
పూచిన సుమమ్ము లా దేవి పూజకొరకె'

అంటూ అతని హస్తాన్ని చేతితో అదిమింది. అప్పుడు

ఆమె పద సన్నిధాన దివ్యస్థలాన
నాక కల్లోలినీ పదన్యాసమునకు
దర వినతమైన హరజటా భరము వోలె
నతుడనయ్యె; మహా షుహోన్నతి వహింతు!

నతుడయ్యు మహా మహోన్నతి వహించడం లోనే వారి హృదయంలో తమ సతికిచ్చిన గౌరవపీఠం యొక్క ఔన్నత్యం వ్యక్త మవుతుంది.

లోకంలో సాధారణంగా ఏ వ్యక్తియైనా తలవంచిన చోటు తాను ఉన్నతునిగా భావించుకోడు. పూజ్యభావం ఉన్న చోటనే ఎంత నతుడైతే అంత ఉన్నత భావం అతనిలో పొదు కుంటుంది. ఇంతేకాదు; తాను నిరంతరం ఆరాధిస్తున్న దేవత తనకు చరణదాసిగా సమస్తాన్ని సమర్పించు కుంటున్న అనురాగవతి. కనుకనే ఎంతో మహోన్నత వ్యక్తియైన ఆమె ముందు ధీరత్వమే కాని దైన్యం తోచలేదు.

ఆమె ఆకాశ గంగానదీ పదన్యాసం. అతడు దరవినతమైన హర జటాభరము. ఇట్టి ఉదాత్తమైన పోలికలే వేదుల కవితకు ఔన్నత్యాన్ని చేకూర్చాయి.

ద్వారమున అడ్డుపెట్టే పూజారి లేని మాతృదేవతా కళ్యాణ మందిరానికి తమ ప్రేయసి నిట్లు ఆహ్వానిస్తున్నాడు కవి.

"రమ్ము ప్రేయసీ! శుభ ముహూర్తమ్ము దాటు
కుండ నుభయ జీవిత కాంక్ష లొకటిజేసి
నాల్గు చేతుల మ్రొక్కు కొందము సవిత్రి
శ్రీ చరణముల, కాశయ సిద్ధి కోస." దీ. పు. 71

మంత ఆమె ఆనంద విస్తారితాక్షియై తన కేల్దోయిని కవి గళానికి పూల మాలగా జేసింది. అపు డతడు

ఆమె పద సన్నిధాన దివ్యస్థలాన
పదియు నాల్గేండ్లపాటి యౌవన సుషుప్తి
తేలి పోయిన యూర్మిళాదేవి మ్రోల
ప్రణయ వినమితుడైన లక్ష్మణుడు వోలె
ధన్య హృదయ రాజ్యాధి పత్యము వహింతు.

ఆమె పదునాల్గేండ్ల యౌవన సుషుప్తి తేలిపోయిన ఊర్మిళా దేవి. అతడూర్మిళ చెంత ప్రణయ వినమితుడైన లక్ష్మణుడు.

సంస్కృత కవుల్లో స్త్రీని ఉదాత్తంగా చిత్రించినవాడు భవభూతి. ఉత్తర రామ చరిత్రలో రాముని చే అట్టిదట్టిదని సీతను గూర్చి అనిపించాడు. కాని వేదుల ఇచ్చట మధుర కథా సన్నివేశాలచే ప్రేయసీ ప్రియుల ప్రణయౌన్నత్యాన్ని ధ్వనింపజేసి స్త్రీని గౌరవ సింహాసనాన్ని అధిష్ఠింపజేశారు.

## శరదుత్సవము

ఈ ఖండిక కూడ తమ అర్ధాంగియైన కృష్ణవేణమ్మగారిని దృష్టిలో ఉంచుకొని వ్రాసినదే. అయితే విమర్శకులు కొందరు దీన్ని ఊహా ప్రేయసి నుద్దేశించి వ్రాసినట్లుగా భావించారు. వారిలో నారాయణరెడ్డి గారొకరు.

"వేదుల సత్యనారాయణ శాస్త్రిగారికి ఊహా ప్రేయసి 'సహ భావనా విలాసినీ నిత్యసైరంధ్రి'గా, 'స్వప్నలోక రాజ్ఞి'గా భాసించినది. ఆమె 'చంద్రికా వసనాంచలోచ్చాలనముల చిర విరహ వాసనల నొగ జిమ్ముకొనుచు తాండవించి'న అమృత సౌందర్య లక్ష్మిగా సాక్షాత్కరించినది."[1]

ఇందలి ఉద్ధరణ వాక్యాలు శరదుత్సవం లోనివే. ఇవి ఊహా ప్రేయసి సంబంధమైన వెట్లుకావో తెలిసికొందాం.

వేదుల వారికి కృష్ణవేణమ్మగారితో వివాహం నిశ్చయమైనది. కాని వేదులవారి జాతకంలో అప్పుడు శనిదశ నడుస్తుంది. ఆ కారణంగా జాతక మార్తాండులైన మల్లయ్య శాస్త్రిగారు వివాహాన్ని మరుసటి సంవత్సరానికి వాయిదా వేశారు. ఈ మధ్యలో పండుగ

1 ఆధునికాంధ్ర కవిత్వము. పుట 351

పబ్బాలకు వేదుల వారిని మల్లయ శాస్త్రిగారు ఆహ్వానించడం వీరు వెళ్ళడం తటస్థించేది.

ఒకసారి సెలవు రోజుల్లో వేదుల మల్లయశాస్త్రి గారింటికి వచ్చారు. రెండుమూడు రోజులు గడిచాయి. ఒకరోజు చుట్టాలతో ఇల్లంతా కిటకిట లాడుతుంది. ఆ వచ్చిన చుట్టాలందరూ స్త్రీలే. ఆరోజు మల్లయ్యశాస్త్రి గారు గ్రామాంతరం వెళ్ళారు. ఆ వచ్చిన చుట్టాలు కృష్ణవేణమ్మకు మంచి సంబంధ ముందనీ, వరుడు ఇంజనీరనీ, చక్కగా ఉంటాడనీ వార్తలు తీసుక వచ్చారు. గొప్ప వారితో చుట్టరిక మనగానే ఎవరికైన ఆశ కలుగుతుందికదా! ఆడవాళ్ళలో గుసగుసలు ప్రారంభ మయ్యాయి. ఈ గుసగుసలు ప్రక్కగదిలోనున్న శాస్త్రి గారికి వినిపించాయి. అప్పుడాయనకు శరీరం మీద చీమలు జెర్రులు పాకుతున్నట్లయింది. లేచి ఇంటి నుండి వెళ్ళి పోవాలని పించింది. చెప్పి వెళ్ళిపోవడానికి తలాయన ఇంట్లోలేరు. ఏం చేయాలో పాలు పోక వేదనతో కుమిలి పోతున్నారు. శరీరం ఉడికి పోతుంది. సాయంకాలానికి జ్వరం వచ్చి విపరీతంగా కుదిపివేస్తుంది. ఆయన్ని పట్టించుకొనే నాథుడు లేడు. ఒళ్ళు తెలియని పరిస్థితిలో మూలుగుతున్నారు.

ఆ మూలుగు ఎలాగో వినబడ్డాయి కృష్ణవేణమ్మ గారికి. ఆమె వారి పరిస్థితి గ్రహించింది. అటూ, ఇటూ ఎవరూ లేకుండా చూచి శాస్త్రిగారి గదిలో ప్రవేశించింది. కాని ఈమెవచ్చు జాడను గుర్తించే పరిస్థితిలో వారు లేరు. నెమ్మదిగా వెళ్ళి ఆయన వీపుపై చేతితో నిమిరారు. ఆ సుమ మృదుల హస్త స్పర్శకు ఆయన లేచి కూర్చు న్నారు. వారికి తెలియకుండగనే కళ్ళు చెమ్మగిల్లాయి. కళ్ళెత్తి ఆమె ముఖం వంక చూడబోయారు. కన్నీళ్ళు కారుతున్నాయి. ఆ కన్నీటి బొట్లు చేతితో తుడుస్తూ, 'ఎవరెన్ని చెప్పినా నేను మిమ్మల్ని తప్ప మరొకరిని పెండ్లి చేసికో'నని చేతిలో చేయివేసి చెప్పి, ఎవరైనా

చూడవచ్చునే భయంతో రెండడుగుల్లో బయట పడ్డారు. *

ఆ సన్నివేశమే శరదుత్సవంగా రూపుదిద్దుకుంది. కృష్ణవేణమ్మ గారు గదిలోనికి ప్రవేశించి చేతితో తమ శరీరాన్ని నిమిరిన ఆ ముహూర్త మాధుర్యాన్ని ఇలా వెల్లడించారు వేదుల.

నా హృదయ మిప్పు డరమూత నగవులందె
కనెను శాంతిదేవత కడగంటి చూపు
బ్రతికి నన్నాళ్ళకీ ముహూర్తమున విరిసె
తొలి వలపుదొల్కు జీవ మాధుర్యరుచులు    దీ. పు. 73

శాంతిదేవత కడగంటి చూపు ఆయనపై ప్రసరించినట్లయింది. బ్రతికినంత కాలానికి సరిపడ్డ తొలివలపు పొంగిన జీవ మాధుర్యరుచులా ముహూర్తంలో ఆవిర్భవించాయి.

ఆమె స్పృశించిన హస్తం కన్నతల్లి దీవనతోడి కౌగిలింతలో జారు తీయని కన్నీటి చలువ అయింది.

మిగుల గంపించు నాపేద మేని నిపుడు
సుమ మృదుల హస్త మేదియో నిమురుచుండె
కన్నతల్లి దీవనతోడి కౌగిలింత
జారు తీయని కన్నీటి చలువ లోయ

శారదానిలమ్ము ఈశ్వరుని శిఖావతంస సుమసౌరభాన్ని వెద జల్లుతుంది. గగనమున కోటి విజయ శంఖాలు మ్రోగుతున్నాయి. అనగా తనవలెనే ప్రకృతి యావత్తు ఉత్సవమున నున్నట్లు ఆ ముహూర్తమున ఆయనకు అనిపించింది. కనుకనే "ఉర్వికీనాడె తొలి శరదుత్సవమ్ము" అని తమ సంతోషాన్ని ఉర్వి కాపాదించారు.

---

* ఈ విషయం కృష్ణవేణమ్మగారే చెప్పారు.

ఇంత ప్రశాంత సౌఖ్యాన్ని ఎప్పుడూ పొందలేని వారి గత జీవితాన్నిలా తలపోసి కొన్నారు.

నరక లోకపు జీకటి తెరల వంటి
వెన్ని నిశలేగ నొక స్వప్న మేని లేక
ఇంత సౌందర్య మింత ప్రశాంత సౌఖ్య
మింత మాధుర్య మెటుదాగె నింతవరకు దీ పు. 74

గిరి గర్భంలోని ఝరివలె వారి యెడద పైకుబుకుతుంది. ఆ ఎడదలో సౌందర్య రసాన్ని శాశ్వతంగా నిలుపుకొంటారట. అలా నిలుపుకోలేక పోతే వృంతచ్యుత ప్రసవంలా రాలిపోతారట.

ఆమె ఆయనకు స్వప్నలోక రాజ్ఞి. వారి జీవితాంతం ఈ అమృత శాంతి చాలంటూ తృప్తితో తమ కృతజ్ఞత నిలా వ్యక్తీకరించారు.

ఈ యమృత శాంతియే చాలు నెపుడు నీ క
టాక్ష భిక్షున కా జీవితాంత మింక
శ్రీ చరణ లాక్షతోడ నా హృదయ కుసుమ
దళము ననురాగ రస రంజితమ్మొనర్తు

ఇలా వేదుల వివాహ జీవితంలోని సన్నివేశం 'శరదుత్సవం'గా మారి 'దీపావళి'కి మరియొక దీపాన్ని చేర్చడానికి హేతువయింది.

తొలుత వేదుల భావ కవులందరి వలెనే ఊహా ప్రేయసిని గూర్చి ప్రణయ గీతాలు పాడుకున్నారు చివరకు జీవిత సంఘటనల్ని మధుర పేశలంగా చిత్రించి తమ గృహిణికి ఆరాధన పూర్వకంగా శరదుత్సవం జరిపారు.

ఏవం విధంగా 'నభూతో న భవిష్యతి' అన్నట్లు స్త్రీకి ఉత్కృష్ట మైన పూజ్యత కల్పించి నవీన మానవతా వాదానికి దోహద పడ్డారు.

❂ ❂

# 3 ప్రకృతి సౌందర్యం

## భావకవులు - ప్రకృతి

కంటికి కనపడుతున్న స్థావర జంగమాత్మకమైన సర్వజగత్తూ ప్రకృతిగా పరిగణింప బడుతుంది. ఈ ప్రకృతిలో గల గిరులు, ఝురులు, విరులు, పక్షులు, ఋక్షములు, వృక్షములు, భ్రమరమ్ములు, సమీరమ్ములు, జలధరమ్ములు మున్నగు వాటిని వర్ణించడం ప్రకృతి వర్ణన. ఇది తొలి పల్కుల నుండి ఆరంభమైనప్పటికీ, దీన్ని భావకవులాత్మాశ్రయ రీతిలో వెలార్చడానికి మాత్రం వర్డ్సువర్తు మొదలైన ఆంగ్ల కాల్పనిక కవులు కారకులు. పూర్వాంధ్ర కవుల్లో పలువురు లక్షణ కర్తలు నిర్దేశించిన అష్టాదశ వర్ణనల నిబంధన ప్రకారం ప్రకృతి వర్ణనలు గావించారే తప్ప తల్లీనులు మాత్రంకారు. అంతే వారు కావ్యత్వసిద్ధికై తమ గ్రంథాల్లో ఆయా సందర్భాల ననుసరించి ఒక్కొక్కపుడు లేక పోయినా పట్టుబట్టి ప్రకృతి వర్ణనలు చొప్పించారు.

భావకవులలాకాక చాలవరకు బాహ్యవర్ణనాలకు స్వస్తిపలికి, ప్రకృతిని స్వీయానుభూతి ప్రకటన కాలంబనంగా గ్రహించారు. ప్రకృతి సౌందర్యాన్ని ఆత్మాశ్రయ రీతిలో కన్నుల పండువుగా చిత్రించారు. వీరు ప్రకృతిని పడతిట్టలేదు. పైపెచ్చు దీన్ని తమ బాధాపరితప్త హృదయాలకు ఉపశమనాన్ని కలిగించేదిగా సంభావించారు. తమ కష్ట సుఖాల్ని ప్రకృతికి అన్వయించుకొని ఊరట పొందారు. బాల్యాన్ని స్మృతికి తెచ్చుకొని గీతా లాలపించారు. ప్రకృతిలో లీనం కావాలని ప్రగాఢంగా కాంక్షించారు. ప్రకృత్యంశంగా పుట్ట లేకపోయినందులకు విచారించారు. మొత్తం మీద భావకవులు ప్రకృతిని అనంతమైన శక్తిగా భావించారు.

## దీపావళి - ప్రకృతి

సహజ కవియైన వేదుల భావకవులందరి లాగే ప్రకృతిని

గాంచి పరవశించి పూర్ణిమ, ఆషాఢ మేఘము, సుధాకరా! మొదలైన ఖండికలు వ్రాసి మహాకవులనిపించుకొన్నారు. ఇవిగాక దీపావళిలో ఆయా సందర్భాలలో చెదురు మదురుగా గావించిన ప్రకృతి వర్ణనలున్నాయి. ముందు వాటిని పరిశీలించడం కర్తవ్యం.

'జయగీతి'లో దేశ స్వాతంత్ర్యాగమనాన్ని సూచించడానికి ప్రభాత కాలాన్ని ఇలా వర్ణించారు.

"కావి ముసుగల్లాడ వేకువ
కాంత దివసాంగణము చేరెను" దీ. పు. 1

వేకువ **కాంత** తాను వేసికొన్న ఎర్రని ముసుగు కదలాడుతుండగా దివసము యొక్క ముంగిటికి వచ్చిందనడం నయన పర్వమైన చక్కని భావచిత్రం (Ideo gram). మరికొన్ని భావచిత్రాలు.

"రేయి విప్పిన నీలి రెక్కల నీడ
అవనీ నభోంతరం బార గ్రమ్మినది" దీ. పు. 5

"పండి వ్రాలిన వరిపైరు పైని బ్రాకి
వచ్చు చిరుగాలి తరగల వరుస" దీ. పు. 16

వర్ణన ఎంతగా ఇంద్రియ గోచర మవుతుందో ప్రకృతి సౌందర్యమంత అనుభవానికి వచ్చి ఆనందాన్ని కలిగిస్తుంది.

వేదుల వర్ణ చలనాన్ని గూర్చి శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి వాక్యాలు. "సత్యనారాయణశాస్త్రిగారి వర్ణనలు కళ్ళకి కట్టినట్టుంటాయి ఉన్నదున్నట్లు వర్ణించి, స్వభావోక్తివల్ల సాధిస్తారు చాలామంది ఈ 'కనుకట్టు' గుణాన్ని. ఈయన వర్ణ చలనము వల్ల సాధిస్తారు. ఈయన గుర్తించి వర్ణించినంతగా వర్ణచలనాన్ని మరొక కవి గుర్తించి వర్ణించలేదేమో అనిపిస్తుంది నా దృష్టికి."[1]

---

1 కవి-సన్మానము-ప్రతిభ, న.న.స. పుట 527

ఈ వర్ణచలనంలో వీరి విశిష్టతను చెప్పేవాటిలో కొన్ని ఉదాహరిస్తాను.

"మేదుర వినీల మేఘాల మేలి ముసుగు
వేసికొని వచ్చె శ్రావణ మాసలక్ష్మి" దీ. పు. 25

కేవలం కంటికి మాత్రమే కాదు; ఇతరేంద్రియాలకు కూడ ఆనందాన్ని కలిగించే ప్రకృతి వర్ణనలు వీరి రచనలో కనిపిస్తాయి.

"కడిమి పూల నెత్తావుల కసటు వార
వృష్టి ముందటి తడిగాలి వీవసాగె" దీ. పు. 25

''పైర గాలి తరంగాలపై నపూర్వ
పరిమళ విలాసములు వెల్లివిరియ సాగె'' దీ. పు. 15

''మోహినీ సాట్టహాస కోలాహలములు
పండు వెన్నెలలమె బ్రహ్మాండమెల్ల'' దీ. పు. 21

ఇవి వరుసగా త్వక్కునకు, ఘ్రాణానికి, శ్రోత్రానికి గిలిగింతలు పెట్టే ప్రకృతి వర్ణనలు. ఒక్కొక్కప్పుడు వీటిలో రెండు మూడింద్రియాల అనుభవాలు పెనవైచుకొని యుండుట కూడ చూడవచ్చు.

మరియు శాస్త్రిగారి ప్రకృతి వర్ణనలు నూత్న భావాలతో మిస మిస లాడు తుంటాయి.

''దూర దూరము నుండి తోయధి పిలుపు
చెవిసోకి పరువెత్తు సెలయేరు వోలె'' దీ. పు. 94

సెలయేరు పరువెత్తుట నేది సాధారణ విషయం. దూరాన్నుండి తోయధి పిలుపు చెవిసోకి పరువెత్తుట అనేది కవి గారి విలక్షణమైన నూతన భావం. ఇట్టిదే మరియొకటి.

పశ్చిమాకాశ నికష సువర్ణరేఖ
లొక టొకటి చెరపుచు బోవుచుండె బ్రొద్దు
గగన దుర్గపు దూర్పు బంగారు తలుపు

తెరవబడియె రే రా జరుదెంచు నంచు దీ. పు. 21

ఇందలి నవ్యతను గూర్చి కురుగంటి సీతారామయ్యగారి మాటలు.

"రెండు దిక్కుల రాగము. వకటి తగ్గుతున్నది. రెండోది క్రమాభివృద్ధి పొందుతున్నది. మొదటి క్రమక్షైణ్యాన్ని ఒక్కొక్క రేఖనే పొద్దు చెసుపుతూ పోతున్నదనీ, రెండవ క్రమాభివృద్ధిని తలుపు తెరచే టప్పుడుండే క్రమంగా చిత్రించడమున్నూ దీనిలో వున్న నవ్యత. ఈ మాటలు విడివిడిగా మన మెరిగినవే! కాని వీటి సమ్మేళనం వల్ల యెటువంటి నవ్యత వచ్చిందో చూడండి."[1]

"ముది శిశిరమ్మునకు చిదిమిన పట్లు
పూలకారు చిప్పళ్ళ పురిటి పొత్తిళ్ళు" దీ. పు 7

"తన ప్రియుడు వచ్చు జాడ గట్టినద యేమొ
కనులు విప్పెను పద్మినీ కాంత యపుడె" దీ. పు. 109

ఈ మొదలైన వన్నీ పై వరుసలో నవ్యతకు పేరు పెట్టతగ్గవి. ఇట్టి వేదుల నూత్న భావాన్ని గూర్చి శ్రీపాద వారి వాక్యాలు కూడ అవశ్య పఠనీయాలు.

"శాస్త్రిగారి పోలికలు, వర్ణనలు మన అనుభవం లోనివే నన్నాను. ఆయన ఊహాలు భావాలు మట్టుకు కావు. భావనాబలం వల్ల వారు గుర్తించిన విషయాలు చాలా విలక్షణంగా ఉంటాయి; ఉండాలి కూడాను. మన మెరిగిన ప్రపంచలోని దృశ్యాలే కవిభావన వల్ల తళుక్కుమని మెరిస్తే అందం. అవి మన మెరిగుండడంవల్ల నచ్చుతాయి. కవి భావన రంగు పూయడం వల్ల అద్భుత మౌతాయి."

గోపాల కృష్ణమూర్తిగారన్నట్లు పై దృశ్యాలు మన అనుభవం లోనివయినా కవి భావనా బలం వల్ల తళుక్కుమని మెరుస్తాయి;

---

1 నవ్యాంధ్ర సాహిత్య వీథులు - పుట 330.

అద్భుత మనిపిస్తాయి. భావకవులు తమ కష్ట సుఖాల్ని ప్రకృతి కన్వయించుకొని ఊరట పొందడం భావ కవితా లక్షణాల్లో ఒకటని ముందే చెప్పబడింది.

నాటి విశాల నీల గగనమ్మును, నాటి యనంత తారకా
కోటులు, నాటి లే మొయిలు గుంపులు, నాటి నిశాంధకారముల్
నాటి నిశీథ మంద పవనమ్ములు నావలె నేడు కష్టపుం
బాటున జిక్కి దుఃఖపడు భంగి విరక్తములై కనంబడున్

నాటి గగనాదులన్నీ నేడు కవిగారి వలెనే దుఃఖపడు తున్నట్లు తోచాయి.

ప్రకృతిలో మానవత్వాన్ని చూడటం ప్రకృతి మానవీకరణం. ఇది వేదాల్లోనే కనిపిస్తున్నా, ఆత్మాశ్రయం రీతిలో వెలువడటం మాత్రం ఆధునిక కాలంలోనే అనడం యథార్థం.

ప్రకృతిలో మానవత్వాన్ని దర్శించుట, దానిని స్వీయానుభూతికి ఆలంబనంగా గ్రహించటం వేదులలో కనిపిస్తుంది.

అందుచేతనే "తన దేశభక్తిని ప్రకృతి యందారోపించి, ఆత్మానుభూతిని ప్రకృతి యొక్క మానవీకరణంగా భాసింప జేశారు."[1] అని పి. వసుంధరాదేవి గారు వ్రాశారు.

అనగా 'కాంక్ష'లో ప్రకృత్యంశమైన పుష్పాన్ని స్వీయానుభూతి ప్రకటన కాలంబనంగా గ్రహించి వేదుల దేశభక్తిని వెల్లడించారు.

తనలాగే మబ్బు కన్నె లశ్రుపూరితమై, బరువైన హృదయ పాత్రికను వంపలేక విచారించడం ప్రకృతి మానవీకరణ కుదాహరణం.

"అశ్రు పూరితమై, బరువైన హృదయ

1 వేదుల దీపావళి-ఒక పరిశీలన. యం. ఫిల్. వ్యాసం. పుట 59

పాత్రికను వంపలేక నా వలెనె వగచు
మబ్బు కన్నెల" దీ పు. 29

ఇట్లే "ముహు రుపచితాశ్రు మలిన కపోల యుగుచు
నా వలెనె యీ నిశయు వెళ్ళిపోవుచుండె" దీ. పు. 109

"అకుల పాటునొంది పూదీవలు నాదులేయెడద తీరున మోడయి పోయె", "నా వలె శుష్క జీవనమునన్ దు ర పి ల్లె డి యీ పవిత్ర గోదావరి" మొదలైన వన్నీ ప్రకృతి మానవీకరణకు పట్టుగొమ్మలైన ఉదాహరణలు.

ఇంతవరకు దీపావళిలో వివిధ ఖండికల్లో వేర్వేరు చోట్లల్లో విభిన్న విషయాల్ని వర్ణించే సందర్భాలలో వేదుల దర్శించిన ప్రకృతి నటి నైకవిధలాస్య గతుల్ని తెలిసికొన్నాం. ఇక ప్రకృతినే ప్రధానమైన ఆలంబనంగా గ్రహించి వర్ణించిన ఖండికల్ని పరిశీలించవలసి ఉంది.

**ఈ నాటికి**

వేదుల రచించిన 'రాణా ప్రతాపసింగు' నాటకంలోని ఒక పాత్ర పేరు తేజసింగు. ఆరావళీ పర్వత ప్రాంతారణ్యంలోగల ప్రదేశమున ఏకాంతంగా ఉన్న ఇతని వద్దకు ఒక భిల్లకన్య పాట పాడుకొంటూ వస్తుంది. ఆ పాటయే ఈ ఖండికకు మూలం. ఈ రెండూ కూడ ముత్యాల సరాలే.

చిన్ననాటి స్నేహపు తీపి గుర్తులు స్మరించుకోవడం ఇందలి విషయం. అనగా బాల్య స్మృతులని స్థూలంగా చెప్పవచ్చు. బాల్య స్మృతి ప్రకృతి కవిత్వ పరిధి లోనిదే యనడానికి నారాయణరెడ్డిగారి ఈ క్రింది వాక్యాలే ప్రమాణాలు.

"బాల్యస్మృతి చిత్రణము కాల్పనిక కవిత్వ లక్షణములలో నొకటి. ఈ లక్షణ మచ్చముగా ప్రకృతి కవిత్వ పరిధి లోనిదే"[1]

---

1 ఆధునికాంధ్ర కవిత్వము – పుట 424

అంచేత దీన్ని ఇక్కడ ప్రస్తావించవలసి వచ్చింది.

ఆట పాటల యందు మునిగి చ
రించు బాల్యమునందు గుదిరిన
చెలిమి జ్ఞప్తికి వచ్చి కన్నులు
చెమ్మగిలి పోవున్

ఇది నాటకంలోని భిల్లకన్య పాడిన పాట యొక్క ప్రారంభ గేయం. దీన్ని అనుసరించి వ్రాసిన ప్రస్తుత ఖండికలోని ప్రథమగేయం.

కలత యెరుగని లేతప్రాయపు
దలిరు టెడదను తీగవారిన
చెలిమి జ్ఞప్తికి వచ్చి కన్నులు
చెమ్మగిలి పోవున్ దీ. పు. 24

చిన్నతనంలో లేత హృదయాన పాదుకొన్న స్నేహం జ్ఞప్తికి వచ్చి కన్నులు చెమ్మగిల్లుట, వలపెరుంగని నాటి చేతల తలచుకొన్నప్పుడు డెందాన పువ్వులు పూచినట్లుండు టనేవి బాల్యస్మృతులు.

చిన్ననాటి చేతలన్నీ గుర్తుండవు. అయినా ఆనాటి మమతానురాగాలు మాత్రం మరపునకు రావు. ఆ మరపునకు రాని మమతను మసక చీకటి మరుగున తరళించు వెలుగుతో పోల్చినారు.

తెరగ విరిసిన మసక చీకటి
మరుగునందరళించు వెలుగటు
మరుపులో నొక పూపప్రాయపు
మమత మినుకు మనున్ దీ. పు. 35

ఆకసంలో దొంతరిల్లిన మబ్బుల జూడగానే ఏదో కోలుపోయిన రీతి ఎద వేగునట.

మింట మబ్బులు దొంతరిల్లుట
కంట బడినపుడెల్ల బ్రదుకుం

బంటు యేదో కోలుపోయిన
పగిది నెద వేగున్ దీ. పు. 36

"మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథా వృత్తి చేతః" అను కాళిదాసు మేఘసందేశంలోని వాక్యాన్ని ఇది గుర్తు తెస్తుంది.

చిట్ట చివరకు చిట్టివలపుల గూడుగట్టిన చెట్టునకు దూరమైన పిట్టవలె తన యెద అడవుల బట్టి తిరుగాడుతుందను గేయంతో ఈ ఖండిక ముగిసింది.

చిట్టి వలపుల గూడు గట్టిన
చెట్టు వేరొక దారి కాగా
బిట్టు వలె నెద నేటి కడపుల
బట్టి తిరుగాడున్ దీ. పు. 36

## పూర్ణిమ

1924 సం. 'భారతి'లో ప్రకటింపబడింది ఖండిక. దీన్ని చదివి ముగ్ధులై వేంకట పార్వతీశ్వర కవుల్లో ఒకరైన బాలాంత్రపు వారు ప్రశంసా పూర్వకంగా ఒక లేఖను వేదుల కిలా వ్రాశారు.

"కాళిదాసు వల్ల అసాధ్యమైన అనుభూతి పండివుంచి .... ఈ అయిదు పద్యాలవలన నీకు ఆ కార్తీక పూర్ణిమ .... ఉద్గ్రంథం అవుతుంది."[1]

దీని నాధారంగా విస్తరించి ఒక గ్రంథం వ్రాయవచ్చునియు, అది వ్రాయాలనియు బాలాంత్రపువారి లేఖా సారాంశం.

"'పూర్ణిమ', 'కాంక్ష', 'అసాఢమేఘము' దీపావళిలోని కవిత్వపు చిక్కదనము, పదముల పొందిక, భావనిర్భరత, పద్యమాధుర్యము ఇత్యాది గుణములు మిగిలిన భావకవుల కంటె వేదులవారి విశిష్టతను

---

1 నా సాహిత్యయాత్ర-అముద్రితము పుట 8.

వెల్లడించును."[1] అని డా. జి. నాగయ్యగారు

"శ్రీ వేదులవారు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా రాజమహేంద్రిం దగ్గర అఖండ గోదావరీనదీ - ఎండాకాలంలో ఆ గోదావరి శుష్క జీవనమై పోవడము - పూర్ణిమ నాటి చంద్రుడు చల్లగా, మెల్లగా, "గాఢ లజ్జాయుత నవోఢవలె సందడి చేయక" ఈ లోకపు టుప హాస్యాన్నీ వికారాన్నీ తొంగి చూస్తూ పోతూ వుండడము-స్ఫురించి మనస్సుల్లో మెరుపు మెరిసినట్లవుతుంది"[2] అని దేశిరాజు కృష్ణశర్మగారు కొనియాడారు.

ఈ మెచ్చుకోలులే కవి వైశిష్ట్యానికి గీటురాయిగా 'పూర్ణిమ' నిలుస్తుందనడానికి నిదర్శనాలు.

పూర్ణిమ నాటి సహజ చంద్రోదయ వర్ణనలో తొలినుండి తుది వరకు 'నవోఢ' (కొత్త పెండ్లికూతురు) స్ఫురించుట ఈ ఖండికలో గల విశేషం.

ఇందలి ప్రారంభ పద్యంలోనే 'పూర్ణిమ'ను సిగ్గుపడుచున్న 'నవోఢ'తో పోల్చారు.

> ఆ యుదయాద్రి నుండి యరుణారుణమౌ ముఖమెత్తి గాఢ ల
> జ్జాయుతయౌ నవోఢ వలె సందడి సేయక తొంగి తొంగి లో
> లాయత దృక్కులన్ దశదిశాంతరముల్ పరికించి జీర్ణమై
> పోయిన నా కుటీర పథమున్ గురుతింతువు చాటు చాటుగన్

పున్నమనాటి చంద్రుని రాకకు, ప్రియాగమనానికి అభేదాన్ని చెప్తూ గడ్డి పరక కూడ పులకిస్తుందనటం వేదుల భావుకత్వానికి పరమ నిదర్శనం.

---

1 తెలుగు సాహిత్య సమీక్ష-పుట 662

2 "శ్రీ వేదుల వారి దీపావళి"-సుభాషిణి, ఏప్రియల్ 1951. పుట 50

ఈ వలి గాడ్పు లెంత వడకించుచు నున్నను, నీ ప్రవాళరే
ఖా విలసన్ముఖంబు తడిగట్టెడు సిగ్గున సంచలించినన్
మోవగరాని ప్రేమను విముక్త గవాక్ష పథమ్ము డిగ్గి నా
కేవకు వత్తువెట్లొ పులకింపగ నా తృణకీర్ణ శయ్యయున్

నిద్రచే మూత పడ్డ కనుబొమ్మల్ని సుధాలింగిత చుంబనాలచె చలింప జేయుడం, అమృత కిరణ కాంతులచే మేలుకొల్పి కొత్త మామమాసం యొక్క సంధ్యానిలం వలె శరీరాన్ని పులకరింప జేయడం అనేవి చంద్రునికీ, ప్రియురాలికీ కూడ వర్తిస్తాయి.

ఇట్లు వ్యంగ్యంగా సాగిన వర్ణన చివరకు 'నీలోని అమృత మంతా తాగుతూ, రాత్రిని స్వప్న మధురక్షణంగా తలంతునను పతాక వాక్యంతో ముగింపబడింది.

ఈ తృణ శయ్య యందె నిదురించెద మిశ్వరమున్ పరస్పరా
ద్వైత గతాత్మ వృత్తిని భవద్భుజవల్లుల నన్ను బందెగన్
జేతువు నీవు నే నపుడు నీ యమృతాసవమెల్ల దాగుచున్
రాతిరి నొక్క స్వప్న మధుర క్షణ మట్లుగ వెళ్ళ బుచ్చుదున్

ప్రకృత్యంశమైన పూర్ణిమను కావ్య వస్తువుగా గ్రహించి అందలి సౌందర్యాది విశేషాల్లో తన ప్రియురాలి గుణ విశేషాల్ని చూడటం ఇందలి నవీన విశిష్టత.

అందుచేతనే విస్సా అప్పారావుగారు

"ప్రకృతినే కావ్య వస్తువుగా జేసి అందలి సౌందర్యాది భావము లను జీవితముతో సమన్వయము చేయుట యే ఈ మార్గములోని విశిష్టత. ఇదే ఈ నవ్య సాహిత్యములోని నూతనత్వము."[1] అని వక్కాణించారు.

1 "స్వాగతోపన్యాసము" ప్రతిభ, న.న.స. – పుట 37.

ఈ ఖండికలో జీర్ణమై పోయిన కుటీర పథము, విముక్త గవాక్షము, తృణకీర్ణశయ్య అనేవి కవి పేదరిక జీవితాన్ని వ్యక్తం చేస్తూ, బాధా నిశితమైన కవి పువుటెదను బయల్పరుస్తాయి.

ఈ కారణంగానే "శాస్త్రిగారి రచనలలో వ్యక్తి గుణమూ సార్వ జనీనతా రెండు మెలిపెట్టు కుంటాయి."[1] అని శ్రీపాద వారు ఉగ్గడించారు.

## ప్రభాతగీతి

ప్రభాతగీతి యనడం లోనే ఈ ఖండిక యందలి విషయం ప్రభాత కాల వర్ణన మని స్పష్ట మవుతుంది.

కడుపు కాల్చే ఆకలితో అలమటిస్తున్నా, దినములు పరస్పర ప్రతిధ్వనులు గాగ జీవితం సాగుతున్నప్పటికీ, ప్రకృతి సౌందర్యానికి పరవశించి ప్రభాత గీతాన్ని పాడుకొన్న వ్యక్తి వేదుల.

విరహ బాష్ప తుషారమ్ము గురిసి కురిసి
కను మొగిడ్చెను హేమంత కాలరాత్రి    దీ. పు. 64

రాత్రి కను మొగిడ్చె ననుట చక్కని అవలోకనం. రాత్రికి విరహాన్ని అంటుగట్టి, కురుస్తున్న మంచును కన్నీటిగా జేసి, హేమంత కాల రాత్రి కను మొగిడ్చె ననుట ప్రకృతికి లౌకిక భావాన్ని అపాదించుటయే. భావనాబలం వల్ల వారు గుర్తించిన విలక్షణ విషయం.

సూర్యోదయాన్ని సూచించడానికి వారు వాడిన తక్కిన వర్ణన త్రయుం.

జీవ చైత్ర ప్రభాత వంశీరవమ్ము
మ్రోగు చుండె రోదసి మూల మూల లందు    దీ. పు. 64
సప్త రథ్య ప్రయాణ హేషా రవమ్ము

1. "కవి-సన్మానము" ప్రతిభ, న.న.స. పుట 229

సాగె దూరుపు పైడి మోసాల మోత్రిల
నను లుపేక్షించు తృణ దళాంతర హిమాశ్రు
కణముపై లోక బాంధవు కరము సోకె

నరు లుపేక్షించే తృణ దళమున గల హిమ కణాన్ని గూడ సూర్యుడు తన కరాలచే స్పృశించినాడు గనుకనే అతడు లోక బాంధవు డయ్యాడు. 'నరు లుపేక్షించు' అనడంలో సూర్యుని మహత్త్వం వ్యక్త మవుతుంది.

సూర్యుడు వీరి దృష్టిలో 'విషాద ప్రపంచ యాత్రా విరాగి, నిరాశా పథైక పురాణ పాంథుడు, ప్రవాస దుఃఖాశ్రు పయోద మూర్తి'.

కవి సూర్యుడ్ని విషాద బాష్ప వారిని పారబోసి ప్రాతరాహ్వాన సామగానంతో జీవన పాత్ర నంచు వరకు నింపుకో మంటున్న హితోక్తి ఇది.

రేయి కాటుక కనుల జారిన విషాద
బాష్ప వారి నొకే సారి పార బోసి
యీ మధు ప్రాత రాహ్వాన సామ గాన
మంచు మోయ జీవన పాత్ర నించు కొమ్ము దీ. పు. 65

ఈయనకి ప్రపంచ మంతా నందనోత్సవ మందిరం. ఆ మందిరాళింద సీమలో నీరవ గళమ్ముతో నిలువ రాదని సూర్యునికి శాస్త్రి గారొనర్చిన హెచ్చరిక ఇది.

భూత కాల దినాంతాను భూతి తోడ
భావి యుగముల కళ్యాణ పథము బట్టి
వెలుగు నీడల జీవన వేణు వూది
పాడు కొనుమ యీనాటి ప్రభాత గీతి దీ. పు. 65

ఇప్పటి వరకున్న విజ్ఞాన సంపత్తి, సాధించిన అనుభవమే భూత కాల దినాంతానుభూతి. మహోన్నతమైన ఆదర్శంతో

ఉత్కృష్టాశయాన్ని సాధించుటయే భావి యుగముల కళ్యాణ పథం. వెలుగు నీడలు సుఖ దుఃఖాలకు సంకేతాలు.

అనగా తన వరకున్న విజ్ఞాన సంపత్తితో సాధించిన అనుభవంతో ఉత్కృష్టాశయసిద్ధికై మహోన్నతా దర్శమార్గంలో పయనిస్తూ వెలుగు నీడల జీవన వేణు వూది ప్రభాత గీతిని పాడుకొను మంటున్నారు కవిగారు.

ఇది సూర్యుడ్ని ఉద్దేశించినప్పటికీ, ప్రభాత కాలాన్ని గూర్చి చెప్పినప్పటికీ ఇందు గోచరించేది కవి ఆత్మీయతయే అనేది మనం మర్చిపోరాదు.

కనుకనే గౌరవజ్ఝల వెంకటసుబ్బరామయ్యగారిలా అన్నారు.

"పృథ్వి యొక్క అణువణువునందూ, కాలం యొక్క ప్రతి క్షణంలోనూ, క్రియ యొక్క ప్రత్యేక స్పందనంలోనూ, జీవిత లక్షణములను వెదకుట, వాటిలోని అంతర్వేదనకు తాదాత్మ్యమును ప్రకటించుటయే నేటి కవిత ముఖ్య లక్షణంగా తోస్తుంది."[1]

## ఆషాఢ మేఘము

ఈ ఖండిక కవిగారి కలం నుండి వెలువడడానికి గల నేపథ్యానుభవాన్ని గూర్చి వారే ఇలా అన్నారు.

"ఒకనాటి అనుభవము చెపుతాను. జయపురపు మహారణ్యములో తిరగడానికి వెళ్ళాను ఒక స్నేహితుని వెంట. అది ఆషాఢమాసము. నది గట్టున ఒక పెద్ద రాతిమీద కూర్చున్నాను ఒక్కణ్ణి. కనుచూపు మేరలో ఎదురుగా ఒక మహాపర్వతము పక్కన దున్నిన పొలాలు. మబ్బుచాటున పొద్దు పొడిచింది. కొండ కొమ్మున నల్లమబ్బు కూడింది. పర్వతరాజు నీలిపాగా మీదితురాయిలాగు ఇంద్రధనుస్సు.

1. ''నేటి తెలుగు కవిత్వపు పోకడలు''-భారతి. జనవరి 1946

సన్న చినుకు పడుతున్నది. చల్లని స్పర్శకు శరీరము గగుర్పొడిచింది, ఎందుకో నిట్టూర్పు విడిచాను. కదులుచున్న మబ్బును చూస్తూ ఉంటే "కంఠాశ్లేష ప్రణయిని జనే కిం పునర్దూర సంస్థే" అన్న శ్లోకము జ్ఞప్తికి వచ్చింది. కాళిదాసు, యక్షుడు, మేఘసందేశము ఒకదాన్ని ఒకటి తరుముకొని వచ్చి నా హృదయాన్ని కదిపి వేసినవి. ఆ మేఘుడు నాకోసమే వచ్చినట్లు "ఏ విరహార్తుడేని .... పయోదమా!" అన్న పద్యము అప్రయత్నముగా వచ్చింది.''[1]

ఆ పద్యమే ఈ ఖండికకు ఆద్యమై నిలిచింది.

ఏ విరహార్తుడేని హృదయేశ్వరి సన్నిధికేగజాలు వా
ర్తావహుగోరి, యేగిరి నితంబ తటమ్ముననేని చిక్కి, వా
పోవుచు నుండెనేమొయని, పొంచి దెసల్ పరికించి చూచు చు
న్నావె ప్రవాస దుఃఖిత మనః ప్రవణోత్సవమా, పయోదమా!

అని తొలుత మేఘుని ఉపకార భావనాకాంక్షను కొనియాడారు. మేఘాన్ని 'ప్రవాస దుఃఖిత మనఃప్రవణోత్సవమా' అను సంబోధన అన్వర్థమై అందగించి ఆనందాన్ని కలిగిస్తుంది.

పర్వతరాజు శిరస్సుపై ధరించిన మేలి హొరంగు నీలి పాగా వలె వేగుబోక చిరుగాలికి అట్టిటులూగు మేఘాన్ని జూడగానే కవి గారికి యక్షవేదనాఖ్యాయిక జ్ఞప్తి వారింది. ఆ తరువాత సంగతిని గూర్చి వారే ఇలా పేర్కొన్నారు.

''మేఘ సందేశము చదివిన సంస్కారము ఆ అనుభవాన్ని ఊహగా మార్చింది. ఆ మేఘము నాకోసము రాలేదు. నేను యక్షుడను కాను. ఏదో మధురస్మృతి ఎప్పటిదో.

లేదల నాటి యుజ్జయిని, లే దలకానగరీ ప్రయాణ స
మ్మోదము, లేడు ప్రేమ భర ముగ్ధుడు నాటి గిరి ప్రవాసి, భా

1. "నా గొప్ప రచన"-భారతి. జనవరి 1944. పుట 27.

> నూదయ చిత్రితేంద్ర ధనురుజ్జ్వల మూర్తివి నీవె నాటి మ
> ర్యాద ప్రవాసి బాంధవుడవై కనుపించెద వోయి నేటికిన్.

అని నాలో కలిగిన భావాలన్నీ ఆ మబ్బుతో చెప్పుకొన్నాను. 'ఆషాఢ మేఘము' అనే రచన రూపుదాల్చింది.''[1]

దీన్నిబట్టి ఈ రచన అనుభవాన్ని నుండి వెలువడిందనుట స్పష్టం. ఊహించి అనుభవించిన రచన కంటె అనుభవించి ఊహించిన రచన హృదయానికి మిక్కిలి హత్తుకొంటుందనే విషయం విజ్ఞులకు విదితమే.

అలనాటి యుజ్జయిని, అలకా నగరీ ప్రయాణ సమ్మోదం మొదలైనవి లేవని వేదుల పెదవి విరిచినారు. కాని నాటి ప్రవాసి బాంధవుడైన మేఘుడొక్కడే నేటికి కనిపించుటచే కొంత ఊరట పొంది ఆ మేఘునిట్లు ప్రశంసించారు.

తరుణీదూరులకు, ప్రేమజీవన దరిద్రిణులకు వారి దుఃఖ బాష్పకణ ముక్తాపాళిని వార్తాక్షరాల్లా వహించి ప్రణయదౌత్యాన్ని నెరపు ఆకాశ యాత్రికుడట మేఘుడు.

> తరుణీ దూరులు, ప్రేమజీవన దరిద్రిణుల్, నభోమాస కా
> తరులౌ దీనుల దుఃఖబాష్పకణ ముక్తాపాళి వార్తాక్షరో
> త్కరముం బోలె వహించి,యంబరపథాంతర్నిత్యయాత్రాధురం
> ధరతన్ మానవు నేటికిన్ ప్రణయ దౌత్యంబీవు మేఘోత్తమా!

మరియు నతడు తెలినీటి మెరుంగు ముత్తెములచే విరహవ్యథతో తన వంక చూచే భామల సంస్కారరహితంగా ఉన్న పాపటను నీటుగ తీర్చిదిద్దునట.

చివరికిప్పటి నవనాగరకత్వ కింకరులు వలపుంగలలు కనజాలని

---

1. "నా గొప్ప రచన"-భారతి. జనవరి 1944. పుట 28

వారనియు, ప్రేమ సన్యాసులనియు ఈ విధంగా తమ ఆవేదనని వ్యక్తం చేశారు.

మాసిన వాసనా మధురిమమ్ముల భౌతిక శుష్క జీవన
గ్రాసపు మేరలన్ గడచిరాని తలంపులబోవు ప్రేమ స
న్యాసుల నీరసంపు హృదయంబుల కేమిటి కిప్పుడీ నభో
మాస నిరీక్షలున్, విరహమాధురులున్ దయితా ప్రవృత్తులున్.

అవును; కవిగారన్నట్లుగా భౌతిక శుష్క జీవనగ్రాసపు మేరలు గడచి రాని తలంపులతో సతమతమవుతున్న ప్రేమ సన్యాసుల నీరసంపు హృదయాల కివేమీ రుచింపవుగదా! బానిస బ్రతుకులు బ్రతుకుతున్న వర్తమానులకు అలనాటి సుఖమయ జీవన సౌభాగ్యం తలపునకైన రాని దూరమైపోయింది. అందుచేతనే నేటివారు ప్రేమ సన్యాసులైనారని కవి ఆవేదన. పైగా మన ప్రబంధ సాహిత్యంలో శృంగారమే కాని లలితమైన ప్రేమకు హృదయంలో స్థానం లేకుండా పోయింది. భౌతిక జీవనాన్ని గడుపుకోవడానికే కాలం సరిపోదు. అందుచే మన జీవనం శుష్కమై నీరస హృదయుల మైపోతున్నాం. కనుక నభోమాస నిరీక్షలకు సమయమే లేదని కవి సానుతాపంగా వివరించారు.

ఒక చక్కని భావ సన్నివేశ మాధారంగా వెలువడిన ఖండిక ఇది. అంతియే కాక కవి గాఢమైన తన మధురానుభవాన్ని పొదిగిన రచన. అందుచే కాళిదాస మేఘసందేశపు ప్రారంభ సన్నివేశ సౌందర్యాన్ని కళ్ళకు కట్టినట్లు చేసి పాఠకుల హృదయాల మీద చెరగని ముద్ర వేసింది.

కనుకనే ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారిలా అన్నారు.

"'ఆషాఢమేఘము'లో కాళిదాసు కవి నాటి యొకానొక యక్షు వేదనాఖ్యాయికక్షప్తివారి కారుణ్యార్ద్రమైన మెత్తని హృదయాల మీద

కవి కొట్టిన రసముద్ర ఎన్నటికి చెరగనిది. ఇందులోని భావశిల్పము, పలుకు పొందిక 'పరాంకోటి' నందుకున్నది. దీనిలో పాఠకులు కొన్ని శతాబ్దముల వెనుకకు మరలి మేఘసందేశపు చాలులు పట్టి కాళిదాస కవీంద్రుని నాటి శృంగార సంపత్తిని చూరగొనే మధురిమ ఉంది."[1]

## సుధాకరా!

వేదుల కీర్తి కిరీటంలో ఒక మణిశలాక ఈ ఖండిక. అందుచేతనే

"ఈయన రచించిన యాత్ర, కృతజ్ఞత, నేడు, పూర్ణిమ, శరదుత్సవము, సుధాకరా! అన్న ఖండకావ్యాలు విశ్వ సాహిత్యాకాశపు చుక్కలు"[2] అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారును

"వేదుల వారి 'సుధాకరా!' లోని చంద్రుని వంటి చక్కదనాల హంస ఒక్క ఆంధ్ర సాహిత్యమే కాకుండా విశ్వ సాహిత్యం అంతా వెదకి చూసినా కనబడదు"[3] అని శ్రీ దామెర్ల రాజ గోపాలరావుగారును

"సుధాకరా! వంటి సుందర కావ్యమునకు తెనుగువారు గర్వపడక తప్పదు. అందలి అచుంబిత భావ సంపత్తి నవీన సాహిత్య ప్రత్యేకపు సొంత సొత్తుగా చెప్పబోతే ఎవ్వరు అడ్డురారు."[4] అని ఇంద్రగంటి వారును ప్రశంసించినారు

ఇట్లు విశిష్టంగా పలువురిచె ప్రశంస లందుకున్న 'సుధాకరా!' లోని వైశిష్ట్యాన్ని తెలిసి కొందాం.

సుధాకరుని మహోదయచ్ఛాయలు సోకగానే వేదుల వారి హృదయం సాగర మట్లు పొంగిందట.

---

1,4. "వేదుల వారి దీపావళి"-భారతి. ఏప్రియల్ 1938. పుట 320
2. "అర్థ శతాబ్దపు ఆంధ్ర కవిత్వము"-భారతి. జూలై 1963 పుట 5
3. "తెలుగు కవిత్వంలోని క్రొత్తందనం"-,, మా. 1940 పుట 403

ఓయి సుధాకరా! నిలువు మొక్క నిమేషము; నీ మహోదయ
చ్ఛాయలు సోకి నాయెడద సాగర మట్టులు పొంగుచున్న దే
వోయనుభూత జీవిత సుఖోర్మ్మ లపూర్వ విముగ్ధ నాట్యముం
జేయుచు బాడుచున్నవి వినిర్మల మోహన రాగ గీతికల్

కవిగారికి వెన్నెల మూగ సోయగమై కనుపట్టింది. మానవుల ఆశలతో విధికి నిరంతర యుద్ధం సాగు ఈ కటికి నేలపై నిల్చిన మనోజ్ఞత కాశ్చర్యం కలిగింది. మోదమో, ఖేదమో, మోహమో, స్వప్నమో ఏదో చెప్పలేని యనుభూతి కలిగి ఆయన్ని ముగ్ధుడ్ని జేసింది. వారికి చంద్రుడు అప్సరః ప్రణయిని యొక్క కొప్పు నుండి జారిన పారిజాత మాలా సమూహముగా, శరద్విభావరీదేవి లలాటికా మణిగా, సుర రాజ్య లక్ష్మికి దీపికగా అగుపించాడు. మరియు నతడు వెన్నెల్లో కనులుమూయని పేదలకై కృపారసం బూరెడు సుధా మురళి నూదు కరుణార్ద్ర మూర్తిగా తోచినాడు. అందుచే సుందర తర చంద్రికా పులకితమ్మగు తీయనైన రాతిరి తెలవారకుండా ఉండాలని కోరుకున్నారు.

తరువాత చంద్రునితో ఇలా అన్నారు.

ఓ యమృతాశ్రు మూర్తి! యెటకో పరువెత్తెదు వాయులీనమై
పోయెడు రాగరేఖ వలె, మోయగరాని ప్రవాస దుఃఖమో
తీయని ప్రేమ వేదనయొ, తీరని కోరికయో, యెదో యెదం
గోయునో యేమొ రాల్చెద వనూన హిమాశ్రు కణాల నావలెన్

ఇపుడు సుధాకరుడు వేదులకు అమృతాశ్రు మూర్తిగా కనిపించాడు. హిమాశ్రు కణాల్ని రాల్చడానికి ప్రవాస దుఃఖమా! ప్రేమ వేదనా! తీరని కోరికా! అని కారణ మడిగారు. అంతటితో ఊరుకోక 'నావలెన్' అని పలికి 'స్వీయ వేదన'ని అభివ్యక్తమొనర్చారు. అట్లొనరించుటలో ఔచిత్యం ఉంది.

సుధాకరుడు పరుల పట్ల నిరంతర సానుభూతితో, చల్లని

చూపులతో హిమాశ్రుకణాలు జారుస్తాడు. మన కవి నిరంతర దుఃఖ వేదనలతో హృదయం దందహ్యమాన మవుతున్నా లోకం పట్ల ప్రేమాభిమానాన్ని, సానుతాపాన్ని ప్రదర్శిస్తూ వచ్చాడు. కనక కవికీ, శశికీ గుణసామ్యం ఉంది. మొత్తం మీద వేదుల చంద్రునిలో తన విషాద హేతువుల్ని అన్వేషించుట ద్వారా ఊరట పొందారు. అంతే కాకుండగా "వెన్నెల వెల్లువ జక్కదనాల హంసవై యరిగెడు నిన్ను జూచు నిశలందున నాకగు బాష్పశాంతి" అని చంద్రునికి తన కృతజ్ఞతా భావాన్ని వెల్లడించారు.

ఆయనకు తెలి మబ్బు దొంతరలు ప్రేమ పిపాసచే వచ్చిన అప్సరోంగనల సితావగుంఠనాలవలె కనిపించాయి. అవి చంద్రునికి మృదుశయ్యలై సుధలు నిండిన నవ్వనెడి కాంతి కెరటాల నురుగులై వేదుల్ని వేదనకు గురి చేశాయి. అప్పుడు కవి తన వేదనని సుధాకరుని కిట్లు మొర పెట్టుకున్నాడు.

నేను నిరంతర ప్రళయ నిష్ఠుర మీ బ్రదుకున్ భరింపగా
లేను, క్షుధాగ్ని నార్పుకొన లేక తపించెడి ప్రేమ కాంక్ష యిం
తేని నశింపకుంట మరణింపగ లేనిటులే నిరోధముల్
లేని మహా ప్రవాహము చలింపక నిల్చిన దొక్క నాయెడన్

దీన్ని గూర్చి దేశిరాజు కృష్ణశర్మగారి అభిప్రాయ మిది.

"బ్రతుకును భరింప లేననే గాఢమైన అసంతృప్తి, మరణింప లేననే సుకుమార ప్రేమ కాంక్షా, ఒక మహాభావ ప్రసరణంగా ఈ కావ్య మంతటా ధ్వనిస్తున్నది. ఆ మహాభావ ప్రవాహమే వీరి కవితా ప్రవాహము. ఈ ప్రవాహము సుడి గుండాలతో, భయంకరంగా ముంచు కొచ్చేటట్లుగా ప్రళయ నిష్ఠురంగా వుండదు."[1]

శర్మగారన్నట్లు అసంతృప్తి, ప్రేమ కాంక్షల భావ ప్రవాహమే

1. "శ్రీ వేదుల వారి దీపావళి"-సుభాషిణి, ఏప్రియల్. 1951 పుట 52

ఈ కావ్యం. చిట్ట చివరకు నీల నభో నిశాంత శోభామయ సీమలందు నీతోపాటు చిరు మబ్బువోలె తిరుగాడుటకు వెంట తోడ్కొని పొమ్మని సుధాకరుని ఇలా వేడుకున్నారు.

ఆ మృదు చంద్రికా యవనికావృత నీల నిభో నిశాంత శో
భామయ సీమలందమృత వాటుల స్వప్నపథాల నొక్క యీ
యామిని మాత్రమే తిరుగు లాడెద నే జిరుమబ్బువోలె, నీ
తో మన సార, నొక్కపరి దోడ్కొని పొమ్ముటకో సుధాకరా!

ఇట్లు దుఃఖోపశమనానికై ప్రకృతిని ఆశ్రయించి, తత్ సామీప్యానికై తహతహలాడారు.

ఈ విధమైన వేదులవారి సుధాకరుడు తెలుగు సాహిత్యంలో విశిష్టమైన సృష్టి యనక తప్పదు. వినూతనమైన శిల్పంతో, విలక్షణమైన భావసంపదతో విరాజిల్లుట దీని ప్రత్యేకత. కనుకనే

"పారిజాతాపహరణపు వెన్నెల కంటె ఇందులో నవంనవ శిల్పమున్నది. రంగనాథ రామాయణపు చంద్రుని కంటె యీ సుధాకరుడు చక్కదనాల హంస. బిల్హణీయపు ఇందు సందర్శనము కంటె ఇందు చూచే జగన్మోహన దృశ్యము పరిపరి విధాల మనస్సును పీడదు."[1] అని ఇంద్రగంటి వారును

"వెన్నెలను శాస్త్రిగారు అనుభవించి వర్ణించినంత వేరొక ఆధునిక కవి - పూర్వకవైనాను - వర్ణించ లేదేమోనంటాను."[2] అని శ్రీపాదవారును కొనియాడారు.

కవి సుధాకరునితో ప్రత్యక్షంగా సంభాషించునట్లుగా ఈ కావ్యం సాగడం వల్ల 'సుధాకరా!' అను శీర్షిక పెట్టడం సముచితంగా ఉంది.

---

1. "వేదుల వారి దీపావళి"-భారతి, ఏప్రియల్ 1౯౨8. పుట ౬20
2. "అర్థ శతాబ్దపు ఆంధ్ర కవిత్వము"-భారతి, జూలై 1963 పుట 6

ముక్తఝరి

ప్రకృతి సౌందర్యం గాంచినంతనే ఊరట పొందే హృదయం కలవారు వేదు లనుట చర్విత చర్వణం. అందుచే వారికి

నవ్వుచున్న యుషస్సతి నయన కాంతి
అలసిన యెడంద కమృత నిష్యందమయ్యె! ము. పుట 2

మంచు ముసుగు జీ రా డ పెండ్లి నడకల వయ్యారంతో వాహ్యాళికి వెళ్ళే హేమంత రాత్రి వర్ణన ఇది.

ఆకు రాలిన మోడులందు స్రుక్కెడు జీవ
కళ మంచు పడి, కనుల్ నులుముకొనియె
చేమంతి పూల పరిమళమ్ములకు సం
ధ్యావసాన సమీర మావులించె
కుతిగొన్న పడుచు చకోరియు రేయెల్ల
తడివెన్నెలకు మూతి ముడుచుకొనియె
పడతి ముంగిట నెండ పొడ సోకు నందాక
పడకిల్లు విడిచి రాబద్ధకించె
పంట కళ్ళాన కాపున్న పడుచు కాపు
వగచె రే యెంతకును దెల్లవారదనుచు
మంచు ముసుగు జీరాడ హేమంత రాత్రి
పెండ్లి నడకల వయ్యాళి వెడలు నపుడు. ము. పు. 13.14

మ్రోడున గల జీవకళ కనులు నులుముకొనుట, సంధ్యావసాన సమీర మావులించుట, చకోరిక మూతి ముడుచుకొనుట, పడతి పడకిల్లు విడిచి రా బద్ధకించుట, రేయెంతకును తెల్లవారదని కాపు వగచుట ఇవియన్నీ మంచు విపరీతంగా పడుతుందనడానికి కవితా స్ఫోరకమైన దృష్టాంతాలు. ఇట హేమంతాతిశయాన్ని చెప్పడం కవి ఆశయం.

### ఇంద్రచాపము

ఈ ఖండికలో కవిగారు 'ఇంద్రధనుస్సు'ను జూడగా వారి యెద సురధనుస్సహస్ర శోభతో నిండిపోగా కలిగిన భావాల్ని పొందు పరిచారు.

వేదుల వారి కిందధనుస్సు స్వర్గం నుండి భూమికి సౌందర్య లక్ష్మి దిగిరావడానికి కట్టిన మణిమయ సోపాన పరంపరలా తోచింది.

నాక లోకమ్ము నుండి సౌందర్య లక్ష్మి
మేదినికి దిగిరాగ నిర్మించి నట్టి
చారు మణిమయ సోపాన సరణి వోలె
అమరె నింద్రధనుస్సు మహాద్భుతముగ ము. పు. 22

ఇట్లు సౌందర్య స్పృహయాళువైన వేదుల అయా సందర్భాల ననుసరించి, వివిధ రీతుల్లో స్వీయ వేదనా పరితప్త హృదయానికి ఉపశమనంగా, కవితా కళకెత్తిన పతాకగా, సహృదయావర్జకంగా ప్రకృతిని చిత్రించారు.

## 4 దైవాన్వేషణం

దేశ దాస్యాంధకారాన్ని పోగొట్టే 'కాంక్ష'తో యుద్యమించి, వేదనయే చమురు కాగా, మానవత దీపించు 'కాగడా' వెలిగించి, ప్రకృతి (పూర్ణిమ)లో ప్రేయసీ 'నిరీక్షణ'ను దైవాన్వేషణకై మరల్చి, మధుర భక్తిచే భగవంతుని దర్శించి, 'పూజా ప్రసూనము'లతో నీరాజన మిచ్చింది దీపావళి.

### భావకవుల భక్తితత్త్వం

ప్రపంచాన్ని నడుపుతుంది మనకు తెలియని ఒక విశిష్టమైన శక్తి. ఆ దివ్యశక్తినే మన వారు 'పరమాత్మ' అన్నారు. ఆ పరమాత్మను చేరుకోవడానికి జీవు డొనరించు సాధనయే భక్తి.

భావకవితా యుగంలో దేశభక్తి, ప్రణయం, ప్రకృతి మొదలైనవాటితో పాటు భక్తి కూడ ప్రాధాన్యం వహించింది. భావ కవుల భక్తిలో పరమాత్మలో జీవాత్మ లీనమయ్యే తహతహ గోచ రిస్తుంది. అనగా భగవంతునికై భక్తుడు పడే ఆరాటం వ్యక్తమవుతుంది. ఈ భక్తి ఆత్మాశ్రయ మగుటచే పాత్రల ప్రసక్తి లేదు. కనుక వీరు తమ ఆవేదనను భగవంతునికి నేరుగా నివేదించుకున్నారు. పరమాత్ముని దయకై పలువిధాలుగా ప్రార్థించారు. వీరిది ప్రణయ మాధుర్యం నుండి పరిణమించిన భక్తి కావున క్రమంగా నాయికా నాయక వాసనా విలసితమై మధురభక్తికి దారితీసింది.

## భావకవులు - మధురభక్తి

ఇది వైష్ణవ సంప్రదాయానికి చెందినది. తనకు తాను ప్రేయసిగా భావించుకొని భగవంతుణ్ని ప్రియునిగా నారాధించుటయే మధురభక్తి. అధునికాంధ్ర సాహిత్య కేదారంలో భావకవులు పలువురు భక్తి కవిత్వాన్ని మీదు మిక్కిలి మధురభక్తి సస్యాన్ని పండించిన కర్షకులే. వీరు మధురభక్తిని మధురాతి మధురంగా రసజ్ఞుల హృదయ భాండాలు తొణికిస లాడేటట్లు గుమ్మరించారు.

ఈ కవితావతరణంపై మధుర భక్తికి ఆటపట్టులైన ఆంధ్రభాగ వతం, క్షేత్రయ్య పదాలు, గీత గోవిందం, కృష్ణ కర్ణామృతాల ప్రభావం గాఢంగా ఉంది. అట్లే గీతాంజలి ప్రభావంకూడ సామాన్య మైంది కాదు. ప్రభువును ప్రాణేశ్వరునిగా, తల్లిగా, తండ్రిగా, పలు విధాలుగా భావించిన రవీంద్రుని గీతాంజలి ప్రభావం దీపావళిపై ముమ్మరంగా ఉంది. ఒక్కొక్కచోట తత్ప్రభావమే కాక తద్భావాలు గ్రహించిన పట్టులూ ఉన్నాయి.

## దీపావళి - గీతాంజలి

'దీపావళి'లోని భక్తికి సంబంధించిన గీతాలపైనే గీతాంజలి

ప్రభావం మిక్కుటంగా ఉండుటచే దీన్ని గూర్చి ఇచట చెప్పబడుతుంది.

వేదుల తమ రచన లందేవేని అనువాదాలుంటే ఆ సంగతిని సుస్పష్టంగా వక్కాణించారు. కాని ఎవరి భావాన్నైనా మనసున గుప్తం చేసికొని రచించిన వాటి ఊసెత్త లేదు. అంత మాత్రాన అది గ్రంథ చౌర్యం (Plagiarism) అనడానికి వీలు లేదు. ఈ సందర్భంలో స్మరణీయాలైన శ్రీపాదవారి వాక్యాలు.

"స్వాతి చినుకులకు ముత్యపు చిప్పవలె ఏవో ఒకటి రెండు భావాలను హృదయ గుప్తం చేసుకుని వాటిని ముత్యాలుగా తయారు చేయడము కూడదనను నేను. కవి రచనలన్నీ తన యనుభవము లోనివే కావాలి అనే జాతి వాణ్ణి కాను నేను. అనుభూతి కేవలం స్వానుభవమే కానక్కరలేదు. తోటి కవి యనుభూతిని అతని కవనము పఠించి తన అనుభవానికి తెచ్చుకోడం కూడా అనుభూతే అంటాను. అందువల్ల బయల్దేరిన రచనలో ఈ కవి హృదయము, వ్యక్తి దీపిస్తే ఆ రచన ఉత్తమ మైనదే అంటాను"[1]

కేవలం ప్రకృతి వల్లకాని, అనుభవం పండి పుట్టుట వల్లకాని కలిగిన అనుభూతినే కవి తన రచనలో పొదుగవలసిన అవసరం లేదు. ఒక మహాకవి అనుభూతిని తనలో జీర్ణించుకొని రచన చేయ వచ్చు. అయితే ఆ రచనలో తన వ్యక్తిత్వాన్ని, కళాత్మకతను, నిండుదనాన్ని పొందు పరచడాన్నిబట్టి దానికి ఉత్తమత్వం సిద్ధిస్తుంది. దీపావళి లోని ఇట్టి ఖండికలన్నీ ఉత్తమత్వాన్ని సాధించు కొన్నవే.

వేదుల వంగ భాషావేత్త. కనుక వంగ భాషకే వన్నె తెచ్చిన రవీంద్రుడాయనకు కొట్టిన పిండి యగుట సామాన్యం. మీదు మిక్కిలి గీతాంజలి ప్రపంచ ప్రసిద్ధం. అందుచే అందలి భావాలు దీపావళి లోని భక్తిగీతాలలో చోటు చేసి కొన్నాయి.

---

1. "కవి సన్మానము"-ప్రతిభ, న.న.స. పుట ౨౨౩.

పరిభూ!

భగవంతుని కంకితంగా ఉద్దేశించింది గీతాంజలిలోని మొదటి గేయం. ఇందు పరమపితను మహాగాయకుని గాను, భక్తుడు తన జీవనాన్ని అతని చేతిలో మధుర వేణువుగాను భావించటం జరిగింది.

This little flute of a reed thou hast carried over hills and dales, and hast breathed through it melodies eternally new.

(ఈ చిన్న వేణువును ఊదుతూ కొండలూ కోనలూ తిరుగుతావు. నిత్య నూతనమైన మధుర గీతాలు ఆలపిస్తావు.) *

ఈ భావ పరిభావం స్పష్టా స్పష్టముగ భాసిస్తున్న పద్యమిది.

ఈ నవ వేణు దండ మిటు లేటికి జెక్కెదవేల చిల్లులై
పోనొగి లింతు వంచడలి పోయితి, వ్యర్థపు టూర్పుగాడ్పులన్
గానము గాగ మార్చుటకెగా యని యిప్పుడె నే గ్రహించితిం
గాని విశీర్ణ మీ హృదయ నాళ మెటుల్ పలికింతువో ప్రభూ!

మూలంలో ఉన్న అస్పష్టపు జీవిత ధ్వనికి వేణువు యొక్క వెనుకటి జీవితాన్ని రమ్యంగా వ్యక్తీకరించి విస్పష్టతను, పరిపూర్ణత్వాన్ని చేకూర్చారు.

ఈ వేణువుని తీసికొని జీవన గీతాల్ని ధ్వనింపు మంటున్నాడు.

ఈ వెడ యూర్పు తావుల జనించిన కమ్మదనమ్ము వ్యర్థమై
పోవక మున్నె, యీ సుషిరముం గొని, తీయని స్వప్న వాసనా
జీవన గీతముల్ విపిన సీమలనైన సరే ధ్వనింపు మీ
శ్రావణ కృష్ణ పక్ష తిమిరమ్ములు పుల్కలతో వినన్ ప్రభూ !

అడవి జీవితాన్ని, చీకటి బ్రతుకుల్ని బాగు చేయడం ద్వారా జీవితాన్ని ప్రయోజనవంతం చేయ మనడం ధ్వనిస్తుంది. ఆ అనడంలో వేదుల ఉక్తి మాధుర్యపుటియత్త ఉంది. మొత్తం మీద ఇట్టి రచనల

---

* అనువాదం - బెల్లంకొండ రామదాసు.

ద్వారా అస్పష్టతా లక్షణ దూషిత భావ కవితకు దూరమై విశిష్టులై నిలిచారు,

ఆశా గానము

ఈ ఖండిక పై గీ తాం జ లి లో ని 15, 16 సంఖ్యల గీతాల ప్రభావం రేఖా మాత్రంగా కనపడుతుంది.

It was my part at this feast to play upon my instrument... (ఈ ఉత్సవంలో నా వీణ వాయించి, పాట పాడమని నన్ను పిలిచారు.)

ఆశాగానంలో ప్రభువును మహాగాయకుని గాను, తన జీవనాన్ని అతని చేతిలోని వీణ గాను భావించుట కన్పడుతుంది.

ప్రకృతి సమస్తం నీ సుకుమార హస్తాల్లో నిద్దుర పోతుంది. అట్టి సమయంలో ఈ శిథిల వీణను పాడుమని నాపై ఏల త్రోసెదవని భక్తుడు ప్రభువుకిలా విన్నవించు కుంటున్నాడు.

ఏ సడి లేక ప్రకృతి యెల్ల నిశీథ తమో నిబద్ధమై
నీ సుకుమార హస్తముల నిద్దుర పోయెడు మౌనవేళ, నీ
వే సరి జేసి యీ శిథిల వీణను బాడు మటంచు నాపయిన్
ద్రోసెద వేల? తీగ తెగునో, శ్రుతి దప్పునొ, పల్కదో ప్రభూ!

ఏమైనా నేను మధురంగా వీణ వాయింపలేను. ప్రేమ రస పూరితమైన విశ్వ విలీన గానాన్ని నీవు వినిపిస్తే వింటూ నంటున్నాడు.

మావుల గుంపులందు మధు మాసములన్ వికసించు కోకిలా
రావము వోలె రాగ మధురమ్ముగ వీణ నదింప జాల, నన్
బోవగ నిమ్ము; ప్రేమ రస పూరిత విశ్వవిలీన గాన మీ
వే వినిపింతువేని సుఖియించెద నే నది యాలకించుచున్

ప్రభువునకు సన్నిహిత స్థానంలో చేరి కూడ "మధురమ్ముగ వీణ నదింప జాల" నంటున్నాడు. అంటే ఆ ప్రభువు నెంత గొప్పగా

భావిస్తున్నాడో అర్థమవుతుంది.

ఎలాగైనా పాడు మంటావా! నా విశుష్కిత గళాన్ని నీ కరుణా సుధా రసంబుతో నింపి మధురింపు మంటున్నాడు. అంటే నీవు కరుణామూర్తివి కనుక నన్ను కరుణార్ద్ర చిత్తుని చేయుమనే వేడుకోలు ఉంది.

ఏ విధినైన బాడుమనియే వచియింతువ యేని ప్రేమమై
నీవె రచించి నాకు గరుణించిన పీ ప్రణయార్ద్ర గీతికల్
గావున, నా విశుష్కిత గళమ్మున నీ కరుణా సుధారస
శ్రీ విభవమ్ము నింపి మధురింపుము నే శ్రుతి గల్పి పాడెదన్

మొత్తం మీద ఈ ఖండిక యందు ప్రేమ రసపూరిత విశ్వవిలీన గానం విన్పింపు మనడంలో విశ్వకవి రవీంద్రుని విశ్వైక భావన అనగా వసుధైక కుటుంబ ప్రేమామృతం స్రవిస్తుంది.

## నీ కోసమే

భక్తుడు వేణువుగా, వీణగానే కాకుండగా పుష్పంగా కూడ భావించుకుని, తన సర్వం భగవదధీన మనిన 'దీపావళి' లోని 'నీ కోసమే' అను గేయమిది.

కోసుకొనుమా యీ కోమల కుసుమము
కోరి విరిసె నీ కోసమె స్వామీ!
తేనెల సోనలు తీరక మునుపే
తీయని వలపులు మాయక మునుపే ॥కోసుకొనుమ॥

విడిన రేకుగమి వడలి పోవునో
తొడిమ వీడి పెనుధూళిని రాలునో
చెడునో వికసించిన మధు శోభలు దీ. పు. 106
ఒడల పులకరింపాదవగ నిపుడే ॥కోసుకొనుమ॥

భగవంతుని చేరుకోవడానికి భక్తుడు పడే ఆవేదన ఇందు వ్యక్త

మవుతుంది. ఈ గేయానికి ప్రేరకమై సన్నిహిత సంబంధమున్న గీతాంజలి లోని గీతమిది.

Pluck this little flower and take it, delay not! I fear lest it droop and drop into the dust.

It may not find a place in thy garland, but honour it with a touch of pain from thy hand and pluck it.

(జాగు చేయకుండా ఈ చిన్నారి పూవును కోసివేయి, ఇది రాలి ధూళిలో కలిసి పోవచ్చు.

ఈ చిన్ని పూవుకు నీ పుష్పమాలలో స్థానం అలంకరించే అర్హత లేకపోవచ్చు.

కాని కనీసం నీ చేతితో గిల్లివేసి అయినా దీనిని గౌరవించు).

ప్రారంభంలో మూలానికి చేరువగా నుండి రాను రాను స్వతంత్ర భావనల వాసనలతో గేయ కుసుమం వికసించి విరాజిల్లు తుంది. కనుకనే స్ఫూర్తిశ్రీగారు

"వేదుల వారి ఖండికలలో కొన్ని రవీంద్రుని రచనలకు ముద్దయిన యనువాదాలు"[1] అన్నారు.

## పూవు

ఈ శీర్షికలో పై భావం ఇంకనూ విశిష్టంగా పునరుక్తమైంది.

ఓ స్వామీ! నీవు నిమేష యుగ ప్రతీక్షతో వేచియున్నా కానరావు. కనుక నీ యనురాగం తెలియని నా హృదయం సంశయ చ్ఛాయల నూగుతుంది. అని చివరకిట్లు వక్కాణించింది.

కేవల మాశ లార్చి యడకించెద వీ కుసుమమ్ము మ్లానమై
పోవునొ, ధూళిరాలి పడిపోవునొ యేమొ, దళీవసంత శో

1. "తెలుగులో వంగ సాహిత్యము"-స్ఫూర్తిశ్రీ వ్యాసావళి. ప్రుట 89

భావిభవమ్ము మాపువడ బ్రాయపు దీయని వాసనల్ నిరా
శా విషమానిలాహతి విషాద పథాల నడంగి పోవగన్.

ఇదీ సర్వాత్మ సమర్పణ భక్తి భావానికి సంబంధించినదే.

## ముక్తావళి

ముక్తావళి యనగా ముత్యాలహారం. ముత్యాల వంటి ఇందలి పద్యాలలో వేదుల కరుణార్ద్ర హృదయం, పలుకు మాధుర్యం పెన వేసికున్నాయి. వీటికి తోడు కవి వ్యక్తిగత జీవనం ముడిపడింది.

నాటి స్వామి ఆజ్ఞ నేడు గుర్తుకు వచ్చి భక్తునికి భయం వేసింది. దానికి కారణం ఇది.

పూవుల రోజులున్ గడచిపోయె, విషాద హిమావృతాంధకా
రావిలమయ్యె నీ ప్రకృతియంతయు, ఆకుల పాటు నొంది పూ
దీవలు నాదులే యెడద తీరున మోడయిపోయె, నాటి యా
జ్ఞావిధి స్వామి! నాకిపుడు జ్ఞప్తికి వచ్చి భయమ్ము గొల్పెడిన్

'నాదు లే యెడద తీరున మోడయి పోయె'. ఈ మాట మనల్ని విచలిత హృదయుల్ని చేస్తుంది. ఎందుచేతంటే ఆయన జీవనం ఇందులో ముడిపడి ఉంది కనుక. ఇంతకూ ఆజ్ఞ ఏమిటో చెప్ప లేదు. ఆ ఆజ్ఞ ఇది. మధుమాసం గతించక పూర్వమే కోమల పుష్పాలతో కూర్చిన ప్రేమదామాన్ని మెడలో వేయుమనుట. ఇప్పుడు పుష్ప మొకటీ లేదు. ఏం చేస్తాడిక? కనుక ఏదారీ లేక భక్తుడిలా అంటున్నాడు.

నా వలె శుష్క జీవనమునన్ దురపిల్లెడి యీ పవిత్ర గో
దావరి పేదవడ్డ నినదమ్ములతో శ్రుతి గల్పి ప్రేమ రా
గావహ దుఃఖ గీతులిపుడల్లుచు గ్రుచ్చుచు నుంటి నొక్క ము
క్తావళి నా పవిత్ర నయనాంబు కణోజ్జ్వల మౌక్తికమ్ములన్

ఇచట జీవన మనగా కవి పరంగా బ్రతుకనీ, గోదావరి పరంగా

నీరనీ గ్రహించాలి. శుష్క జీవన మనడం లోనే కవి చాతుర్యం వ్యక్త మవుతుంది.

శుష్క జీవన మంటే మొత్తానికి ఎండి పోవడం కాదు. నీరు తగ్గిన గోదావరి అని అర్థం. అప్పుడు కెరటాల హోరు తగ్గుతుంది. అందుచే పేదవడ్డ నినదాలన్నాడు కవి. పవిత్ర నయనాంబు కణోజ్జ్వల మౌక్తికమ్ములచే ముక్తావళి గ్రుచ్చాడు భక్తుడు.

గీతాంజలి లోని 23వ గీతమున గల

Mother, I shall weave a chain of pearls for thy neck with my tears of sorrow.

(అమ్మా! నా విషాదాశ్రువులతో, నీ కోసం ఒక ముత్యాలమాల గుచ్చుతాను.) అనుదాన్ని మనసులో ఉంచుకు నే ఇంతటి చక్కటి సమాసాన్ని కూర్చినట్లు తెలుస్తుంది. ఈ సమాసం రవీంద్రుని ప్రభావాన్ని కప్పిపుచ్చి వేదుల ప్రతిభను వ్యక్తం చేస్తుంది.

"వేదుల సత్యనారాయణశాస్త్రి కవిత కొంతవరకు నిరాశతో నిండి ఉంటుంది. కాని, రవీంద్ర స్పర్శ తగిలే సరికి తప్త కాంచనంలా మెరసి పోతుంది."[1] అని అచంట జానకీ రామ్ గారనడం ఇట్టివాటి నుద్దేశించే. భక్తుడు తాను గ్రుచ్చిన ముక్తావళికి వసంత మాస సంధ్యా పరిమళ స్పర్శ లేదు. కనుక దాన్ని ననుగ్రహించ మన్నాడు.

గీతాంజలి పరమాత్ముని 'అమ్మా' అని సంబోధింపగా ముక్తావళిలో 'స్వామి' అని పిలుచుటచే భక్తి, మధుర భక్తిగా పరిణమించింది. మొత్తం మీద గీతాంజలిలోని 22, 23 గీతాల భావాల్ని జీర్ణించుకుని 'ముక్తావళి' రూప కల్పన చేశారు.

ఇట్లు గీతాంజలిలోని భక్తుని 'ఆర్తి' 'దీపావళి' ఖండికల్లో ప్రధానాంశ మనుట సారాంశము.

---

1. సాగుతున్న యాత్ర-2-పుట 224

## దీపావళి - భక్తి

భావకవులందరి లాగే వేదుల తనకు తాను ప్రియురాలుగా, ప్రియునిగా, గోపికగా, రాధగా భావన చేసికొని భగవంతునిపై భక్తిని వ్యక్తీకరించారు. మీదుమిక్కిలి ఈ సందర్భాలలో వాసక సజ్జికయై నిరీక్షించారు; అభిసారికా భూమికను ధరించారు. కోమల కుసుమంగా, కలువగా రూపముల నెత్తారు. మురళీగాన ప్రశస్తి గావించారు. వింత భావాలతో పొంగిపోతున్న హృదయానందానికి హేతువు భగవంతుని చేయి తనను స్పృశించుటేయని తన్మయత చెందారు. తమ హృదయాన్ని భగవంతుని గృహంగా భావించారు. ఆయన ముందు తమ ప్రణయానుభూతుల నేకరువు పెట్టారు.

భగవంతుని కోసం నిరీక్షింపలేక ఆయన మెడలోని పూల దండనయి శాశ్వతంగా ఉండాలని ఆకాంక్షించారు. ప్రాణనాయకుడు కనపడని జీవితాన్ని చీకటుల కోనగా భావించారు. ఆయన యెడ తానేమైన అపరాధ మొనర్చితి నేమోయని కుమిలి పోయారు. ప్రపన్నుడు కావలె నంటే నిష్కామత అవసరమను గీతా ప్రబోధ సారాంశాన్ని చిట్ట చివరకు విశ్వ ఘోషణ రహస్యంగా వినిపించారు.

## నిరీక్షణము

వేదుల తాను ప్రియురాలుగా భావించుకొని స్వామికై 'నిరీక్షణ' ద్వారా వలపును ప్రకటించి భంగ్యంతరంగా భక్తిని వ్యక్తీకరించారు.

ఇందు కవి అష్టవిధ శృంగార నాయికల్లో ఒకతెయైన వాసక సజ్జిక అయ్యారు. ప్రియుడిపుడు వస్తాడని పడకగదిని, తనని అలంకరించుకొనేది వాసక సజ్జిక. వేదుల వాసక సజ్జిక 'నిరీక్షణము'ను నవ్యాతినవ్యంగా రమ్యాతిరమ్యంగా తీర్చిదిద్దారు. కనుకనే నోరి నరసింహశాస్త్రి గారిలా అన్నారు.

"ఇందులోని (దీపావళి) 'నిరీక్షణము' అనే కావ్యములో ఆలంకారికులు 'వాసక సజ్జిక' అని పేర్కొనే నాయికను నూతన పద్ధతిలో రమ్యముగా వర్ణించినాడు."[1]

వాసక సజ్జిక అలంకరించుకొనే తీరిలా ఉంది.

కురులను దువ్వి, పూల్ముడిచి, గొజ్జగి పూవుల లేమెరుంగు టం
బరము ధరించి, గంధకలపమ్ముల మేన నలంది, కమ్మ క
స్తురి తిలకమ్ము నెన్నుదుట సొంపుగ దిద్ది, సువర్ణ భూషణో
త్కరములదాల్చి ద్వార సవిధమ్మున నిల్చితి వెచ్చనూర్చుచున్

పూల రన్న కోమలమైన ప్రియుని శరీరం నొచ్చునని తమ్మి పుప్పొడి తెచ్చి పాన్పుపై పరిచింది. ఏది అలికిడియైనా తన ప్రాణ నాథుడు వచ్చెనేమో యని భ్రమించి వీథియెల్ల పరికించే ఆమె స్వరూపమిది.

అలికిడి యేదియైన వినినంత గవాక్షము నుండి లేచి మే
న్పులకలుదేర, బాదములను న్దడబాటిగురొత్త, మారుతో
చ్చలిత కదంబ పల్లవము చాడ్పున నా యెద సంచలింప, న
ల్గెలకుల వీథియెల్ల బరికింతు జలింప నిశాంధకారముల్

ప్రియుని అనురాగ గీతికల్ని అతని పద సన్నిధినే కంఠమెత్తి తీయగ పాడాలని వాంఛించింది. ఆ వాంఛతో ప్రదోషవేళ మేళవించిన వీణ అర్ధయామినీ వాయు తరంగాలచే అపశ్రుతులు పలుకుతుంది. కలువల తేనె లానిన వలిగాడ్పు తన స్వామి జాడ చెవి నూదునేమో యని యూర్పు లెగబట్టింది. ప్రాణంలో ప్రాణమై పొల్చిన వానికే దయపుట్టని దుర్విధి నాడిపోసింది. ఆమె యెద జలించిన మోత్రలే ఆతని పద స్వనాలేమోయని యూపిరాపింది. ప్రియుని రాకను గూర్చి ఆశ నిరాశల మధ్య ఇటు లూగిన లాడింది.

---

1. సారస్వత వ్యాసములు-ఐదవ సంపుటం. పుట 139

రావను కొందుగాని యనురాగము ద్వారము మూయనీదు, దుః
ఖావహ మౌనుగాని భవదాదర పాత్రములంచు వేష భూ
షావళు లూడ్వ లే, నిటు నిరాశ యొకింత, యొకింత యాశగా
శ్రావణ లక్ష్మినై నిలువ జాలక యుంటిని వెల్గు నీడలన్

ఇటు శ్రావణ లక్ష్మినై అనడం ఆలోచించ వలసిన విషయం. శ్రావణ లక్ష్మి అంటే శ్రావణ మాసంలో వచ్చే 'వరలక్ష్మి వ్రత' సంబంధమైన లక్ష్మి. శ్రీకాకుళం ప్రాంతంలో ఒక సంప్రదాయ ముంది. వ్రతం రోజున వ్రతం ప్రారంభించే వరకు ఉదయాన్నే విగ్రహాన్ని గడప మీద ఉంచుతారు. ఆ శ్రావణ లక్ష్మి నిరీక్షణని మన మిక్కడ అనువర్తింప చేసి కోవలసి ఉంటుంది.

ఆమె హృదయం శంక గొనినట్టి వనీ మృగి గుండెలా ఉంది. ఈ భయద రాత్రి వివిక్త పథాన్ని జూచు కొంచు ముహూర్త కల్పాలెంతసేపు గడప గలనని తన స్వామిని గూర్చి పరితపించింది.

ఇట్లు వాసక సజ్జిక నద్భుత నవ్య ప్రేయసిగా తీర్చిదిద్దారు. కనుక నే 'నిరీక్షణము' ముచ్చటైన కళాఖండంగా రూపు దాల్చింది. అందుచేతనే ఇంద్రగంటి వారు

"నిరీక్షణములో వాసక సజ్జికా నాయిక మధుర దృశ్యమును బొమ్మ గీచి చూపినారు. ఇందుకు 'రావను కొందుగాని' 'అలికిడి యేమె యైన' వంటి పద్యాలు లక్ష్యములు"[1] అని యనినారు.

ఈ ఖండిక యందు భగవంతునికై జీవుడు పడు నారాటం వ్యంగ్యంగా వ్యక్తం చేయబడింది. కవియే వాసక సజ్జిక. వాసక సజ్జికయే భక్తుడు. ప్రియుడే స్వామి అనగా భగవంతుడు.

1. వేదుల వారి దీపావళి - భారతి, ఏప్రియల్ 1938

ఒక క్షణము

ఇట్లు ప్రణయ భావాలతో భగవంతునికై నిరీక్షిస్తున్న కవి హృదయం మహానంద పులకితమైంది. దానికి కారణం వెనుదిరిగి చూచుకొన్నారట

ఇంత యానంద మున కేది హేతు వనుచు
వెనుదిరిగి చూచుకొంటి-కెంబెదవు లందు
జిరు నగవు జీరుకాడ నీ చిగురు కేల
నా భుజమ్ము స్పృశించి యున్నావు నీవు దీ. 17

కర స్పర్శనమున పులకించి అవశమైన కవి హృదయం ఆతడాత్మనాథుడని గ్రహించింది.

ఎపుడు గుర్తించి నదో నీ యదృష్ట పూర్వ
భవ్య రూపమ్ము నీ కర స్పర్శ మాత్ర
నపుడె పులకించి పులకించి యవశమైన
నా యెద గ్రహించె నీ వాత్మనాథుడ వని దీ. 17

అలా గ్రహించడానికి కారణం వారి బహుజన్మ పరిచయం. అది కాలపు మడత లందు నశింపనిది. ప్రేమ సూత్రకలిత మగుట దాని విశిష్టత. అదియే కవిని భగవంతుని పాదాల్ని కౌగిలింప జేసింది. ఆ దృఢాశ్లేషమున ఇరువురొక్క హృదయు మొక్క ప్రాణమై 'ప్రేయసీ' యని 'ప్రాణ ప్రియా' యని బాష్ప భాషణాలతో పలుకరించు కొన్నారు.

నిష్కృతి

స్వామి భుజాబంధనంచే కరుణించినపుడు భక్తుడ్ని సిగ్గూ, భయం పొదివి కొన్నాయి. అందుచే అతని గుండె చెదరింది.

నీ భుజాబంధనము గరుణించి యెపుడు
నను గరంచితి, వపుడె సిగ్గును భయమ్ము

పొదివికొని యిట్టి నా గుండె చెదరగొట్టి
నీ పదాంతికమందు బంధించివైచె దీ పు 22

స్వామి పాదాలచెంత బంధింపబడిన భక్తుడు తన వలపు లన్నిటిని గోసి, దండలుగ గ్రుచ్చి, మెడలోవేసి మ్రోడై నిలిచాడు. అంతేకాదు; అన్య సుఖాల్ని విడిచి స్వామి కృపాదృష్టియే సర్వస్వ మంటూ జీవిత సుధాకలశాన్ని త్రాగడానికి చేతులార అందించాడు. ఆయన పదాబ్జ సన్నిధిని నిలిచే చనువు నొసంగినందులకు ఉప్పొంగి పోయాడు. కాని కఠిన విధి కంటబడిన ఆతడు బలియగు కురరిలా కొట్టుకున్నాడు. చివర కిలా బాధ పడ్డాడు.

దేనికై దుఃఖ జీవినైనానో నేను
అదియె నిష్కృతిగా గాయమయ్యె నెడద
మానునా యిది, కంట నీరైన రాదు
రాలి పడ దా పదాబ్జ పరాగలవము. దీ. పు. 24

## ఉత్కంఠ

భగవంతుడ్ని దర్శించాలనే ఉత్కంఠ కిది పరాకాష్ఠ. కవి తన హృదయాన్ని భగవంతుని గృహంగా భావించుకున్నాడు. అందుచే హృదయ కవాటాన్ని తెరచి స్వామి నిట్లాహ్వానించాడు.

అనుపమ ప్రణయాతిథేయమ్ము తోడ
పొంర దెరచితి హృదయ కవాట మిపుడె
మొయిలు నీడలు చీకట్లు ముసురుకొనిన
నీ గృహము నీవె కైసేయనేగు దెమ్ము. దీ. పు. 32

తేనె తావుల బరువోపలేని పూవు పొద్దు పొడుపు వరకు వేగి పోతుంది. అట్లే బ్రదుకెల్ల తీయని వలపునింపి నీకై వేచియుంటినని అనుపమ ప్రణయాతిథేయమ్ముతో స్వామిని ప్రార్థించాడు. ఎంతకును తన స్వామి రాకపోయేసరికి ఒంటరిగా నిట్లెంత సేపోర్తునని వ్యథ చెందాడు.

వలపు లొలికెడు పూవులు వాడిపోయె
కనక పీఠిక హారతి కునుకు చుండె
తమ్మిరేకుల సురటి పొంకమ్ము దొరగె
నొంటి నిక నెంత సేపిటు లోర్తుస్వామి. దీ. పు. 62

పూవులు వాడిపోయాయి. హారతి కునుకుతుంది. అయినా, స్వామి వచ్చే జాడ లేకపోయేసరికి తానేమైన దోష మొనర్చితినేమో యని భావించాడు. ఇటకు రావడాని కిష్టం లేకపోతే స్వామి పాదాల చెంతకు తానే వత్తునన్నాడు. నీవు రాకుండుటచే భయంకరమైన రాత్రివేళ "అనదనై పడియుంటి శూన్యాలయమున" అని విలపించాడు.

తన్ను తాను ప్రియురాలుగా భావించుకొని భగవంతుణ్ని నాథునిగా తలంచి సాగించిన రచన ఇది. రమ్యమైన భావుకతకు పట్టం కట్టవలసిన విశిష్ట ఖండిక ఉత్కంఠ. భక్తుని తపనని పరమ మనోజ్ఞంగా వ్యక్తమొనర్చిన ఈ ఖండిక తన శీర్షికను సార్థకంచేసుకుంది.

కలుష

వేదుల 1935లో 'ప్రేమ విజయము' 1937లో 'రాజ రత్నము' అనే సాంఘిక కథల్ని సినిమాలకి వ్రాశారు. వాటిలోని పాటలు దీపావళిలో చోటు చేసికున్నాయి. దీనికి

"దీపావళి' సంపుటము ఒకటే ఈయనది వచ్చినది. దానిలో ఖండ కావ్యములు మొత్తము మీద - సినిమా పాటలను కూడా చేర్చుకుని-సంబద్ధములు కాకపోయినా," అను శ్రీపాదవారి వాక్యాలే ప్రమాణాలు.

"సంబద్ధములు కాకపోయినా" అనే మాట కివటు తావులేదు. సంబద్ధములు చేయుట వేదుల ప్రత్యేకత. భావకవితా శాఖలైన భక్తికీ, వేదనకూ పట్టుగొమ్మలుగా పరిణమింప చేశారు.

తాను ప్రియురాలై ప్రాణ విభుడైన భగవంతుణ్ని ఎంత ప్రార్థించినా, అతడు రాకపోయేసరికి భక్తుడు కొంత నిరాశకు లోనై

నాడు. భక్తుని బ్రతుకు కటిక చీకటి పాలయింది. అట్టి స్థితిలో తననొక కలువగా భావించుకున్నాడు.

చీకటుల పాలేన ఈ కలువ బ్రతుకింక
సోకదా నీ సుధా శ్రీ కరమ్ముల చలువ ॥చీ॥
రేకు రేకుల విరిసి నాకె బరువగు నెడద
వాకలగు తేనియల వలపు గాలికి బోవ
చీకటుల పాలేన యీ కలువ బ్రతుకింక దీ. పు 42

అని భగవంతుడ్ని సుధా శ్రీకరమ్ముల చలువకై కలువయై పరితపించారు.

కొన మొదలు గనరాని మసక చీకటిరేయి
ముసరి మూగిన కారు మొయిలు కొనల దాటి
మెరుగు కన్నుల గురియు చిరునగవు వెన్నెలల
మరగు నాయెద జల్లబరుప రానే రావా! అని ప్రాణనాథుడ్ని

తన ఎదను జల్ల బరచడానికి రమ్మని ప్రార్థేయపడ్డారు. దీనికి మూలంలో ప్రియురాలు తాను కలువగా భావించుకొని చంద్రుని మిషతో ప్రియుడ్ని రమ్మని కోరడం కావచ్చు. కాని యుగ లక్షణాన్ని బట్టి విమర్శకులు దీన్ని భక్తుని కన్వయించారు.

"ఇందు భగవంతుని సన్నిధికై భక్తుని ఆవేదన మనకు ద్యోతక మౌతుంది."[1] అని ప్రభాతం గారన్నారు.

## పేద బ్రతుకు, చకోరిక *

కవి భగవంతుని సన్నిధికై వివిధ రూపాల నెత్తే ఆరాటం ఈ రెండింటి యందు కన్పిస్తుంది.

ప్రేమామృత సరసీ మరాళినై
నీ మురళీ నవనీత గీతినై

1. "భావకవితా మురళి-శ్రీ వేదుల దీపావళి"-భారతి, సె.1982. పు 60
* ఈ రెండూ కూడ 'ప్రేమ విజయం'లోని సినిమా పాటలు.

పేద బ్రతుకు నర్పించెడు భాగ్యము
లేదా యిక నీ పాద దాసికిని డి. పు. 103

ఇంకా పూవువలె, మెరుపువలె అర్పించుకొనే భాగ్యం లేదా అని విలపించింది. భగవంతుని "యెడద పూలదండనయి వేలుచు వలచుచు" శాశ్వతంగా ఉండిపోవాలని భావించింది.

తరువాత చకోరిక రూపంలో భగవంతునికై పడే తహతహ వ్యక్తం చేస్తున్న గేయం.

శీతామృత చంద్రాతపమున, నవ
జీవన పులకితయై విసువెరుగక
ప్రేమ గాన మొనరించుచు, చిర సుఖ
సీమ విహారము సేయ నాశపడు
ఈ చకోరికకు ఎన్నడొ పున్నమ
ఈ చెర విడి యెపుడెగిరి సుఖించునొ! డి. పు. 104

మురళి

సినిమా పాటనైనా (కలువ), తన మిగిలిన గ్రంథాలలోని ఏ గేయాన్నైనా (రాణాప్రతాపసింగు నాటకం - ఈనాటికి), సతీమణి నుద్దేశించిందైనా (ఆరాధన) కవితా పరీమళ యుక్తంగా భావ కవితా శాఖల సంబద్ధ పుష్పాలుగా తీర్చి దిద్దడం కనిపిస్తుంది.

'ఆరాధన'కు సంబంధించిందే ఈ గేయం కూడ. పెండ్లిచూపుల నాటి సంఘటన 'ఆరాధన' అయితే ఆనాటి 'వీణానాదం' మురళిగా మారింది. అనగా పెండ్లి చూపుల నాటి కృష్ణవేణమ్మ గారి వీణా వాదనాన్ని దృష్టిలో నుంచుకుని ఇది వ్రాయబడింది. గోపికల నలరింపజేసిన మురళీగానం భావకవుల్ని లోగొంది. వీరిలో పలువురు వేణుగాన ప్రశస్తి గావించారు. ఈ వరుసలో వేదులకి ఈ మిష దొరికింది. గాన మాధుర్యానికి పరవశించి మురళీధరుని ఈ విధంగా ప్రార్థించారు.

నీ గీతి విశ్వమంతా గొంతు విడి పాడు
నీ తోడ ప్రాణలీలా తాండవమ్మాడు
ఓ దివ్య గాయకా
ఓ ప్రాణ నాయకా
ఏది యింకొక్క మారూదరా నీ మురళి
నా లోనె నేడు బృందావనము విరిసినది
నా లోనె నేడె యమునా తటిని మొరసినది
ఏ వసంతానిలమొ
ఏ గాన కల కలమొ
ఈ నా యెడద నిండా నిండి పోయినది.

ఈ ప్రార్థనలో వేదుల తన నిజ జీవితాన్ని కూడ వ్యక్తీకరించడం వారి దృష్టిలో తమ శ్రీమతి వీణా గానం ఉందనడానికి నిదర్శనం.

ఆనంద లేశమైనా నోచుకోలేదు
రా, నా ప్రవాస పాషాణ జీవనము
భాగ్య సుమ వాసనలొ
పుణ్య ఫల మాధురులొ
నీ పాట తీపి నేడే పొంగుచున్న విర

మధురభక్తి కవిత్వంలో వేణుగాన ప్రశంస విశిష్ట స్థానం ఆక్రమించడం ఒకటి, పెండ్లి చూపుల నాటి వీణాగానం గుండెలో గూడు కట్టుకోవటం రెండు ఈ గేయం వ్రాయడానికి ప్రేరకాలు.

## సంధ్యాన్వేషణము

ఆత్మాశ్రయంగా సాగిన దీపావళిలో అచ్చటచ్చట కొంత వస్త్వాశ్రయంగా చోటు చేసుకుంది. అట్టి వానిలో నిదియొకటి.

కవి గోపికయై దివ్యగాయకుడైన గోప కిశోరమూర్తిని మధురమైన జిజ్ఞాసతో నన్వేషించుట ఇందలి విషయం.

పశ్చిమ దిక్కున కుంకుమ రంగవల్లి నికుంజ శోభ యంతరించింది. దిన శ్రీకాల కుంతల చ్ఛాయలో విరహ విషాదరేఖ చిందు వారింది. ద్విజ రాజ పాంథ్య మాగధుల కైవారమ్ములను గడసారి గీతి శాంతించింది. వాత్సక ధేనుకాన్యోన్య సమ్మేళ నాహ్వాన సంభ్రమమ్ము తలగింది. గోప సందోహమునకు ప్రేయసీ సల్లాప కాంక్ష కలిగింది. కాని శ్యామికా గోకులమున గోప కిశోరమూర్తి జాడ కనిపించలేదు.

అచ్ఛమైన వ్రజ వాతావరణం ప్రతిబింబిస్తున్న సూర్యాస్తమయ వర్ణన మిది.

పిమ్మట వేణుగాన విశిష్టత వ్యక్తం చేయబడింది. కాళిందీ నదీ తరంగాలు మురళీ గీతా తత్పరతతో నడిమాని మంత్రిత వ్యాళము లట్టు లున్నవట.

నీలి మొయిళ్ళ నీడల వినీలములైన కళిందజా సరి
త్కూల తరంగ మాలికలు గూడ, భవన్మురళీ మనోజ్ఞ గీ
తా లలితాను రాగ రస తత్పరతన్ నడిమాని మంత్రిత
వ్యాళము లట్టు లున్నయవి వైణవికాగ్రణి! యెందుబోతివో

అంతే కాదు; పసి కాపరియైన గోపాలుడు లేకపోవుటచే లేగ దూడలు పొదుగుల జేపు పాలుకూడ త్రాగుట లేదట.

పొదుగుల జేపుపాలు గొనబోవక, పచ్చిక ముట్ట రాక, యె
ల్ల దెసల శూన్యవీక్షణము లన్నిగుడించుచు నే విషాదమో
యొదవిన యట్లు టిచ్చవడి యున్నవి మోములువంచి లేతయా
గదుపులు క్రోవి నూదు పసికాపరి నీవెట నుంటివో గదా!

మురళీ మృదుగానరవమ్ము లేమిచే బృందావని శూన్యమైంది. బృందావనంలో గల చివురాకుల్లో, తీగల్లో, పూవుల్లో ఆక్రందం నందడించింది. కోయిలలు జాలిగా కూస్తున్నాయి.

ఈ విధంగా కృష్ణగాన విరహితమైన సకల చరాచర జీవరాశి విషాద భరితమైంది.

కోనుల వల్లికావృత నికుంజాల యందుగాని, శాద్వల శ్యామల భూములందుగాని, తమాల మహీజ వాటికారామము లందుకాని, నదీ తటోపల స్తోమము లందుగాని, శ్యామ సుందరుని యునికి లేక పోవడంతో గోపిక కొందల మొందింది. తరువాత ఆ మాధవుని వేణుగానం సదా వినుచుండు లతా పుష్పాదులలో ఒక దానిగా జనించినా బాగుండునని దుఃఖించింది.

తీవనొ పూవనో వసుమతీజమనో, యమునాపగోర్మినో
గోవునొ మబ్బునో, వెదురు కోవినొ, చుక్కనొయై జనించినం
దావక వేణుగానము సదా వినుచుండుగదా యటంచు చిం
తావివశాత్మయౌ చరణదాసికి గన్పడవేమి పాపమో!

ఇలా అనడంలో చరణదాసియైన గోపిక యొక్క కృష్ణాన్వేషణ భావ వ్యగ్రత సువ్యక్త మవుతుంది.

మొత్తం మీద ఆమె ప్రార్థనలోగల భావ పరంపర మనల్ని రసార్ద్ర చిత్తుల్ని చేస్తుంది.

ప్రభూ!

రసజ్ఞుల గుండెల్లో గూడు కట్టుకున్న వేదుల పద్యాల్లో నిది యొకటి.

ఈ విషమంపు గాడ్పుటలయింపుల గ్రుచ్చిన దండ ఛిన్నమై
పూవులు రేకులూడి పడిపోయె మిగిల్చితి ప్రేమ వాసనా
ప్లావిత తంతువిద్ధి: యురివైతువొ నామెడ నీ ప్రవాళ రే
ఖా వర హస్తమంద భయ కంకణమట్లు ధరింతువో ప్రభూ!

పూవుల రేకులూడి పడిపోగా మిగిలింది ప్రేమ వాసనా ప్లావిత తంతువు. దానితో నామెడ కురివేస్తావా! లేక అభయ కంకణంగా ధరిస్తావా! అని భగవంతుడ్ని ప్రార్థించాడు కవి. సర్వమూ నీ యధీన మనుట శరణాగత లక్షణం.

నే ననేక కష్టాలు పడ్డాను. సౌందర్యాదులు నాశనమై పోయాయి. మిగిలింది నీ మీద భక్తి ఒక్కటియే. భక్షించినా, రక్షించినా నీ యిష్టమని దీని అంతరార్థం.

సాధారణంగా ప్రతివ్యక్తీ కాల మనుకూలించినంత కాలం ప్రతీ విషయానికీ, తానే కారకుడ ననుకుంటాడు. జీవితంలో ఎదురు గొప్పలు తగులుతుంటే క్రమంగా మారి 'విధి' అనే వాడొకడున్నా డనుకుంటాడు. అట్టిదీ పద్యానికి సంబంధించిన సంఘటన, ఆచంట జానకీరామ్ గారి మాటల్లో

"ప్రేమ వాసనా ప్లావిత తంతువు: గుప్పుమని సువాసన వీయడం లేదూ!! అసలు పద్యంలో, 'ధరియింతువో ప్రభూ!' అని ఉన్నది. కాని, ఆ రచన నాలో కలిగించిన భావాలను బట్టి ఆ 'ప్రభూ' అనే మాటను 'సఖీ' అని మార్చి వ్రాసుకున్నాను, నేను. వేదులతో అన్నాను అలా మారుస్తున్నానని, అతను వెంటనే 'అదే సరేమో' నా ఊహ లోనూ 'సఖి'యే ఉన్నదేమో!!" అన్నాడు."

ఈ పద్యాన్ని విజిటింగ్ కార్డుపై వ్రాసికొని కారులో నిత్యం కనపడేటట్లు అద్దంపై అంటించుకున్నారట. కాలం గడిచింది. పరిస్థితి తలక్రిందులైంది. అప్పుడు వారే ఇలా అనుకున్నారట.

"ఆనాడు గర్వంతో, "ప్రభూ!" అని ఉండవలసిన చోట "సఖీ" అని దిద్ది వ్రాసాను, నిజానికి అసలు పాఠము, "ప్రభూ!" యే, సరి. ఇదే సరయైన పాఠము అనుకొన్నాను.''[1]

వేదుల రచన జీవన సత్యాని కద్దం పడుతుందనడాని కిదొక సాక్ష్యం.

---

1. సాగుతున్న యాత్ర - పుట 223.

## రాధ

చంద్రాతప చారు శారద యామినీ సమయం. రాధ మధురలో గోపాలకృష్ణుని వెదకి వెదకి బృందావనం చేరుకుంది. దూరాన్నుండి మురళీరవం విని, మేన్మరచి, యమునానదీ పులిన సీమల్లో వెర్రిగా తిరిగింది. చివరకు గోపాల కృష్ణుని చేరి మరొక మారు మురళి వాయింపుమని కోరింది.

రవి కరోద్దీప్త హిమ శీకరమ్ము వోలె
రమ్య పింఛము చిత్రవర్ణముల దొలుక
శిరము నూపుచు మోవిపై మురళినూని
యేది మరియొక మారు వాయింపుమోయి! దీ. పు. 26

గోపాలకృష్ణుని వేణుగానంలో సుమామృతంలోని మధురిమ, చంద్రాతపంలోని మార్దవం, సమీరంలోని పరిమళం కలవంది. ప్రేమ పిల్లనగ్రోవి నూది పరవశరాలిని చేసి ప్రేమ తనివార ముద్దు పెట్టు కోమంది.

ప్రకృతి పులకింప, యమునా స్రవంతి పొంగ
భావము చిగుర్ప, బిల్లనగ్రోవి నూది
పరవశంజేసి నన్ను, గోపాలకృష్ణ
ప్రేమ తనివార నొకముద్దు పెట్టుకొనుము దీ. పు. 27

ఇందు రాధా ముఖమున వేణుగాన ప్రశస్తి గావింపబడింది. జీవాత్మ పరమాత్మలో లీనమగుటకు పొందే పెనగులాట స్పష్టమవు తుంది.

## కన్నీటి పాటలు

వేదుల వ్రాసిన 'రాణా ప్రతాపసింగు' నాటకంలో గల పాటలు కాలాంతరమున చిన్న చిన్న మార్పు చేర్పులతో దీపావళిలో 'కన్నీటి పాటలు'గా రూపొందాయి. నాటకంలో ఈ పాటలు చాల వరకు 'భిల్లకన్య' అను పాత్రముఖంగా వెలువడ్డాయి. ఆమె రాణా

ప్రతాపసింగు అనుయాయుడైన తేజసింగును మనసు నందిడుకొని ఇవి పాడుకుంది. మరికొన్నింటిని తేజసింగు, అతనిని ప్రేమించిన పుష్పకుమారి గాన మొనర్చారు. నాటకంలోని పాటల్ని ఎవరు పాడినా, వీటిని మధురభక్తిపరంగా మలచుకొనుటలో కవి చాకచక్యం చరితార్థమైంది.

ప్రస్తుతం దీపావళిలో పాటలు కవి నాయికా ముఖమున పలికించినాడు. అనగా తాను నాయికా రూపంలో దైవాన్ని అన్వేషిస్తూ కన్నీరు నింపినాడు. ఆ నాయికను మనం గోపికగానో, రాధగానో భావించినా భావించవచ్చు.

ఇందు ప్రియురాలగు భక్తుడు నిద్రిస్తుండగా హృదయేశ్వరుడైన భగవంతుడు చిరునవ్వుతో చెంతకు చేరాడు. చేరిన హృదయేశ్వరుడనుకూల వాయువులా శరీరాన్ని తాకి జన్మ జన్మాల వాసనలు పోగొట్టినాడు. అంతేకాకుండగా ప్రియురాలిని మేలుకొలిపి మంజుల స్వరంతో మధురంగా పాటలు పాడి పరవశను జేసినాడు. తొలిచూపులోనే తీయని కలలా అదృశ్యమై పోయాడు. అంచేత ప్రియురాలు తన హృదయేశ్వరుని తనివితీరా చూడ లేకపోయింది. కనుక పరిపరి విధాల వాపోయింది. తొలి చూపులో తోచిన రూపునే తలచుకొంటూ ఆ కొద్దిసేపటిలో తాను పొందిన ప్రణయానుభూతుల్ని నెమరు వేసికోసాగింది.

కనులెత్తి కనినంత కరిగి పోయితిని
మాట లాడిన యంత మమతను గొంటి
పాట పాడిన యంత బరవశనైతి
దరిజేరి నంతనే దాసినైపోతి
కన్నుల జిరునవ్వు వెన్నెల గురియ
వలపు పిల్లన గ్రోవి వాయించు నతని
పాదాల సుమమాల పగిది వ్రాలితిని ద్. పు 90

తాను తెచ్చిన విరిదండని కట్టడానికి పడిన కష్టాల్ని ఆమె ఇలా చెప్పుకుంది.

అడవెల్ల దిరుగాడి యాయాన మనక
సగము విచ్చిన సన్న జాజి పూవులను
తీవ కొక్కొక్క పూవు తీరున గోసి
తన కంఠమున వేయు తలపున నేను
కట్టిన యీదండ కఠినుడై త్రెంచి
నామెడ కురివోసి నను మాయజేసి
యెటు వోయినాడె నా హృదయేశ్వరుండు  దీ. పు 91

భావకవులు తమ జీవితాన్ని కుసుమ రూపంగా భగవంతునికి సమర్పించుకోవడం గురించి ఇంతకు ముందనుకొన్నాం. వారు ఆ విధంగా భావించడం జన్మసాఫల్యానికి మార్గంగా, భక్తికి పరమావధిగా నెంచారు. ఇటు వేదుల తమను పేదపూవుగా భావించుకున్నారు.

తేటి రెక్కలసీడ, తెమ్మెర యూగ్పు
పసిప్రొద్దు నునుముద్దు, నిసికంటి నీరు
సోకక తాకక సోనలైపారు
కమ్మతేనెల తోడ గమ గమ వలచు
నీపేద పూవుపై  దీ. పు 92

దయలేక అడవిలో గిరవేసి, నా నాథుడు కనురెప్ప పాటులో కనబడకుండా పోయాడని నాయికా రూపంలో పరితపించారు వేదుల, తరువాత

తలిరు ప్రాయము నాటి తలపుల లోన
మరులు గొల్పెడి వాని మధుర రూపమ్ము
ప్రియంపు దీయని పాటల లోన
రాగమొల్కిన వాని రమణీయ గుణము
తలపోసి కొనుచు వంతల మోసి కొనుచు  దీ. పు 39

తన శుష్క జీవితాన్ని అతికష్టంపై ఇంతవరకు నిలిపానంది. ఇక హృదయనాథుని వియోగాన్ని సైపలేక ప్రేమసాగరయాత్ర సాగిస్తానని ఆమె తన దుఃఖ తీవ్రతను వెలిబుచ్చింది. ఇంతలో హృదయేశుని మురళి యెదసోకింది.

దూర దూరము నుండి తోయధి పిలుపు
చెవిసోకి పరువెత్తు సెలయేరు వోలె
వినువీథి తొలిమబ్బు కనుసైగ దోచి
దరిజేర బోవు బెగ్గురు కన్నెవోలె     దీ. పు 94

ఏగుదెంచింది. కాని ఆమెకు ప్రియుడు కనిపించలేదు.

పూల వెన్నెల కడలి పొంగిన వేళ
బూచిన విరజాజి పొదల క్రీనీడ
నిసినీలి తలకట్టు కొనలార్చు వేళ
సెలయేళ్ళ దరి చెట్లుచేమల నడుమ     దీ. పు. 94

బ్రిదుకెల్ల కన్నుగా ప్రియుని వెదుకాడుకుంది. చివరకు సిగ్గువిడిచి, తన విరహ జీవితాన్ని మొరపెట్టుకుంటానంది. ఈ మొరని ఆమె చాల గడుసుదనంగా వ్యక్తీకరించింది.

ఎలప్రాయపు టెడంద మొలిచిన తీవ
తునుమగా దరమౌనె దుర్విధికైన
... ... ... ...
కన్నెత్తి చూడ లేకున్న నే మాయె
పులకరించిన మేను తెలుపదే మనసు
మాటాడ కున్నంత మాత్రనేమాయె
చెప్పదే మర్మంబు చెక్కిలి చెమరు
ఎన్ని జన్మాలదో, యీ మన ప్రేమ
నేడుదాచిన దాగునే మనలోన
అపరాధ మెరుగని యనదను నేను
ప్రాణేశ మనకేటి పంతమ్ములోయి     దీ. పు. 95

ఈ ప్రేమ ఒక నాటిది కాదట. అనేక జన్మలదట. చివరికి లౌక్యాన్ని ఉపయోగించి. మన ఇరువురికీ పంతాలేటికంది. అయినా ప్రియుడు కనిపించలేదు. అందుచే ఇలా లాభం లేదని తనను అసలెందుకు రెచ్చగొట్టితివని ప్రియుని నొక్కి నొక్కి ప్రశ్నించింది.

నీకింత మనసు లేనే లేదయేని
రాగానలమ్మింత రగిలింపనేల
ఆశ గొల్పెడి తలంపసలె లేదేని
నాదరి నీవేణు వూదుట యేల
సాధించు బుద్ధియే జనియింపదేని
అగుపించి మటుమాయమై పోవనేల దీ. పు 96

అని గుచ్చి గుచ్చి అడిగింది. అంతటితో ఊరుకోక తన నిశ్చయాన్ని ఇలా నొక్కి చెప్పింది.

జాగేల భయమేల సంశయమేల
నా ప్రాణ పతివీవె నా నిధి వీవె
నా జీవనము వీవె నా యాశవీవె
నా పవిత్రాత్మైక నాథుడవీవె
మాయని కను చందమామవు నీవె
పారమ్ములేని గభీర మహాబ్ధి
దరిజేర్చుకొను కర్ణధారివి నీవె దీ. పు 96

ఆత్మైక నాథుడు కనిపింపకపోతే సమస్తలోకాన్ని చీకటి నరకంగా భావించింది. అయినా

"ఎదలోని మూర్తితో నెడబాటు లేదు దీ. పు 97
తీయని బంధమ్ము తెగి పోవదెపుడు" అని తన మనో నిర్ణయాన్ని ప్రకటించింది. ఆ నిశ్చయంతో చివరికీ అభిప్రాయానికి వచ్చింది.

ఈ నడుకానలో నేకాంతముగను

చెట్లు చేమలతోడ సెలయేళ్ళతోడ
పూల గుత్తులతోడ పులుగులతోడ
నాటు లాడుచు పాట లాలపించుచును
స్వేచ్ఛగా గాలినై విహరించు చుందు దీ. పు 98

అంతియే గాక

బ్రతుకె దుఃఖం బాశ పడుటె దుఃఖమ్ము
వలపె దుఃఖము ప్రాణపతియె దుఃఖమ్ము దీ. పు 98

అని వైరాగ్య భావాన్ని అలవర్చుకుంది. తానె దుఃఖమై దుఃఖిస్తున్న "లోకా స్సమస్తా స్సుఖినో భవంతు" అన్నట్లు మంగళ వాక్యంతో భరత వాక్యాన్నిలా పలికింది.

వెలుగులో వెలుగుచు వేడుక పడుచు
లోకంబె సౌఖ్యంబులో మున్గ గాక దీ. పు 98

భక్తుడు తాను ప్రియురాలిగా భావించుకుని దైవాన్వేషణ గావించడంలో, తాదాత్మ్య సిద్ధికై పరితపించడంలో, మధురమైన భావ చిత్రాల్ని ప్రదర్శించడంలో, మృదులమైన తెలుగు పలుకుబడి నుపయోగించడంలో వేంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంతసేవ'ని తలపింప జేస్తాయి వేదుల 'కన్నీటి పాటలు'

## రథయాత్ర

గీతాంజలిలోని 50, 51 గీతాలలో ప్రస్తావింపబడిన 'దివ్య రథ యాత్ర' కాంతి దీనిపై లీలా మాత్రంగా భాసిస్తుంది.

లోక శాంతికై భగవంతుని సువర్ణ రథం బయులుదేరింది. ఆ రథచక్ర నినాదం విని దీపమే లేని తన కుటీద్వారం చేరువలో అతనికి నిలువ వలసిన పనిలేదని ఆమె తలంచింది. ఇంతలో మురళీ నాదాలు వినిపించాయి. ఆ క్షణంలోనే రథమేతెంచి ద్వారం చెంత నిల్చింది. రథం దిగి అతడామె చెంతకు వచ్చి నిలబడ్డాడు. అతని కనుల చిరునవ్వు

చూచి క్రుంగి పోయింది. అతడామె ముఖవైఖరి చూడడానికి తల యెత్తాడు. ఆమె తన చూపుల్ని అతని పవిత్ర చరణాలకు ముడివేసింది. కాని ఆతని కడ జననాంతర ప్రేమ రహస్యాలు వెలువరించడం మరిచి పోయిందిట.

నీ మధు రాధరారుణిమ నిండిన నీయనురాగ హాసముల్
నా మలినాశ్రు పూర తతులంబడినప్పటి యింద్ర చాపరే
ఖామణి భూషలీ యెడద గప్పుటచే జననాంతరామృత
ప్రేమ రహస్యముల్ వెలువరించుకొనన్ మరపయ్యె నీ కడన్

రథం రయమ్మున సాగిపోయింది. అప్పుడామె బాధతో ఇట్లనుకుంది.

ఈ విరసంపు మౌగ్ధ్యమున కీవెటు లెంచెదవో యటంచు నెం
తో వెరజెంది దివ్యరథ ధూళి సుగంధిలమైన దుఃఖ పుం
ద్రోవనె వేడియూరుపుల దొంతరలంబొరలాడి చచ్చియుం
జావని యాశలం బ్రణయ సాగర పారముదాక జల్లితిన్

తాను పొందిన ముగ్ధత్వానికి అతడేమనుకొంటాడో యని ఆందోళన చెందింది.

ఇందు మానవునికి, భగవంతునికి ఉన్న సంబంధం, వారియాత్మల అన్యోన్యాకర్షణం, పరస్పరాన్వేషణం వ్యక్తమవుతున్నాయి. భగవంతుడు చేయు శాంతి యాత్ర భక్తునికి ప్రేమ నందించడానికే. జననాంతరామృత ప్రేమ రహస్యము అనుటలో ఆత్మ, పరమాత్మల సంబంధం ఈనాటిది కాదని వ్యక్తమౌతుంది. ఆమె తన యాశల్ని ప్రణయ సాగర పారము దాక జల్లిత ననడం జీవాత్మపడే తహ తహకు పరాకాష్ఠ.

దిగ్వదనముల్ పులకించుట, కోరికలే పరస్పరా హారము లౌట, చూపుల్ని పవిత్ర చరణాలకు ముడివైచుట, అతని అనురాగ హాసము లామె మలినాశ్రువులపైబడి ఇంద్ర చాపరేఖా మణిభూష లగుట, మొదలైన వన్నీ వేదుల కవితా కళకుమానదండంగా చెప్పుకోవచ్చు.

అంకితము

తన హృదయేశుడ్ని నమ్మింది. ఆశ పెట్టుకుంది. అయినా ఆయనకు ఆమె పడుచు ప్రాయంపై జాలి పుట్టలేదు. అందుచే విరహాగ్ని రగులు కొలిపి నా హృదయాన్ని ఏల దహిస్తున్నావంది. హృదయపుందీయదనాన్ని గ్రహించలేక పోతివని ఇలా అంది.

యౌవనపు దీయమెడలని తీవకపుడె
పాప హేమంత కార్శ్య మేభంగి వచ్చె
శ్రావణము వెళ్ళిపోని యీరాగ తటిని
యెండి పోవునె హృదయేశ! ఇంతలోనె

ఇందు తీవ, రాగతటిని ప్రియురాలే. అనగా కవియే. నిన్ను గూర్చి గీతికలు పాడటానికి గళము సారించుకున్న కోయిలకు శ్రావణ జలద పటలి సంభవించిందని ఆవేదన చెందింది. అంటే కోయిల మిషతో తన గురించే భగవంతునికి విన్నవించు కుంటుంది. ఆమె జీవిత కావ్యాన్ని ఆయన కేనాడో అంకితం చేసికొందట

నాదు జీవిత కావ్యమేనాడు నీకు
నంకితము జేసికొంటి నా యంత నేను
నాటి ప్రేమాక్షరములు కన్నీట గడిగి
చెరపి వేయ నాతర మౌనె జీవితేశ!

భావ కవులందరి లాగే వేదుల తన యౌవనాన్ని భగవంతునికి సమర్పించు కోవడంలోని తహ తహ ఇందలి సారాంశం.

అభిసారిక

తన్నలంకరించుకుని నాయకుని గూర్చి సంకేత స్థానానికి పోయే స్త్రీ అభిసారిక. రాధ అభిసారిక రూపం ధరించి కృష్ణునికై తపించుట ఇందలి విషయం.

రాధ రేయి రేయెల్ల కంటిపై రెప్పయిడక వేచియున్నా విభుడు

రాలేదు. వృథాభిసరణంతో మధువిభావరి గతించింది. అతడు కోరి బ్రతిమాలి నపుడు పంతగించింది. అందుచే అతడు వస్తాడనుకోవడం దురాశ అనుకుంది. అసలు యమునాతటాన్ని సంకేత మేల చేశావని చెలికత్తె నిట్లు ప్రశ్నించింది.

విభుని యతసీ ప్రసూన సన్నిభ తనూ వి
కాసము పదేపదే జ్ఞాపకమ్ము దెచ్చి
నా యెద దహించు నీ యమునాతటమ్ము
చెలియ! సంకేత మేల చేసితివి నీవె. దీ. పు 109

ఆమెలాగే ఉపచితాశ్రుమలీనకపోలయై రాత్రి వెళ్ళిపోతుంది. పాపం! శూన్య గృహాన్ని జేరడానికి అడుగు సాగడంలేదు. చివరకు వేకువకాంత నవ్వునని శకుంతాలు మేలుకోక పూర్వమే ఇల్లు చేరుకుంది.

తన ప్రియుడు వచ్చుజాడ గట్టినది యేమొ
కనులు విప్పెను పద్మినీకాంత యపుడె
అరుణ రాగావకుంఠనాంతరము నుండి
నన్నుగని వేకువ నెలంత నవ్వునదిగో! దీ. పు. 109

పద్మినీకాంత తన ప్రియుడైన సూర్యుడు వచ్చే జాడ పసిగట్టి కనులు విప్పిందనడం పద్మ వికాస దృశ్యాన్ని మానవీయారోపణ చేయడమే. ఎర్రని ముసుగులో నుండి వేకువ కాంత నవ్వడం గూడ ఇట్టిదే. భగవదన్వేషకుడైన కవి అభిసారికా ముఖంగా జీవాత్మ యొక్క వేగిరపాటుని చెప్పడం అభిప్రేతమైన విషయం.

## నేడు

చివరకు రాధకు తన ప్రాణ విభుడైన మాధవుని అనుగ్రహం ప్రాప్తించింది. అందుచే హరి పదాంభోజాల కాంతి మరంద లహరి ఆమె దరిద్ర కుటీరాంగణంలో చైత్ర ప్రభాత పరిమళాల్ని గుమ్మరించింది. దీనితో

"ఆహ్నాయ సా నియమజం క్లమ ముత్ససర్జ
క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే"[1] అని కాళిదాసు అన్నట్లు
"కారు మబ్బుల చిమ్మ చీకటుల త్రోవ
దిరుగు లాడిన వేసట దీరిపోయె" ను. దీ. పు 111

ఆమె డెందంలో "పూల చిరునవ్వులో పొంగిపోవు పొలుపు
గాలి యూర్పుల చిరు తరంగాల వలపు
చివురు జొంపాల వెచ్చని కవుగిలింత
పులుగు గొంతుక తీయని పులకరింత" నిండి పోయింది.

ఆమెకు "తప్పిపోయిన స్వప్న సౌందర్య పథము
పారవైచిన చిరతర ప్రణయ మురళి" దీ. పు 112
వెదకి కొని వచ్చినట్లయింది.

అందుచే ఆమె "సంభ్ర మాశ్చర్యకర సుఖ స్వప్న శాంతి
సంతతానందమయ నూత్న సత్యకాంతి
పాడుకొందును తాండవ మాడుకొందు" ననినది.

కనుక నేడామె కుటీర మానంద నందనము

నిజానికిది ఆయన జీవితానికీ వర్తిస్తుంది. ఆయన జీవితంలోనికి కృష్ణవేణమ్మగారు ప్రవేశించడం దరిద్ర కుటీరాంగణమున చైత్ర ప్రభాత పరీమళాలు గుబాళించడమే. ఆమె రాకచే ఆయినకు చిమ్మ చీకటుల త్రోవలో తిరుగు లాడిన అలసట తీరిపోయింది. పొలుపైన వలపు, వెచ్చని కవుగిలింత, తీయని పులకరింత ఆయన హృదయానికి చేకూరాయి. అందుచే ఆయన కుటీర మంటే జీవనం ఆనంద నందనవనం అయింది.

---

1. కుమార సంభవము-పంచమ సర్గ-శ్లోకం. 86

## పూజా ప్రసూనములు

కర్మను 'ముక్తసంగస్సమాచర'[1] అను గీతా వాక్యసారాన్ని ప్రబోధిస్తున్న ఖండిక ఇది.

భగవంతుని కోరికపై రాలని పూలు తేవడానికి యుషః కాలంలో బయలుదేరాడు భక్తుడు.

రాలని పూలు కోసికొని రమ్మని పంపితివీవె యీ యుషః
కాలమునందు పెద్ద యొడ్డిగట్టి ననున్, పవమానవీచికా
జాలములందు నే వలపు జాడలు గట్టుచు వచ్చులోన నీ
పూల వనమ్ము గుమ్మమును మూసిరి పిల్చిన బల్కరెవ్వరున్

పూలవనం గుమ్మమునూసి ఉండడంతో పిల్చినా ఎవరూ పల్కలేదు సరికదా! ఆ దారిని పోయేవాళ్ళు లోలోపల నవ్వుకుంటున్నారు. పాపం! అతన్ని చూచి అలా నవ్వుతున్నా, వేగు చీకటిలో పూవుల తావు లానుతూ ఎలాగో నిలబడ్డాడు. ఇంతలో ప్రభాత శీతల సమీరం మెయిసోకి అతని విషణ్ణ హృదయాన అపూర్వ విముగ్ధ భావాలు పుట్టు కొచ్చాయి. ఆ సమయంలో దూరం నుండి పిలుపులా భగవంతుని నిరంతర వ్యాసిత విశ్వఘోషణ రహస్యం వినిపించింది.

కాలము వెళ్ళబుచ్చి విధికాళులపై దలమోపుకంటె నే
నేల స్వతంత్ర ధర్మము వహింపగ రాదని తోటపెన్గడిన్
గేల స్పృశింప, వింటినొక కేకను 'మాలికగ్రుచ్చనెంచు ప్రే
మాలను లీ వనిం జొర ననర్హులు వారల కందవీ పువుల్

"మాలిక గుచ్చనెంచు ప్రేమాలను లీవనిం జొర ననర్హులు వారల కందవీ పువుల్" అనేది దూరం నుండి పిల్పుగ చెవి సోకిన నిరంతర వ్యాసిత విశ్వఘోషణ రహస్యం.

---

1. భగవద్గీత-అధ్యాయము-3. శ్లోకం. 9.

ప్రపన్నుడైనవాడు చేయవలసింది నిష్కామ కర్మ, అంటే మాలిక గుర్తిచ్చనెంచుట స్వార్థంతో కూడుకుంది. కనుక అట్టి ప్రేమాలనులైన స్వార్థకర్ములకు ఈషువు లందవని వినపడింది.

ఒకే కర్మ స్వార్థానికి చేస్తే బంధము. పరహితంగా చేస్తే "శ్రేయః పరమవాప్స్యథ."[1] అను గీతా వాక్యానుసారం జీవునకు పరమ శ్రేయం కలుగుతుంది. అనగా కర్మ కర్మగానుండక ధ్యానంగా మారుతుంది. మోక్ష పరంగా పరిణతి చెందుతుంది.

ఇట్లు వేదుల గీతాంజలిని జీర్ణించుకుని, 'ప్రభువు' నుద్దేశించి 'ఆశాగానం' గావించి, 'ముక్తావళి'ని సమర్పించి మధురభక్తి మార్గంలో వాసక సజ్జికా నాయికయై, 'అభిసారిక'యై, 'కన్నీటి పాటలు' పాడుకుంటూ చివరకు నిష్కాను భక్తులైనారు.

# 5 వేదన

## భావకవులు–వేదన

భావకవితా ప్రపంచంలో పరిగణింప వలసిన విషయాల్లో విషాద మొకటి. భావకవులు తమ ఉదాత్తాశయ విరుద్ధాలైన అనేక సంఘటనలకు వేదనాభరిత హృదయు లయ్యారు. ఆ ఆవేదనను కళాత్మకంగా శోకగీతా లాలపించుట ద్వారా చల్లార్చుకున్నారు. కనుకనే వీరి రచనల యందు సర్వేసర్వత్ర విషాదమే పరచుకుని ఉంది. ఈ రచనల వెనుక కీట్స్, షెల్లీల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. అంతేకాక, ఆంగ్ల విద్యాభ్యాసం కారణంగా అలవడ్డ ప్రపంచ జ్ఞానంతో పెరిగిన తులనాత్మక దృక్పథం ఒక ఎత్తుకాగా, ఆ కోణంలో కనిపించిన మనదేశపు దీనదశ, చేతకానితనం, సమాజంలోని ఎగుడు దిగుళ్ళు, వెర్రిమొర్రి కట్టుబాట్లు పేరిట జరిగే సాంఘిక కాలుష్యం, అనుకరణ

1. భగవద్గీత-అధ్యాయము-3, శ్లోకం 11

దాస్యం వీటికితోడు ఇనుప గుప్పిటి పరిపాలన మరియొక ఎత్తుగా భావ కవుల విషాద గీతికలకు నేపథ్య భూమిక అయింది. ఈ విషాదం వారి స్వాత్మకమైన వేదన మాత్రమే కాక సామాజిక ప్రతిబింబంగా కూడ కవి ధర్మాన్ని నిర్వర్తించుటు ద్యోతక మవుతుంది.

## వేదుల - వేదన

అయితే వేదుల విషయంలో వారి జీవన పరిస్థితులు కూడ వీటికితోడై అగ్నికి ఆజ్యం పోసినట్లు దుఃఖాగ్నిని రగుల్కొల్పాయి. వారి ప్రవాస జీవనవేదన దీపావళిలో గల విషాద గీతాలలో చోటు చేసుకుంది. కనుకనే

"జీవిత కల్లోలము నుండి యుబికినదగుటచే వారి కవిత్వము నకు నిండు జీవమున్నది". అని కందుకూరి వారు[1]

"శ్రీ వేదుల కన్నీటిలో నిజమైనవేదన ఉన్నది."[2] అని నోరివారు

"ఏ ఆశాభంగమో, అవ్యక్తవేదనయో, చెప్పలేని అశాంతియో యీాయన హృదయాన్ని రగిల్చియిన్ని కావ్యములను వెలిగించినట్లు ఇందులోని ప్రతిపలుకు చురుకుగా సోకినప్పుడు స్ఫురిస్తుంది."[3]

అని ఇంద్రగంటి వారు వక్కాణించారు.

ఈ పైవారి మాటల్ని బట్టి వేదుల విషాద గీతాల వెనుక అయన ప్రవాస పాషాణ జీవనం గాఢంగా ఉన్నదనే విషయం తేటతెల్ల మవుతుంది. కవిగారి జీవిత ప్రస్థానం లోని 'నిరాశా నిస్పృహాలు'* చదివితే ఆ పాషాణ జీవనం గురించి తెలుస్తుంది. ఈ సందర్భంలోనే ఆచంటవారి వాక్యాలు కూడ వినాలి.

"ఒకప్పుడు ఆయన ఎన్నో బాధలు అనుభవించినట్లు ఉంటారు.

---

1. దీపావళి_మనవి పుట VIII * పుట 25
2. సారస్వత వ్యాసములు-3 పుట 204
3. వేదుల వారి దీపావళి-భారతి-ఏ. 1938

కారణం తెలియదు కాని, ఎందువల్లనో, ఆయనను అందరూ నిరసిస్తున్నారు అనే భావం ఏర్పడిపోయింది. ఆయనలో ఆ పూర్వపు రోజులలో."[1]

ఇట్లు ఆనాటి పరిస్థితులు, పాషాణ ప్రవాసం, కాలేకడుపు, తోటి వారి నిరాదరణ మొదలైనవి నేపథ్యంగా వారి విషాద గీతాలు వెలువడ్డాయి. అంచేతనే వేదుల గీతాలలోని వేదన కృత్రిమమైంది కాదని విమర్శకులు ముక్త కంఠంతో ఘోషించారు.

### ఆవృత్తి

వేదుల గోదావరి కెగువన గల గంగలో గొల్లపల్లి వంటి గొల్ల గూడెం నివాసి. గోదావరి తీర రాజమహేంద్రవర ప్రవాసి. కనుక ఆయన అచ్చపు గోదావరి మనిషి. ఆ సాహచర్యం ఫలితంగా వీలు దొరికితే చాలు తన కవితలో గోదావరిని స్మరించి పులకరించి పోవడం ఆయన జీవలక్షణంగా భాసించింది. ఈ జీవలక్షణమే వీరిని భవభూతికి సోదరుని చేసింది. తనలో ఈ లక్షణాన్ని గుర్తించి 'గౌతమీ కోకిల' యని పేరు పెట్టిన రామశేషయ్య చౌదరిని 'మేటి శిల్పి' యని ప్రశంసించారు కవిగారు. ఒక్కొక్క వేళ స్వీయ కవితా వాహినికి గోదావరితో ఐక్యం కల్పించి తనను తానోదార్చు కున్నారు.

ఆయన మనోగత విషాదాన్ని గౌతమీ నది తనలో దాచుకుంది.

ఆ ప్రశాంత నిశా జఠరాంత మందు
కలత నిద్దురలో కలల్ గాంచుచున్న
గౌతమీ నది నామనోగత విషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె    దీ. పు 37

చెడ్డైన, మంచైన మహాసృష్టిలో జరుగు విషయాల్ని ఆకాశంలో

1. సాగుతున్న యాత్ర - పుట 146

నుండి తటస్థంగా చూస్తున్న తారలు వారి అశ్రుకణాల్ని ఏరుకున్నాయి. వేదుల తాను గౌతమీ గర్భంలో మ్రోత పెడ్తున్న యుగ యుగాల విశ్వమహోగ్ర దుఃఖ జీవ గీతాల కావృత్తి చెప్పుకోవడం కోసం మిగిలారట.

నేనె మిగిలితి నీ గౌతమీ నదీ ప
విత్ర గర్భమ్ములో మ్రోత వెట్టుచున్న
యుగ యుగాంతర విశ్వమహోగ్ర దుఃఖ
జీవ గీతాల కావృత్తి చెప్పు కొనగ దీ. పు 38

ఇలా గోదావరికి తన విషాదానికి ముడిపెట్టుకుని ఊరట పొందారు.

## అశాంతి

కవిగారి జీవితానికి సంపూర్ణ దర్శన మీ 'అశాంతి'. ఆయన అనుభవించిన కష్టాలు, ఎదుర్కొన్న నిష్ఠూరాలు, ఎదురైన విషమ ఘట్టాలు మొదలైనవన్నీ దీని వెనుక బలంగా కనిపిస్తున్నాయి.

కనికరము లేని దుఃఖ వేదనల సెగల
... ... ... ...
మోసికొని, నేనె నాలోన మూల్గు కొనుచు
... ... ... ...
ఎడతెరపి లేక తిరుగాడి బడలినాను. దీ. పు 39

సుఖ స్వప్న దరిద్రులైన వేదుల హృదయానికి ముళ్ళులోతుగా గుచ్చుకున్నాయి. అందుకే ఇలా అంటున్నారు.

దారుణపు జీవితంపు టెడారి లోన
తీరని పిపాస నేదారి తెన్ను లేక
నేనె నా దుఃఖ బాష్పశోణిత లహరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను దీ. పు 39

ఇటు 'నేనె' యనుటలో ఓదార్చేవారు కూడ లేకపోవడంవల్ల తన దుఃఖాన్ని తానే దిగమ్రింగుకున్నాడనేది సువ్యక్త మవుతుంది.

ఇది వారి దుఃఖ భూయిష్ఠమైన ఏకాకి జీవితానికి దర్పణం.

కడుపు గాల్చెడు మండు టాకటను రేగి
కోర్కె లొండొంటిని గ్రసించు కొనెడు కొలది
నొడ లెరుంగక కాల మృత్యువును నేనె
కొంచెముగ గొంచెముగ గబళించినాను దీ. పు 39

ఎంతకాల మెన్ని సారులు పస్తులున్నారో పాపం! ఒడ లెరుంగక కాలం గడిపా ననడానికి కవి వాడిన వాడిపలుకు కాల మృత్యువును గబళించుట. శోక సముద్రమైన గుండె నిగురబెట్టి పిండగా వెలువడిన మాటలు. ఈ మాటల వెన్కగల ఘాటును పసిగట్టిన ఆచంట వారిలా అన్నారు.

"ఎంత భయంకరంగా ఉన్నది ఈ 'అశాంతి' ఈ ఆవేదన, ఈ శోకము! ఈ మాటలు ఋషి శాపంలా ఉన్నాయికాని, కవి వాక్యంలా లేవు."[1]

ఇంతగా గడిపిన కవి యెదలోని బరువు తీరడానికి "కనికరపు జూపు చిరునవ్వు తునకయైన గటికి కరవయ్యె బాడు లోకాన" నని బాహ్య ప్రపంచాన్ని గర్హించారు.

చివరకు "కారు మబ్బులె కాదు, చీకటులె గాదు
క్రమ్ము కొననిమ్ము, కరడులు గట్టనిమ్ము" అనుచు తమ నిశ్చయాన్ని ఇలా వక్కాణించారు.

వలపు తీపి యెరుంగని వట్టి రాతి
గుండె లోకమ్ము నిప్పులు గురియ నిమ్ము
హృదయ మున్నంత వరకు నా ప్రేమ కాంక్ష
బ్రతికి యున్నంత వరకేడ్చి బ్రతుకు చుందు. దీ. పు 40

1. సాగుతున్న యాత్ర - పుట 147

ఏ వెలుగు నన్ను తన దరి కీడ్చుకొనునొ
ఏ తలపు దారి సూపునో దీ పు 40

శాస్త్రిగారు ఆశాజీవులనడానికి ఈ పైవాక్యాలే ప్రమాణాలు. నిరాశకు లోనైనప్పటికీ, ఏదో ఒకమూల ఆశ స్ఫురించకపోతే ఆ జీవికంతటితో సరి. కనుకనే కవిగారు కేవలం నిరాశను మాత్రమే చిత్రించి ఊరుకోక ఆశాపథం వైపు కూడ దృష్టిసారించారు.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీపాదవారు వాక్రుచ్చిన వాక్యాలు కవిగారి హృదయాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నాయి.

"నిరాశ వెనకనే ఉన్న ఆశ కూడా కనబడితేనే ఖండకావ్యం పూర్తి అవుతుంది. లేకపోయిన రచన కావ్యఖండమే. సత్యనారాయణ శాస్త్రిగారి ఖండ కావ్యాలన్నీ ఈ విషయంలో సంపూర్ణాలు.

వలపు తీపి యెరుంగని వట్టి రాతి
గుండె లోకము నిప్పులు కురుస్తున్నా హృదయ మున్నంత వరకు, ప్రేమకాంక్ష బ్రతికి యున్నంతవరకు ఏ వెలుగుదారి చూపునో అనే ఆశతో ఏడ్చి బ్రతక మంటూరాయన."[1]

ఏదో వెలుగు, తలపు ఉంటే చాలు మోడైనప్పటికీ చిగురించి తీరుతుంది. ఆ ఆశాభావమే ముందుకు నడిపిస్తుంది. దాని నుపదేశించడమే ఈ ఖండిక విశిష్టత.

కనుక దేశిరాజు కృష్ణశర్మగారిలా అన్నారు.

"ఈ వెలుగూ తలపూ ఈ కావ్యరూపం పొందిన లావణ్యంగా అందలి గుణంగా, కాంతా సమ్మితోపదేశముగా వున్నవి.[2]

---

1. కవి-సన్మానము ప్రతిభ, న.న.స. పుట 351
2. వేదుల వారి దీపావళి-సుభాషిణి, ఏప్రియల్ 1951.

ఏమగునో

ఈ గీతం "ఏమగునో యిక నా బ్రతుకు
ఎటు చూచిన దరియే కనరాదు'' అని నిరాశావహంగా ప్రారంభింపబడినప్పటికీ ముగింపులో మాత్రం దారి చూపు తార కోసం ప్రతీక్షించే ఆశను ప్రకటిస్తుంది.

''సాంద్ర జలదముల ఝంఝానిలముల
సాగు చున్నదీ సాగర యానము
దారి చూపు నా తారయె మెరయదొ" దీ. పు 41

ఈ ఆశయే మానవుని సుఖ జీవన తీరంకోసం నిరీక్షించేటట్లు చేస్తుంది. ఈ ఆశా నిరీక్షణను గురించి కడియాల వారి వాక్యాలు చూడండి.

"దుఃఖానికి దుఃఖానికి నడుమ ఏదో సుఖలేశం మనిషిని చావకుండ బతికిస్తుంది. నల్లని మబ్బుకు వెండిజరీ అంచున్నట్లు పుట్టెడు దుఃఖంలో ఏదో ఒక సుఖలేశం వుంటుంది. కమ్ముకున్న నిరాశకు చివర ఆశ ఏదో కన్పించి బతుకంతా దానికోసం నిరీక్షించేటట్లు చేస్తుంది. ఇది సృష్టివైచిత్రి-భగవంతుని లీల"[1]

పరివాసి

వేదుల పరివాస జీవితాన్ని ప్రతిబింబిస్తున్న వియోగి క్షుబ్ధ హృదయంలోని వేదన ఇందలి విషయం. ప్రేమ సూచకంగా నవీన మృణాళదామాన్ని కవి ధరించాడు. దాని మనోజ్ఞతలు హృదిని తాకియు తాకక ముందే ముడిత్రెంచిన దుర్విధి అతన్ని తమోమయ వీథుల్లో పారవేసింది.

నా మెడలోన వైచుకొనినా నొక దుశ్శకునంపు వేళ మా
ప్రేమకు సూచకంబని నవీన మృణాళ సరమ్ము, కాని యా

1. కృష్ణశాస్త్రి కవితా వైభవం-భారతి. 1924 పుట 19

దామ మనోజ్ఞతల్ హృదిని దాకియు దాకక మున్న తున్కలై
పో ముడి[త్రెం]చి దుర్విధి తమోమయ వీథుల వైచె గ్రూరతన్

ఇటు లోకం చెప్పుకుంటున్న కాళిదాస కవీంద్రుని మేఘసందేశ కావ్యగాథా పూర్వవృత్తాంతంలోగల యక్షుని (హేమమాలి) స్థానంలో కవి నిలబడినట్లు తోస్తుంది. నాటి గగనాదులన్నీ తనలాగే నేడు దుఃఖిస్తూ విరక్తితో ఉన్నట్లు అతనికి కనిపించాయి.

నాటి విశాల నీల గగనమ్మును, నాటి యనంత తారకా
కోటులు, నాటి లేమొయిలు గుంపులు, నాటి నిశాంధ కారముల్
నాటి నిశీథ మంద పవనమ్ములు నావలె నేడు కష్టపుం
బాటున జిక్కి దుఃఖపడు భంగి విరక్తములై కనంబడున్

కవి యెంతగా ఆపుకో దలచి నప్పటికి నేవో రహస్స్మృతులు యౌవన సుఖ స్పృహల్ని కదలించి వేశాయి. గౌతమీ పులిన ప్రదేశాల్లో తిరుగుతూ ఆయన హృదయం దప్పికతో తపించిపోయింది. అనునిత్య మేవో స్మృతులు చెలరేగి బాధించాయి. ఆయన కిలా రాత్రింబవళ్ళు శోక గీతాలే వినిపించాయి.

నాకు బ్రిశాంతిలేదు, కఠినమ్మగు శూన్యమునందు గ్రుంగి చీ
కాకయి పోయె నా బ్రదుకు, కన్నులు విప్పిన మూసికొన్న బా
ధా కలుషమ్ము లాశ లెడదన్ విదళించును నిస్సహాయతా
వ్యాకుల శోక గీతులె యహర్నిశమున్ వినవచ్చు రోదసిన్

తుదిలేని, సైపగారాని ప్రవాస జీవితాన్ని స్మరిస్తూ రక్తబాష్పాలు సోనలు వార, నులూక విలోకనాలు చెమ్మగిల్లేటట్లు ఏడ్చుటే దిక్కయింది. ప్రపంచమే మృగతృష్టల యింద్రజాలమై పోయింది. నిత్యం అకాల మృత్యుగర్జా కలితాట్ట హాసాలు వినబడుతున్నాయి. అయినా ఆశాకిరణద్యోతకంగా ఇలా ముగించారు.

నా కిపుడెల్ల వేళల వినంబడు చుండె నకాల మృత్యు గ

ర్జా కలితాట్ట హాసముల సందడు లందున బేర్మివివిహ్వలా
శాకరుణమ్ముఁలో గుసగుసల్, మరి చైత్ర శుభ ప్రభాత వం
శీ కలగాన మీ శిశిర జీవన మంచిక లేనె లేదకో! దీ. పు 45

యక్షుని ప్రవాస జీవితాన్ని రేఖా మాత్రంగా స్పృశిస్తూ స్వీయ పాషాణ ప్రవాస జీవనంలో గల హృదయ మర్మాల్ని మెలిపెట్టే దుఃఖాన్ని వెల్లడించారు వేదుల.

## దీపావళి నాడు

దినములు పరస్పర ప్రతిధ్వనులుగా గడిచిన ఇరవై అయిదు సంవత్సరాల వేదుల జీవన దర్పణం ఈ ఖండిక.

"హరీంద్రనాథ చట్టోపాధ్యాయ వంటి భావుకుడు ఈయన దీపావళి అనే కావ్యమును విని ఉప్పొంగి పోయినాడట. అట్టి ప్రత్యే కాభిమానానికి పాత్రమైన ఆ కావ్యనామమే ఈ సంపుటాని కంతటికి పేరుమోసింది. కాదంటే కావ్యావళినే దీపావళిఅన్నారనుకొందాము"1 అని ఇంద్రగంటివారు వక్కాణించినారు. వీరి మాటల్ని బట్టి హరీంద్ర నాథుడు వేదుల 'దీపావళి నాడు'ను తెగమెచ్చుకున్నారనడం స్పష్టం. ఈయన మహాకవిగా, మహామనీషిగా, కళాకారునిగా, రాజకీయవేత్తగా జగమెరిగిన వ్యక్తి. అట్టి మహానుభావుని ప్రశంసయే దీని విశిష్టతని చెప్పక చెప్తుంది.

ఇది నిశీథి, నేను, చిమ్మట లనే పాత్రల నడుమ సంవాద రీతిలో నడిచింది. ఇందలి 'నేను' అనగా కవియే. 'నిశీథిని' విశ్వ ప్రకృతిలోని కాలానికి గుర్తు. చిమ్మట తాత్కాలిక సుఖలేశంతో తృప్తి పడే ప్రవృత్తికి చిహ్నం.

అమావాస్య చీకట్ల నడుమ శూన్యగృహంలో మరణ వాద్యాల గుండెలు కొట్టుకోగా ఏడుస్తున్న కవితో నిశీథి ఇట్లంది.

---

1. 'వేదులవారి దీపావళి'-భారతి ఏ. 1938 పుట 317

జగతి యీనాటి యీ మహోత్సవము నందు
మునిగి యానందమున బొంగి పోవుచుండ
ఇటు రగులు గొల్పి రెవరు నీ హృదయమందు
నణచు కొనియున్న ఘోర దుఃఖానలమ్ము        దీ.పు 48

తనకూ, లోకానికీ సమన్వయం కుదరక ప్రతీవాడు లోలోపల దుఃఖిస్తూ ఉంటాడు. పైకి మాత్రం ఉత్సవాన్ని ప్రకటిస్తాడు. ఇది లోక సహజం. ఇల్లే దుఃఖానల మణచుకుని జగమంతా దీపావళినాటి మహోత్సవంలో ఆనందంతో పొంగి పోతుంది. కాని కవి దుఃఖిస్తున్నాడు. అందుచే హృదయంలో అణుచుకున్న ఘోర దుఃఖాగ్నిని ఎవరు రగులు కొల్పారని నిశీథి ప్రశ్నించింది. "అణచు కొనియున్న ఘోర దుఃఖానలమ్ము" అనడంలో పై చెప్పిన లోక నైజ మిమిడి యుంది. మానవ మనః ప్రవృత్తి దాగి ఉంది. కవి హృదయంలో రగులుకున్న ది-అణచుకొనియున్న దుఃఖాగ్ని కాని, కొత్తగా పుట్టింది మాత్రంకాదు. అపుడు కవి సమాధాన మిది.

ఇంతగ దహించు కొనిపోవు నీ యెడంద
బాష్పములు జారిపడి చల్లబడునొ యనుచు
మూసికొనిపోయె నా నేత్రములు తమంత
రాత్రియే యింక బహిరంతరములు నాకు        దీ. పు 48

బాష్పాలు పడి దుఃఖాగ్ని చే దహించి పోతున్న గుండె చల్లబడుతుందని నేత్రాలు వాటికవే మూసిపోయాయనడం వేదుల భావనా చమత్కారానికి, లోపల వెలుపల కూడ రాత్రియే యనడం విషాదాతిశయానికి తార్కాణాలు.

వీరి హృదయంలో మండుతున్న మహాగ్నికి దీపావళి మహోత్సవాగ్ని ఒక అగ్ని కణం మాత్రమేనట.

లోన జ్వలియించుచున్న మహానలమున
కొక స్ఫులింగమె కాద యీ యుత్సవాగ్ని

శైశవమ్మాది ప్రేమ శ్మశానమైన
జీవి కొకనాటి కేటి దీపావళి యిక  దీ. పు. 49

ఈసందర్భంలో హనుమచ్ఛాస్త్రిగారి మాటలు.

"'దీపావళి'లోని కవి భావప్లుతి లయాంతశిఖి చిట్టము కట్టింది. ప్రపంచాన్నంతటినీ ప్రతిఘటించి ధిక్కరించి కవి చేసుకున్న ప్రత్యేక సృష్టిలో అందరూ మహోత్సవముగా నెంచే పండుగు తన మహత్వమున కెంత అల్పాల్పమో నిర్ణయించడంలో యీ కవి ఉన్నతి బోధకు వస్తుంది."[1]

వేదుల ఒంటరిగా అరుంతుదమైన దుఃఖ జీవనాన్ని అనుభవించిన వ్యక్తి అనడం చర్వితచర్వణం. అంచేత శైశవమ్మాది ప్రేమ శ్మశానమైన తన బ్రతుక్కి దీపావళి ఎందుకని ప్రశ్నించుకున్నారు. అయితే దీపావళీ మహోత్సవ విముఖులైనప్పటికీ, ప్రకృతిని మాత్రం తిరస్కరించరు. పైపెచ్చు తనకు ప్రకృతియే ఆదరణ, ఆశ్రయం చూపిస్తుందని దృఢంగా నమ్మారు. కనుక "నీ విసీలోదరమున దొరకె నీ దురదృష్టవంతునకు జోటు" అని నిశీథితోను,

"నన్ను నిరసించు వారి యానంద మందు
నాకు భాగమ్ము వల దొక్కనాటికైన
చీకటుల జీల్చుకొని వచ్చు మిాకరాళ
గాన రవములనే నా సుఖమ్ము గలదు  దీ. పు 49

అని చిమ్మటతో చెప్పుకున్నారు. ఇప్పటివరకు దుఃఖవీథుల్లో ఆయన సఖుల అడుగు జాడ లెరుగరట. కన్నీటి జడులతో పంకిలమ్మైన జీవన ప్రాంగణంలో శాంతి దేవత పాదాల గుర్తులకై వెతుక్కుంటూరట. మరియు ఆయన ఆకొన్న ఆశలతో స్వప్న సాగర తటాలపై కలతిరిగారు. చివరకిలా తమ నిర్ణయాన్ని ప్రకటించారు.

1. వేదులవారి దీపావళి-భారతి. ఏ. 1939 పుట 318

మ్రొక్కిన కొలంది గాలితో ద్రొక్కివేయు
నీ కఠిన లోకమెల్ల బహిష్కృతమ్ము
రండు, చిమ్మటులార! ఈ రాత్రివేళ
నావలెనె పాడుకొను మీరె నాకు సఖులు దీ. పు 51

'మెత్తని వాడిని చూస్తే మొత్తబుద్ధి వేస్తుంది' అనే సామెత ఉండనే ఉంది. అంటే మెత్తగా ఉన్న వాడిని మొత్తడం, గట్టివాడికి మొక్కడం లోకం పోకడ. ఈ పోకడిని తన దుఃఖానికి జోడించి సార్వకాలికమైన నిజాన్ని సందర్భానుగుణంగా వక్కాణించారు వేదుల.

ప్రవాసియైన వేదుల ప్రేమ పిపాసతో జీవన పథమ్ములో సఖుల అడుగుజాడలకై వెదకి విసిగి వేసారినారు. పైపెచ్చు నా యనువారు లేని బరువైన వారి పేద బ్రతుకు ఒంటరిగా కఠిన లోక పదఘట్టనచే నలిగి పోయింది. ఆ నలిగిన బ్రతుకు నుండి వెలువడిన వేదనయే ఈ ఖండిక అంతటా దట్టంగా పరచుకుని ఉంది.

మొత్తం మీద నిరాశ నుండి ఆశను, దుఃఖం నుండి ఆనందాన్ని చూడగల్గిన వ్యక్తి వేదుల. కనుకనే ఈ కఠిన లోకమెల్ల బహిష్కృతమ్మని ధీరత్వాన్ని ఆచరణ పూర్వకంగా హితోపదేశం చేశారు.

## ఎప్పుడో

దుఃఖాంత కథలతో వేగిపోయిన కవి జీవిత కావ్య సమాప్తికై ఎదురు చూడటం ఇందలి విషయం.

కష్ట భూయిష్టమైన దుఃఖాంత కథల పుటలు త్రిప్పిన కొద్దీ విసివి పోయిన వారి పరిస్థితి ఇది.

"కునుకు దీప మారదు; పొడి కనుల నిదుర
రాదు; బరువైన యెద మనోరథము పోదు;" దీ. పు 52

బలిసిన పులుల లాగ భయం గొల్పే ఘట్టాలు వేగంగా వెళ్ళవు. చెరబడ్డ కీరంలా సుఖ స్పృహల కలలతో ప్రాణం స్వేచ్ఛా విహారానికి

రెక్క లాడిస్తుంది. అందుచే చివరకు

"ఈ వ్యథాక్లిష్ట జీవిత కావ్యమునకు
నంతి మాశ్వాస శాంతి సమాప్తి యెప్పడో!'' దీ పు. 52

అని పలాయన వాదాన్ని పలవించు నట్టులుంది. దుర్భరమైన దుఃఖ మావరించి నపుడు తాత్కాలికంగా ఆ వ్యక్తి నైరాశ్యంలో కూరుకు పోవడం సహజం, సాధారణానుభవం. అంత మాత్రలో ఆ వ్యక్తిని పలాయన వాదిగా ముద్రవేయడం కురచ చూపు మాత్రమే. భిన్న భిన్న పరిస్థితుల్లో మానవ హృదయం భిన్న భిన్న వికల్పాల నందు కుంటుంది. అది తాత్కాలికం కనుక వెంటనే గుండె దిటవు పర్చుకుని తమ స్థిర నిశ్చయాన్ని గీతాలలో ఇలా వెల్లడించారు.

గీతములు

వేదుల స్థిత ప్రజ్ఞని చాటిచెప్తున్న ఈ గీతా లాయన ఆశావాది యనడాన్ని ఋజువు చేస్తాయి. తమ హృదయాన్ని గాఢ దుఃఖాగ్ని మండించే కొద్ది వేడి నిట్టూర్పు గాడ్పు కూడ కదుపరట. ఎంతగా ఆపదల మునిగి నప్పటికి కన్నీరు రానీయ ననడం వారి దృఢ చిత్తాన్ని వ్యక్తీకరిస్తుంది.

ఆశలు భగ్నమైనా రోదించరు. మరియు వారినిజూచి ప్రపంచం నవ్వీన కొద్దీ గీతాలు పాడి తృప్తి పరుస్తారట.

ప్రేమ దాహాన నెడద తపించుకొలది
అమృత మొలికింతు స్మిత నయనాంచలముల
నన్నుగని యీ ప్రపంచమ్ము నవ్వుకొలది
తనియజేతు గొంతెత్తి గీతములు పాడి దీ. పు 53

ఈ భావ పరంపర అంతా దుఃఖాన్ని భరించుటలో గల వారి పూనికను పదే పదే నొక్కి వక్కాణిస్తుంది.

జ్వాల

బాహ్య లక్షణాల్ని మాత్రమే గమనించడం, లోపల విషయాల్ని ఆలోచించక పోవడం లోక సామాన్యం. అట్లే కవి తన హృదయపు లోలోతుల్లో ఉన్న వేదన ఎవరికీ తెలియదని సాగరాన్ని ఆలంబనంగా చేసుకుని ఇలా అన్నారు.

ఊరు పూర్వున దూగాడు నూర్మ్యులరసి
తరగ తరగ వినంబడు తానము విని
నురుగు నురుగున చుక్కల మెరుగు గాంచి
ఆటయని, పాటయని, హాసమని తలంచు
గాని, యీ మహా సాగరాగాధ హృదయ
బాడబానల జ్వాల యెవ్వరికి దెలియు దీ. పు. 64

సముద్రపుటలల తూగును ఆటగాను, తానమును పాటగాను, నురుగును నవ్వుగాను లోకం తలుస్తుంది. కాని అందలి బడబాగ్నిని గమనించదు. అట్లే కవి నవ్వుతూ గొంతెత్తి గీతాలు పాడితే ఆనంద మనుకుంటారేగాని ఆ వెనుక గల విషాదాగ్ని యెవ్వరికీ దెలియదు.

ఆహ్వానము

మృత్యువు నాహ్వానించడం ఇందలి విషయం. నవ్య కవులు మృత్యువును ప్రియమైన వస్తువుగా వర్ణించారు. 'On death' అను గేయాన్ని రచించిన షెల్లీ "Death is the Crown of the life" అనిన కీట్సు మొదలైన ఆంగ్లకవుల పరిభావమిది. గీతాంజలిలో కూడ దీని ప్రసక్తి ఉంది. నవ్యాంధ్ర సాహిత్యంలో దువ్వూరి, వేంకట పార్వతీశ్వర కవులు మున్నగువారీ విషయంలో పేర్కొనదగినవారు. ఏతత్కవితను భావ కవితా విమర్శకులు భక్తికవితలో ప్రస్తావించారు. అయితే వేదుల వేదనాభరితంగా దీన్ని వ్రాయడం కారణంగా ఈ ప్రకరణంలో గ్రహింపవలసి వచ్చింది. కవి మృత్యువును ప్రేయసిగా భావించి

"నిత్య హింసా రిరంసా వినిద్రరుద్ర
భవన వాటికా ద్వార కవాటములను" తెర్చుకుని
"బాధాతివేల హృదయ వేదనా జాలముల ద్రోసి వేసి కొనుచు"
రమ్మని ఆహ్వానించారు. కవి దృష్టిలో ఆమె

"లోక లోకాల శాంతి వెల్లువలు వారు
నెరిజీరల వాల్గనులెత్తి నవ్వి
చారు హేమంత సంధ్యా తుషార సార
శీతల కృపామృతా సార సేచనముల దీ. పు. 55, 56
దప్త హృదయమ్మునకు జల్లదన మొసంగ" గల యట్టిది.

అంచేతనే మృత్యుదేవతను

"కోమలాశ్రు మౌక్తిక మాలికా మనోజ్ఞ
మైన నీ హృదయాన నన్నదుము కొనగ" విచ్చేయు
మన్నారు.

మృత్యువు వారికి సుధా మధుర విధుర జీవశాంతి, 'ప్రేమైక జీవకళ, విశ్వగాన మోహిని' ఇహదుఃఖ తమోనియతి. కనుకనే

"కష్ట నిష్ఠుర శోక లోకమ్మునందు
వలపు తొలగిన యీ పాడుబ్రతుకు బరువు
నీడ్వ లే కేడ్వ లేకిట్టు లేడ్చు నన్ను
త్వ ద్భుజాశ్లేష మృదుల బంధమున జేర్చి
కాల జలధి తరంగాల జోలబాడి
మాతృ వక్షమ్ము వోలె ప్రేమ ప్రసన్న
మైన యద్వంద్వ కాంతి సీమాంతరమున
శాశ్వత సుషుప్తిముంచి ప్రశాంతుజేయ" దయసేయు మని

ప్రేయసీ! యని సంబోధించి ఆహ్వానించారు.

కష్ట నిష్ఠురమైన లోకంపై వారికి విసుగు పుట్టింది. వలపు తొలగిన పాడుబ్రతుకు బరువైపోయింది. కనుకనే శాశ్వత సుషుప్తిలో

ముంచి ప్రశాంతుని జేయు మనుట. అయితే ఇది జీవితం నుండి పలాయనం చిత్తగించు మనే ప్రబోధం కాదు. జీవన మరణాల తత్త్వాన్ని ఉపదేశించడమే ఇచట కవి ఆశయం.

ఇందు మరణదేవతను సంబోధించిన సంబోధనలు నిజ రూపాభివ్యక్తంగా సాగి రసజ్ఞ మనోజ్ఞాలై అలరారుతున్నాయి.

అస్తగిరి వాసినీ!, జీవితావసాన శైశిర తమోభిసారికా! ధిక్కృత ప్రేమ చరమాతిథీ!, మహాబ్ధి పారదూర ప్రవాసినీ!, ప్రాణ శాంతి గాయనీ!

ఇంచేతనే "నన్నయగారి ప్రార్థనలలాగా, పెద్దనగారి 'వికచాంబకాల్లాగా' ఈయన సంబోధనలు చాలా అందంగా ఉంటాయి. ఎక్కడలేని పదాలూ గుమికూడి వాటి పరిమళాన్ని అందిస్తాయి వీరి సంబోధనలకి."[1] అని శ్రీపాదవారు వాక్రుచ్చారు.

అయితే ఇందు మరణదేవతను 'అస్తగిరి వాసిని' గను, 'స్వప్నరాజ్ఞి'గను పేర్కొని యుండగా

"ప్రేయసిని పేరు పెట్టి పిలువక ప్రేయసీ, సఖీ, అస్తగిరివాసినీ, స్వప్నరాజ్ఞీ, స్ఫురదూప ప్రవాసినీ, ప్రాణశాంతి గాయనీ, నిత్య సైరంధ్రీయని పిల్చుకొన్నారు"[2] అని జి. రామమోహనరావుగారు

"వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు 'అస్తగిరి వాసిని' గను, 'స్వప్నరాజ్ఞి'గను ప్రేయసిని పేర్కొనిరి"[3] అని డి.లలిత కుమారిగారును

"అంతేకాదు; ధిక్కృత ప్రేమ చరమాతిథి', 'మహాబ్ధి పారదూర ప్రవాసిని', 'ప్రాణ శాంతి గాయని' ఆమె."[4] (ప్రేయసి) అని

---

1 కవి సన్మానము-ప్రతిభ న.న.స. పుట 332

2. "వేదుల వేదన"-భారతి. జనవరి 1969. పుట 32

3. ఆధునికాంధ్ర కవితా తత్త్వము. పుట 70

4. భావకవులు-ప్రతిభా విస్ఫూర్తి. పుట 273.

డా. శివలెంక ప్రకాశరావుగారును వ్రాయుట అవిచార మూలక మనడం తప్పదు. ఇవి మృత్యువును గూర్చి చేసిన సంబోధనలే కాని ప్రేయసి నుద్దేశించి చేసినవి కావు. మృత్యువును ప్రేయసి గా భావించుట భావకవితా విశిష్ట లక్షణాల్లో ఒకటి. అందుచే వేదుల మృత్యువునట్లు సంబోధించారు. అంతేకాని ప్రేయసిని 'అస్తగిరివాసిని' అనడం వారి అభిమతం కాదు. ఈ ఖండిక యందలి వస్తువు మరణాన్ని ఆహ్వానించడమే కాని ప్రేయసిని పిలుచుట మాత్రం కాదు.

ఇలా వేదుల 'దీపావళి'లో పరమ తీవ్రమైన దుఃఖాన్ని మాధుర్య గర్భితంగా వ్యక్తం చేశారు. కనుకనే

"వేదుల కవిత్వములో వేదనతోపాటు తీయదనం ఉన్నది. ఈ తీయని వేదనే మన్ని ఆకర్షిస్తుంది."[1] అని కృష్ణశాస్త్రిగా రుగ్గడించారు.

## 6 మానవత

### మానవత

"మానవుడే అన్నింటికి పరమ ప్రమాణం" (Man is the measure of every thing) అన్నదే మానవతకు తలమానికమైన సూత్రం. సర్వ మానవ సమానత దీని పరమ లక్ష్యం. కాలక్రమంలో పెక్కు మార్పులకు లోనైన మానవతావాద లక్షణాలివి. వ్యక్తి స్వేచ్ఛ, సర్వమానవ సౌభాత్రం, సమాన న్యాయం, అంతరాలను సృష్టించే అంధ విశ్వాసాల నిరాసనం, భౌతిక సంపదానుభవంలో సమానత ఇత్యాదులు.

ఎక్కడ పుట్టినా, ఎక్కడ పెరిగినా ఈ మానవతావాదం భారత దేశంలో అడుగు పెట్టడానికి ప్రధాన ద్వార మాంగ్ల విద్య. తెలుగు దేశంలో మాత్రం కొందరిపై ఆంగ్లేయ విద్య కారణంగా, మరి

1. "కవి-సన్మానము" ప్రతిభ, స.న.స. పుట 340

కొందరిపై బ్రహ్మసమాజం ద్వారా ఈ వాదం తన ప్రభావాన్ని ప్రసరింప జేసింది. కందుకూరి, చిలకమర్తి, గురజాడ, సలాది మొదలైన వారీ వాద ప్రఖ్యాత ప్రధాన సంచాలకులు.

భారతదేశంలో అంతకు ముందున్నది మతాతీత మానవతా వాదం కాదు; మత మనవతా వాదం. భగవంతుడు దీనికి పునాది. స్వర్గ నరకాలు, మోక్షం శిఖరాలు. పాప పుణ్యాలు, కీర్త్యపకీర్తులు, దాన ధర్మాలు సోపానాలు. అయితే ఇవి హేతుబద్ధాలు కావు. అందుచే మూఢ విశ్వాసాల పల్లేరులు పెరిగి భారతాన్ని బీడుగా మార్చాయి. కుల తత్త్వ మాధారంగా అంటరానితనం అలముకుంది. ఒకటేమిటి; సాంఘిక దురాచారాలు ఒక దానిని మించి ఒకటి విజృంభించాయి. అవి చూచి పైజెప్పిన కందుకూరి మున్నగు వారందరూ మానవీయ పతాక నెగుర వేశారు.

## దీపావళి-మానవత

శ్రీ రఘుపతి వెంకటరత్నం గురుత్వం కారణంగా కృష్ణశాస్త్రి హృదయంపై బ్రహ్మసమాజపు ముద్ర పడింది. అది ఆయన కైతకు వెన్నెముక. వారి సాహచర్యం ఫలితంగా బ్రహ్మసమాజ ప్రభావం వేదులకు కూడ సోకింది. ఈయన ఆచరణ శీలి. వారి వివాహం, హరిజన శిష్యాదరణ దీన్ని ఋజువు చేస్తున్నాయి. అంతేకాక బ్రహ్మ సమాజ స్ఫూర్తి దీపావళి కాంతిగా కనిపిస్తుంది. కనుకనే

"బ్రహ్మసమాజ మిచ్చిన చైతన్య బలంతో మూఢ విశ్వాస శృంఖలాల్ని విదల్చి తన జీవితానికి శరదుత్సవం చేసుకొన్న సంస్కర్త వేదుల"[1] అని డా. మిరియాల రామకృష్ణగారు

"వేదులవారి దృష్టి బ్రాహ్మమతము. బ్రహ్మసమాజము మానవునిలో రేకెత్తించిన ఉత్తమ మానవత్వ జిగీష 'దీపావళి'లో

1. 'వేదుల వ్యక్తి-శక్తి' ముక్తఝరి పుట IX

వెలుగు బాటలను చూపిస్తున్నది."[1] అని దేశిరాజు కృష్ణశర్మగారు నుద్ఘాటించారు.

సంఘంలో కనిపిస్తున్న దోపిడి, పరపీడ పరాయణత్వాన్ని వేదుల విస్మరించ లేదనడానికి 'కాగడా' బలీయమైన సాక్ష్యం. దీనిలో వెలుగు సంఘపరంగా దారి చూపించేదిగా ఉంది. దేని కొరకు 'కాగడా' వెలిగించాలో చెప్తున్న గేయం.

అధికార దృప్తుల కర్థమత్తులకు
భోగదాసిగ నున్న భూదేవి కొరకు
చెక్కిన నెలరాల చెరసాల నడుమ
వధ్య శిలా వైభవం బిచ్చగించి
దేవులాడుచు నున్న దేవుని కొరకు
దారి తప్పిన బాటసారుల కొరకు
దారి గానని పేద వారల కొరకు
వెలిగించు కాగడా వెలిగించవోయి దీ. ప్ర 6

భౌతిక సంపదైన భూమి కొద్దిమంది అధికారుల, అర్థ మత్తుల గుప్పిట్లో చిక్కుకు పోవడం ఆయనకు వేదన కలిగించింది.

వధ్యశిలా వైభవంతో దేవుడు దేవులాడు చున్నాడంటే దేవాలయ భూము లన్యాక్రాంతం కావడం కావచ్చు. మక్తాదారులు శిస్తు ఎగ గొట్టడంవల్ల కావచ్చు దీపంపెట్టే దిక్కులేక ఉండటం వేదులకు వేదన కలిగించి ఉండవచ్చు. ఇది పక్కకు పెట్టి దేవుని పేరుమీద పెద్ద పెద్ద లందరు చేస్తున్న అన్యాయాలు ఆయన మనసులో ఉండి వుండ వచ్చు. అట్లే దారి తప్పిన బాటసారుల కోసం, దారి గానని పేదవారల కోసం కాగడా వెలిగించ మనడం సామాజిక స్పృహ సంబంధించిన విషయానికి తార్కాణం. ఈ సందర్భాన్ని పురస్కరించుకున్న జి. రామమోహనరావుగారి వాక్యాలు.

1. 'వేదులవారి దీపావళి'-సుభాషిణి, ఏ. 1951. పుట 52

"అధికార వాంఛల్లో మునిగి అర్థతృప్తికి మత్తులై భూమాతను భోగదాసిగ భావించి తన్మయం చెందేవారికి, చెరసాలలో కుంగి కృశించి పోతున్న జీవికి, దారి తప్పిన బాటసారికి, దారిగానని పేద గుండెకు కాగడాను చూపించి ప్రగతిపథం వైపునకు మార్గాన్ని ఏర్పరచి, సామ్యవాదం దృష్టియందుంచికొని తొ డి మ లూ డి న 'మానవ బ్రతుకులకు' విముక్తి కలిగించు మని వారి హృదయం ఆవేశంతో ముందుకు వచ్చింది."[1]

ఇటు రావుగారు చెప్పిన సామ్యవాద దృష్టియే ప్రగతి పథం. అది మానవతా వాదంలోని భౌతిక సంపదానుభవంలో సమానతకు ప్రతినిధి.

ఇక్కడ వధ్యశిలా వైభవంతో దేవుడు దేవులాడుతున్నాడన్న ట్లే కాంక్ష లో దేవుడు ధనవంతుల పెద్దరికానికి మతోన్మాదం పెంచు వాడని ఆయన పేరుమీదుగ జరుగుతున్న దోపిడిని నిరసించారు * అట్టి దేవునికి మారుగ నిల్చిన రాతి బొమ్మలకై జీవితాల నర్పించవద్దని బ్రహ్మసమాజ ప్రభావంతో ఉద్ఘోషించారు. ఇంకా దీన్ని గురించి టి. యల్. కాంతారావుగారు ఇలా అంటున్నారు.

"భావకవులకు చాలా మందికి సమాజం సంగతి ఎక్కువగా పట్టలేదు. వేదులవారు మానవతా వాదిగా కనబడతారు. ధనవంతులు, దరిద్రులు అనే భేదాన్ని ఆయన గుర్తించారు. ధనవంతులు, దరిద్రుల రక్త మాంసాలను వారివిగా చేసుకొని పెద్ద వాళ్ళవుతున్నారని గుర్తించారు. అయితే ఈ గుర్తింపు వెనుక ఏ ఆర్థిక సిద్ధాంతం లేదు. సంఘంలో కవియైన తను ఒక మనిషిగా సాటి మానవునికి జరుగుతున్న అన్యాయానికి చలించాడు. అందుచేతనే ధనవంతుల ఏజంటైన దేవుడు తన కవసరంలేదని, స్వచ్ఛమైన మనిషిని మాత్రమే తను కాంక్షిస్తానని

1. వేదుల వేదన-భారతి. జ. 1963 పు. 31 * ఇదే గ్రంథం పు. 67

చెప్పాడు. తాత్కాలిక ప్రయోజనాసక్తే తాను దేనికీ లొంగనని అన్యాపదేశంగా చెప్పిన కవి వేదుల."[1]

అయితే ధనవంతులు, దరిద్రులు అనే భేదాన్ని గుర్తించడంలో వెనుక ఏ ఆర్థిక సిద్ధాంతం లేదనడం ఆలోచనీయం. యూరపు, ఇంగ్లాండులలో వోల్టేరు, రూసో నాయకత్వాన జరిగిన పారిశ్రామిక విప్లవం జమీందారుల, భూస్వాముల పూంజీకృత ధన స్వామ్యం పరాస్తం చేసి, సిరిసంపద లన్నింటి పైన ప్రజలందరికీ సమాన భాగ స్వామ్యం ఉండాలని ఘోషించి స్వాతంత్ర్యం, సహోదరత్వం, సమానత్వం అను సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఆ సిద్ధాంత మందలి శాస్త్రీయ మానవతావాదాన్ని కంఠోక్తిగా ప్రకటించడమే ఇందలి మౌలిక గుళిక.

ఆర్థిక సిద్ధాంతం సంగతి అలా వుంచితే వేదుల పేదల్ని మాత్రం మరచి పోలేదు. అవకాశం వస్తే పేదవారి ప్రస్తావన తేక మానరు. సుధాకరా! లో

"ఇంత సొంపు లొలుకు వెన్నెలం గనులు మూయని పేదలకై కృపారసం బొలికెడు నీ సుధా మురళి నూదుదువో" అంటారు. ఇందు కనుల మూయని పేదలంటే ఆకలితో నిద్ర పట్టని పేదవారని గాని, రాత్రివేళ కూడా విశ్రమించక శ్రమిస్తున్న పేదలనిగాని మనం గ్రహించవచ్చు. వారికై కృపారసం బొలికించుట మానవతను ప్రకటించడమే. దయా సుధారసాస్వాద దరిద్రులైన ధనవంతులకు పేదల సంగతి ఎలాగాపట్టదు. కనుక నీవైన మరచి పోకుండగా, వారిపై దయారసాన్ని ప్రసరింపజేయమని చంద్రుడ్ని కోరడం గమనించవలసిన విషయం.

"ఇట్లే 'జయగీతి'లో మాతృదేశ స్తవం గావిస్తూ 'పేదపాలిటి

1. వేదులవారి వేదన-ఆంధ్రపత్రిక, 2-11-85

యన్నపూర్ణవు', అనడం, అలాగే 'కాంక్ష'లో పేదల రక్త మాంసాలచే పెంపు వహించినవారు ధనవంతులనడం వారి మానవతా దృక్పథం తోని గుర్తులు.

'ఆరాధన' మొదలైన ఖండికల ద్వారా స్త్రీకి పూజ్యభావం కల్పించి నవీన మానవతా వాదానికి దోహద పడటం ముందే చెప్పబడింది. ఇక 'ముక్తఝురి'లో మానవత తెలిసికుందాం.

## ముక్తఝురి - మానవత

పరాయి పాలనలో మగ్గుతున్న మాతృదేశ స్వాతంత్ర్య వాంఛ, కుల మతాలతో కునారిల్లుతున్న సంఘ సంస్కరణాభిలాష, గర్భ బంధాది చిత్ర కవితా సరస్వతి శృంఖలాబద్ధ నిరసనం భావకవుల్ని వ్యక్తిస్వేచ్ఛకు పురిగొల్పింది. ఈ స్వేచ్ఛ పరమలక్ష్యం సమాజ సాహిత్యగత పురోగమనావరోధాల్ని తుడిచి పారవేయడం. ఇది మానవత యందు పర్యవసించుట దాని విశిష్టత. కృష్ణశాస్త్రి మొదలైన వారు జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నించినవారే.

వేదుల, వారి 'ముక్తఝురి' ఖండ కావ్యంలోని 'ముక్తఝురి'శీర్షికతో నున్న ఖండికలో, గిరి గర్భం నుండి వెలువడ్డ ఝురి మిషతో వ్యక్తి స్వేచ్ఛనిట్లు వ్యక్తం చేశారు.

> నావలె శైలబంధనమునంబడి స్రుక్కెడు వారికెల్ల స్వే
> చ్ఛా విభవమ్మొసంగ నిక సాగర యాత్ర కుపక్రమింతు నా
> త్రోవకు నడ్డమౌ గిరి తతుల్ గహనమ్ములు ఛిన్నభిన్నమై
> పోవ, సమస్తలోక ముడి వోవని శాంతి సుఖమ్ము లందగన్

ఈ బంధనాలు ఆచార సంబంధాలు కావచ్చు; సాహిత్య సంబంధాలు కావచ్చు. అందు స్రుక్కెడు వారికెల్ల స్వేచ్ఛా విభవమ్ము నొసంగుట వారి ఆశయం. సమస్తలోకం శాంతి సుఖా లందడం వారి వాంఛ. 'సర్వేజనా స్సుఖినో భవంతు' అను మానవతా వాద పరమ లక్ష్యం ఇందు వ్యక్తం చేయబడింది.

మరియు వేదుల వసుధైక కుటుంబ సంస్థాపనాన్ని, విశ్వమానవ సౌభ్రాత్రాన్ని ఇలా బోధిస్తున్నారు.

ఏ యెడ - ఏ విధాన జనియించిన నేమి ప్రపంచమెల్ల నా
దే యని స్వేచ్ఛగా పరుగు లెత్తుచు సోదర సృష్టినెల్ల నా
ప్యాయత పల్కరించుచు ప్రియమ్మున గౌగిట జేర్చి జీవనో
పాయన మిచ్చుచుం దుడిచివైతు పురోగమ నావరోధముల్

పురోగమ నావరోధాల్ని తుడిచి వేయడమంటే సంఘ పురోభివృద్ధికి ఆటంకాల్ని కలిగించే దురాచారాల్ని నిర్మూలించడం.

ఈ విధంగా కవి దిక్కుదిక్కుల శాంతి సందేశ గీతి పాడుతూ విశ్వసృష్టిలో విచ్చల విడిగా చరిస్తూ దూర దూరాల తీరోపతీరాలకి స్వేచ్ఛా ప్రమోద వార్తను మోసికొను పోదువన్న వారి మానవతా ప్రబోధం విశ్వమానవ సౌభ్రాత్రానికి విజయ పతాక.

## స్వప్నము

నేటి మానవతా లక్షణాల్లో శాంతి ప్రచారమొకటి. రెండవ ప్రపంచ యుద్ధం చివరి రోజుల్లో అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, రష్యానేత స్టాలిన్ మాస్కోలో సమావేశమయ్యారు. ట్రూమన్ స్టాలిన్‌తో మాటలాడుతూ అప్పటికే అమెరికా అణుబాంబును తయారు చేసిందన్న వార్తని బాంబు పేల్చినట్లు పేల్చడం, తరువాత రష్యానేత అణుబాంబు తయారీకి శాస్త్రవేత్తల్ని ప్రోత్సహించడం జరిగింది. అది నాందికాగా అగ్రరాజ్యాల మధ్య అణ్వాయుధాల పోటీ అధికం కాజొచ్చింది. నేడు ప్రపంచం మొత్తం దగ్ధమై గుప్పెడు బూడిద మిగలడానికి కొన్ని ఆయుధాలు చాలు. అప్పటినుండి తక్కిన ప్రపంచ దేశాలు మానవత్వాన్ని మరిచిపోయి, పేదల కడుపుకొట్టి, మారణాయుధాలు తయారుచేసి మానవుల మనుగడకే ముప్పు ఘటించే స్థితికి తెచ్చాయి. దీన్ని గ్రహించిన కవులు మానవతని దృష్టిలో పెట్టుకుని శాంతి ప్రచారానికి పూనుకున్నారు.

వేదుల ప్రపంచ పరిస్థితిని ఈ ఖండికలో ఇలా వ్యక్తపరిచారు.

ఏ జాతి కాజాతి యీనాడు గొంతెత్తి
శాంతి ప్రచారమ్ము సలుపుచున్నది పైకి
... ... ...
... ... ...
లోలోన భయ సంశయాలతో మతిపోయి
తిన తిండికై కట్టుకొన గుడ్డకై నవయు
ప్రజల నోళులు గొట్టి పసిడి యంతయుబెట్టి
ఆయుధా గారమ్ములౌ పెద్ద రాజ్యాల
నాశ్రయించు చున్న దణ్వస్త్ర లబ్ధికై ము. పు 7

నేడు దేశాధినేతలు అన్న వస్త్రాల కోసం ఆరాటపడే ప్రజల గోడును వినిపించుకోవడం లేదు. వారు అణ్వస్త్రాలకై ఆయుధాగారాలుగా పేరుపడ్డ అగ్రరాజ్యాలైన రష్యా, అమెరకాల నాశ్రయించడం వ్యక్తం చేయబడింది.

చెట్టు తొర్రల్లో నివసిస్తూ, ఆకుల్ని కట్టుకుని, జంతువుల్ని వేటాడి, పచ్చి మాంసాన్ని తిని బ్రతుకు సాగించే ఆదిమానవ జీవనం నుండి పెరుగుతూ వచ్చిన నేటి నాగరకతా వృక్షం మానవోత్తముల మేధాకృషి ఫలితం. ఆ వృక్షం నాశనమై అవని పెనువల్లకాడై పోవునేమో యని ప్రజల భయాన్ని ఇలా ఉద్ఘోషించారు.

తొలి మానవుని నాటు మొలిచి నానాటికిని
శాఖోపశాఖా విసార విస్తారమై
మానవోత్తముల మేధా నిదర్శనముగా
నిఖిల విశ్వమ్ముపై నీడలార్చెడి నాగ
రకతా మహావృక్ష రాజమ్ము నాశమై
అవని పెనువల్లకాడై పోవునోయని
... ... ... ...
... ... ... ...

అందరు ప్రాణాల నరచేత బెట్టుకొని
బ్రతుకు చున్నారీ ప్రపంచమ్ములో నేడు! ము. పు 8

దీని కంతకూ కారణం "మానవుని దృష్ట హృదయమ్ములోని తృష్ణ." అది "ప్రేమ బాహ్యమై మతము పేరిట ధర్మమర్మములు గోసి నర్తనము" సేస్తుంది. బుద్ధుని అహింసా పథమ్ము, శంకరుని జ్ఞాన పథమ్ము, క్రీస్తు త్యాగ పథము, మహమ్మదు సౌభ్రాత్ర పథము నరుల స్వార్థపరతను మాన్పజాల కున్నవని ఆయన ఆవేదన.

"ఒరుని నెత్తుటితో తన యుదర పూర్తి
సలుపుకొను చున్నదిపుడు తృష్ణా పిశాచి" ము. పు 9

అని అనడం అక్షరాల నిజం. ఇచట వారి వాక్యాలే అను సంహితాలు.

"కుల, మత, వర్ణ ద్వేషాలతో ఒళ్ళు తెలియకుండ ఒకరి గొంతు ఒకరు తెగ నరుకు కొంటున్నారు. శ్రామికుల కష్ట నిష్ఠురాలకు ధనికులు కండ్లెర్రజేస్తున్నారు. పాలితుల మీద పాలకులు నిరంకుశ ఖడ్గము విసురు తున్నారు. నోట్లకట్టలు అడ్డపడి ధనికుల ఇనుపపెట్టెల సొరుగులు లాగినా రావడము లేదు. రోజల్లా కష్టపడినా కార్మికుడి కడుపు నిండడము లేదు. అర్థకామాలకై సాగుతున్న ఈ పోరాటములో మానవుడు మానవత్వాన్ని కోల్పోతున్నాడు."[1]

పురోగమ నావరోధాలైన మానవుల మధ్య ఉన్న కుల, మతాది కుడ్యాలు; భాష, దేశం మొదలైన సంకుచితమైన ఎల్లలు కృత్రిమ వేషాలనడం ఆయన హృదయ వైశాల్యాన్ని చెప్తుంది.

బాసను బట్టి దేశమును బట్టి మతంబును బట్టి రంగు వ్య
త్యాసము బట్టి శత్రువుల యట్టులు మానవులెల్ల ద్వేష రో
షా సహనమ్ములం బెనగు లాడెద రయ్యవి కృత్రిమంపుపై
వేసము లంచు నెంచ కురిపెట్టుకొనంగ తెగింతు రేలకో

1. 'మన సాహిత్యంలో మార్పులు'-అభ్యుదయ, మా. 1947 పుట 70

పక్షులూ, జంతువులూ సమష్టిగా జీవిస్తుండగా మానవుడు మాత్రం ప్రక్కవాని జీవితాన్ని ఆర్పేయ జూస్తున్నాడని యథార్థాన్ని ఇలా చెప్పారు.

ఒక్క మహీజ మందె విహగోత్కరముల్ తమ గూళ్ళలోన ఏ
చిక్కుల పాలుగాక నివసించు పరస్పర మైత్రితో - మృగా
లొక్కడ మందగా బ్రతుకు చుండు సమష్టిగ గాని, మానవుం
డక్కట! ప్రక్కవాని బ్రతుకార్పనె చూచు దయావిహీనతన్

అని తలపోస్తూ కవి పడకపై మేను వాల్చి జీవిత చింతల్ని మరపించే గాఢ నిద్రలోనికి జారుకున్నాడు. అప్పుడు స్వప్నములో ఒక మహామహుడు కనిపించి ఇట్లనినాడు.

దేవళ మీ సమస్త జగతీతల మంచెదనమ్మి, స్వార్థముం
బోవిడి, సర్వభూత హితమున్ మత మంచు దలంచి, జాత్యహం
భావము మాని, మానవ సమాజము సర్వమొకే కుటుంబ మన్
భావనతో చరించిన, ప్రపంచము శాంతి నికేతన మ్మగున్

నిజంగా భావిస్తే ఈ ప్రపంచ మొక దేవాలయం. సర్వభూత హితమే మతం.

అంతే కాదు; మన మందరము విశ్వపౌరుల మంటున్న ఆ మహానుభావుని వాక్యాలివి.

ఏ జాతియో దేశమేదియో ఏ వర్ణ
మో, మతంబేదియో పోనిమ్ము మనకేల
మనము మానవుల మీ మహికి కామందులము
విశ్వపౌరుల మొక్క వృక్షమ్ము చివురులము

ఇలా అనడం మానవతకు అవధులు లేకపోవడం. మరియు

పేద కన్నుల నశ్రుబిందు వొక టురలెనా
ఉదధు లేడీ యెడద నుప్పొంగి పోవలయు!

పుడమి ప్రాకెడి చిన్ని పురుగేని బడలెనా
ఊర్పు గాలుల విసరి ఉపచరింపగ వలయు!

అని చెప్పి ఆ మూర్తి మాయమైంది. అపుడు కవి మేల్కొని ఇలా అనుకున్నాడు.

"స్వప్నమైనచో నిది మహాశ్చర్యకరము
సత్యమైనచో నిది మహోత్సవ దినమ్ము" ము. పు 12

ఈ ఖండిక వారి అభ్యుదయ భావనకు, అహింసా సిద్ధాంతానికి పరాకాష్ఠ. ఆయన మానవతా హృదయానికి ప్రతిబింబం. ప్రపంచ సమస్యల పటం

సంఘంలోని అన్యాయాన్ని, అధర్మాన్ని ధైర్యంగా తీవ్రంగా నిరసించడం ముక్తఝురిలో ఇంకా కనపడతాయి. 'మా తల్లి' అనే ఖండికలో

సోదర శోణితమ్ము జవిజూచెడి క్రూరులు, కార్మిక ప్రజా
స్వేద ఫలమ్ముతో నినుప పెట్టెల నింపెడి నిర్దయుల్ మతో
న్మాద నిరంకుశుల్ దురభిమానులు నిండిన లోకమందు అ
స్మాదృశ దుర్బల ప్రజల మన్పగ తల్లి! త్వదన్యమున్న దే!

భారతదేశాన్ని తల్లిగా భావించి చెప్పిన పద్యమిది. సోదరుల రక్తాన్ని రుచిజూచే క్రూరులు, కార్మికుల స్వేదముతో పెట్టెలు నింపుకునే నిర్దయులు వీరి కవితలో చోటు చేసికోవడం గమనించవలసిన విషయం. కనుకనే డా. శొంఠి సూర్యనారాయణరావుగారిలా అన్నారు.

"Legislators of mankind అనిపించుకొన్న మహాకవులు ధర్మాధర్మాల మధ్య నిరంతరం జరిగే సంగ్రామంలో ధర్మంకోసం, సంఘ సంస్కరణ కోసం ప్రజానీకానికి అండగా నిలుస్తారు. వారిని ఉత్తేజ పరుస్తారు. శ్రీ వేదులవారు అట్టి ప్రజాకవులు."[1]

---

1. ప్రస్తావన – ముక్తఝురి. పుట XXII

ఇట్టిదే మరొకటి.

ధనిక నిర్దాక్షిణ్యమున కమ్ముడై మ్రగ్గు
కార్మిక ప్రజల యాక్రందనములకు మ. పు 62

ఇవన్నీ వేదుల పేదకార్మిక ప్రజలకై కలాన్ని బలంగా నడిపిన వ్యక్తి అనడానికి దృష్టాంతాలు.

పై విధంగా కర్షకులకై, కార్మికులకై కలంపట్టి, చిట్టెము కట్టిన చారిత్రిక బంధాల్ని తెగ తెంపులు జేయ సమకట్టడమే గాక, రాబోవు ఉపద్రవాల ప్రభావాల్ని వ్యక్తీకరించి, సర్వమానవ సంక్షేమానికై సృజనాత్మక రచనలు గావించిన మానవతావాది వేదుల.

అందేతనే ఆయన 'అభ్యుదయాన్ని' 'అభ్యుదయ రచన'ని ఇలా నిర్వచించి సత్యకవులై, సత్యనామాన్ని సార్థకం చేశారు.

"అన్న వస్త్రాలు లేనివాడు కానీ, అక్షరాస్యుడు కానివాడు కాని లేక పోవడమే అభ్యుదయము. మానవుడు మానవుడుగా జీవించేటట్లు చేసేదే అభ్యుదయ రచన."[1]

ఇంతవరకు 'దీపావళి'లోని 'దేశభక్తి' మొదలైన వాటిని గూర్చి ఏకీభవించిన చోట ముక్తఝురిని కలుపుకుని పరిశీలించుట జరిగింది ఇక పరిశీలింపగా మిగిలిన 'ముక్తఝురి' విశేషాల్ని తెలిసికుందాం.

## 7. ముక్తఝురి

వేదులవారి అద్వితీయ కావ్యం 'దీపావళి' అయితే ద్వితీయ కావ్యం ముక్తఝురి. 'దీపావళి' సంకలనం తరువాత ఆయా సందర్భాలలో రచించిన కవితా ఖండికలు 'ముక్తఝురి' రూప మెత్తాయి. ఇందలి ప్రథమ ఖండిక శీర్షిక నామమే ఈ సంకలనానికి సంకేతంగా ఉంచబడింది. ఇందు 'ముక్తఝురి' వంటి స్వేచ్ఛా సందేశాలు,

1. మన సాహిత్యంలో మార్పులు-అభ్యుదయ మా. 1947. పుట 70

'స్వప్నము'వంటి మానవతా ప్రబోధాలు, కవి ప్రశంసలు, కృతజ్ఞతలు, స్మృతి కవిత లిత్యాదు లున్నాయి.

ఇందలి రచనల విశిష్టతను గూర్చి డా.శొంఠి సూర్యనారాయణ రావుగారు ఏతద్గ్రంథ ప్రస్తావనలో ఇలా అన్నారు.

"ఈ సంకలనంలో దేశభక్తిని ప్రబోధించే జాతీయ గీతాలు, స్వాతంత్ర్యాగమనం, చైనా దురాక్రమణ వంటి సందర్భములలో జరిపిన రచనలు యిత్యాదులు ఉన్నాయి. భావకవులు కావడంచేత వారి కవితలో కథా వస్తు వేమయినప్పటికిని ప్రత్యేకత కనబడుతుంది. 'తెలుగుతల్లి'పై వారికి గల మాతృ ప్రేమ యీ సంపుటిలో వ్యక్త మవుతుంది. తెలుగువారి నుత్తేజ పరిచే గీతాలు యిటువంటివి చాలా అరుదుగా వెలువడ్డాయి. ఈ విధంగా పాఠకుల హృదయాలకు హత్తుకొని పోయే రచనలకు 'మిత్రస్మృతి'ని తార్కాణంగా పేర్కొన వచ్చును. 'అంధగీతి' అనే శీర్షిక కూడ ఇట్టి చేతనాత్మకమైన రచన."[1]

ఇక వీటిని గూర్చి వరుసగా తెలిసికుందాం. ముక్తఝురి గూర్చి 'దేశభక్తి'యందు 'స్వప్నము' గూర్చి 'మానవత'యందు ప్రస్తావింప బడ్డాయి.

## చరణ ధూళి

ప్రజలకు బుద్ధునిపై గల అభిమానాన్ని, ఆయన విశిష్టతని వ్యక్తం చేసే సంఘటన ఇది. అది హేమంత కాలం. మంచు దట్టంగా పడుతుంది. అందుచే పద్మసంతతి సమస్తం నశించి పోయింది. కాని ఒక్క సుదాముని పుష్కరిణిలో మాత్రం అద్భుతమైన పద్మమొకటి పూచింది. అతడు దాన్ని అమ్మడానికి పురవీథికి తీసికొని వెళ్ళాడు. అచటివారు అకాల పుష్పిత పద్మాన్ని ఎంతవెలకైన కొనడానికి ఇలా పోటీ పడ్డారు.

---

1. ముక్తఝురి - ప్రస్తావన. పుట XV

రాత్రి గొట్టిన యీదరకు తప్పి ఈ సుంద
రాబ్జ మబ్బుట భాగ్యమనియె నొకడు
పురికి విచ్చేసిన బుద్ధదేవుని యర్ఘ్య
మున కర్హతమమిది యనియె నొకడు
బోధి సత్త్వుని జూడబోదు నీ కమల మూ
ల్యం బెంతయో చెప్పుమనియె నొకడు
అర్హాతునకు పద్మమనిన నెంతో ప్రీతి
అర్పింతు నా కమ్మమనియె నొకడు

ఇట్లు లహ మహమిక మీర నెల్లవారు
పద్మమును గొన నారాటు పడెడు నప్పు
డఖిల మంగళ గీత వాద్యములు మ్రోయ
సపరివారంబుగా, ధరాధిప వరుండు      ము. పు 14.15

పద్మాన్ని కొనడానికి ప్రజ లారాటు పడుతున్న సమయంలో వనాన ఉన్న బుద్ధ భగవానుని కొల్వడానికి వెళుతున్న ప్రసేన జిజ్జనపతి పద్మహస్తుడైన సుదామునితో ఇలా అన్నాడు. ఓ

మాలి! అకాల పుష్పిత సుమమ్మునకున్ వెల దేల్చి చెప్పుమా
వైళమ యేను బుద్ధ భగవచ్చరణార్చన కేగగా వలెన్

అంత సుదాముడు పద్మమూల్యం ఒక సువర్ణ మన్నాడు. పది సువర్ణాలు తీసికోమని ప్రభువన్నాడు. ఇరువదని గుంపులో నుండి ఒక డరచినాడు. ముప్పదని, ఏబదని క్రమంగా పద్మ మూల్యాన్ని పెంచు తున్నారు. ఇలా వివాద పడుతున్న రాజుని, ప్రజల్ని జూచి తలవని తలంపుగా వింత వెలుగుతోచి ధనముపై నాసమాని

భూవిభుండాదిగా సేవకు వరకు
సంపన్నుడాదిగా సామాన్యుదాక
ధనమెంత వ్యయమైన వెనుకాడబోక
కడగి పోటా పోటీగా వెలపెట్టి

ఎవ్వరి కోసమై యేయర్థమెంచి
యీతమ్మి కొనలకై యెగబడుచుండి
రతనికి నేనె యీ యబ్జమర్పించి
యీ పరమార్థ మేలందగా రాదొ! ము. పు 16

అని అనుకున్నాడు. అంత అచటివారితో పద్మ మమ్ముకోవడ మిష్టం లేదు; క్షమింపుడని చెప్పి బుద్ధుడున్న ఆరామానికి బయలు దేరాడు. సుదాముడు చూచిన బోధి సత్త్వుని స్వరూప మిది.

అరుణా ధరమ్ముపై విరియు సుందర మంద
హాసమ్ములో శాంతి మోసులెత్త....

తనువుగొన్న అహింసా సుధర్మమట్లు
కరడుగట్టిన సత్య ప్రకాశమట్లు
క్షితి తలాన పద్మాసనాసీనుడైన
బోధి సత్త్వుని గనె సుదాముడు క్షణమ్ము! ము. పు 17

సుదాముడు కరుణామూర్తియైన బుద్ధునికి మొక్కి తాను తెచ్చిన పద్మాన్ని ఆయన పాదములపై ఉంచి తనువు ధన్యమైనట్లు తలస్తూ భక్తితో నిల్చున్నాడు. అప్పుడు బుద్ధుని కపోల దరస్మిత కాంతిరేఖలో శీతల వీక్షణకోచిలో కృపామృతం పాయలు పాయలై అచ్చటి లతాతరు సమూహం వింత వికాసంతో ఒప్పింది. అంత

పాయని ప్రేమ బుద్ధ భగవానుడు మోమొకయింత యెత్తి కన్
దోయిని పాలవెల్లి నయిదోడగు హాసము మోసులెత్త 'వ
త్సా! యెది నీయభీష్ట' మనినంత సుదాము డెరుంగరాని యే
దో యనుభూతి 'మీ చరణధూళి' యనెం బులకించి పోవుచున్

సుదాము డెరుంగరాని యనుభూతితో 'చరణధూళి' యనుట ఈ ఖండికకు కొసమెరుపు. సుదాముని ప్రపత్తిని బుద్ధ భగవానుని ప్రతిపత్తిని చాటుతుం దీ ఖండిక.

అంధగీతి

వస్తూ పోతున్న జన సమూహంతో నిండియున్న వీథి అచ్చట అంధ బిక్షకు డొకడు గొంతెత్తి ఏకతారకు శ్రుతిగలిపి పాడుతూ ఉంటాడు. 'కానబడవేమి! స్వామి నాకంటికి' అను వాని పాట జనుల చెవిసోకే ఆవకాశం లేకపోవుటచే వేడిగాలిలో కలిసిపోతుంది. ఆ మార్గంలో పోతున్న కవికి అతని పాట వినిపించును. కాని ఈయనకి గుడ్డివాడను దయతప్పించి పాట భావం మాత్రం పట్టలేదు. ఒక రోజు సాయంత్రం అంధ భిక్షకుని పాటలో వీరికి ఏ నిగూఢార్థమో స్ఫురియించి అచట పారవశ్యంతో నిలిచిపోయారు.

గోకుల బృందావనీ కుంజవీథుల
మారు మ్రోగిన మురళీరవమ్ము
ప్రాచీన తాపసాశ్రమవాటికల నుండి
నిర్గమించిన యౌపనిషదరవము
కాశికా గంగోర్మికా రస గర్భమౌ
ఆచార్య వరుల బోధారవమ్ము
శారదా పాద మంజీరమ్ములౌ కవీ
శానుల సరస వాచారవమ్ము

అంధు మొరతోడ బెరసి నా యాత్మవిరిసి
ఆ నఖ శిఖమ్ము రక్తనాళాంత రాంత
రాల స్పందించి పెనుగాలి వోలె రేగి
తూల్చివైచె నహంకార ధూళినెల్ల                ము. పు 20, 21

అంధుని మొరయందు మురళీరవాదుల్ని వినుటచే కవి అహంకారం మటుమాయ మయింది. అపుడు నిరహంకారియైన కవి పశ్చాత్తాపంతో లోక సత్యాన్ని ఇలా వెల్లడించారు.

చూడవలెనన్న కాంక్షతో పాడుకొనెడు
అంధునార్తా రవమె సత్యమైన గీతి!

కన్నులుండియు చూడగా కాంక్షలేని
యంధుడను నేనె నాపాటె యంధగీతి! ము. పు 21

సత్యాన్వేషణ కాంక్ష కలిగి యుండాలనేది ఇందలి ఉపదేశం.

## విహగ గీతి

శాస్త్రిగారు దీన్ని కృష్ణశాస్త్రిగారి 'స్వేచ్ఛాగానము'లోని 'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' అను గేయాన్ని మనసులో పెట్టుకునే 'సొగసుల పుట్టవో యెగిరెడి పిట్ట!, దిగిరావె యొకమారు దివినుండి భువికి' అని ప్రారంభించినారని తోస్తుంది. దివినుండి భువికి దిగిరాకపోవడానికి కారణం సొగసుల పుట్టయైన పిట్టనిట్లు ప్రశ్నించారు.

జనులన్న భయమో యసహ్యమో నీకు
అడుగు సవ్వడియింత యాలించినంత
అందాల నీరెక్క లాడించు కొంచు
నెచటికో యెందుకో యెగిరి పోయెదవు
నిను వెంబడింప నా మనసౌనుగాని
వాయు విమానంబునా యేమి నేను? ము. పు 24

పిమ్మట విహగ గీతాన్ని ప్రశంసించారు.

మాతృదేవత కంఠ మధుర స్వరమ్ము
నీ గొంతులో మారు మ్రోగునో యేమొ
మోదాన నుప్పొంగి పోవు నా యెడద
చవులూరు నీ పాట చెవి సోకినంత ము. పు 24, 25

మరియు

ఆడుచు బాడుచు హాయిగా మింట
నీవలె దిరుగాడ నేనెంతుగాని

లేవు రెక్కలు నాకు లేదు సాహసము అని పక్షితో ఆకాశంలో తిరగడానికై రెక్కలు లేనందులకు బాధపడ్డారు. రెక్కలు లేవు కాబట్టి పక్షినే భువికి దిగి రమ్మన్నారు.

నరు లందరును స్వార్థపరు లనుకొనక
పరహింస కలరెడి వా రనుకొనక
కవి హృదయాల రాగము శృతి గల్ప
దిగి రావలయు నీవె దివి నుండి భువికి ము. పు 26

నరులందరినీ ఒక గాటను కట్టివేయడం మంచిది కాదంటూ, కవుల రాగాలతో శృతి కలపడానికి భువికి దిగి రమ్మనటలో వేదుల వైతాళికత్వం వ్యక్తమవుతుంది.

మొత్తం మీద 'విహగగీతి'లో గౌతమీ కోకిల హితోపదేశం భూమిపైనే స్వేచ్ఛాగీతాల్ని ఆలాపించాలనడం.

## తుది బేరము

ఇది రవీంద్రుని గీతానికి అనువాదమని వేదులవారే చెప్పారు.

'ఎవరు కొంటారో! నావెవరు కొంటారో' అని తలమీది సరకుల తట్టతో తిరుగుతున్నాడు. ఇచట ఎవరు తిరుగు తున్నారనేది చెప్పలేదు. కనుక కవి అనే మనం గ్రహించాలి. రాజమార్గంలో తిరుగుతుండగా పైడి తేరెక్కిన భూపతి వచ్చి 'నా శక్తితో కొనియెద నిన్ను' అని అంటే 'మించిన లొంగు బల్మికి లెక్కయేమి' అని అనగా రాజు వెళ్ళి పోయాడు. సందులో వెళ్ళుతుంటే 'పైడి యొసగి కొందును నిన్ను' అని వృద్ధ ధనికుడన్నాడు. 'నిలువని ముల్లె నిష్ఫల' మనే తలంపుతో మరలి పోయాడు కవి. సుందరి ఒకర్తె 'నా నవ్వుతో కొనెదను నిన్ను' అని అంటే 'లే నవ్వు కన్నీట లీనమగు తుది' కని అనగా ఆమె వెళ్ళి పోయింది.

సాగర తీరాన ఇసుకలో ఆలిచిప్పలతోడ ఆడుకొనే పసిపాప ఎరుగున్నట్లు వచ్చి 'ఏమీయకయే నిన్ను నేకొందు' ననడంతో

'అటకు నేనిట్టె అమ్ముడైపోతి ము. పు 24
తలమీద భారమంతయు తీరిపోయె!' అని ముగింపబడింది.

శక్తి, సంపద, అందం క్షణికాలనే భావం ఇందు ఉపదేశింప బడుతుంది. అమాయకత్వం, కోమలత్వం, నైర్మల్యం గల పసిపాప ఆటకు అమ్మడై పోవుట అనివార్యమని ఇందలి సందేశం.

## కృతజ్ఞత

నవ్య సాహిత్య పరిషత్తు నవమ వార్షికోత్సవం 24-12-1942 నుండి 27-12-42 వరకు ఏలూరులో మహావైభవంగా జరిగించి. దీనిలో అంతర్భాగంగా చతుర్థ దివసమున పరిషత్తువారు వేదుల వారిని సన్మానించారు. తనకు జరిగిన సన్మానానికి ఆయన ప్రకటించిన 'కృతజ్ఞత'యే ఇది.

నాటి సన్మాన సభాధ్యక్షులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. శ్రీ కురుగంటి సీతారామయ్యగారి వేదాశీర్వాదంతో కార్యక్రమం ప్రారంభ మయింది.

విశ్వనాథవారు ఉపన్యసిస్తూ

"వేదుల విలక్షణమైన కవి. ప్రతి శబ్దానికీ ఏదో ఒక గుణం ఉంటుంది. ఓజస్సో, మాధుర్యమో, ప్రసాదమో ఈ మొదలైన పది గుణాలలో ఏదో ఒకటి ఉంటుంది. మాధుర్యమే గుణంగా కల శబ్దాలను ఏరియో, లేకపోతే అగుణ పాత్రిచర్యం కలిగేటట్లో ఒకానొక కవే చెయ్యగలడు. ఇది పూర్వజన్మ సంస్కారంచేత కలిగేశక్తి. ఆ సంస్కారం శ్రీ వేదులకు సమృద్ధిగా ఉంది. అది (మాధుర్యం) శ్రీ వేదులలో కనిపించినంత మధుర మధురంగా మరియొకచోట లేదనే నా ఉద్దేశం."[1] అని వేదులవారిని మాధుర్య గుణ యుక్తంబైన కవితా నిర్మాణంలో సాటిలేని మేటియని ఉగ్గడించారు.

తరువాత సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు భావరాజు వెంకట కృష్ణారావుగారు కవిగారికి వారికీ గల స్నేహబంధాన్ని గూర్చి చెప్తూ

1. 'కవి-సన్మానము' ప్రతిభ. న.స.ప. పుట 517

"జీవితం ఎడారి కాదు. జీవితం దుఃఖమయం చేసుకున్నా, ఆనందంతో నింపుకొన్నా మన మనసే కారణం. జీవిత క్షేత్రంలో పరిమళించే మంచి పూవులు పూయించి, కాయలు కాయించి, పండ్లు పండించే కర్షకునివలె నరుడు ప్రయత్నం చేయాలి. జీవితం అమృత మయం చేయాలి"[1] అని దుఃఖిస్తున్న కవికి చేసిన హితోపదేశాన్ని వివరించారు.

పిమ్మట కాటూరి మాట్లాడుతూ నవ్యసాహిత్యానికి సౌలభ్యాన్ని, సారళ్యాన్ని సమకూర్చిన కవియని అభివర్ణించారు.

అనంతరం శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 'దీపావళి'ని గూర్చి కూలంకషంగా చర్చిస్తూ చివరగా "కావ్య కుసుమావళిని సేకరించే వారికి మరో కవివి ఇన్ని ఖండకావ్యాలు జాబితా లోనికి రావేమో?"[2] అని ముగించారు.

తదనంతరం శ్రీ శివశంకరశాస్త్రిగారు "పండిత కవి పరిషత్తులో మహాజన సమక్షములో మర్యాద జరగడము మహాఘనము."[3] అని అంటూ వేదులతో గల స్నేహబంధాన్ని, వారి వంశాది వివరాల్ని, కవితా కళని వాకుృచ్చారు.

చిట్టచివరగా కృష్ణశాస్త్రిగారు శాస్త్రిగారితో గల అనుబంధాన్ని వివరించి "కవి పరమశివుడు. కాలకూటం లోపల దాచిపెట్టుకొని వెన్నెల ప్రసాదిస్తాడు శివుడు. కవి దుఃఖాన్ని హృదయములో దాచు కొని ఆనందం పంచిపెట్టుతాడు. వేదుల కవిత్వములో వేదనతో పాటు తీయదనం ఉన్నది. ఈ తీయని వేదనే మనల్ని ఆకర్షిస్తుంది.

వేదుల ఇంట మొదట దీపము లేదు. ఇప్పుడందులో చంద్రబింబ మున్నది. ఆరు చిన్న చిన్న దీపాలు వెలుగు తున్నాయి. ఆయనకు దీపావళి ఉంది"[4] అని ముగించారు.

---

1. 'కవి-సన్మానము' ప్రతిభ. న.న.స. పుట 321
2. పుట 334. 3. పుట 334 4. పుట 340

ఈ విధంగా సాహిత్య సహవర్తులిచ్చే శుభాశిష ప్రశంసలకు సంతోషించి వారికి కృతజ్ఞత ఇలా తెలియజేశారు.

నా నడతెంచుత్రోవ సుమనః ప్రతతుల్ వికసించి సౌరభా
హ్వాన మొనర్ప వాఙ్మయ సహవర్తు లిచ్చు శుభాశిషప్రశం
సా నినదాలతో మరువ జాలని మన్నన జేసినట్టి హే
లా నగరీ రసజ్ఞుల కళారతి నా మతి బాయదెన్నడున్

ఇది వేదులకి మరువజాలని మన్ననయే. కనకనే ఒక సుఖ స్వప్నం సత్యంగా పరిణమించిందనుకొని "ప్రస్ఫుర ద్దేహముతోడ భాగ్యమయ దేవత సన్నిధిసేత"* అను తిక్కన మాటల్ని జ్ఞప్తికి తెచ్చుకున్నారు.

మరియు ఈ సన్మాన మింతగా వారికి ఇంపూ, పెంపూ నింప డానికి కారణం ఇలా వెలిబుచ్చారు.

నరపతి మెచ్చియిచ్చెడు ధనంబులు గాని, మణీ విభూషణాం
బర బిరుదాగ్రహార పరివార విసారము గాని, నాకిటుల్
సరసులు పండితేంద్రులు కళా జగతీ సహయాత్రికుల్ మహా
దరమున జేయు మన్నన విధంబున నింపును బెంపు నింపునే!

సమకాలం వారు, అందులోనూ విద్వాంసులు పైపెచ్చు సహవర్తులైన వారు మెచ్చుకోవడం సాధారణ విషయం కాదు.

## సత్కృతి

భద్రగిరి సాహితీ సమితి సభ్యులు వేదుల్ని సన్మానించగా దానికి కవి స్పందనయే ఈ సత్కృతి.

'పుట్టిన దేశమంచు, రఘు పుంగవు సన్నిధియంచు' నీ సత్కృతికి సమ్ముదం పడ్డారట. తమకు సత్కృతి భాగ్యయోగ్యతలు భద్రగిరి వాసుని ప్రాపున జేసియే లభించాయని ఆయన నిలా స్తుతించారు.

---

* విరాటపర్వం - చతుర్థాశ్వాసం, పు 150 వ పద్యం.

నీ పదధూళి సోకి రమణీత్వము నందదె రాయి, పాదుకా
రూపమునన్ భవత్పద సరోరుహసేవ యొనర్చి దారువు
ర్వీ పరిపాలనంబు నొనరింపదె! అట్లె లభించె నాకు నీ
ప్రాపున జేసియే రఘువరా! యిటు సత్కృతి భాగ్యయోగ్యతల్

## ముద్దాడ

ఇది ప్రశంసాత్మకమైనది. శ్రీ ముద్దాడ లచ్చునాయుడుగారు శ్రీకాకుళం జిల్లాలోని ఈదుల వలస నివాసులు. విద్వత్కవి పోషకులైన వీరు వేదుల్ని తమ గ్రామానికి రప్పించి భూరిసత్కారం గావించారు.

"అమితౌదార్యము నెంచి భూజనము ముద్దాడంగ మీవంశ నా
మము ముద్దాడగ నయ్యె!" అని గృహనామోత్పత్తిని వివరించారు.

"కులమో జాతియొ ప్రాంతమో మతమొ సాకుంజేసి సాహిత్యపున్
విలువల్ గట్టెడు కాలమందు" ఎక్కడ కావలి? ఎక్కడ ఈదుల వలస? మన యుభయుల కెట్లొదవె స్నేహమని ప్రశ్నించుకుని కవిగారే ఇలా సమాధాన మిచ్చారు.

"కలసికొందురిట్లె కవియు రసజ్ఞుండు
ఉదధి లవణ మడవి యుసిరి కట్లు" ము. పు 51

## ఉగాది కవితలు

ఇవి ప్రకృతి వర్ణన కాటపట్టులు. నిత్య సత్యముల కాలవాలములు.

భూత కాలము కన్న రాబోవు కాల
మభ్యుదయ దాయ కమ్మను నాశ సహజ
మెల్లవారికి అట్లుకాదేని బ్రదుకు
భారమైతోచు నెంతటి వారికైన ము. పు 89

అని నిత్యసత్యాన్ని పలికిన సంతత భవిష్యదాశాభి సరణ జీవి వేదుల.

మిత్రస్మృతి

ఆంగ్ల సాహిత్య ప్రభావంతో అవతరించిన స్మృతి కవిత్వం ఆంధ్ర సాహిత్యంలో అంతంత మాత్రమే కనపడుతుంది.

"The Elegy is a Lyric expressive of melancholy or grief, in particular, when commemorative of dead friend."[1]

అనుదానికిది నూటికి నూరుపాళ్ళు సరిపోతుంది. వేదుల కావలి కళాశాలలో పనిచేస్తున్న కాలం. పి.రమణారెడ్డిగారు కళాశాల పాలక వర్గ సభ్యులు. నిషధ యోగ్యులు. ఒకనాటి సాయంవేళ కళాశాల నుండి వస్తూ రైలు క్రిందపడి దుర్మరణం పాలైనారు. అందుచే వేదుల హృదయం వేదనా భరితమైంది. ఆ వేదన అక్షరాకృతి దాల్చింది. అదియే మిత్రస్మృతి. ఇందు రమణారెడ్డిగారి సద్గుణాల్ని స్మరించారు.

కళానిలయాన్ని కనుగొన్నప్పుడల్లా ఆయన స్మృతిచే కనులు చెమ్మగిల్లుతున్నాయట.

పోయిన వారెటుల్ బ్రతుక బోవరు గుండెలు వ్రీలనెంత వా
పోయిన గాని నిన్మరచి పోగలమే? త్వదనారత శ్రమో
పాయనమౌ కళానిలయ వాటిక కన్గొని నప్పుడెల్ల నీ
మాయని తీయనైన స్మృతి మా కనులం దడి సేయకుండునే?

హృదయ విదారకమైన పద్య మిాక్రిందిది.

భాగ్రతగా నిన్ను సంభావించు విద్యార్థి
సంతానమును నిరాశ్రయ మొనర్చి
చెమట నెత్తుఱుగ నీచే బెంపబడిన కా
వలి కళాశాల నాకులము పరచి
అరక్రమగ్గిన ఫలం బామయ పీడిత
యైన నీ జనని దుఃఖార్త జేసి

1. Encyclopedia Americana - Volume 17.

నీవె లోకమైన నిండు చూలాలి నీ
యిల్లాలి గన్నిటి వెల్లిద్రోసి
ఎల్ల ప్రాపు నీవైన యింటిల్లి పాది
నాపదంబుధి ముంచి మిత్రాళి నొంచి
ముప్పదేండ్లకె నూరేండ్లు ముగియజేసి
యమర పురికేగితే మహోత్తమ చరిత్ర! ము. పు 106

ఏక రసమాకృతి దాల్చినట్లులుంది. ముప్పదేండ్లకే నూరేండ్లు ముగిసి మిత్రుని స్మృతికి మిత్రస్మృతి అక్షరాంజలి.

## దీవన

అమలాపురం నివాసియైన పి. అన్నాజీరావుగారు జర్నలిస్టు. వినోదమిక్కిలి కవులు. వీరికి వేదుల సంస్కృతాంధ్రాలలో గల మర్మాలు విప్పిచెప్పి కావ్యరచనా నైపుణ్యాన్ని కలుగ జేశారట. అందుకే పద్యనాటికల సంపుటాన్ని వేదుల కంకిత మిచ్చారు. అంకిత మివడానికి కారణాన్ని ఇలా చెప్పారు.

అనఘ స్వాంతులు భవ్య కావ్యరచనా వ్యాపార పారీణ వి
జ్ఞనుత ప్రజ్ఞులు మీరు మెత్తురను కాంక్షంగాదు; మీదౌ ఋణం
బును దీర్మాన మొనర్తు నెమ్మనను తలంపుంగాదు; నా కావ్య క
న్యను మీకిచ్చుట కోరకుండ గురుదేవా! యాత్మసంతృప్తికై*

ఇది 'సౌందర నందన' మంకిత పద్యాల్లోని 'కేతన తోడ' అను పద్యాన్ని తలపింప జేస్తుంది. ఇంత గాఢ గురుభక్తి యుక్త శిష్యుడు ఇచ్చే కావ్య స్వీకర్తృత్వాని కంగీకరించారు వేదుల. అంతేగాక ఉంచి దీవన' నందించారు. నాకు కృతి యీయడం

''జోగియు, జోగియు గౌగిలించుకో గుప్పెడు బూది రాలు

* 17-4-1959న శర్మగారు శాస్త్రిగారికి వ్రాసిన ఉత్తరం లోనివి.

నను కొంత యథార్థమొనర్చి తియ్యేడన్" అని చెప్పి తాను చేపగలిగింది 'దీవన' మాత్రమేయని పలికిన పద్యమిది.

నీకు ధనాశలేదు, మరి నే ధన ధాన్యము లీయజాలగా
నీ కవి నోట నీ మనసునిండుగ దీవన మాత్రమిత్తు నా
శ్రీ కమలా కటాక్షముల నీడ సమానుల లోన నుత్తమ
శ్లోకుడ వౌదుగాక సరసుల్ దలలూచు కృతుల్ రచించుచున్
'సమానానా ముత్తమ శ్లోకో భవతు' అనేది తెలుగులో పెగింది.

మనసా!

ఇది ముక్త్యురికి ముగింపు ఖండిక. వారి వైరాగ్య తత్త్వానికి సువర్ణాక్షర పేటిక. భగవంతుణ్ణి శరణుజొచ్చి మనః ప్రబోధముగా జన ప్రమోదముగా ఆలాపించిన గీతిక. నీ రోజు అయిపోయిందని మనసునకు చేసిన హెచ్చరిక.

ఈ భవాంభోధి నీవే రీతి దాటేవు
ఏమి తలపోసేవె ఓ మనసా!
కన్ను గానగరాని కటికి చీకటిలోన
ఎన్నాళ్ళీ నీ బ్రతుకు ఓ మనసా!
అస్తమించెను సూర్యుడంతరించెను సంధ్య
అయిపోయె నీరోజు ఓ మనసా! ము. పు 2

కనుక ఏదో మార్గాన్ని చూడమని కర్తవ్యాన్ని బోధిస్తున్న మేలుకొలు

గట్టుపై కూర్చుండి కంట నీరిడు చున్న
కానరాదే దారి ఓ మనసా!
ఇల్లు వాకిలిగాని, ఇల్లాలుగాని, నీ
కిపుడు తోడౌనటే ఓ మనసా!
కల్ల బంధాలెల్ల చల్లగా తెంపుకొని
గతి యేదొ చూడవే ఓ మనసా! ము. పు 112

చివరకు ఆ పరమేశుడొక్కడే శరణ మనుకోమంటున్న హితోక్తి.

భవ్య తేజోమూర్తి, భవకర్ణధారి ఆ
పరమేశు డొక్కడే ఓ మనసా
ఆపదలు-గీపదలు అణగునే ఇకనయిన
అతడె శరణనుకోవె ఓ మనసా ము. పు 112

వేదుల వైరాగ్య తత్త్వానికి ప్రతీకగా నిలిచిపోగల మేలికైత ఈ పాట 'వేదులవారి కథలు' అను గ్రంథంలో గల 'అనితమ్మ' కథలోనిది. ఇట్లు సర్వవిధ కవితా ఝరులు ముక్తఝరిలో ప్రవహించాయి.

## 8. ఛందో విశిష్టత

### పద్య విద్య

తెలుగువారి పద్యం రమారమి వెయ్యేళ్ళ పంట. అది పద్యవిద్యా సామ్రాజ్య పట్టభద్రుల ఏలుబడిలో పరిఢవిల్లిన సాహిత్య సంపదకు భద్రపేటిక. దాని జీవశక్తి సమస్తం ఆ పట్టభద్రుల ప్రతిభా ప్రాదుర్భూతం. వారి ప్రాశస్త్యానికి కుదురనదగింది పద్య విద్య. తెలుగులో ఈ పద్య విద్యకాద్యుడు నన్నయ. సంస్కృతమున దీనికి మూల విరాట్టు వాల్మీకి. కనుకనే నన్నయ భారతావతారికలో

"... .... గురు పద్య విద్యకు నాద్యు నంబురుహ గర్భనిభుం బ్రచేతను పుత్రుభక్తిదలంచుచున్"[1] అని వాల్మీకిని స్తుతించుట జరిగింది.

సంస్కృతంలో వాల్మీకికి పూర్వం ఛందస్సున్నట్లే తెలుగులో నన్నయ్యకు ముందు పద్య రచన ఉంది. అది పద్య రచనయే కాని పద్యవిద్య కాదు. కనుకనే సంస్కృతాంధ్రాలలో వాల్మీకి నన్నయ్యలు పద్య విద్య కాద్యులైనారు.

---

1. ఆంధ్ర మహాభారతం - ఆదిపర్వం. ప్రథమాశ్వాసం. 21వ పద్యం.

చాపయల్లినట్లు గణ యతి ప్రాసలుకూర్చి పద్యాన్ని సాఫుగా వ్రాసుకుని పోవడం పద్య రచన అవుతుందిగాని పద్య విద్య కాదు. భావానుకూల ఛందాన్ని ఎన్నుకోవడం, ఎన్నుకున్న ఛందంలో తదుచితంగా యతిప్రాసల్ని సంయోజించే నేర్పు, భావ స్ఫోరకమైన ఎత్తుగడ, ధారాశుద్ధి, సమాస గ్రథన చాతుర్యం, పద్యం బిగింపు సడల్కుండగా జాగ్రత్త పడటం, నడకలో ఒయ్యారపు విరుపులు, ఎత్తుగడక్కదగిన ముగింపు, భాష కాయువు పట్టులైన నుడికారముల, సామెతల సోయగం చెడకుండగా వాటి యొదుపు కనిపెట్టి వాడుకోవడం, అనుకున్న భావాన్ని సంపూర్ణంగా ఇమడ్చడం మొదలైనవన్నీ పద్య విద్యాంశాలు.

## వేదుల పద్యశిల్పం

పీటిని పుణికి పుచ్చుకునేది పద్య విద్య. ఈ విద్యలో ఆరియు తేరిన వృద్ధమూర్తి వేదుల. శతావధానాలు చేయడంవల్ల వీరికి ఛందస్సు నల్లేరుపై బండినడక. యతి ప్రాసలకై తలగోకికొనే అవస్థ ఉండదు. పదాన్ని బట్టి అర్థాన్ని మార్చుకునే అగత్యం లేదు. ఛందోఽశ్వాన్ని వారి స్వాధీనంలో ఉంచుకుని స్వారీ చేస్తారే కాని దాని యథేచ్ఛాగమనానికి తలయొగ్గరు. కాకపోతే తొలినాళ్ళలో అలవడ్డ ఆశుకవితా ప్రభావంవల్ల పద్యపు బిగింపు సడలిపోయే ప్రమాద ముండవచ్చు. అంచేత రాయప్రోలు వారిలాగే వీరును వేగాతివేగోక్తికి స్వస్తిచెప్పి రమ్యాక్షర క్షోణికి పయనించారు. నిల్కడగా పద్యాన్ని తీర్చిదిద్దారు. రానురాను నన్నయ్యను దలపింపజేశారు. పద్య విద్యా సామ్రాజ్య పట్టభద్రులుగా గడిదేరారు. కనుకనే పలువురు విజ్ఞ రసజ్ఞులిలా అన్నారు.

"అతనికి పద్యరచన ఒక పరమ మధురమైన హేల. అది ఒక తేనె పానకం. అతనిలో భావన గూడ చాల సుకుమారంగా ఉంటుంది." [1]

---

1. విశ్వనాథ 'ఆతిథ్యము' భారతి, మా. 1962 పుట 28

"ఆంధ్ర సంస్కృత పదాల చిక్కని చక్కని పొహళింపులతో, తీయని జాతీయ మాధురితో వృత్తా లల్లగల పద్య విద్యాధిక్యతలో శ్రీ శాస్త్రిగారితో తుల తూగ గల వారెంతో మంది లేరు."[1]

"ఈ కవి వృత్తాల రుచి పెంపు తరచు నన్నయాదులను స్పృశిస్తుంది"[2]

"వీరి వృత్తములలో నన్నయ ధారాశుద్ధి స్ఫురించు చుండును-నాగులవలె వాగులువలె ఉరకలు పెట్టే వీరి వృత్తాలలో గణాలు, యతిప్రాసలు కరగి భావాలతో కలిసిపోయి వాటి ఉనికిని కోల్పోయి నట్లనిపిస్తాయి"[3]

"భావావిష్కారంలో నేమి, సమాస విన్యాసంలో నేమి, కారక బిగింపులో నేమి, అంతటా ఆయన పద్య శిల్పమూ, శబ్ద సంగీతమూ నన్నపార్యుల కోవను జ్ఞాపకం చేస్తాయి."[4]

తెలుగు కవులు సంస్కృతాన్ని వాడినచోట సంస్కృత కవుల కన్నా మిన్నగా సమాసాన్ని ధారాళంగా, పరమ సుకుమారంగా వాడిన సందర్భాలు లేకపోలేదు. వారికి యతిస్థానం విచ్ఛేదం కనుక సమాసం అక్కడితో ఆగిపోతుంది. మన కా సమస్యలేదు. అక్షరమైత్రి కారణంగా సమాసానికి అడ్డూ, అపూ ఉండదు. సుందర సుకుమార సమాస రచనకు నన్నయ, తిమ్మన, పెద్దన, రాయప్రోలు మున్నగు వారు పేర్కోదగ్గవారు. ఈ కోవలో గణింపదగ్గవారు వేదుల. వేదుల వారి సమాస గ్రథనానికొక ప్రత్యేకత ఉంది. మృదుల మంజులము లైన పదాలతో అన్వయ కాఠిన్య రహితంగా సమాసాన్ని అల్లడంలో ఆయన దిట్ట.

---

1. 'తెలుగు వెలుగులు' ఆంధ్ర సచిత్ర వారపత్రిక 15-2-61
2. ఇంద్రగంటి 'వేదులవారి దీపావళి' భారతి. ఏ. 1938
3. ప్రభాతం 'భావకవితా మురళి-శ్రీ వేదుల దీపావళి' భా. సె.1922.
4. ఇంద్రగంటి భానుమూర్తి 'జయంతితే' విశ్వోదయ మాగ్జైన్ 75-76

'అప్సరః ప్రణయినీ కబరీచ్యుత పారిజాత మాలా విసరంబవో'
'శరద్విభావరీదేవి లలాటికా మణివో' పు 77
'ఆ మృదు చంద్రికా యవనికావృత నీల నభో నిశాంత శో
భామయ సీమలు పు 78
కోమల వల్లికావృత నికుంజ తలమ్ముల పు 83
జననాంత రామృత ప్రేమ రహస్యముల్ పు 100

ఇట్టి వీరి సమాసాలు లలిత పద విన్యాసంచే శ్రవణ సుభగం భావుకములై అర్థకాఠిన్యం లేనివగుటచే సద్యః స్ఫురణ శోభితాలై వ్యర్థపద రాహిత్యంచే అర్థ గౌరవ మహితాలై ఒప్పారు తున్నాయి. అంచేతనే

"కవిత్వానికి ఉచితమైన బాహ్యరూపం ఇయ్యటానికి శాస్త్రిగారికి ధారాశుద్ధి, పాండిత్యం, కళాకౌశలం ఉన్నవి. చక్కని సమాసాలు కూర్చి పద్యాన్ని శ్రవణ పర్వంగా చెయ్యటంలో వీరికీడైనవారు ఆధునికుల్లో లేరనవచ్చు."[1] అని కుం. న. గారు

"రాయప్రోలు కవిలాగనే వేదుల సత్యనారాయణశాస్త్రిగారున్నూ సంస్కృత పదాల్ని ధారాళంగా ప్రయోగిస్తూ అక్షర రమ్యత సాధించ యత్నించారు. 'నూతన మనోరథము', 'నృత్యగీతానునయము', 'ద్వార తోరణాస్థానము' 'ఘోర కారానరకమ్ము', 'పార్థివ శ్రీ', 'ఆషాఢవారిదము','మధుప్రవాస ప్రయాణవేళ', 'అంధతమసమ్ములు' వంటి ఉదాహరణలు వారి పద్యాలన్నిటిలోనూ కనబడతాయి."[2] అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

"దీపావళిలోని శయ్య తెనుగులో పువ్వులు పరచినట్లు,

1. 'విమర్శనము' భారతి జూన్. 1938
2. అర్థ శతాబ్దపు ఆంధ్రకవిత్వము. భారతి. జూలై 6 పుట 3

సంస్కృతంబు పచరించిన పట్టున మెరపు తీగెలను కమ్మెచ్చున లాగి నట్లు సౌష్ఠవముగా సాగింది"[1] అని ఇంద్రగంటివారు వక్కాణించారు.

సంస్కృత సమాస ఘటనా విన్యాసమలా వుంచి తెలుగుదగ్గరకు వస్తే ఇంద్రగంటి వారన్నట్లు పువ్వులు పరచినట్లు ఉంటుంది. నుడి కారపుతావి గుబాళిస్తుంది. తెలుగు పలుకుబడిని సొంపు చెడకుండ ఒడుపు కనిపెట్టి వాడుకొనడంలో కడు గడసరితనం కన్పడుతుంది. ఆ పొందికలో అందెవేసిన చేయి వారిది. దానికి మచ్చులివి.

'తేనె తావుల బరువోప లేని పూవు
పొద్దు పొడుపునకై వేగిపోవు పగిది
బ్రదుకు బ్రదుకెల్ల తీయని వలపునింపి' దీ. పు 32

'కొస మొదలు గనరాని మసక చీకటి రేయి' దీ. పు 42

'వెచ్చని నాయెడంద జెయివెట్టి కలంచిన యట్లు' దీ. పు 44

పూవు పూవున దావి గుబుల్కొనంగ దీ. పు 65

ఎన్నడు సోకునో తరగలెత్తగ తెమ్మెర తావియూర్పు ము. పు 4

ఆరని కోర్కెగా బ్రతుకు నందు రగుల్కొను ము. పు 23

ఇవి యన్నీ తెలుగు పలుకులే అయినా పలుకుబడిని పసిగట్టి పుణికి పుచ్చుకున్న నుడికారాన్ని పొంకముగా బింకముగా వాడు కోవడం కన్పిస్తుంది.

నీలి మొయిళ్ళ నీడలు, వలపు కౌగిటి ముడి, రేయి కాటుక కనులు, చిరునవ్వుతునుక, మొయిలు నీడల చీకట్లు, వలపుతీపి, పురిటి పొత్తిళ్ళు, విరిసిన పూల వెన్నెలలవెల్లువ, వలపునీడలు, చెక్కిన నెలరాల చెరసాల, కటికి కరవయ్యె, రేయి రేయెల్ల కంటిపై రెప్పయిడక, పొద్దువిడుకొన్న కలలు మొదలైనవి వారి తెలుగు పలుకుల ముడికి,

---

1. 'వేదులవారి దీపావళి'. భారతి. ఏ. 1938

ముద్దైన పలుకుబడికి మరికొన్ని మచ్చుతునకలు. ఇది గమనించిన మధునాపంతుల వారిలా అన్నారు.

"పద ముద్రలో నీకవి బహుభద్రత గలవాడు. పలుకుబడి చిక్కగా, చక్కగా, కుదిరికగా నుండును. సంస్కృత వాణిపై మక్కువ పెంచుకొన్నను, వాడిన తెనుగునుడి యెంతో ముద్దుగా నుండును."[1]

ఇక వీరి సంస్కృతాంధ్ర పదాల అల్లిక వడ్లను బెరుగును గలిపినట్లు కాక తిల తండులాన్వయ శ్రీ శోభితమై క్షీర నీరాలవలె కలిసి పోతుంది. మరియు పద్యంలో యతిప్రాసలు తమ ఉనికిని కోల్పోయి అసలవి ఉన్నవా! యనే సంశయాన్ని కలిగిస్తాయి.

ఊపిరి యాడనీని కఠినోపల బంధములో కలాకలా
లాపము గాని నర్తన విలాసము గాని ధరాపరీమళా
వాపము గాని లేని పుటపాకపు చీకటి జీవితమ్ము నె
ట్లోపితినో గదా! అవలి యొడ్డగుపింపని కాల మీదుచున్

## వేదుల వృత్తము

తెలుగు సాహిత్యంలో ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్కరి నుదుటున పొద్దు పొడిచింది. కంద మనగానే తిక్కన డెందమున కదలాడును. అలాగే సీసం శ్రీనాథుని సొత్తుగా గణింపబడింది. వృత్తానికి వాసి ధూర్జటిది. ఆటవెలదికి పుస్తె కట్టినవాడు వేమన. ఆధునిక కాలంలో విమర్శకులు వృత్తానికి వేదుల్ని పేర్కొంటారు. ఈనా మాటకు క్రింది విమర్శకుల వాక్యాలే ప్రమాణాలు.

"వృత్తాన్ని నడిపించడములో సిద్ధహస్తుడీయన. పదాల కూర్పు లోని వైలక్షణ్యం భావానికి కూడా లోతు నలవరించి కవిత్వానికి గంభీరత ప్రసాదిస్తోంది. పద్యాలు చదువుతూన్నంతసేపూ రసికుల

1. ఆంధ్ర రచయితలు. పుట 334

హృదయానుభవం, వృత్తంతో పాటు దోహృదిలాగ నడుస్తోంది. భావ గుంభనం ఒకటి ఈయన కవిత్వానికి ముఖ్యలక్షణం. పద్యాలు నాలుగు పాదాలతోటీ గజగమనం చేస్తాయి మన హృదయాల మీద. పద్యాల అడుగు జాడలు నిలుస్తాయి హృదయాల మీద."[1] అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

"కవిత్వపు లోతులు తెలిసినవాడు; భావాన్నీ భాషనూ ఒక్క శృతికి కూర్చగలడు. భాష లొంగిన పనిముట్టు. ఎంత క్లిష్టమైన భావాన్నైనా చక్కగా చెప్పి పద్యం సుఖంగా నడిపించగలడు. వృత్తాలు నడిపించడం ఈయన సొమ్ము."[2] అని ముద్దు కృష్ణగారు

"మరి కవిత్వపు లావణ్యాలూ, లోతులూ వేదులకు తెలిసినంత మరెవ్వరికీ తెలుసునా అని ఆలోచిస్తున్నాను. పాత మాటలే సరికొత్త వైపోయి, పాత వృత్తాలలోనే పడి, ఒయారంగానూ, ఒరగానూ, ఉద్వేగంతోనూ, ఉల్లాసంతోనూ ఊగుతూ ఊగుతూ ఇదివర కెరగని వనిపిస్తాయి."[3] అని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

"ఈయన వృత్తములపై నమితమైన ప్రాభవము గలవాడు. ఎట్టిక్లిష్ట భావమునైన మిక్కిలి ప్రసన్నముగా వ్యక్తము చేయగలడిట్టు"[4] అని దివాకర్ల వేంకటావధానిగారు

"ప్రాక్తన సంప్రదాయములకు సమీపస్థుడై, కొత్తచపులు పుట్టించునట్లు కవిత్వము కట్టుటలో "వేదుల కవి" మంచి నేర్పరి. ఆనాడు శ్రీనాథుడు సీసములకు బేరు పడినట్టుగా, ఈనాడు 'వేదుల' వృత్తములకు బేరుపడెను."[5] అని మధునాపంతుల వారు

---

1. 'కవి-సన్మానము'. ప్రతిభ. న.న.స. పుట 233
2. వైతాళికులు పుట 296
3. 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం' సారస్వత వ్యా-1 పుట315
4 ఆంధ్ర వాఙ్మయ చరిత్రము. పుట 59
5. ఆంధ్ర రచయితలు పుట 534

"వృత్తాన్ని ఇంతకమ్మగా గడుసుగా వ్రాసిన కవులు చాల అరుదు. ఎంత అందని భావాన్నైనా లాలించి తన పద్యంలో పొదగగల దిట్ట"[1] అని ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు

"నన్నయ ప్రసన్నత, పోతన్న పదలాలిత్యం, సూరన్న వంటి ప్రాచీన కవుల ధారా శుద్ధి, విద్వత్కవులైన వేదులవారి వృత్తాలలో వ్యక్తమౌతాయి."[2] అని శొంఠి సూర్యనారాయణరావుగారు

"పద్యరచనలో వృత్తాలను సమర్థంగా నిర్వహించడం కవిశక్తికి గీటురాయి వంటిది. వేదులవారి వృత్తరచన పూర్వ సంప్రదాయానుగామి అయినా, అపూర్వ నవ్యత, సరికొత్త తళుకు సంతరించుకొన్నది."[3] అని ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారు.

వీటి అన్నింటిని పరిశీలించిన మీదట సారాంశమిలా చెప్పవచ్చు. భాష లొంగిన పనిముట్టు. ఎంత క్లిష్ట భావాన్నైనా పద్యంలో ఇముడ్చుట. భాషకు భావానికి లంకె కుదుర్చుట. ఆధునిక జీవకళతో వృత్తాన్ని పరమ సుందర సుకుమారంగా నడిపించుట.

ఇవి యన్నీ దీపావళి కావ్యాన్ని ఉద్దేశించిన పలుకులు. ఈ కావ్యంలోని పద్యాలు మూడువందల లోపే. అందు వృత్తాలు అంకిత పద్యాలతో గలిపి ఎనభై ఎనిమిది. అసలు తెలుగువారు తరచు వాడే వృత్తాలు ఉత్పల చంపక శార్దూల మత్తేభాలు. దీపావళిలో శార్దూలం కనిపించదు. మత్తేభాన్ని అధిరోహించింది ఒక్కసారే. చంపకం గుబాళించింది తొమ్మిదిచోట్ల. తక్కిన చోట్ల వారు ధరించింది ఉత్పలమాలనే. ఉత్పలమాలని వారు నడిపించే తీరునకు కాంక్షలో పద్యాలన్నీ పరమోదాహరణాలు.

---

1. గౌతమీ సాహిత్యం-భావాభ్యుదయ రేఖలు తూ. గో. జిల్లా. రచయితల ప్రత్యేక సంచిక పుట 29
2. ముక్తఝురి. ప్రస్తావన. పుట XIX
3. సాహిత్య పరిచయం పుట 70

## పద్యశిల్ప సన్నివేశం

ఇది ముక్తఝరిలో ఉంది. గిరి గర్భం నుండి వెలువడ్డ ఝరీ గమనం యొక్క ఉత్తరోత్తరాభివృద్ధిని చెప్పే తీరిది.

వదలె చిరతర శైలబంధము!
వదలె శంకాతంక భయములు!
వెలువడితి – ఆ క్షణమె స్వేచ్ఛా
నిలము మైసోకన్

కోలుపోయిన హక్కు చేకొన్నయట్లు
మరచిపోయిన మార్గము దొరికినట్లు
జారిపోయిన మురళి చేకూరినట్లు
పొడిచె నాలో నెదో పాలకడలి పొంగు!

ప్రాకుల్ వట్టిన చిమ్మచీకటుల యా పాషాణ కారాగుహా
ప్రాకారమ్మరి నంత–నా బ్రతుకుపై ప్రాభాత శోభామయా
శాకాంతి ప్రసరమ్ము పాదుకొనె స్వేచ్ఛామారుతాహ్వాన గీ
తా కోలాహలమేదొ నా యెడద నుత్సాహమ్ము లూగించెడిన్

ఇందు మొదటిది ముత్యాల సరం. పిమ్మట తేటగీతి. అటుపై శార్దూలం. ప్రారంభంలో సన్నని జాలై క్రమక్రమంగా విశాలత్వాన్ని పొందే ప్రవాహ గమనాన్ని సూచించే ఛందస్సుల నెన్నుకోవడం ద్వారా వేదుల ఛందశ్శిల్పి యనిపించుకున్నారు.

బృహత్ కావ్యాల్లోనే సాధ్యమయ్యే యిట్టి శిల్పాల్ని ఖండ కావ్యంలో సాధించడం వేదుల వైశిష్ట్యాన్ని పెంచుతుంది. ఇట్టి పద్య శిల్ప విజ్ఞాత కనుకనే సానల దీరిన జాతి రత్నాల వంటి పద్యావళిని వ్రాసిన వేదుల ఒకప్పుడు బలిజేపల్లి లక్ష్మీకాంతం గారితో ఇలా అన్నారని ఇంద్రగంటి వారి కథనం.

"తెలుగు దేశంలో పద్యం వ్రాస్తే నేను వ్రాయాలి. లేకపోతే

నీవు వ్రాయాలి." దీన్ని గురించి విశ్వనాథ తన జీవిత చరిత్రలో కూడ ప్రస్తావించారు. వేదులది స్వోత్కర్ష కాదు. అనుభవంతో కూడిన ఆత్మ విశ్వాసం. ఏది ఏమయినా ఢిల్లీకి ఢిల్లీ, పల్లికి పల్లి అన్నట్లు ఎవరి పద్యం గొప్పా, అందం వారికున్నా వృత్తరచనలో ఈయన ఆధునికుల్లో ధనికుడవడం ఖాయం.

## గేయ చ్ఛందస్సు

ఆధునిక సాహిత్యంలో ప్రధాన పాత్ర వహించిన గేయ చ్ఛందస్సు ముత్యాల సరం. దీన్ని వెలుగు లోనికి తీసికుని వచ్చిన వ్యక్తి గురజాడ. ఆయన్ని అనుసరించి భావకవులు ముత్యాల సరాలతో తమ కావ్య కన్యకల్ని అలంకరించుకున్నారు.

వేదుల వాడిన మాత్రాచ్ఛందస్సుల్లో ముత్యాల సర మొకటి. దీపావళి కావ్యంలో తొలిదీపం ముత్యాలసరం. అట్లే 'ఈ నాటికి' కూడ. ఈయన ఆశువుగా చెప్పిన ఒక ముత్యాల సరాన్ని గూర్చి శ్రీశ్రీ ఇలా వ్రాశారు.

"ఒకమారు శాస్త్రిగారిని 'ముత్యాల సరాలేవైనా వ్రాశారా? నా వ్యాసంలో ఉదాహరిస్తా'నని అడిగాను. సముద్రపు టొడ్డున నడుస్తున్నాము. శాస్త్రిగారు తాము వ్రాసిన వేవీలేవు గాని ఇప్పుడొకటి వ్రాస్తానని,

"ఒక్కడైనను మాట లాడడు
ఒక్కడైనను తేరి చూడడు
ప్రక్కనడకల ఎండ్ర పీతలె
దిక్కు మన కింకన్" అన్నారు. శాస్త్రిగారు వ్రాసిన, నాకు తెలిసిన ముత్యాల సరం ఇదొకటి."[1]

---

1. 'ముత్యాల సరం' సారస్వత వ్యాసములు పుట ౨౭౮

ఇట్లే చతురస్ర గతిలోను, ఖండ గతిలోనూ పలుగేయాలు రచించి తమకు గల గేయరచనా ప్రావీణ్యాన్ని వెల్లడించారు.

అందుచేతనే వావిలాల సోమయాజులు గారిలా వ్రాకుచ్చారు.

"ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు, రాయప్రోలు సుబ్బారావు, తురగా వెంకట్రామయ్య, వేదుల సత్యనారాయణశాస్త్రి.... ప్రభృతులు వివిధ రకాలుగా గేయాలు వ్రాసి పేరు పొందారు, పొందుతున్నారు, పొందుతారు."[1]

## 9. ప్రభావము

### ఇతరుల ప్రభావం

ప్రభావ మనగా వేదుల సాహిత్యంపై ఇతరుల సాహిత్య ప్రభావ మనికాని, ఇతరుల సాహిత్యంపై వేదుల సాహిత్య ప్రభావ మనికాని గ్రహించాలి. సాన్నిహిత్యమున్న సాహిత్యాలు పరస్పర ప్రభావాలకు లోనవడం సహజం. అటువంటప్పుడు ప్రాచీన, అర్వాచీన కాలాలలో తెలుగుపై పెత్తనం వహించిన సంస్కృతాంగ్లాల ప్రభావం ఎంత గాఢంగా ఉంటుందో ప్రత్యేకంగా ప్రవచింపవలసిన అవసరం లేదు. మరియు ఒక కవిపై అతని సాహిత్యంలో గల పూర్వీయుల, సమకాలీనుల ప్రభావం పడటం అతిసాధారణ విషయం. ఇతరుల ప్రభావ మున్నంత మాత్రాన ఏ రచననైనా తక్కువగా భావించడానికి వీలులేదు. అయితే ఆ రచనలో ఆ కవి యొక్క ప్రతిభా, హృదయం సువ్యక్తం కావాలి.

ఈ సందర్భంలో పింగళి లక్ష్మీకాంతం గారి వాక్యాలు స్మరణీయాలు.

1. 'గేయ రచనలు-ప్రాచీనులు' సారస్వత వ్యాసములు పుట 195

"అసలు కవులలో ఎవరిని ఎవరు అనుకరించినను అనుకరణ దోషము కాదు. తమకు పూర్వులైన కవుల భావములను పలుకుబడులను స్వేచ్ఛగా ఏక కుటుంబ ధనమువలె వాడుకొనుట పూర్వాంధ్ర కవులకే గాక సంస్కృత కవులకును ఆచారము."[1]

మొదటినుండీ వేదులకు సంస్కృత భాషా పాటవం మిక్కుటం. అంచేత ఆయనపై కాళిదాసాదుల ప్రభావం కొట్టవచ్చినట్లుంటుంది. కృష్ణశాస్త్రి మొదలైన వారి సాహచర్యం వల్ల అంతగా రాని ఆంగ్ల సాహిత్యంలోని నూతన విషయా లాకళింపునకు రావడం కారణంగా షెల్లీ ఇత్యాదుల ప్రభావం వీరిపై పడింది. పనిగట్టి నేర్చుకున్న బెంగాలి సాహిత్య ప్రభావం చెప్పనక్కర లేదు. మీదు మిక్కిలి విశ్వవిఖ్యాతులైన రవీంద్ర కవీంద్రుని భావాలకు ముగ్ధులయ్యారు. హిందీ వాసన అసలు లేనప్పటికీ ఏ మిత్రుని మధ్యవర్తిత్వం చేతనో మాఖన్‌లాల్ చతుర్వేదీ ఉత్కృష్ట భావన కవిగారి కలంద్వారా జాలువారి రమణీయత పెంపొందించుకుంది. నవ్యాంధ్ర సాహిత్య యుగ కర్తలైన గురజాడ అడుగుజాడల్లో ముత్యాల సరాల నేరుకున్నప్పటికీ రాయప్రోలు వేసిన బాటవెంబడి కొంత పయనించారు. దీనికి కారణం పద్యం మీదున్న అధికారం కావచ్చు. మధుర భక్తి కవితా విశిష్టులైన వేంకట పార్వతీశ్వర కవుల ఏకాంత సేవలో కన్నీటి పాటలు పాడుకున్నారు. అప్పుడే అడుగు నిలదొక్కుకుంటూ అగ్రగామిగా ఉన్న కృష్ణశాస్త్రిగారితో భుజం, భుజం కలిపి పయనించే యత్నం చేశారు.

## కాళిదాసాదుల ప్రభావం

'ప్రవాసి'లో మొదటి పద్యం చదువుతుంటేనే విధిగా 'మేఘ సందేశం'లోని యక్షుని పూర్వ వృత్తాంతం గుర్తుకు వస్తుంది. మరియు యక్షుడు-ఆషాఢ మేఘాన్ని ఉద్దేశించి పలికినట్లు వేదుల 'పూర్ణిమ'లో

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర - పుట 81

చంద్రుని రాక గురించి ప్రస్తావించడం గోచరిస్తుంది. అట్లే 'ఆషాఢ మేఘము'పై కాళిదాసు ప్రభావాన్ని శీర్షిక నామమే చెప్పక చెప్తుంది. యక్షుని వేదన కవికి గుర్తుకువచ్చి స్వగతానుభూతిగా ఈ ఖండిక వెలువడింది. "కాళిదాసు కావ్యాలలోని పరువమూ, బరువూ ఈయన పద్యాలలో కనిపించుతవి."[1] అని ముద్దుకృష్ణగారు ముఖ్యంగా ఈ ఖండికలోని పద్యాల నుద్దేశించే అన్నారు.

## భవభూతి ప్రభావం

వేదుల తన కవితలో వీలైనప్పుడల్లా గోదావరిని స్మరించి ఊరట పొందారు. ఈ అనుబంధానికి గుర్తు 'గౌతమీ కోకిల'. ఈ విషయంలో ఈయనకు అగ్రేసరుడు భవభూతి. ఉత్తర రామచరిత్రలో గోదావరిని 27 సార్లు స్మరించినట్లుగా ఇంద్రగంటివారి వక్కాణ. ఇంతే కాదు 'భవభూతి'ని స్ఫురింప జేసే భావాలు 'దీపావళి'లో కనిపిస్తాయి. 'మాలతీ మాధవం'లో 'లీనేవ ప్రతిబింబి తేవ' అని మాధవుని నోట నుండి వెలువడ్డ ఈ శ్లోకాన్ని తలపింప జేస్తున్న దీపావళిలోని పద్య మిది.

> వెచ్చని నాయెడంద జెయివెట్టి కలంచిన యట్లు, సూదులన్
> గ్రుచ్చిన యట్లు, కత్తిమొన గోసిన యట్టులు, చూర్ణ చూర్ణమౌ
> మచ్చున రాల మోదినటు, మండెడు నిప్పున గాల్చినట్లు, క
> మ్మెచ్చున లాగినట్లను నిమేష మెవో స్మృతు లేచి యేచెడున్

ఉత్కటోత్కటమైన దుర్భరతమమైన ఆ వ్యథను వ్యక్తీకరించ డానికి ఇంతకు మించి మాటలుండవు.

అసలు భవభూతి రచనల్లో కరుణ రసం మూలమయితే వేదుల పద్యాల్లో విషాద కరుణాలు కేంద్రంగా ఉన్నాయి.

---

1. వైతాళికులు, పుట 296

ఆంగ్ల కవుల పరిభావం

మృత్యువును ప్రాచీనులు భయంకర మైనదిగా చిత్రించారు. ఆధునికులు మాత్రం 'సఖి'గా భావించారు. ఇలా భావించడానికి ఆంగ్ల కవులైన షెల్లీ, కీట్స్, జాన్‌డన్ కారకులు.

దీపావళి లోని 'ఆహ్వానము' అను ఖండికలో మృత్యువును సఖిగా, ప్రాణశాంతి గాయనిగా, ప్రేమైక జీవకళగా భావించుట వీరి పరిభావమే కావచ్చు.

మరియు షెల్లీ పరిభావం కన్పడుతున్న కృష్ణశాస్త్రి, సత్యనారాయణ శాస్త్రిగార్ల గేయ పద్యాల పంక్తులు.

చివురింపదో చైత్ర శుభో
త్సవ విభాత కళ్యాణము
ఈ దరిద్ర హేమంతమున - ప్రవాసము
- మరి చైత్ర శుభ ప్రభాత వం

శీ కలగాన మీ శిశిర జీవన మందిక లేనె లేదొకో.

"O, Wind, If winter comes, can spring be far behind?"[1] షెల్లీ పరిభావం దీపావళిపై అక్కడక్కడ కన్పడుతుంది. అయితే ఇతరుల పరిభావం కనిపింపకుండా జేయడం వేదుల విశిష్టత. అందు చేతనే 'ప్రభాతం' గారిలా అంటున్నారు.

"పూవు వీడినగాని పుట్టదు ఫలము, ఫలము రాలక జనింపదు నవాంకురము, దగ్ధ దినైక చితాభస్మరాశి, సుప్తివీడెడి యుషస్సునకు పునాది, అని గతాన్ని తలచి క్షతికి విలపించ వలదంటారు. దీనిపై షెల్లీ 'ఓడ్ టు ది వెస్ట్ విండ్' పరిభావ మున్ననూ కవి తెలియ జేయుటలోని వైలక్షణ్యము కొనియాడ దగినది"[2]

1. "The complete poetical works of P.B.Shelly" పుట574
2. "భావకవితా మురళి-శ్రీ వేదుల దీపావళి" భారతి సె.1982 పు. 59

## రవీంద్రుని ప్రభావం

దీన్ని గూర్చి ఆ యా సందర్భాలలో చెప్పడం జరిగింది. ముఖ్యంగా గీతాంజలి ప్రభావం దీపావళిపై గాఢంగా ఉన్నదనే విషయం మధుర భక్తిని వ్యక్తీకరించే సందర్భంలో వక్కాణింపబడింది.

వేదుల 'ఆషాఢ మేఘము' వ్రాయడానికి పూర్వ మెప్పుడైనా రవీంద్రుని 'మేఘ దూతము' చదివి ఉండవచ్చు.

## రాయప్రోలు ప్రభావం

వేదులపై రాయప్రోలు ప్రభావం బలమైంది. ఈయన్ని అనుసరించి కోకిల్ని గూర్చి పద్యాలు వ్రాసినవారిలో వేదులవారొకరు. మరియు

"వలపు లొలికెడు పూవులు వాడిపోయె
కనక పీఠిక హారతి కునుకు చుండె" దీ. పు 32

ఈ పద్య పంక్తులు చదువుతుంటే రాయప్రోలు వారి 'విరహ వీథి'లోని

"హేమ పాత్రల చందన మెండి పోయె
ద్వారములు మోయుచున్నవి హారములను" అను పంక్తులు జ్ఞప్తికి వస్తాయి.

అట్లే రాయప్రోలు వారి 'పిలుపు' అను శీర్షికలోని

"నిశలు పులకించె, కనులకు నిదుర రాదు"అను భావ తీవ్రత వేదుల 'సంధ్యాన్వేషణము,' 'రాధ' లలో కనిపిస్తుంది.

## కృష్ణశాస్త్రి ప్రభావం

'దీపావళి' లోని విషాద కావ్యాలు చదువుతుంటే కృష్ణశాస్త్రి ధోరణి అగుపిస్తుంది.

యుగ యుగంబుల నీశ్వర యోధులగుచు
స్వేచ్ఛకై ప్రాణ సుమము లర్పించువారి
అమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు. కృష్ణపక్షం. పు3

ఈ పద్య ప్రభావం వేదులవారి కాంక్షలోని నీచపు దాస్యవృత్తి అను పద్యంపై కనపడుతుంది.

దీపావళి లోని "నేనె నాదుఃఖ బాష్ప శోణిత లహరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను" దీ. పు39

ఇది చదివినప్పుడు కృష్ణశాస్త్రిగారి ఈ క్రింది పద్యపాదం గుర్తుకు వస్తుంది.

"నల్ల ద్రావితి మున్ను దోసిళ్ళ కొలది"

ఇట్టివి ఇంకా చూపింపవచ్చు. అయితే వేదుల విశిష్టతకు మాత్రం కొదవుండదు.

కనుకనే శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారిలా అన్నారు.

వేదులలో కృష్ణశాస్త్రి పోకడలు చాలా కనబడతాయి. కాని ఒక కొత్త జిలుగు వాటికి వేరే రంగు పూసేస్తుంది.

కృష్ణశాస్త్రిగారి 'అన్వేషణమును' వేదుల 'సంధ్యాన్వేషణము'ను దగ్గరబెట్టి చదివితే పైధోరణి వెల్లడవుతుంది.

## అనంతర కవులపై వేదుల ప్రభావం

ఈ సందర్భంలో ముందుగా ఇంద్రగంటి వారి వాక్యాలు అనుసంధేయాలు.

"శ్రీ వేదుల, కృష్ణశాస్త్రి తరువాత వచ్చిన కవుల్లో వారి ప్రభావం తెలియకుండా ఎంతైనా ఉంది. విజయనగరం వేంకటు కాళీదాస కవులు, విశాఖ శ్రీశ్రీ, పురిపండా, రాజమండ్రిలో గణపతి శాస్త్రి, విశ్వేశ్వరావు, రామభద్రరావు, సహదేవ, జనమంచి వగైరాలు వీరి ప్రభావానికి లోనుగాకుండా ఉండలేదు. అస్మదాదులు పద్యమెత్తితే వేదుల వృత్తంలోకో, కృష్ణశాస్త్రి గొంతులోకో పోయేది."[1]

దీన్ని బట్టి అనంతర కవులపై వేదుల ప్రభావం ఏమిటో స్పష్టమవుతుంది.

---

1. తూ॥ గో॥ జిల్లా. రచయితల ప్రత్యేక సంచిక. పుట 30

"నావలె శుష్క జీవనమునన్ దురపిల్లెడి యీ పవిత్ర గో
దావరి" అను వేదుల పద్యపాదాన్ని గుర్తుచేస్తున్న ఇంద్రగంటి వారి గోదావరీ స్మరణం.

"ఓ గోదావరి తల్లి నిన్ననిన ఏవో మాతృ సాన్నిధ్య లీ
లా గంధమ్ములు తోచి నెమ్మదిని చల్వాల్చిండు"

మరియు శ్రీ శనగన నరసింహస్వామి వారి 'జలదగీత' లోని

"ఏ లలనా వినూత్న విరహేడ్యుఁడౌ దౌత్యము బూంచునన్ భయాం
దోలన దౌలకేగకుము తోయద శేఖర!" అనేది

వేదుల ఆషాఢ మేఘంలోని

" ఏవిరహార్తుడేని హృదయేశ్వరి సన్నిధి కేగజాలు వా
ర్తావహుగోరి....పయోదమా." అను పద్యాన్ని తలపింపజేస్తుంది. ఇట్టి వాటిని గ్రహించియే మధునాపంతుల వారిలా అన్నారు.

వేదులవారి కృష్ణశాస్త్రిగారి భావ కవిత్వపు జాడల కీనాడును అవకాశ మున్నదనుటకు నరసింహస్వామి కృతమైన చైత్రవంది ఒక యుదాహరణము.

ఏది ఏమైనా ఒకరి నొకరనుకరించారంటే పూర్వవ్యక్తిమీదున్న గౌరవంగా భావించడం సహృదయ లక్షణం.

"Imitation is the best compliment paid to an author" అనే ఆంగ్ల సుభాషితం ఉండనే ఉంది.

## 10. కావ్య రచనాదర్శం

వేదుల కావ్యరచనాదర్శం అనందోద్దీపన మొక్కటే యనడానికి వీలు లేదు. వారొకొక్కక్క చోట వాచ్యంగా, మరికొన్ని చోట్ల ధ్వని

1. మధునాపంతుల సాహిత్య వ్యాసాలు పుట 169

పూర్వకంగా సమకాలిక సమాజాన్ని ఉత్తేజపరచే ప్రబోధాలు గావించారు. వాటిలో కొన్ని సార్వకాలికోపదేశాలుగా భాసించుట విశేషం.

స్త్రీకి ఉదాత్త స్థానమిచ్చి ప్రణయ గీతాలు ఆలాపించినప్పటికీ అనాటి ప్రధాన సమస్యయైన దాస్య విముక్తికై నడుంకట్టి దేశభక్తి ఉద్బోధక కవితలు రచించారు. సమాజంలో నున్న కాఠిన్యాన్ని, దుష్ట సంప్రదాయాల్ని అవసరానుగుణంగా ఖండించారు.

అసలు కావ్యానికి 'దీపావళి'అని పేరు పెట్టడంలోనే అసురత్వాన్ని ఓడించి దైవత్వాన్ని పొందిన మానవత్వాన్ని దీపించు దీపావళి పండుగలోని పరమార్థం గోచరిస్తుంది. ఈ కావ్యనామాన్ని గూర్చి

"వేదులవారి దృష్టి బ్రాహ్మ సమ్మతము. బ్రహ్మ సమాజము మానవునిలో రేకెత్తించిన ఉత్తమ మానవత్వ జిగీష 'దీపావళి'లో వెలుగు బాటలను చూపిస్తున్నది. దీపావళిలోని సాంకేతి కార్థాన్ని తీసుకుంటే నిరాశను-ఆశ గెలవడంలోని జీవిత వికాసాన్ని దీపావళి పండుగ యందలి విజయ చిహ్నాన్ని వ్యంగ్యంగా ధ్వనింపచేస్తుంది."[1]

అని పలికిన దేశిరాజు కృష్ణశర్మగారి వాక్యాలు యాథార్థ్య రామణీయకములు.

ప్రకృతి పరిణామంలో సార్వకాలిక సత్యాన్ని ధ్వనింప జేస్తున్న వేదుల ప్రబోధమిది.

పూవు వీడినగాని పుట్టదు ఫలము
ఫలము రాలక జనింపదు నవాంకురము
దగ్ధ దినైక చితా భస్మరాశి
సుప్తి వీడెడి యుషస్సునకు పునాది.
ముది శిశిరమ్మాకు చిదమిన పట్లు
పూల కారు చివుళ్ళ పురిటి పొత్తిళ్ళు
గతముకై తలపేల, క్షతికేల వగపు — దీ. పు 7

1. 'శ్రీ వేదులవారి దీపావళి' సుభాషిణి. ఏ. 1951 పుట 52

పూవు వీడిన తరువాతనే ఫలం పుడుతుంది. ఫలం రాలిన పిమ్మటనే నవాంకురం జనిస్తుంది. ఇది ప్రకృతి జీవన పరిణామం. అంటే భూత కాలం వర్తమాన కాలానికి పునాది అనీ, వర్తమానమే భవిష్యత్తుని నిర్ణయిస్తుందనే చారిత్రిక సత్యాన్ని ఇది వ్యక్తం చేస్తుంది. దీనిలో గతితార్కిక వాదం కూడ ధ్వనిస్తుంది. ప్రళయం నుండే సృష్టి జరుగుతున్నట్లు విప్లవం వల్ల చైతన్యం ఘటిల్లుతుందనేది సార్వ కాలిక సత్యం. గత కాల జనుల త్యాగఫలం వర్తమాన కాల జన సౌఖ్యానికి హేతువు కాగలదను నిత్యసత్యం ధ్వనిస్తుంది. కనుకనే గతంలో జరిగిన నష్టాన్ని గూర్చి విచారించడం తగదని ప్రకృతి ద్వారా ఇలా ఉపదేశించారు.

తొడిమ వీడిన పూవు తోవ చూడదు తీవ
ధూళి రాలిన పండుతో పోదు పాదపము
గాలి గలిసిన పాటకై పక్షి వెతపడదు
తరగ విరిగిన మహోదధి తీసి పోవదు    దీ. పు 6,7

ప్రకృతి నిత్య నూతన పరిణామశీలి. పూవుకోసం తీవ, పండు కోసం పాదపం, పాటకై పక్షి, తరగ కొరకు మహోదధి దుఃఖించవు. అట్లే గతాన్ని స్మరించుకుంటూ వర్తమాన జీవితాన్ని నిర్లక్ష్యం చేయ రాదని కవి కంఠోక్తి.

వేదుల ప్రేమ విషయంలో నూతనాధ్వగులు. వారికి మూఢ విశ్వాసాలు కిట్టవు. కనుక ప్రేయసీ ప్రియుల కిలా హితోపదేశం చేశారు.

మూఢ విశ్వాస శృంఖలమ్ముల విదల్చి
వలపు కౌగిటి ముడి బట్టు వడితిమేని
మన శరీర సుఖ స్పర్శనమునకు నేటి
యణువణువు కూడ నవ జీవ మనుభవించు.    దీ. పు 16

దీన్ని వేదుల తమ ప్రేయసిని ఉద్దేశించి అన్నప్పటికీ వధూవరుల

మధ్య ఉండవలసింది ప్రేమయనీ, అది ఉన్నప్పుడే వారు నిజమైన సుఖాన్ని పొంది, నిత్య నూతనమైన జీవనాన్ని గడుపుతారనే సత్యాన్ని వెల్లడించారు. అనగా ప్రేమ విహీనమైన వివాహం పేరు మీదుగా మూఢ విశ్వాస శృంఖలాలచే బంధింప బడేకంటె వలపు కౌగిటి ముడిచే దగ్గరవడంలోనే జీవన సౌఖ్యం ఇమిడి ఉంది అని భావము.

ఆ రోజుల్లో పెళ్ళిపీటల మీదే వధూవరులు పరస్పరం చూచు కోవడం జరిగేది. పెళ్ళికి ముందు వారలొకరి నొకరెరుంగరు. వారి ఇష్టాయిష్టాలతో పనిలేదు. అన్నీ తల్లిదండ్రులే. కనుకనే ఒక ఉపన్యాసంలో సోమసుందర్ గారు "నా భార్య పిత్రార్జితం; నా పిల్లలు స్వార్జితం" అని అన్నారు. ఇది తెలిసికుంటే వేదుల సందేశ పరమార్థం తెలుస్తుంది.

లోకంలో సాధారణంగా ఏ వ్యక్తి అయినా తనను ప్రేమించు వారి ఆనందానికై ఆలోచింపడు. కాని తనను నిరసించువారి ఆనందానికి జీవనం సమస్తం ధారపోస్తాడు. ఈ భావ పేటికిది.

నన్ను ప్రేమించు వారి యానందమునకు
నేను విడువ లేదొక్క యూర్పైన గాని
నన్ను నిరసించు నీ చిరునవ్వు కొరకె
బ్రతుకు వెలిగించి వలపు నివాళి యిడితి దీ. పు 31

దీనిలో ప్రియురాలి చిరునవ్వు కొరకు బ్రతుకు వెలిగించి హారతి పడతాడుగాని తనను పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రుల్ని కన్నెత్తి యైనా చూడడనే విషయాన్ని ధ్వనింప జేశారు.

"Poets teach in verse what they learn from suffering" అను షెల్లీ సూక్తికి లక్ష్యమైన సందేశమిది. వేదుల పాషాణ ప్రవాస జీవనానుభవ వేదన ఇలా వెలువడింది.

మొక్కిన కొలంది గాలితో దొక్కివేయు
నీ కఠిన లోకమెల్ల బహిష్కృతమ్ము

రండు, చిమ్మటు లార! ఈ రాత్రి వేళ
నావలెనె పాడుకొను మీగె నాకు సఖులు దీ. పు51

మ్రొక్కిన కొద్దీ త్రొక్కి వేసే లోకాన్ని లెక్కచేయ వద్దంటున్నాడు కవి. దీనిలో సామాన్యులు అధికార దృప్తులకు, అర్థమత్తులకు సేవచేసి మ్రొక్కి, మొత్తబడేకంటె తమ దుఃఖాన్ని పంచుకునే వారితో కలిసి జీవనాన్ని గడపడం యుక్తమనే ధ్వనిపూర్వకమైన హితోక్తి ఉంది.

'Tolerance is the culture' అనే సుభాషితానికి లక్ష్యంగా తన స్థిత ప్రజ్ఞను నొక్కి వక్కాణిస్తున్న పద్యం.

గాఢ దుఃఖాగ్ని కీలలు గాల్చుకొలది
కడుప నొక వేడి నిట్టూర్పు గాడ్పునైన
ఎడతెగని యాపదల ముక్కలిడిన కొలది
కనుల రానీయ నొక బాష్ప కణమునైన దీ. పు 53

ఇటు వేదుల తమ దృఢ నిశ్చయాన్ని వ్యక్త పరచుట ద్వారా కష్టకాలంలో మనోధైర్య మవసరమని పాఠకుల కుపదేశం.

కవిగారి దృష్టిలో మృత్యువు 'వేదనా జాలముల ద్రోసివేసి కొనుచు' విచ్చేయు నట్టిది; 'తప్త హృదయమ్మునకు జల్లదనమొసంగ' 'శాశ్వత సుషుప్తి ముంచి ప్రశాంతుజేయు' దయచేయు నట్టిది. ఇలా భావించుట ద్వారా మృత్యువును పదే పదే తలంచుకుని ఆందోళన చెందవలసిన పని లేదనీ, అది సహజ ప్రవృత్తి అనీ, మీదు మిక్కిలి మోయలేని బరువును తొలగించు కోవడానికి అవసరమనీ చెప్పి నట్లయింది.

ఆయన కవితాదర్శాన్ని ఇలా ఆవిష్కరించారు.

భూత కాల దినాంతానుభూతి తోడ
భావియుగముల కళ్యాణ పథము బట్టి
వెలుగు నీడల జీవన వేణువూది
పాడుకొనుమ యీనాటి ప్రభాత గీతి. దీ. పు 65

తనకు పూర్వ మందున్న కవీశ్వరుల కవితా చాతుర్య చాకచక్యాన్ని ఆకళించుకుని, దానికి జీవితానుభవాన్ని జోడించి మహోన్నతా దర్శంతో సదాశయ సాధనకై భావియుగాల కళ్యాణ పథంలో సుఖ దుఃఖాలకు సంకేతాలైన వెలుగునీడల జీవన వేణువూది ప్రజల్ని చైతన్య వంతుల్ని చేసే ప్రభాత గీతి నాలాపించి వైతాళి కత్వాన్ని నిర్వహించడానికి రమ్మని కవి కోకిలలకు గౌతమీ కోకిల పిలుపు.

"కాలము వెళ్ళబుచ్చి విధి కాళులపై దలమోపు కంటె నే

నేల స్వతంత్ర ధర్మము వహింపగ రాదని" పలికి విధికి దాసోఽహం కాగూడదని స్వీయ వ్యక్తిత్వం వ్యక్తమయ్యే స్వతంత్ర మార్గం అవలంబించాలని హితోపదేశం.

ఈ విధంగా చైతన్య ప్రేరకమైన కవితల్ని రచించి సమాజ శ్రేయస్సుకి పాటు పడ్డారు వేదుల.

అంచేతనే ఆవంత్స వారు

"సామాజిక సందేశ మిచ్చే తావులలో వేదుల కవితా హృదయం అసమాన ధీరత్వం ప్రదర్శిస్తుంది. ఆశా వాదంతో భాసిస్తుంది......... కారు చీకటుల వెగటును పోకార్చే సురభిళ దీప కళికలుగా భాసిస్తాయి వేదుల కవితలు."[1] అని ఉగ్గడించారు.

కనుకనే భావకవిత్వం పలాయన వాద కవిత్వమనే అపరి పక్వ బుద్ధుల వాక్కులు వేదుల కవితకు వర్తించవు.

## ౩. శేష కవితలు

దీపావళి, ముక్తఝురి కావ్యాలలో చేరని ముద్రితాముద్రిత కవితల్ని 'శేష కవితలు' అని పేరు పెట్టడం జరిగింది. వీటిలో కొన్ని

---

1. 'మరపురాని కావ్యం' ఆంధ్రభూమి 24-4-86

ముద్రిత సమయానికి లభింపక పోవడం, లభించినా ఉపేక్ష వహించడమో అయివుండవచ్చు. మరికొన్ని ఈ కావ్యాల ముద్రణానంతరం వ్రాసి ఉండవచ్చు. మరియు ప్రశంసాది సర్వ పద్యసాహిత్యాన్ని గూర్చి ఇందే చర్చింపబడింది.

## 1. కోకిల

కోకిలను గూర్చి భావకవులు పలుమంది కవితా గానం గావించారు. వారిలో వేదుల ఒకరు. ఈ ఖండికలో నాలుగు పద్యాలున్నాయి.

నీ మధుర ప్రణయార్ద్ర గళంతో ఎవనికోసం పాడుతున్నావని ప్రశ్నించే మొదటి పద్యమిది

పూయని పూతలై తెరల పోలిక బర్వెన సాంద్ర చంద్రికా
చ్ఛాయల లీనమై ప్రకృతి శాంతి వహించినవేళ రాగము
ద్రాయితమైన నీదు మధుర ప్రణయార్ద్ర గళంబు నెత్తి కో
కోయని యొంటిగా నెవని కోసము పాడెదవమ్మ కోకిలా!

మోడులు కూడ చిగురించేటట్లు నీ సుధాగళాన్ని సవరించి ఎవ్వని గూర్చి గానం చేస్తున్నావని వేసిన రెండవ ప్రశ్న.

ఇగురుల నారగించి సెలయేటి పవిత్ర జలంబు ద్రావి యొం
టిగ నవ చూత పల్లవ కుటీరములందు సుధాగళంబు జ
ల్లగ సవరించియున్ సురభిళస్వర మాధురి తోడ మోడులుం
జిగురులు వెట్ట గానమును జేసెద వెవ్వని గూర్చి కోయిలా!

మాధవాగమనంతో విశ్వమంతా పూలతోటయై పల్లవింపగా, సెలయేటి ప్రవాహ శ్రుతులలో వీణాధ్వనులు వినిపిస్తుండగా, పల్లవ పుటంలోని ప్రణయ రసాన్ని ఆస్వాదించి, రాగము చిగుర్ప, మావిపైని కూర్చుండి ఎవ్వని గూర్చి పాడుతున్నావని ప్రశ్నించి శ్యామల దేహాదుల నిచ్చిన ఆ ప ర మే శ్వ రు ని గూర్చి పాడుమంటున్న హితోపదేశంతో ముగింప బడింది.

శ్యామల దేహమిచ్చి విపినాంతర బాల రసాల శాఖికా
ధామము నిచ్చి యంబర పథాన యథేష్ట విహారమిచ్చి పే్రి
మామృత సిద్ధ రాగమయమౌ కలగానము నిచ్చి సత్కవి
స్తోమ సుపూజ్యు జేసిన విశుద్ధుని బాడుము నీవు కోయిలా!

## 2. ఘోర పతనము *

వేదుల ఆత్మాశ్రయ విషాదానికి నాంది పల్కింది దీనితోనే అని చెప్పవచ్చు. ఘోరమైన దాస్యాంబుధిలో మునిగి పోవడంచే ఇంతకాలం జాతి, దేశాల గురించి, కర్తవ్యాన్ని గురించి ఆలోచించుకోలేక పోయితినను ఆవేదన ఇందు వ్యక్తీకరింపబడింది.

ఈ నాటికి కవిగారి స్థితి జీవితంలోనేమి, కవిత్వంలోనేమి అయోమయంగా ఉంది. ఆయన మార్గ మీారెండింటిలోను అంధకార బంధురమే. ఆనాటి జీవితంలో నున్న నిస్పృహ ఇందు చోటు చేసుకుంది.

ఎవ్వడను నేను, నాజాతి వృత్తమేమి?
విమల చారిత్రియైన యే వీర మాత
తల్లియై నాకు ప్రకృతిలో తావొసంగె?
ధర్మ పథమేది? నాకు గర్తవ్యమేమి?

అని ప్రశ్నించు కోవడంతో ప్రారంభమైంది. ఈ విధంగా ఆలోచించుకోక పోవడానికి కారణాన్ని ఇలా చెప్పారు.

క్రమ్ము కొనుచున్న మోహాంధకార పటలి
లోన నేనొక నలుసునై లీనమైతి
... ... ...
... ... ...
పాడు వారిన సాదు హృద్భవన మందె
కాక దృక్పథావర్త లోకంబునందు

* భారతి, ఫిబ్రవరి 1924 పుట 142

విపుల తిమిరంబె మూర్తీభవించి పోయె
దారి దొరకక వెదకంగ తలపులేక
శాంతి సుఖములు లేక స్వేచ్ఛయును లేక
తోడు లేక కన్నులు విప్పి చూడలేక
వెనుక ముందేమి లేక నివ్వెరగు సోక
అంతులేనట్టి ఘోర దాస్యాంబునిధిని
మునిగితిని గానబడకుండ మునిగిపోతి

ఇటు ఘోర దాస్యాంబుధిలో మునిగి పోవడమే ఘోర పతనం. అస్వతంత్రతా శృంఖలాలచే బంధింపబడి జాతి అంధత్వంలో మగ్గి పోవడాన్ని కవి తన జీవన వేదన మిషతో అభివ్యక్తం చేశారు. 1923 నాటికి దేశీయుల పరిస్థితి అది.

### 3. ఒక నీడ

ఇది సినిమా పాట కావచ్చు; లేక ఆ దృష్టితో వ్రాసి ఉండవచ్చు. లోక మేమను కుంటె నాకేమిరా, నీ కోసమె ఉసురు నిలిపానురా! అనేది పాటకు అనుపల్లవి. నాయిక తనపై కోపించిన నాయకునితో సర్వాంగ సీకేయను భావాన్ని గడుసుగా వ్యక్తం చేసింది.

ఎన్ని జన్మాలదో ఈనాటి మన పొత్తు
కన్నెరగ్రకే మంటు గలిసి పోయే నటర ॥లోక॥

మన పొత్తు ఎన్ని జన్మాలదో అనడం నాయిక గడుసుదనాన్ని చెప్తుంది.

తలపూలు తురిమినా, తిలకమ్ము దిద్దినా
తలపులో నీ వలపె నిలిచి ఉలికించురా ॥లోక॥

ఇలా పొంకంగా, పొందికగా సాగింది పాట. కొసకు తన పడుచు ప్రాయాన్ని పండించుకో మనడంతో ముగిసింది.

ఉండనీ మండనీ నిండు నా బ్రదుకు
పండించుకోర నా పడుచు ప్రాయము నీనె ॥లోక॥

## 4. కవి సార్వభౌమ ప్రశంస

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు కృష్ణ భారతాన్ని వ్రాశారు. దానిలోని కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు గల సంపుటాన్ని పాలకొల్లు వాస్తవ్యులైన శ్రీ చుండూరి నారాయణరావుగారికి కృతి యీయడం జరిగింది. ఈ సభ 18-10-29 న జరిగింది. ఆ సభను ప్రశంసిస్తూ వేదుల వ్రాసిన పద్యాల్లో ఒకటి.

ఎప్పుడు రాణ్మహేంద్రుడు కృతీశ్వరు డయ్యెనో, మన్మసిద్ధి రా
జెప్పుడు పిల్చినాడో సుకవీంద్రుని తిక్కన మామ గారటం
చెప్పుడు పెద్దనార్యకవి యెక్కిన పల్లకి రాయలెత్తెనో
అప్పటి వైభవంబు నిపుడారసి నారము మీ కతంబునన్

తరువాత వేదంలా పావనమైన భారత కృతీశత లభించుట పురాసుకృతమని కృతి భర్తను ప్రశంసించారు.

## 5. నాళం కృష్ణారావు ప్రశంస

శ్రీ నాళం వారి షష్టి శుభోత్సవ సందర్భంగా వేదుల పద్యాలు చదివారు. వాటిలో వారి అనుబంధాన్ని ప్రకటిస్తున్న పద్య మిది.

నీవని నన్ను బిల్చెడు మనీషివి, మద్గురువర్యస్నేహ సం
భావన గొన్న విద్వదభిమానివి, తీయని యాంధ్రజంపు నె
త్తావుల సన్నజాజి విరి దండలతో గయిసేసి యాంధ్ర వా
గ్దేవత వేణికిన్ సొగసు దెచ్చిన కృష్ణకవీ నమస్కృతుల్

పిమ్మట గౌతమీ గ్రంథాలయాన్ని స్థాపించావని కొనియాడారు.

## 6. కానుక

బుచ్చి సుందర రామశాస్త్రి కవితను ప్రశంసించిన పద్యం.

కలపంపు గమగమల్ వలచు లే జవరాలి
జిలుగు పయ్యంటపై సొలసినట్లు

కోనేటిలో నీదుకొని పోవు రాయంచ
రెక్కలూపున నలల్ రేగినట్లు
కలువ పూదేనియ కడుపులో మేల్కొన్న
యెలదేటి పాటపై కెగసినట్లు
ఆమని సంజ నొయ్యన తోట మలుపులో
చలువ తెమ్మెర పీవ సాగినట్లు

మైమరపు గూర్చి భావ సంపదలరేపి
తీయముల దీర్చి మదికెంతొ హాయిగూర్చి
ముద్దు లొల్కెడు మాధవపెద్ది సుకవి
కవిత మాటెల్లు తల్లి భాగ్యంబు కాదె.

ఈ భావ పరంపరలో కవితా పరిమళం గుబాళిస్తుంది.

## 7. ఆశీస్సులు

చామర్తి వేంకటాచలపతిగారు వేదుల శిష్యులు. వీరి 'ఆర్తగీతి' కావ్యానికి ఆశీస్సు రూపంగా వేదుల వ్రాసిన తేటగీతి ద్వయం.

ఒక విహంగ విలాప గీతికయె కావ్య
సర్గమున కాది మంగళా చరణమయ్యె
ఆది కావ్యము నీది ప్రియా వియోగ
శోక సుశ్లోక మయ్యె గదో కుమార

ఉదర బడబానల జ్వాలి కోద్ధితోరు
ఘోషయే కాదు మౌళి విభూషణార్హ
భాసుర వినూత్న రత్న సంపదలు వత్స
కలవు నీ కావ్య శిల్ప సాగరమునందు

ఇందు శిష్యుని కుమార! అని సంబోధించడం శిష్యవాత్సల్యాన్ని వ్యక్తం చేస్తుంది. క్రౌంచ విహంగ విలాపం రామాయణ కావ్య నిర్మాణానికి మంగళాచరణ మైనట్లే ప్రియా వియోగ శోకం సుశ్లోక

మయిందనీ, నీ కావ్య శిల్ప సాగరంలో బడబానల ఘోషయే కాక వినూత్న రత్న సంపదలు కూడ ఉన్నాయని శిష్యునికి యోగ్యతా పత్రమిచ్చారు.

మరియొక శిష్యుడైన చోడగిరి చంద్రరావుగారి 'హృదయవీణ' కావ్యానికి అందించిన ఆశీస్సు.

వెలుగు నీడల తోడి జీవితపు గాథ
పాతుకొన్నాడ వెదలోని బరువు దీర
ఎవరి మాటేల! లోక బాంధవు డతండె
వినును చెవియొగ్గి నీ పాడు కొనిన పాట

## 8. పెండ్లి పద్యాలు

వేదుల ఏ పద్యాలు వ్రాసిన పట్టిందల్లా బంగార మయినట్లు కవితా పరిమళంతో ఘుమ ఘుమ లాడతాయి.

శ్రీ బెజవాడ గోపాలరెడ్డి వివాహ సందర్భంలో వ్రాసిన పద్యాల్లో ఒకటి.

పాల చినుకులు తెలి తలంబ్రాలు గాగ
సాగరేశ్వరు ముత్యాల శాల వెడలి
హరి యురోమణి సౌధాన నడుగుపెట్టు
శ్రీ తరుణి దంపతుల గటాక్షించు గాక

1952లో శ్రీ కొమ్మారెడ్డి బాపయ్యచౌదరిగారి కుమార్తె వివాహ సందర్భంలో కాటూరి, రాయప్రోలు, విశ్వనాథ, వేదుల మొదలైన వారు పద్యాలు వ్రాశారు. వేదుల పద్యాల్లో ఒకటి.

ఒకడు హృదనిడె సతికి; వేరొకడు సగము
తను వొసంగె; మరొక్క డాననము నిచ్చె
ఒకరి కొకరు సర్వస్వమిచ్చుకొని బ్రతుకు
పంట పండింపుడీ వధూవరులు మీరు.

ఇందు భార్యకు హృదయ మిచ్చినవాడు విష్ణువు, తను విచ్చిన వా డీశ్వరుడు, ఆనన మిచ్చినవాడు బ్రహ్మ. ఇటు ఇచ్చుట ఒకవైపు నుండే జరిగింది. అందుచే ఈ వధూవరుల్ని ఒకరి నొకరు సర్వస్వ మిచ్చుకుని బ్రతుకు పంట పండింపు మనడంలో చమత్కార ముంది. మరియు ఈ పద్యాన్ని చదవగానే

ఊరుజాని రురోజానిః వక్త్రజాని ర్వధూవరౌ।
శిరో౽ర్ధ దేహజానిశ్చ కుర్వంత్వేతౌ రసోత్తరౌ॥

అను శ్లోకం జ్ఞప్తికి వస్తుంది.

సి. వి. సుబ్బన్న శతావధాని సంకలించిన 'కళ్యాణ మంజరి' అను గ్రంథంలోని శాస్త్రిగారి పద్యాల్లో ఒకటి.

ఆరని జ్యోతియై గగన మందున నిల్చి కుటుంబ జీవన
ద్వారము జేరవచ్చు పతివత్నులకెల్ల సుశీల సంపదా
ధార పథైక దీపిక విధమ్మున వెల్గెడు నయ్యరుంధతీ
తార శుభద్యుతుల్ గురియుతన్ దలపాల్రలుగ క్రొత్త జంటపై.

ఈ పెండ్లి పద్యాల విషయంలో నేడున్న వైముఖ్యం నాడు లేదు. తిరుపతి వేంకట కవులు కూడ పెండ్లి పద్యాలు వ్రాసిన వారే. నాడు పద్యాలతో ఆశీర్వదించడం గౌరవ ప్రదంగా ఉండేది.

ఇంతటితో వేదుల పద్య సాహిత్య సమీక్ష పూర్తయింది. ఇక మిగిలిన వారి కథ, నవల, నాటకాది సాహిత్యాన్ని గూర్చి వరుసగా తెలిసి కుందాం.



# గౌతమీ కోకిల వేదుల సాహిత్య సమీక్ష

## IV వేదుల వారి కథలు

'వేదుల ఎంత హృద్య పద్య కవితా ధురీణులో అంత కథారచన ప్రవీణులు. దీనికి సాక్ష్యం గౌతమీ కోకిల గ్రంథమాలా ప్రచురణ ప్రథమ ప్రసవమైన 'వేదులవారి కథలు.'* ఈ సంపుటంలో నున్న కథ లయిదు మాత్రమే. అలాగని రాశి తక్కువైనా వాసికేమీ కొదువ లేదు. దీనికి క్రింది శివశంకర శాస్త్రిగారి వాక్యాలే ప్రమాణాలు.

"పురుషులలో శ్రీరాయసం వెంకటశివుడు. భావరాజు కృష్ణరావు, బుర్రా సుబ్రహ్మణ్యము, కొడవటిగంటి కుటుంబరావు, శేకుమళ్ళ కామేశ్వర్రావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ........ ప్రభృతులు పేరు పడ్డారు."

అర్తనాదము, మా మరదలు, అనితమ్మ అను మూడు కథలూ వేదుల ఉపజ్ఞా మూలకాలు. 'వేసవి మబ్బులు' అనే కథకు వంగ రచయిత శరత్‌బాబు కథానిక ఆధారం. అట్లే 'డాక్టరు చెప్పిన పెండ్లి కథ'కు వంగ రచయిత ప్రభాతబాబు రచించిన చిన్న కథ మూలం.

## 1. ఆర్తనాదము ♦

### కథా సంగ్రహం

ఇందు కథానాయకుడైన ఉమాపతి సంపన్నుడు. శబరి గోదావరిలో కలిసే చోటికి మైలు దూరంలో ఉన్న రామచంద్రపురమనే కుగ్రామం అతని నివాసం. వేట అంటే ప్రాణం లేచ్చి వచ్చినంత

---

*ఈ గ్రంథం ముద్రింపబడటానికి కారకులు వేదులవారి పేర 'గౌతమీ కోకిల గ్రంథమాల'ను స్థాపించి భద్రాచల మన్య ప్రాంతంలో సాహిత్య చైతన్యాన్ని కలిగించిన శ్రీ శిలిగం జగన్నాథంగారు.

♦ భారతి. జూన్ 1936

పని. గోదావరిపై పడవ ప్రయాణం పెట్టుకుని సరదా తీర్చుకుని మూడు, నాలుగు రోజులకు ఇంటికి తిరిగి రావడం పరిపాటి. ఆయన భార్య లక్ష్మి పేరు లోనే కాదు; నిజాని కామె గృహలక్ష్మి. అశోకుని కాలంలో పుట్ట వలసిన ఆ అనుకూలవతి ఒక్క వేట విషయంలో మాత్రం పతికి ప్రతికూలంగా ఉండేది. అతడు కూడ ఆమె మనస్సు బాధ పడే మాట కాని, పనికాని తలపెట్టే వాడు కాదు.

ఒకరోజు వేటకు వెళ్తున్న ఉమాపతిని వద్దని లక్ష్మి ప్రాధేయ పడింది. అప్పటి కామె నిండు చూలాలు. గత రాత్రి తనకు వచ్చిన పాడు కల గురించి చెప్పి వారింప బూనింది. కాని ఫలితం శూన్యం. ఉమాపతి పూర్వంలాగే పడవపై బయలు దేరాడు. పోచారం దగ్గర పడవ ఆగింది. అంతకు ముందులా కాక, ఎందుకో ఆరోజు మంత్రం వేసినట్లు పక్షులే కనిపించలేదు. తిరుగు ప్రయాణానికి సమయ మవు తుందనగా చెట్టుమీద జక్కవ జంట ఉమాపతి కంట పడింది. అంతే; తుపాకీ పేలింది. ఆడు పిట్ట అసువులు బాసింది. మగ పక్షి ఏడుపు హృదయ విదారకంగా వినబడుతుంది. మొదటి సారిగా అట్టి సన్ని వేశంలో మనసు పాడయిన ఉమాపతి ఆడుపిట్ట కళేబరాన్ని అక్కడే వదలి పెట్టి తిరుగు ప్రయాణం పట్టాడు.

దారి పొడుగునా మగ పక్షి ఆర్తనాదం చెవుల్లో గింగురు మంటూనే ఉంది. తల్లడిల్లిన గుండెతో ఇంటికి చేరుతుండగా అతని తల్లి ఏడుపు వినబడ జొచ్చింది. కాన్పు సరిగా రాక లక్ష్మి కన్ను మూసింది. ఉమాపతి చక్రవాక పక్షివలెనే 'ఆర్తనాదము' చేశాడు. ఆ 'ఆర్తనాదమే' కథాశీర్షిక.

### కథా వైశిష్ట్యం

తనకు పురుడు రావచ్చని లక్ష్మి ఆందోళనతో ప్రాధేయపడ్డా భార్య మనస్సును నొప్పించే ఏ పనినీ తలపెట్టని ఉమాపతి పెడ చెవిని పెట్టాడంటే మన పూర్వులు వేటని 'సప్త వ్యసనాల్లో' ఎందుకు చేర్చారో

అర్థమవుతుంది. అంతే 'వేట' అనే వ్యసనానికి లోనైన వ్యక్తి సర్వ గుణాభిరాముడైనా మనస్సుని నిగ్రహించుకోలేడని ఉమాపతి పాత్ర ద్వారా వ్యక్తం చేశారు వేదుల. చిట్టచివర పరిస్థితి ఇది. "ఎంతో దూరము నుంచి, ఏదో హాహారవము అతని హృదయములోనూ ఆ గదిలోనూ నిండి పోయినట్టయి, అతన్ని క్షోభింప జేసింది. పడి ఉన్న లక్ష్మి కన్నులు మృత్యుగ్రస్త చక్రవాకి కన్నులూ ఒక విధముగానే తోచి అతని జీవ శక్తిని కదిల్చి వేసినవి." వే. క. పుట 21

ఈ వాక్యాల్ని బట్టి కవి 'ఆత్మవత్సర్వ భూతాని' అను ఉపనిషద్వాక్యాన్ని బోధించినట్లయింది మొత్తం మీద జీవహింస మాన్పుట కథా లక్ష్యం. 'మా నిషాద' శ్లోకావిర్భావానికి కారణమైన క్రౌంచ మిథునమే ఈ కథలో అవతరించి మరలా అదే విధమైన వియోగమనుభవించి మానవ జీవన సరళికి మహోత్తమ సందేశాన్ని ప్రవచించింది.

## వాక్య-భావ-శబ్ద చిత్రాల తోరణాలు

వేదుల కథకు బలం, ప్రయోజనం చేకూరేటట్లు తమ అలంకార ప్రజ్ఞా ప్రయోగ ధురీణతను సమయోచితంగా ప్రయోగించి పాఠకుల మనోనేత్రాల ముందు రమ్యాతి రమ్యమైన గోదావరీ పరిసర వాతావరణాన్ని సాక్షాత్కరింప జేశారు. ఎన్నో చిత్రాల్ని వారి కలం మనకు ప్రసాదించింది.

సుదూర పరి సమాప్తమైన అడవి చివర మబ్బుల గుట్టల లాగు కనబడుతున్న నల్లని కొండల పొడవులు-పే. 1

నది గట్టున ఆకాశాన్ని వెక్కిరిస్తున్నట్లున్న చెట్లు-పే. 4

సెలయేళ్ళ పక్కల గోదుమ వన్నె తాచుల కుబుసాలు పరిచినట్టు ఏ జాడా అంటని ఇసుక తిన్నెలు-పే. 4

కొండల నీడలూ, చెట్ల నీడలూ పడి నీలిమ తేరుతూ, మచ్చలేని కొండ చిలువ లాగు మెల్లిగా సాగుతున్న నదీ ప్రవాహము-పే. 4

నీరు తాగుచున్న వనగజాల లాగున నీటి అంచుల కానుకొని నలుపుతేరి ఉన్న బండరాళ్ళు-పే. 5

కావ్య ప్రపంచములో మంజులత్వ మాధుర్యములు పడుగు పేకలుగా నేసిననేత ఆమె మనస్సు-పే. 6

మింటు తునకలయి, గుంపు గుంపులై రకరకాల పొడవులతో చందమామను పట్టుకొనడానికిలాగు విచ్చల విడిగా పరుగెత్తుతున్న మబ్బులు—పే. 7

శ్రావణ భాద్రపదాలలో రక్తచందనము పూసుకొన్న వీరాంగన వలె మానవులకు భయంకర మూర్తిగా కనిపించే గోదావరి నడు కార్తికములో నర్తకి వలె ఆడుతూ పాడుతూ సాగుతున్నది-పే. 11

గట్టు మీద పొట్టవెళ్ళని జొన్నచేలు గాలి తరంగాలకు వాలి తేలుతూ, సస్యలక్ష్మికి వింజామర వీస్తున్నట్లున్నవి—పే. 11

నీటి ప్రబ్బలి పొదలు ప్రవాహాన్ని అనుసరించి వంగి లేస్తూ నదీ దేవతకు నమస్కరిస్తున్నట్టు కనబడుతున్నవి—పే. 12

ఇవియన్నీ రచయిత ప్రకృతి పరిశీలనా పాటవానికి, ఆ పాటవాన్ని కథానుగుణంగా వ్యక్తీకరించే నేర్పునకు మచ్చుతునకలు. అంతేకాక, ఈ వర్ణనలన్నీ గోదావరితో ఆయనకున్న సంబంధాన్ని ఋజువుచేస్తాయి. మీదు మిక్కిలి ఈ రచయిత కవియను విషయాన్ని అడుగడుగున గుర్తు చేస్తాయి.* కావ్యంలా సాగిన కథ ఇది.

* 'క్రౌంచవధ' అనే పేరుతో ఈ కథ శ్రీ నిర్మల భీమసేనుగారిచే హిందీ భాషలోనికి అనువదింపబడింది. అది 'సారిక' అనే హిందీ సాహిత్య మాసపత్రికలో ప్రకటింపబడింది.

## 2. మా మరదలు ♦

### ఉపోద్ఘాతం

కరుణ రసం ఉట్టి పడే కథ ఇది.

"ఏ విషయములోనూ పురాణములోని సతిమతల్లులకు తీసిపోని ఒక పతివ్రత కథనే నేను ఇప్పుడు వ్రాయదలచు కొన్నాను. ఇది నా స్వకపోల కల్పితము కాదు. వాస్తవమునకు ప్రతిరూపము" పు26

అని వ్రాయడాన్ని బట్టి వారికి లోకంలో తారసిల్లిన ఒక అమ్మాయి జీవితాన్ని ఆధారం చేసుకుని కొన్ని మార్పులూ, చేర్పులూ చేసి ఈ కథను రూపొందించి ఉండవచ్చని మనం భావించ వచ్చు. ఈ కథలో గల 'దేవి'యే మరదలు. రచయిత చెప్పినట్లు ఈమె సహిష్ణుత యందు, పాతివ్రత్య మందు, ఆత్మత్యాగ మందు పౌరాణిక సతీమణుల సరసను స్థానం పొంద దగింది.

### కథా సంగ్రహం

మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన దేవికి పండ్రెండవ యేట వివాహ మయింది. ఉమాపతిది అంత కలిగిన కుటుంబం కాదు. అయినా బి. ఏ ప్యాసైనాడు; బి. యల్ చదివించి తన కొడుకునకు జూనియర్‌గా నుంచవచ్చనే అభిప్రాయంతో అతనితో వివాహం జరిపించాడు దేవి తండ్రి. వైవాహిక ధర్మం రక్తగతమై యున్న దేవికి మగడంటే ప్రాణం. 'ఆడవాళ్ళకు మొగుడికంటె ఇష్టు లెవరూ ఉండర'ని ఆమె అభిప్రాయం. పు. 26

ఉమాపతి బి. యల్ పరీక్ష తప్పాడు. వ్యాపారం చేసి బ్రతుకు తానంటే అతనికి దేవి అన్నగారయిదు వేలిచ్చాడు. కొన్ని నెలలకు దేవి పుట్టింటికి వచ్చింది. అప్పటికే ఆమె నగలు ఉమాపతి చేతిలో హరించి పోయాయి. వ్యాపారం కూడ చతికిల పడింది. అయినప్పటికీ

♦ భారతి, మార్చి 1931

దేవి మాత్రం భర్త పేరు మీద కూడ ఈగ వాలనియ్యలేదు. భర్త నిర్లక్ష్య జీవితం, పుట్టింటి ఎత్తిపొడుపులు, నిరసనలు.... అన్నీ భరించింది. ఈ బాధలు చాలవన్నట్లు దేవికి మగపిల్లాడు పుట్టి పోయాడు. తండ్రి వద్దని చెప్పినా భర్త వెంట వెళ్ళడానికి ఆమె వెనుకంజ వేయలేదు. తండ్రి పోయినప్పుడు మరలా పుట్టింటికి వచ్చిన దేవి భర్తకోసం దొంగతనానికి కూడ తల యొగ్గింది. తరువాత కొన్నాళ్ళకు ఉమాపతి ఏదో ఆఫీసులో నౌకరీ చేస్తూ ఆఫీసు సొమ్ము కైంకర్యం చేయగా ఆతని పేరిట వారంటు తిరుగుతుంది. భర్తను రక్షించుకోవడానికి దేవి దగ్గర ఏమీ మిగలలేదు. ఆదుకున్న వారూ లేరు. తాను చూస్తుండగా భర్త జైలుకు వెళ్ళడం ఆమె భరించలేదు. అందుకే కిరసనాయిలు పోసుకుని అగ్నికి ఆహుతి అయింది. ఆ చిన్నారి తల్లి అంతులేని మానసిక సంఘర్షణలో, నిస్సహాయ స్థితిలో ఆత్మాహుతి అయ్యే నాటికి పదహారేళ్ళు మాత్రమే.

## కథా వైశిష్ట్యము

మొత్తం కథను 'వదిన' పాత్ర పాఠకులకు చెప్పుట యిందలి విశేషం. స్త్రీ హృదయాన్ని ధరించి పాత్ర ముఖంగా మాటలాడడానికి రచయిత పరకాయ ప్రవేశం చేసినట్లుంది.

ఒడిదుడుకుల జీవిత గమనంలో ఒక అబల - అటు బాధ్యతా రహితంగా వర్తించెడి భర్తకూ, ఇటు పుట్టినింటికీ మధ్య ఎట్లు నలిగిపోతుందో-హిందూ వైవాహిక వ్యవస్థ పాతివ్రత్యమనే ఒకానొక మానసిక ప్రవృత్తిని ఎంత దృఢంగా నిర్మించుకుని నిలుపుకున్నదో ఈ కథ అద్దం పట్టి చూపిస్తుంది.

"పాతివ్రత్యం అనేది ఒక సిద్ధాంతం అనుకొంటే-ఆ సిద్ధాంతాన్ని శిరసావహించి దానికోసం తన జీవితాన్నే తృణప్రాయంగా త్యాగం చేయడం అన్నది ఒక స్త్రీ జీవితంలో అద్భుతావహమైన విషయం. ఏదో ఒక రాజకీయ సిద్ధాంతానికి కట్టుబడి ప్రవాస జీవితంలో దుర్భర

వేదనల పాలైనప్పటికీ దీనిని వదలక ఆ లక్ష్య సాధనలో తమ జీవితాలనే బలిదానం ఇచ్చే విప్లవకారుల చరిత్ర వంటిదే దేవి బ్రతుకు."[1] అని వ్రాసిన ఇజ్జా వెంకటరావుగారి వాక్యాలు త్రోసి వేయలేం.

## వాక్య భావ చిత్ర విన్యాసాలు

కథా సంవిధానానికి, పాత్ర హృదయావిష్కరణకు, సన్నివేశ చిత్రణకు వేదుల సజీవమైన, సహజమైన, శక్తిమంతమైన వాక్య చిత్రాల నుపయోగించి సమున్నతమైన వారి ప్రతిభా సామర్థ్యాన్ని ప్రకటించుకున్నారు.

"ఆ అందమూ చందమూ అంతాపోయింది. ఎన్నాళ్ళనుంచో జబ్బుతో తీసుకొంటున్న మనిషి లాగు ఉన్నది. ఏమి వాలకము పడ్డది! బంగారము వంటి శరీరము మాడిపోయింది. కన్నులు లోతుకు పోయినవి. ఒంటు నెత్తురే కనబడడంలేదు. నులకతాడులా ఉన్న దామె."

"అను తాపపక్వమై ఆమె హృదయము పండిన గోరింటకాయ వలె ఉన్నది. ఎంత తేలిక మాట తాకినా అది చెక్కలై పోతుంది."

"దేవి ముఖము చిన్నబోయింది. మనసులో ఉన్న విచారమంతా ఒక్క నిట్టూర్పుతో పైకి విడిచి తలవంచుకొన్నది." పు 36

ఈ కథలో స్త్రీ సహజ సంభాషణ అచ్చు గుద్దినట్లుంది.

"ఒకసారి నేను ఏకాంతముగా ఉన్నప్పుడు "నీ మొగుడు నీకు తగిన వాడేనే? నీకు ఇష్టమేనా?"అని అడిగాను. ఆమె నవ్వి నా బుజము పట్టుకొని నొక్కుతూ "పోవే నీవంతానూ? ఆడవాళ్ళకు మొగుడికంటె ఇష్టులెవరుంటారు?" అన్నది. నేను రెండు బుగ్గలూ పట్టుకొని నొక్కుతూ "అప్పుడే మొగుడంటే నీకు ఇంత అభిమాన మేమిటే...." అని ఏమేమో అనబోతున్నాను. పు 26

1. "కథా సాహిత్యంలో గౌతమీ కోకిల పౌరోహిత్యం" అముద్రితం పుట 12

"మా అత్తగారు "నీ నగలన్నీ ఏమయినవే? చేతి గాజులు కూడా" అని ఏమో అనబోయినది. దేవి చాలా విరక్తితో "నగలున్నవి. అవి అమ్ముకొని తినేవాళ్ళుకారు వాళ్ళు. ఒకవేళ అమ్ముకొన్నా అవి వాళ్ళ సొమ్ము. ఏమి చేసుకొంటే మనము ఏమనగలము?" అని అంది. పు 22

దేవిని నా గదిలోనికి పిలిచి నెమ్మదిగా "మొగుడి పక్షము వహించి కన్నతల్లితో దెబ్బలాడడానికి నీకు సిగ్గులేదే. నీ సిగ్గు చిమడ! మొగుడంటే ఒకేసారి పడి చచ్చిపోతున్నావేమిటి? సిగ్గుమాలిన దానా! అని అన్నాను. పు 23

ఈ ఉదాహరణోక్తుల పంక్తులు చదువుతుంటే పాఠకుల మనో నేత్రాల్లో ఆయాపాత్రల ఉచ్చారణ సంబంధ కాకుస్వర స్వరూపం, తదనుగుణమైన హస్తాద్యవయవ విక్షేప విధానం స్పష్టంగా ప్రతి బింబిస్తుంది. ఆయన సినిమా పాటల రచయిత కనుక సందర్భాన్ని అనుసరించి ఈ కథలో ఒక చక్కని పాట వ్రాశారు. దేవి అగ్నికి ఆహుతయ్యే ముందు తన వదినకు ఉత్తరం వ్రాస్తూ చివర ఇలా అంది.

"వదినా! ఈవేళ తిథిఏమిటో తెలుసునా? ఫాల్గుణ శుద్ధ సప్తమి. సరిగా ఈరోజుననే నాభర్తను నేను మొట్టమొదట చేరుకున్నాను. అది అంతా ఇప్పుడు నాకు జ్ఞాపకము వస్తున్నది. అప్పటివలెనే ఇప్పుడూ వెన్నెల కిటికీలోనుంచి చంద్రుడు నావైపుచూసి నవ్వు తున్నాడు. వెన్నెల నామీద పడుతున్నది. ఆనాటిపాట మా రంగక్కయ్య పాడినది. ఇప్పుడు జ్ఞాపకము వస్తున్నది.

ఏటికే నాకింక జడుపు - ఒక్క
నాటికిని రాబోదె విడుపు -
నా హృదయనాథుండు, నాజంట విడకున్న
నాకీ ప్రపంచమ్మె నందనోద్యానమ్ము....ఏటికే.

కాలమేఘాలు లోకాల కనుమూయనీ
మాయదే నాచందమామ చిరునవ్వు....ఏటికే.
కటికచీకటి కాటుకల పూత పూయనీ
నన్ను బొదవునె పండువెన్నెలల వెలుగు....ఏటికే.
నిదురలో మరపులో నెనరు జాగరములో
వదలిపోవని శరద్వైభవ మ్మిదె యుండ....ఏటికే.

ఆహా! అది ఒకరోజు. మరల ఇది ఒకరోజు. దానికి దీనికి ఎంతో వ్యవధానము. ఆనాటి వెన్నెలలో నా హృదయేశ్వరుని పాదాలదగ్గర ఆశ్రియము పొందాను. ఈనాటి వెన్నెల్లో మరల ఆ పాదాలదగ్గరనే ఆశ్రియము కోరుతూ వెళ్ళిపోతాను." పుట 51, 52

భర్తను చేరుకునే తొలిరాత్రి మాధుర్యాన్ని పొందే ముందుస్థితికీ, కొద్ది నిముషాల్లో అగ్నిలో ఆహుతికి ముందున్న స్థితికీ ముడివేయడం వేదులవంటి ప్రతిభావంతులకే చెల్లుతుంది. అదీ పాటతో ముడివేయడం మరీ విశేషం.

ఇలాగే దేవి అగ్నికి ఆహుతి కావడాన్ని సీత అగ్నిప్రవేశ ఘట్టానికి జోడించి భాస్కర రామాయణంలోని సీత దహన స్థితయి య్యే పద్యాన్ని సందర్భపడేటట్లు చేయడం పూర్వకావ్యాలపై ప్రభుత ఉన్న వేదులకే చెల్లింది.

పాతివ్రత్యం వెనుక నుండి స్త్రీలెంత కష్టానికి గురియవు తున్నారో, అదియెంత దృఢమైందో తెలియజేయడం రచయితధ్యేయం. అంచేత కథ చదివిన తరువాత పాతివ్రత్యపు టవగాహనపై కొత్త ఆలోచనలు మన మనసులో చెలరేగక తప్పవు. అయా పరిస్థితుల్ని బట్టి, భర్తల ప్రవర్తనల్ని బట్టి స్త్రీజాతి ఈ భారత భూమి పై మనుగడ సాగించడానికి, పాతివ్రత్యమనే మాటకు సరికొత్త నిర్వచనాల్ని వెదకడానికి ఈ కథ పరోక్షంగానైన దోహదం చేస్తుంది.

## 3. అనితమ్మ ♦

వేదుల కథా నిర్మాణ కౌశలాని కీకథ ప్రబలోదాహరణం.

### కథా సంగ్రహం

ఒక తెలుగువాడు బర్మాదేశంలో టాంగూనగరంలో సిటాంగు నదివైపు వెళ్ళుతుండగా దూరంలో తెలుగు కీర్తన వినబడింది. ఆ పాడుచున్నవారెవరో తెలిసికోవాలని ఆసక్తితో ఆ వ్యక్తి ముందుకు వెళ్ళాడు. సిటాంగు నది వంతెన మీద ఒక బౌద్ధ సన్యాసి ఏకతార మీటుతూ యాసలేని తెలుగులో కీర్తన* పాడటం ఆ వ్యక్తికి ఆశ్చర్యాన్ని కలిగించింది. వివరం అడగ్గా ఆ సన్యాసి తెలుగువాడే అని తెలిసింది. గృహస్థుడు బౌద్ధ సన్యాసిని తన యింటికి ఆహ్వానించాడు. వర్షం పడుతుండగా సన్యాసి ఆ యింటి గుమ్మంలో అడుగు పెట్టగానే మెరుపు తళుక్కుమంది. ఆ వెలుగులో ఇంటి ఇల్లాలి ముఖం సన్యాసి చూశాడు. వెంటనే అతడు పెద్ద కేకవేసి స్పృహతప్పి పడిపోయాడు. సపర్యలు చేయగా సన్యాసికి స్పృహ వచ్చింది. ఆ యింటి దంపతులు కోరిన మీదట సన్యాసి తన కథను చెప్పాడు. ఆ ఇల్లాలి పేరు 'అనితమ్మ' అని తెలియగానే అదోకలా అయ్యాడు.

ఆ బౌద్ధ సన్యాసి పూర్వాశ్రమంలో వివాహితుడైన పట్టభద్రుడు. వ్యాపార నిమిత్తం ఇండియానుండి బర్మాకు వెళ్ళాడు. భార్య మాత్రం ఇండియాలోనే ఉంది. అక్కడ అతనికి సాలోయా అనే బర్మాదేశపు అందాల బరిణెతో పరిచయ మేర్పడింది. కొన్ని రోజులు హాయిగా గడిచాయి. ఒక రోజున హఠాత్తుగా వ్యాపారి భార్య ఇండియా నుండి వచ్చింది. ఆ యిద్దరి ఆడవాళ్ళతో అతడొకే యింటిలో జీవితాన్ని సాగిస్తున్నాడు. కొంతకాలానికి భార్యకు ఆడపిల్ల పుట్టింది. అప్పుడొక బౌద్ధ సన్యాసి వచ్చి సంతానం కలిగిందని ఆనందపడవద్దని

---

♦ భారతి, అక్టోబరు 1928. * ఇదే ముక్తపురి చివర చేర్చబడింది.

ఆ దంపతులకు చెప్తూ అనిత్యమనే మాటను పలుసార్లు పలికాడు. అయితే 'అనిత్యం' అని పలకడం రాక అన్నిసార్లు 'అనితం, అనితం' అన్నాడట. ఆ కారణంగా భార్యాభర్తలు తమ ఆడుబిడ్డకు 'అనితమ్మ' అని పేరు పెట్టుకున్నారు.

వ్యాపారి భార్యపట్ల సాలోయాకు అసూయ పెరిగింది. వ్యాపారికి అతని భార్య శీలం విషయంలో అనుమానం కలిగించే ఉద్దేశంతో సాలోయా వంటవాని సాయంతో ఒక పన్నాగం పన్నింది. ఆ నాటకాన్ని గ్రహించిన వ్యాపారి వంటవానిని కత్తితో పొడిచాడు. ఫలితంగా వ్యాపారికి ఏడేళ్ళు శిక్ష పడింది. జైలు నుండి విడుదలై వ్యాపారి తిరిగి తన యింటికి వచ్చాడు. ఇంట్లో భార్య, కూతురు లేరు. సాలోయా, వంటవాడు కాపురం అక్కడే ఉన్నారు. పెళ్ళాం బిడ్డల ఆచూకీ తెలియక, ఆ వ్యాపారి అంతా మిథ్య - అంతా అనిత్యమని తెలిసికుని చివరకు బౌద్ధ సన్యాసిగా మారాడు.

ఆ కథ విన్న అనితమ్మ ఆ బౌద్ధ సన్యాసి తన తండ్రి అని తెలుసుకుంది. ఆ సన్యాసి కూడ తన కుమార్తెను గుర్తించాడు. తన భార్య తనకోసం ఎదురు చూచి పదిహేను రోజుల క్రితమే కన్నుమూసిందని కూతురు చెప్పింది. తండ్రిని తమ దగ్గరే ఉండిపొమ్మని కాళ్ళ మీద పడి ఏడ్చింది కూతురు.

సన్యాసికి సుఖ దుఃఖాలుగాని, సంసార బంధాలుగాని లేవనీ, ఈ ప్రపంచమంతా మిథ్య అనీ అతడు చెప్పాడు. ఇక్కడే ఉండాలని అనితమ్మ మరలా గట్టిపట్టుపట్టింది. సన్యాసి గట్టిగా 'హో' అని కేకవేసి భోరున పడుతున్న వానలో కలిసిపోయాడు. తరువాత ఆ దంపతులెంత వెదకినా కనిపించలేదు.

## కథా వైశిష్ట్యం

ఇందలి ఇతివృత్తం భారత, బర్మా భూభాగాల్ని పసందుగా అల్లుకుంటూ సాగింది. స్వాతంత్ర్యం రాకముందు చాలమంది

తెలుగువారు వ్యాపారానికి గాని, పనిపాటలు చేసుకుని బ్రతకడానికి గాని బర్మావెళ్ళి వచ్చుచుండుట పరిపాటి. బర్మాజాతి వారితో వివాహ సంబంధాలు పెట్టుకున్న తెలుగువారూ ఉన్నారు. వీటన్నింటిని జోడిస్తూ రచయిత 'అనితమ్మ' కథకు రూపకల్పన చేశాడు.

ఈ కథకు వేదిక టాంగూనగరంలో ఒక ఇల్లు. ఆ ఇంటిలోనే వ్యాపారి సాలోయాతో ప్రేమ కలాపాలు సాగించాడు. ఆ ఇంటనే వ్యాపారి భార్యకూడ కాపురం పెట్టింది. ఆ ఇంటిలోనే అనితమ్మ పుట్టింది. అక్కడే వంటవానితో సాలోయా అడ్డూ ఆపూ లేకుండా కులికింది. చివరకు అనితమ్మ అదే ఇంటిలో భర్తతో కాపురం చేస్తుండగా యాదృచ్ఛికంగా తండ్రిని కలిసికోవడం చిత్రాతిచిత్రంగా జరిగిన సంఘటనలు.

'అనితమ్మ' అను పేరు రచయితకు తట్టడమే ఒక చమత్కారం. 'అనిత్యం' 'అనితం'గా ఉచ్చరింపబడటం; అది ఒక అమ్మాయి పేరుగా-అనితమ్మగా రూపొందుట ర చ యి త నిశిత దృష్టికి నిర్దిష్టమైన నిదర్శనము. ఆపేరే కథకు శీర్షికగా భాసిల్లుట—ఆద్యంతము వైరాగ్య విశ్వరూపంతో ప్రవర్తిల్లిన ఇతివృత్తం కాబట్టి ఔచిత్య సుందరంగా ఉంది. ఇందు బౌద్ధ సన్యాసి పా డి న తెలుగుకీర్తన వైరాగ్యంతో నిండినదే.

## నాటకీయత భాసించిన ఘట్టం

సహజంగా సాగిన ఈ కథకు నాటకీయత అద్దబడింది. అది కథకు పరిపుష్టిని చేకూర్చుటయే కాక ప ఠ న కుతూహలాన్ని పెంపొందించింది.

భాసుని స్వప్నవాసవదత్త నాటకంలో నిద్రపోతున్న రాజు వాసవదత్త నామాన్ని పలవరించడం, యాదృచ్ఛికంగా వాసవదత్త అక్కడే ఉండి ఆ మాటలు విని, రాజు తనను గుర్తించాడని తడబడి అక్కడ నుండి వెళ్ళిపోయింది. అప్పుడే కనులు తెరచిన రాజు లీలగా

తన కనుల ముందు కనిపించిన వాసవదత్త రూపం యథార్థమా!, స్వాప్నికమా! అనే విభ్రాంతికి లోనవడం భాస సాహితీ సమారాధకులకు తెలిసిన విషయం. నిజానికి ఆ సన్నివేశమే నాటకానికి ఆయువుపట్టని పండితుల వక్కాణ. అది సహజత్వానికి విరుద్ధంకాని అద్భుత రూపకల్పన. అది భాస మహాకవి ప్రతిభా విద్యుత్కళిక. దీనికి దీటైన సన్నివేశ కల్పనా సామర్థ్య ప్రదర్శనం ఈ కథలో ప్రస్ఫుటించింది. అది ఇది.

వ్యాపారి భార్య పక్కలో చంటిపిల్లను పరుండబెట్టుకుని గాఢ నిద్రలో ఉంది. వంటవాడామెకు తెలీకుండగా ఆ పక్కమీదే పడుకున్నాడు. ఈలోపున సాలోయా వ్యాపారిని తీసికొని వచ్చి ఆ దృశ్యం అతనికి చూపించింది. నిజానికి వంటవాడు, సాలోయా ప్రేమపక్షులు. వ్యాపారికి భార్యపట్ల అనుమానం కలిగించడానికి, సాలోయా వంటవానితో కలిసి పన్నిన పన్నాగమిది. వంటవాడు నిద్రపోతున్న ఆమెపై చేయి వేయబోయాడు. ఇదికూడ వ్యాపారికి భార్య శీలంపై అనుమానం కలగడానికి చేసిన చేష్టయే. అనగా ఇది అంతా వంచనాశిల్పంలోని భాగమే. అయితే వ్యాపారికి భార్యశీలం పట్ల అనుమాన మింతకూడ కల్గలేదు. ఇది అంతా వారిరువురు పన్నిన నాటకమని అతనికి మెఱుపువలె తట్టింది. ఒళ్ళుమండిన వ్యాపారి అతని చేతికి దొరికిన కత్తిని వంటవానిపైకి విసిరాడు. అది భుజం దూసుకునిపోయి తలకు తగిలింది. వంటవాడు తెలివితప్పి క్రింద పడిపోయాడు. గది అంతా రక్తం. పడిపోయిన ప్రియుని కౌగిలించుకుని సాలోయా భోరుమంది.

ఈ గందరగోళానికి వ్యాపారి భార్య లేచింది. జరిగిన కథ ఏమిటో ఆమెకు తెలేదు. వంటవానితో సాలోయా ప్రేమకలాపాలు సాగించడం వ్యాపారి భార్యకు తెలుసు. కానీ, ఆవిషయం చెపితే గొడవ జరుగుతుందని ఆ రహస్యాన్ని భర్తకు చెప్పలేదు. ఆమె ఇప్పుడు లేచి చూడగా సాలోయా వంటవానిపైపడి ఏడుస్తుంది. భర్త

చేతిలో కత్తి. జరిగిన దాన్ని చూడలేదు కనుక ఆ సన్నివేశానికి కారణం మరొక విధంగా ఊహించింది. ఎప్పటివలె సాలోయా వంట వానితో రహస్యంగా కులుకుతుండగా తన భర్త చూచి వానిని కత్తితో పొడిచాడని అనుకుంది. వంటవాడు తన యెడల అవమానకరంగా ప్రవర్తించిన తీరుగాని, వాడు పక్కలో పడుకోవడంగాని తెలీదు. ఏ మాత్రం తెలిసినా అవమాన భారంతో అల్లాడి పోయేది. ఆ మానవతీ లలామ పాత్రనంత వివేకంతో చిత్రించడం రచయిత ప్రదర్శించిన ఔచిత్యానికి, మనస్తత్త్వపరిశీలనా పాటవానికి క్షోదక్షమమైన తార్కాణం.

కనుకనే వావిలాల సోమయాజిగారు, పోరంకి దక్షిణామూర్తి గారు ఇలా వ్రాశారు.

"వేదుల 'అనితమ్మ'వంటి మరపునకురాని కొన్ని కథలలో మనోహర రచనా విన్యాసమును చూపినాడు."[1]

"వేదుల సత్యనారాయణశాస్త్రిగారు కవిగా ప్రసిద్ధులై'అనితమ్మ' వంటి రచనల ద్వారా కథకులయినారు.[2]

## వే స వి మ బ్బు లు ♦

దీనికి శరత్‌బాబు వ్రాసిన చిన్నకథ ఆధారమని ముందే చెప్పబడింది. ఈ సంగతిని వేదులే తెలియజేశారు కాబట్టి తెలిసింది కాని లేకపోతే కథాగమనాన్ని బట్టి స్వతంత్ర కథగా భావిస్తాం. కథా నిర్మాణానికి సంబంధించిన పథకం వినా మిగిలినదంతా వేదులదే.

### కథా సంగ్రహం

రామవరం బ్రాహ్మణాగ్రహారం. గోపాలం చెన్నపట్నంలో బి.ఏ అనర్సు అయివచ్చాడు. ఇక్కడ గ్రంథాలయం ఏర్పాటు

---

1 కథా సాహిత్యము' విజ్ఞాన సర్వస్వం-4 పుట 745.

2. 'కథానికా వాఙ్మయము' ఆం. చరిత్ర-భూగోళ సర్వస్వము. పు.438

♦ ఆంధ్రభూమి, ఫిబ్రవరి 1933.

చేయాలని అతని సంకల్పం. ఆ ఊరిలో కుర్రకారంతా దీన్ని బల పరిచారు. గ్రంథాలయానికి ఒక ఇల్లు కావాలి. లక్ష్మీనారాయణగారి ఇల్లయితే బాగుంటుందని గోపాలం శిష్యుడు విశ్వనాథం సూచించాడు. లక్ష్మీనారాయణ ఒకప్పుడీయూరివాడె. అతని చెల్లెలు వితంతువు ఆమె అన్నగారింటి యందే ఉంది. యవ్వన ప్రభావంవల్ల ఇల్లు విడిచింది. అయితే ఆమె జీవితం సర్వనాశనం కాగూడదని చెల్లెల్ని వెదికి, వెదికి లక్ష్మీనారాయణ ఇంటికి తెచ్చుకున్నాడు. ఊరి బ్రాహ్మణ్యం అతన్ని వెలివేసింది. ఆ ఊరిలో నిప్పూ, నీరూ పుట్టక వసంతవరం కాపురం మార్చాడు. అక్కడ వడ్డీ వ్యాపారం వల్ల ధనవంతు డయ్యాడు. ఈ విధంగా రామవరం ప్రజలకు లక్ష్మీనారాయణ అంటే లోకువ. ఇక్కడ ఖాళీగా ఉన్న యింటిని గ్రంథాలయానికి చందాగా ఈయకపోతే, వసంతవరంలో కూడ వెలి విషయం ఎక్కలాగి అల్లరి చేయడానికి విశ్వనాథం సూచనపై గోపాలం అతని బృందం నిశ్చయించుకున్నారు. తీరా వసంతవరం వెళ్ళగా తన చందా పావలా అని, పిసికి పిసికి పావలాను, ఆరణాలకు పెంచాడు. ఇంతలో గోపాలానికి దాహం వేసింది. మంచి నీళ్ళడిగితే లక్ష్మీనారాయణ చెల్లెలు నీళ్ళ చెంబుతో గుమ్మం దగ్గరకు వచ్చింది. విశ్వనాథం లక్ష్మీనారాయణకు అతని చెల్లెలికి బాధ కలిగేటట్లు మాట్లాడాడు. ఇంతలో ఒక సంఘటనవల్ల ఆమె ఉదాత్త మనస్కురాలని గోపాలం గ్రహించాడు. లక్ష్మీనారాయణ గుమస్తా గోపాలం ప్రభృతుల్ని దాహం పుచ్చుకోవడానికి తన ఇంటికి ఆహ్వానించాడు. దారి పొడుగునా ఆ గుమస్తా లక్ష్మీనారాయణ్ణి, అతని చెల్లెలిని అసహ్యంగా చిత్రించడానికి ప్రయత్నించాడు. విశ్వనాథం ప్రభృతులు దానికి వంతపలికారు. కాని దుర్మార్గుడైన గుమస్తా చెడు బుద్ధిని కళ్ళార చూచిన గోపాలం మాత్రం వారితో శ్రుతి కలపలేదు. అన్నింటిని ఆలోచించిన పిమ్మట గోపాలం వెనక్కి వెళ్ళి ఆ వెలివేయబడిన లక్ష్మీనారాయణ వితంతు సోదరి చేతినీళ్ళు త్రాగడానికే నిశ్చయించుకున్నాడు.

[కథా] వైశిష్ట్యం

ఈ కథ బ్రాహ్మణ్యానికి సంబంధించిన వ్యవహారం కావున [ర]చయిత చేతిలో సహజత్వం రూపుదిద్దుకుంది. 'వెలి' అనే సాంఘిక [దు]రాచారాన్ని తూర్పారబట్టడం ఈ కథలోని జీవపదార్థం. సమాజం [లో]ని దౌష్ట్యాన్ని ఖండించడానికి, తన అభిప్రాయాల్ని ప్రకటించ[డా]నికి రచయితకు ఈ కథ తాలూకు చట్రం లభించింది. దీన్ని [ప్ర]తీభాసురంగా ఉపయోగించు కోవడంవల్ల ఏనుగంత బలం [వ]చ్చింది. వాడీ వేడీ ఉన్న కొన్ని వాక్యాలు.

"ముక్కుపచ్చ లారనప్పుడే ఒళ్ళో కూర్చోబెట్టుకొని తల్లిగారే [త]లంబ్రాలు పోస్తుంది. కాని చిన్నప్పుడు భర్తపోతే - ఆ పసిపిల్ల [యా]వజ్జీవమూ నియమముగా తన బ్రతుకు బండలు చేసుకోవా[ల]నుట" — పు. 95

"నిజానికి హిందూ సంఘము దురాచారాలచేత, పురోహితుల స్వార్థపరత్వముచేతా లోలోపల కుళ్ళిపోయింది." - పు. 96

"ప్రస్తుతము సంఘమును పాలిస్తున్నది ధన పిశాచిగాని శృతులుగావు, స్మృతులుగావు, ధర్మముకాదు."— పు. 96

"ప్రస్తుతము కలిలో ధర్మగోవుకు ఒక్కటేకాలు ఉన్నదట. కాని ఉన్న ఆ ఒక్కకాలితో పేదవాడి మొగము మీద తన్నుతూ, ఆ ధర్మ గోవు తన వాడికొమ్ములతో ధనవంతుల యినప పెట్టెలకు కాపలా కాస్తున్నది." - పు. 96.

"మిరప తోటలోని 'దిష్టిబొమ్మలు'లాగు దేవుడూ, మతమూ, ధర్మమూ అనేవి దుర్బలులను హడల గొట్టడానికి, తెలివిగల శ్రీమంతుల అధికారమును నిలపడానికి ఉపయోగ పడుతున్నవి." — పు 96

"మతపిశాచి కాళ్ళ క్రింద నలిగి పోతూ ఉన్న జాతీయత నెత్తిమీద కోట్లకొలది భగవద్గీతలూ, ఉపనిషత్తులూ వేసి లాభమేముంటుంది." — పు. 97

"పతితులకు పావనతా, రోగులకు ఆరోగ్యమూ, ఆపన్నులకు సాహాయ్యమూ, దరిద్రులకు అన్నమూ కల్పించలేని ధర్మము ధర్మము కాదు. సంఘము సంఘముకాదు.

"ధర్మము సనాతనమే. కాని దేశ కాల స్థితులవల్ల దానికి రూప మేర్పడుతుంది. ఈ రూపము పరిణామశీలము. పరిణామ మంటే ఏదో విప్లవముగా ఊహించుతాడు మానవుడు. దానికి కారణము ఆచార దాస్యము." – పు. 111

## కథాకాలం నాటి పరిస్థితి

బ్రిటీషువారి పాలనలో బానిసత్వానికి వ్యతిరేకంగా భారతీయు లలో జాతీయాభిమానం పెల్లుబుకుచున్న పరిస్థితి ప్రతిబింబిస్తున్న కథ ఇది. ఆ కాలంలో ప్రతివ్యక్తికీ జాతి స్వధర్మము మీద, మత సంబంధమైన ఆచార వ్యవహారాల మీద, దేశీయమైన సంస్కృతి మీద అభిమానం పెరిగింది. మన ప్రాచీన సంప్రదాయాల్ని చక్కగా గౌరవించుకోవాలనే తహతహలో, సంప్రదాయం పేరిట మొలకెత్తిన 'వెలి' వంటి కుక్కగొడుగు ఆచారాలు కూడ సనాతన ధర్మంలో ఒక భాగమే అను భావన గోపాలం వంటి యువకులకు కలగడంలో ఆశ్చర్యంలేదు. ఇటు అనుసంధేయాలైన ఇజ్జాడవారి వాక్యాలు.

"సంప్రదాయం ఎప్పుడూ విలువైనదే. అందులో ఎప్పటి కప్పుడు కొంత మాలిన్యం ఏర్పడుతూనే ఉంటుంది. స్వధర్మాన్ని రక్షించుకోవడం ఎంత అవసరమో, దానిని సంస్కరించుకోవడం కూడా అంతే అవసరం. లేకపోతే ఆ స్వధర్మమే జనులపాలిటి ఉరి కొయ్యగా మారుతుంది. బలవంతులూ, ధనవంతులూ ఆ శిక్షనుండి ఎప్పుడూ తప్పించుకోగలరు. కాని నిస్సహాయులూ, నిర్ధనులూ అయినవారి మాటేమిటి? వారందరి తరపునా ఈ రచయిత వకాల్తా పుచ్చుకొన్నాడు."[1]

1. కథా సాహిత్యంలో గౌతమీ కోకిల పౌరోహిత్యం. అము. పుట 39

ముగింపు

ఈ కథ ముగింపు విశిష్టమైంది. దీన్ని నేడు విమర్శకులు 'కొస మెరుపు' అంటున్నారు. గోపాలం ప్రభృతులు ఎండలోపడి లక్ష్మీనారాయణ ఇంటినుండి గుమస్తా వెంట వెళ్ళుతున్నారు. అవకాశం దొరికింది కదా అని గుమస్తా తన గొప్పతనాన్ని, లక్ష్మీనారాయణ, అతని చెల్లెలి తప్పుల నేకరువు పెడ్తూ "సిగ్గులేక మీకు మంచినీళ్ళు తెచ్చిందామె ఏమి పోకిళ్ళు పోతుందనుకొన్నారు?" అని అనినాడు. ఇక్కడే కథ అడ్డము తిరిగినది. గోపాలం హఠాత్తుగా ఆగి "నాకు చాలా దాహమవుతున్నది. వెనకకు వెళ్ళుతాను." అన్నాడు.

"వెనకకు ఎక్కడికి వెళ్ళుతారూ? ఆ కనబడేదే మా యిల్లు" అని గుమస్తా.

"నేను మీయింటికి రాను. వీళ్ళను తీసికొని వెళ్ళండి. నేను లక్ష్మీనారాయణ గారింటికే వెళ్ళి మంచినీళ్ళు తాగుతాను" అని గోపాలం. పు. 112

"అరే, ఆ దుర్మార్గురాలి చేతినీళ్ళు! ఆ పతితురాలి చేతినీళ్ళు తాగడమా?" అందరూ కళ్ళు పెద్దవి చేశారు. పు 112

పొరపాటును పురస్కరించుకొని మూర్తీభవించిన మంచితనాన్ని నిరసించడము పాపము! .... ఆచారముకన్నా స్వభావము బలవత్తరము....పక్ష విరహితము చేసి పక్షి అధఃపతితము అవుతున్నదనడము ధర్మదేవత కళ్ళు పొడిచివేయడమే .... ఆచార దృష్టిలో లోకమునకు ఈమె పతితురాలు. కాని ఆచారపిశాచి మానవత్వాన్ని చంపగలిగినప్పుడే పాతిత్యము. నిజానికి మనకంటె ఆమెలో మానవత్వమూ, హృదయమూ ఎక్కువ సజీవముగా ఉన్నవి. ఆమె చేతినీళ్ళు తాగినంత మాత్రాన నా బ్రాహ్మణ్యము పోయేటట్లయితే

నేను బ్రాహ్మణుడ నవడమునకు తగను" అని గిరుగిన వెనక్కి తిరగాడు.

"అయితే నీకూ గ్రంథాలయోద్యమానికీ" అం హస్తోదకమే" అని గోపాలం లక్ష్మీనారాయణ ఇంటికేసి సాగాడు.

వచ్చిన తంటా అమె చేతినీళ్ళు త్రాగడానికి వెళ్ళబోవడం. చేతినీళ్ళకు పర్యాయపదం హస్తోదకం. దీనికి ఆశ విడిచిపెట్టుకోవడం అని అర్థం వాడుకలో ఉంది. అనగా లక్ష్మీనారాయణ చెల్లెలి హస్తోదకానికి వెళ్ళబోవడంవల్ల గ్రంథాలయోద్యమానికి తెరపడింది. ఇక్కడ రచయిత బహు చమత్కారంగా హస్తోదకమనే పదాన్ని ఉపయోగించి తన ప్రతిభను చాటుకున్నాడు.

హస్తోదక మను పేర 'ఆంధ్రభూమి'లో ప్రచురింపబడ్డ ఈకథకు కాలక్రమంలో రచయిత అభిప్రాయాన్ని మార్చుకుని కథలు గ్రంథ రూపం దాల్చునప్పుడు 'వేసవి మబ్బులు' అను పేరు పెట్టారు

వేసవికాలంలో మబ్బులు పట్టినా, అవి అంతలోనే తేలిపోతాయి. వాటివల్ల ప్రయోజనం శూన్యం. ఈ కథ గ్రంథాలయ స్థాపనకు గోపాలం వంటి యువకులు నడుం కట్టడంతో ప్రారంభమైంది. 'ఆదిలోనే హంసపాదు' అన్నట్లు గ్రంథాలయానికి గృహసంపాదనలోనే వారి ప్రయత్నం బెడిసికొట్టింది. నీరు కారని వేసవి మబ్బులలాగే వారి ప్రయత్నం నీరుకారిపోయింది. అది తెలియజేయడానికే ఈ కథ కీ పేరు పెట్టబడింది.

ఈ కథ వంగదేశం నుండి వచ్చిందని ముందే చెప్పబడింది. అయితే వితంతువులపట్ల అక్కడ ఉన్నంత క్రూర నిర్బంధకాండ తెలుగుదేశంలో లేదు. వితంతువు చేతినీళ్ళు త్రాగడానికి పనికిరావనే నిషేధం ఇక్కడలేదు. వంగదేశంలో ఉంది. మన తెలుగు జాతిలో పవిత్రమైన పితృకార్యాల్ని వితంతువులే నిర్వహించడం అనూచానమైన ఆచారం.

## 5. డాక్టరు చెప్పిన పెండ్లి కథ

### కథా సంగ్రహం

కథానాయకు డిరువది నాలుగేండ్ల యువకుడు. డాక్టరు చదువును పూర్తి చేశాడు. పిత్రార్జితమైన ఆస్తి కావలసినంత ఉంది. అందుచే వైద్యం చేసి డబ్బు గడించాలనే కోరిక అతనికి లేదు. అయితే చదివిన చదువుకు సార్థక్యముండాలని శ్రేయోఽభిలాషులందరూ పట్టుబట్టడంతో ఆసుపత్రి పెట్టడానికి కావలసిన పరికరాల కోసం కలకత్తావచ్చాడు. ఈ యువకునకు డాక్టరు కావాలన్న కోరిక కంటె కథానాయకుడు కావాలన్న ఆకాంక్ష ఎక్కువ. కాబోయే భార్య తన సిరి సంపదల్ని చూచి కాక గుణగణాల్ని మెచ్చి ప్రేమించాలని ఇతని ప్రగాఢమైన ఆశంస.

కలకత్తాలో నదిలో స్నానం చేసి గట్టుమీదకు వచ్చినవెంటనే ఇతనితో ఒక పెద్ద మనిషి వాదోపవాదాలొనర్చి బ్రాహ్మణుడే అని నిర్ధారణ చేసుకుని వంటవానిగా కుదుర్చుకున్నాడు. ఈ యువకునికి ఇదంతా బలే తమాషా అనిపించింది. కొంతకాలం సరదాకైనా వంట బ్రాహ్మణునిగా గడిపి చూడాలని నిశ్చయించుకున్నాడు. ఆ పెద్ద మనిషి వెంటవెళ్ళి వంటగదికి అధిపతి అయ్యాడు. అంతేకాదు, ఆ పెద్ద మనిషి మొదటి భార్య కుమార్తె ప్రియంవదకు హృదయాధినాథుడయ్యాడు. ఈ సన్నివేశంలో చక్కగా నటించి కథానాయకుడై సతీసమేతుడైన ఈ డాక్టరు పెండ్లికథ కడుపుబ్బ నవ్విస్తుంది. అంతరంగ ఔన్నత్యానికి అగ్రతాంబూల మీయడం ఇందలి విశిష్టత.

### కథా వైశిష్ట్యము

డాక్టరైన యువకుడు, పైపెచ్చు డబ్బుపుష్కలంగా ఉన్నవాడు పొరుగూరిలో ఒక్క పెద్ద మనిషికి వంట బ్రాహ్మడిలా కనిపించడం ఒక చమత్కారం. పెద్దమనిషి సవాలక్ష ప్రశ్నలు వేసి ఆ యువకుడ్ని

వంటు బ్రాహ్మణునిగా పెట్టుకోవడం, అందుకు ఆ యువకుడు పాచిక పదవిలో ఉండే మజా కూడా సరదాకైనా ఓసారి చూడాలని అంగీకరించడం కూడా చమత్కారమే. ఇది అంతా కథలో హాస్య ప్రధానమైన మొదటి భాగం.

ద్వితీయ భాగం సున్నితమైన శృంగార రసభరితం. ఈ వంటు బ్రాహ్మడికి సహాయం చేయడానికి ప్రియంవద తరచు వస్తూ వెళ్తుండటంతో నాయికానాయకుల మధ్య సన్నగా అనుబంధం మొదలై క్రమేణ చిక్కబడింది. పాపం! ప్రియంవదకు జ్వరం వచ్చినా సవతి తల్లి యేమీ పట్టించుకోదు. తండ్రి కూడ అంతే. మన కథానాయకుడు డాక్టరే కనుక ప్రియంవదకు వైద్యం నడిపి, ధైర్యం చెప్పి, సానుభూతి చూపి ఆమెను రక్షించుకున్నాడు. ప్రియంవదకు డబ్బు ఖర్చుచేసి వివాహం చేయడానికి ఆమె తండ్రి సిద్ధంగా లేడు. ఖర్చులేకుండా వంటు బ్రాహ్మడి చేత కూతురి మెడకు మంగళసూత్రం కట్టించాడు. ఈదెబ్బతో యువ డాక్టరుకి కథానాయకునిగా జీవించాలనే కోరిక నెరవేరింది.

పూర్తిగా నాటకీయత భాసించిన ఈకథలో అడుగడుగునా సంభాషణాత్మక రచన కొనసాగింది. ఈ సంభాషణలో హాస్యం మూటలు కట్టిన మాటలు చకచకా సాగుతూ పాఠకులకు చక్కిలిగింతలు పెడతాయి.

పెద్దమనిషి: వంటచేయడము చేతనవునా? ఎక్కడైనా చేశావా?

యువకుడు: చిత్తము

పె. మ. : ఇప్పుడు చేస్తావా?

యువ : దొరికితే ఎందుకు చేయను?

పె. మ. : అసలు వంట తెలుసునా?

యువ : చేపకు పుట్టుకతోనే ఈత వస్తుంది.

.... .... ....

పె. మ. : ఇక్కడికి వచ్చి ఎన్నాళ్ళయింది?
యువ : నాలుగైదురోజులు కావచ్చింది.
పె. మ. : నౌకరీ కోసమే వచ్చావా?
యువ : కాకుంటే సినిమాలు నాటకాలు చూడడానికి వచ్చానా మరి? పు. 120-121

.... .... ....

యువ : నీది చాలా అన్యాయము కాదా?
ప్రియంవద: ఏమిటి అన్యాయము?
యువ : ఇతరుల ఉత్తరము చదవడము
ప్రియంవద: మీరు నాకు ఇతరులా?
యువ : అప్పటికి మనకు వివాహము కాలేదుగదా! నేను నిన్ను ప్రేమిస్తున్న సంగతి కూడా నీకు అప్పటికి తెలియదు కదా! అటువంటప్పుడు నేను పరాయివాణ్ణి కానా?
ప్రియంవద: అట్లా అనుకుంటున్నారా మీరు?
యువ : కాదా మరి?
ప్రియంవద: నేను ఎప్పుడు పుట్టానో అప్పుడే మన ఇద్దరికి పెండ్లి అవుతుందని బ్రహ్మదేవుడు స్థిరపరచి ఉంటాడు పు. 155,156

## సందేశము

ప్రేమించి పెండ్లి చేసుకోవడంలో ఉండే సంచలనాత్మకమైన అనుభూతి సౌఖ్యాన్ని జుర్రుకోవడంలో ఒక సాహసిక యువ విద్యార్థికుడు పడిన యాతన సమాజానికి విప్లవాత్మకమైన సందేశాన్ని ఇస్తుంది. ధనవంతుడైనా నిరాడంబర జీవితాన్ని ప్రేమించాడు. ప్రేమబంధం ముందు సమస్తం దిగదుడుపే అని చాటి చెప్పాడు. తనను నిజంగా ప్రేమించే వ్యక్తిని తానై వెదుక్కున్నాడు. తన ఆశయాన్ని స్వీయప్రయత్నంచేత వాస్తవంగా మార్చుకోవడం అతని విప్లవాత్మక భావనా విశిష్టతకు, పురుషకారానికి గీటురాయి.

చివరి మాట

వేదులవారికి వంగసాహిత్యంలో ఎన్నో కథలు నచ్చి ఉండవచ్చు. అటువంటప్పుడు శరత్ బాబుది ఒక కథ, ప్రభాత బాబుది ఒక కథ స్వీకరించి, వాటి నాధారంగా తెలుగులో ఈ రెండు కథల్ని వ్రాయు డానికి కారణ మేమిటనే ప్రశ్న పాఠకులకు పుట్టకపోదు. ఇవి ఆయన హృదయాన్ని హత్తుకోవడం ఒకటి; రెండు నాటి సమాజానికి ప్రతి బింబాలుగా ఉండుట. ఆయనకున్న సామాజిక స్పృహ అట్టిది.

ఒక దశలో భారత దేశ వివాహ వ్యవస్థ ఇప్పటిలా లేదు. ముఖ్యంగా బ్రాహ్మణ కులంలో మరీ విడ్డూరంగా చకచకా బాల్య వివాహాలు జరిగి పోయేవి. 'అష్ట వర్షా భవేత్ కన్యా' అనేది అందరి దృష్టి పథంలో తిరుగుచుండేది. గిల్లిన పాలుగారే పసివయసులో ఉన్న ఆడ పిల్లలకు పెళ్ళిళ్ళు చేయక తప్పేది కాదు. దీని వలన సుగుణాల మాట దేవుడెరుగును గాని, చిన్నతల్లుల బోడి గుళ్ళతో భారతదేశం అట్టుడికి పోయింది. ఎంతటి వీర సనాతనులకు సైతం బాల వితంతువు లైన తమ కుమార్తెల స్థితిగతుల్ని గురించిన ఆవేదనా పూరితమైన ఆలోచన తప్పలేదు.

ఆంగ్లేయుల పాలన, ఆంగ్ల సాహిత్య పరిచయం, దానివలన యుగయుగాల ప్రపంచ దేశాల చరిత్రల పఠనాసక్తి పెరిగి మేధావులలో కొత్త ఆలోచనల్ని రేకెత్తించాయి. మేధావుల సంఘ సంస్కరణ సందేశాలు సనాతన సంఘ వటవృక్షాల కూకటి వేళ్ళను కదలించ సాగాయి. మరియు భారతీయులలో విజ్ఞాన బీజ వ్యాప్తికి గ్రంథాలయోద్యమాలు ప్రారంభింపబడ్డాయి. ఈ రెండు విషయాలు ప్రతిబింబిస్తున్న కథ వేసవి మబ్బులు.

ఇంక రెండోది ముక్కు పచ్చలారని వయస్సులో పెద్దలు చేసే పెండ్లిండ్లలో మజా లేదనే ఆలోచన యువజనుల్లో బలపడింది. ఆ కారణంగానే వైద్య విద్యను పూర్తిచేసిన యువకుడు తనకు నచ్చిన

పిల్లను, తనను మెచ్చిన పిల్లను ఏరికోరి ఎన్నిక చేసికున్నాడు. కాల్పనికోద్యమ ప్రభావంతో భారతీయ రచయితలు ప్రణయా రాధనలో మునిగి తేలారు. వీటన్నింటి ప్రభావ ఫలితమే 'డాక్టరు చెప్పిన పెండ్లి కథ'.

## కథా సాహిత్యంలో వేదుల స్థానం

'వేదులవారి కథలు' అను గ్రంథాన్ని ఇంతవరకు పరిశీలించిన దాన్నిబట్టి కొన్ని ప్రత్యేక లక్షణాల్ని ఇలా క్రోడీకరించవచ్చు. ఈ ప్రత్యేక లక్షణాలే వేదులవారి స్థానాన్ని కథాసాహిత్యంలో చెక్కు చెదరకుండా ఉంచుతాయి.

పఠితను తొలినుండీ తుదిదాక విడువకుండా తనతో తీసికొని పోయే కథా కథన ప్రతిభ పుష్కలంగా ఉంది. ప్రతికథకు సమగ్ర మైన స్వరూపమిచ్చి చదువరికి ఏ విషయంలోనూ సందేహం లేకుండా చేయడం. సరళసుందరమైన రచన. భాషాభేషజముండదు. కనుక పాఠకుని ఆలోచనా స్రవంతికి అడ్డుకట్టలుండవు. పాత్రల కుచితమైన భాషను, సంభాషణకు తగిన కాకుస్వరాన్ని ప్రయోగించి వాటి స్వభావాన్ని సువ్యక్తం చేయడం, వాక్య, భావ చిత్రాల్ని సందర్భో చితంగా వాడి కథానన్ని వేశాల్ని సాక్షాత్కరింప జేయడం ఉంటుంది. కృత్రిమ పాత్రలుగాని, వ్యర్థ పాత్రలుగాని కనిపించవు. దీనికి కారణం పాత్రల సంఖ్య పరిమితంగా ఉండడం. కనుక ప్రతి పాత్ర జీవకళతో తొణికిసలాడుతుంది. వారి స్త్రీ పాత్రలు విశిష్టమైనవి; విభిన్నమైనవి. సమకాలిక సాంఘిక జీవనం ఇతివృత్తం. ఇతివృత్తంలో నవ్యత ఒక గుణం. వేటపైనా, బర్మాలో తెలుగువారి గురించి కథ లల్లడం ఆ రోజుల్లో విశేషమే. ఏ విషయమెత్తుకున్నా దానికి సంబంధించిన సమగ్రమైన వాతావరణాన్ని కల్పించి చదువరి మనస్సు నచ్చటు కేంద్రీకరింప జేయడం. ఏ కథ చెప్పినా కొద్దో, గొప్పో సంస్కరణ దృష్టి తొంగిచూస్తుంది. జీవహింసను వ్యతిరేకిస్తూ 'అర్త

నాదము'ను, పాతివ్రత్యపు వేదికపై నలిగిపోయిన స్త్రీ యెడల సానుభూతిగా 'మా మరదలు'ను, వెలివేత విధానాన్ని విమర్శిస్తూ 'వేసవి మబ్బులు'ను రచించడమే తార్కాణం.

వేదుల విద్వత్కవి యగుటవల్ల ఆ ప్రభావం కథలపై పడింది. ఆ ప్రభావ ఫలితంగా వారి కథల్లో సంస్కృత సూక్తులు, పద్యాలు, పాటలు - సందర్భానుసారంగా చోటు చేసుకున్నాయి. "యథా స్త్రీణాం తథా వాచాం, సాధుత్వే దుర్జనో జనః"♦ వంటి సూక్తుల నుపయోగించి భవభూతిపై గల తమ ప్రత్యేకాభిమానాన్ని చాటుకున్నారు. ఇవి పాఠకునకు అర్థం కానంత మాత్రాన కథావగాహనానికి అడ్డురావు సరికదా వాటిని అర్థంచేసికోవడాన్ని బట్టి పిండు కొనే వాడినిబట్టి పాలు, పిండికొద్దీ రొట్టె అన్నట్లు హృదయాహ్లాద స్థాయి పెరుగుతుంది. ఉత్తమ తరగతికి చెందిన కవి పద్యంలో ఎన్ని పోకడలు పోగలడో వచన రచనయందు కూడ అన్ని పోకడలు పోగలడు. ఈయన విషయంలో ఇది నూటికి నూరుపాళ్ళు సమన్వయిస్తుంది. మొత్తంమీద అభివృద్ధి నిరోధక భావాలకు హస్తోదకాన్ని సమర్పించిన అభ్యుదయ కథా రచయిత వేదుల.



♦ స్త్రీల పాతివ్రత్య విషయంలో, వాగ్రచనల విషయంలో ఏదో తప్పు పడ్తూనే ఉంటారు ఖలులు.

## V. నవలలు

### బెంగాలీ నవలానువాదాలు

ఆంగ్లేయుల పాలనకు ఓంకార మయింది కలకత్తా నగరం. అచ్చటనే మొట్ట మొదట విశ్వవిద్యాలయం వెలసింది. తత్కారణంగా వంగదేశం సర్వరంగాలలో సర్వతోముఖాభివృద్ధి గాంచింది. దానితో పాటు ప్రతిభావంతులకు పుట్టినిల్లయింది. ఆ ప్రతిభావంతుల కారణంగా వంగభాషా ప్రభావం భారతీయు లందరిపై ప్రసరించింది. ముఖ్యంగా ముందుగా తెలుగువారికి ఆ గాలి సోకింది. దానికి మూలం ఎక్కడ నుంచి ఉన్నా, ఏ నవ్యత ప్రాదుర్భవించినా, ఏ ఉద్యమం తలెత్తినా వెంటనే స్పందించి, స్వీకరించి, స్వీయం చేసికోవడం తెలుగువారికి రక్తగతమైన లక్షణం. వీటిని నిరూపించే సంఘటనలు బెంగాలు విభజన, వందేమాతరం ఉద్యమం, బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర పర్యటన, ఆంధ్రోద్యమం ఇత్యాదులు.

ఈ శతాబ్దపు తొలిపాదంలో ఆంధ్ర సాహిత్యాభిమానులకు బెంగాలీ నేర్చుకోవడం ఒక ఫ్యాషన్ అయిపోయింది. అంతేకాదు; వంగీయుల వేషాన్ని కూడ తెలుగువా రనుకరించేవరకు వచ్చింది. ఆకాలంలో వేంకట పార్వతీశ్వర కవులు, చాగంటి శేషయ్య మొదలైన వారు వంగసారస్వతంలోని నవలల్ని తెలుగువారి కందించారు. వారిలో వేదుల వారొకరు. ఈయన మిక్కిలి స్వల్పకాలంలో గుంటూరులో ఉండగా శ్రీ శివశంకర శాస్త్రి గారి ద్వారా బెంగాలీ నేర్చుకున్నారు. త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి గారి తోడ్పాటుతో బెంగాలీనుండి 'అపరాధిని', 'ధర్మపాలు'డనే నవలల్ని ఆంధ్రీకరించారు. పిమ్మట రంగమహల్, వినోదిని యనే నవలల్ని స్వయంగా అనువదించారు. వేదులవారివి అనువాదాలే కాని సొంత నవలలు లేవు.

అనువాదంలో కథావస్తువు, ఆ వస్తువుని చిత్రించిన శిల్పం, ఆ చిత్రణ నందలి భావాలు మూల గ్రంథానికి చెందుతాయి. అనువాదకునికి మిగిలేది భాషాంతరీకరణ మందలి భాషా సౌష్ఠవం మాత్రమే కనుక దానినే పరిశీలించాలి.

## 1. అపరాధిని

శ్రీహరి సాధన ముఖోపాధ్యాయునిచే రచింపబడిన సాంఘిక నవల. దీనిని వేదుల 1926లో అనువదించారు.

### కథా సారాంశము

జడ్జీయైన శ్యామబాబు మొదటి భార్య ఒక అమ్మాయిని కని చనిపోయింది. ఆ అమ్మాయి పేరు హేమలత. అతని రెండవ భార్య పేరు సరయూబాల. తరువాత హేమలతకు ప్రభాసబాబుతో వివాహమైంది.

సరయూబాల పినతండ్రి కొడుకు రతీకాంతుడు. భర్తతో చెప్పి ఇతనికి కొంత పైకమిప్పించింది. ఇది కాక సరయూబాలను బ్రతిమాలి డబ్బుగుంజి దుబారా చేస్తుండేవాడు. అతడు సరైనదారిలో పడతాడని పెండ్లి చేసింది. కాని భార్యయైన సుశీలతో నుండక 'గుణమణి'యనే ఉంపుడుకత్తెతో గడిపేవాడు. వీని దుర్వర్తనాన్ని గూర్చి సరయూబాల భర్తకు తెలియనీయకుండా కప్పిపుచ్చింది. రతీకాంతుడు చేసిన పనులవల్ల శ్యామబాబుకు కూడ అపకీర్తి వచ్చింది. ఆ విషయాలు మంచం పట్టిన శ్యామబాబు సరయూబాలకు చెప్పాడు. ఆమె కన్నీరు తెచ్చుకుంటూ తమ్ముని తప్పులన్నీ దాచినందుకు భర్తను క్షమింపుమని వేడుకుంది. తరువాత శ్యామబాబు పరలోకగతుడయ్యాడు. మగదిక్కు లేకపోవడంచే ఇంటి వ్యవహారాల్ని తమ్ముడ్ని చూడమంది సరయూబాల. అత్తగారు దుఃఖంలో ఉందని హేమలతను తోడుగా ఉంచి ప్రభాసబాబు ఉద్యోగం చేయడానికి వెళ్ళాడు. రతీ

కాంతుడు ఆస్తికోసం హేమలతకు విషమిచ్చి చంపడానికి సిద్ధపడ్డాడు. ఈ సంగతి సరయూబాలకు తెలిసింది. రతీకాంతు డిల్లు విడిచి పారిపోయాడు. ఈ విషయం ప్రభాసబాబుతో సరయూబాల పూసగుచ్చినట్లు చెప్పింది. ఈ మాటలు విన్న హేమలత 'మామయ్యకు నేనంటే ప్రేమ. అంత ఘోరకార్యం చేయ'డంది. ఆ మాట విన్న సరయూబాల నిర్ఘాంతపోయింది. ఆమె మనసును కుదుటపర్చుకుని ఇలా అంది.

"మొదటి నుండియు నేనే అపరాధినిని. నా భర్తయెడల కూడ నేను అపరాధినై పాపము మూట గట్టుకొన్నాను. హేమలతకు కూడ నేనే అపరాధము చేసినాను. పాపమును దాచిదాచి తప్పు చేసినాను. నిప్పురవ్వను కొంగున మూట గట్టుట ఎవ్వరి తరము! అందుచేతనే అంతయు తగుల బడిపోయినది. నన్ను క్షమించుడు" అన్నది.

తరువాత సరయూబాల సుశీలతో కాశీకి వెళ్ళిపోయింది. చివరకు ఆమె సుశీలను రతీకాంతుని వద్దకు చేర్చింది. నవల ముగిసింది.

రతీకాంతుని దుండగాలు కరుణ స్వభావంతో కప్పిపుచ్చివాడు మరింత దుష్టునిగా మారడానికి కారకురాలైంది. కనుకనే సరయూబాల అపరాధినిఅయింది. అదియే నవలకు అన్వర్థనామమైంది. దుష్టకార్యాల్ని సహించడం, కప్పిపుచ్చడం అపరాధమని మనకీనవల ఉపదేశిస్తుంది.

## వైశిష్ట్యం

ఈ నవల భాషకు ఆయువు పట్టులైన తెలుగు నుడికారపు సొంపుతో, సామెతలతో తొణికిసలాడుతుంది. చిటిపొటి వాక్యాలతో, సులభ సుందరంగా రచన సాగింది. మచ్చునకు కొంత.

"ఈ మాటలకు రతీకాంతుడు కొయ్యబారిపోయినాడు. గుణమణి ఇట్లు చెప్పునని అతడు కలలోనైన అనుకొనలేదు. తన్ను విడిచిపెట్టి భార్య దగ్గరకు పోవుచున్నాడని తెలిసినచో ఆమె నిలువున నీరైపోయి కంగారు పడునని అతడనుకొన్నాడు. నదురు బెదురు లేకుండ ఆమె ఈ మాటలు చెప్పుట చేత అతడు కుప్పగా కూలి పోయినాడు." పు 137

ఈ నవలను గూర్చి "స్త్రీలకు గల సహజ కరుణా స్వభావము చక్కగా వర్ణింపబడినది. గ్రంథశైలి సరళముగా నున్నది. ఇది పఠనీయ గ్రంథము లందొకటి." అను భారతి పత్రిక అభిభాషణమే ఈ గ్రంథం యొక్క విశిష్టతని వ్యక్తం చేస్తుంది.

## 2. ధర్మపాలుడు

వంగభాషలో గొప్ప చరిత్రజ్ఞులైన రాఖాలదాస బంధోపాధ్యాయ మహాశయులు దీని కర్తలు. ఇది చరిత్రాత్మక నవల. దేశాభిమాన పూరితమైంది.

భారతదేశంలో ప్రఖ్యాతి నొందిన రాజవంశాలలో పాలవంశ మొకటి. క్రీ. శ. 750 ప్రాంతంలో వంగ రాష్ట్రమున అరాజకత వ్యాపింపగా 'గోపాలు'డనే వానిని కొందరు ప్రముఖులు రాజుగా నెన్నుకున్నారు. అతడే పాల వంశానికి మూల పురుషుడు. ఈ వంశానికి చెందిన రెండవ రాజు ధర్మపాలుడు. ఇతని చరిత్ర ఇందు వర్ణింపబడింది. పాల వంశీయులు బౌద్ధ మతాభిమానులు.

వేదుల దీన్ని 1929లో అనువదించి నూతక్కి రామశేషయ్య చౌదరిగారి కంకిత మిచ్చారు. ఈ నవల కుపోద్ఘాతంలో వేంకట పార్వతీశ్వర కవులు దీని విశిష్టతని గూర్చి ఇలా అన్నారు.

"దేశాభిమాన పూరితములును, చరిత్రాత్మకములు నగు నవలలు రసవంతములగు కథలతో గూడినవై మనోజ్ఞములగుటచే జరిత్రముల కంటెను విశేష ప్రయోజనము గూర్చుచుండును. ఈ నవల యిట్టి యుపయోగ కరములగు నవలలో నొకటి."

'ధర్మపాలు'డను ఈ నవల ఐదు ఖండాలుగా ఉంది. ప్రతిఖండం కొన్ని భాగాలుగా విభజింపబడి వాటికి శీర్షిక లుంచబడ్డాయి. పరిమాణంలో పెద్దది.

## కథా సారాంశము

శ్రీ గోపాలదేవుడు గౌడ సామ్రాజ్యాధిపతి. అతని కుమారుడు యువరాజు ధర్మపాలుడు. ఇతడు బౌద్ధ ధర్మపాలుడు. ఇతడే మన నవలా నాయకుడు. గోకర్ణ దుర్గాధిపతి మరణించుటచే ఆ దుర్గాన్ని శ్రీపుర దుర్గాధీశుడు కబళించడానికి సిద్ధమైనాడు. కనుక గోకర్ణ దుర్గ రక్షణకై ఆ రాణి గోపాలదేవుని సహాయ మర్థించింది. తండ్రీకొడుకు లిర్వురూ తగు సేనతో వెళ్ళి దుర్గాన్ని రక్షించారు. అందుచే రాణి తన కుమార్తెయైన కళ్యాణిని ధర్మపాలుని కిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించింది. కాని గౌడ సామ్రాజ్యంలోని ప్రతికూల పరిస్థితుల వల్ల కళ్యాణీ ధర్మపాలుర వివాహం వాయిదా పడుతూ వచ్చింది. ఇంతలో గోపాలదేవుడు చనిపోవడం, ధర్మపాలునకు ఘూర్జర రాజుతో యుద్ధం తటస్థించడం జరిగింది. ఈ యుద్ధంలో రాష్ట్రకూటరాజు సహాకరించాడు. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని అతడు తన కుమార్తెను పెండ్లి చేసి కొమ్మంటూ ధర్మపాలుని పట్టు బట్టాడు. ధర్మపాలు డంగీకరింపక కళ్యాణిని పెండ్లి చేసికున్నాడు. అందుచే కోపించిన రాష్ట్రకూటరాజు తన మిత్రులందరిని కూడ గట్టుకుని ధర్మపాలునిపై దాడి ప్రారంభించాడు. తన మూలంగా భర్తకు కలిగిన ఆపదకై కళ్యాణి కలత పడింది. అస్వస్థకు లోనైంది. ఆహారం మానివేసింది. రణ రంగంలో విజయలక్ష్మి ధర్మపాలుని వరించింది. అవసాన దశయందున్న కళ్యాణిని ధర్మపాలుడు సమీపించాడు. "నేను-వెళ్ళి-పోవుచున్నాను; పెండ్లి-చేసుకో" అని కళ్యాణి అతికష్టం మీద పలికింది. ధర్మపాలుడు కళ్యాణిని సందిట పట్టుకుని రోదించాడు. సందిట నున్న కళ్యాణి మోమున కడసారి చిరునవ్వు తళుక్కుమని మెరసి అదృశ్యమైంది.

## శైలి

ఇందలి భాష వ్యావహారకానికి సన్నిహితమైన గ్రాంథికం.

రచనలో అరసున్నలు కూడ విడిచి పెట్టలేదు. అలాగని శైలి క్లిష్ట మనడానికి వీలులేదు. డొంకతిరుగుడు లేని వాక్య నిర్మాణం; ఆ వాక్యాలు కూడ చిన్న చిన్న తునకలు. అందుచే అర్థసౌలభ్యానికి ఆటంకం లేకుండా సరళ సుందరంగా సాగింది. మచ్చున కొంత వచనం.

"తెల్లవారుజాము కావచ్చినది. పక్షులు కూయసాగినవి. తూర్పుదిక్కున చీకటి కొంచెము కొంచెము చెదరిపోసాగినది. కాని వారిరువురికి నిద్రాభంగము కలుగలేదు. క్రమక్రమముగా తూర్పు దిక్కున ఆకాశమందలి మబ్బుతునకలు కెంపెక్క సాగినవి. మంచు పడిన చెట్ల చిట్టచివర కొమ్మలన్నియు లేయెండ పడి బంగారుపూతఁ బూసినట్లైనవి. పక్షుల కలకల ధ్వనులతో అడవి యంతయు రొద పట్టినది. అయినను వారుభయులకు మెలకువ రాలేదు." పు. 248

## 3. రంగమహల్: ఇది లభింపలేదు.

## 4. వినోదిని

### నవలా వైశిష్ట్యం

విశ్వకవి రవీంద్రుని నవలల్లో 'చోఖేర్ బాలీ' అనేది విశిష్ట మైంది. 'చోఖేర్ బాలీ' అనగా 'కంటిలో మెరమెర' అని అర్థం. వేదుల దీన్ని 'వినోదిని' అను పేరుతో అనువదించారు. దీని గొప్పతనం గురించి గ్రంథం యొక్క చివరి అట్టమీద ఇలా ఉంది.

"వినోదినిలో రవీంద్రుని అత్యద్భుత కథాకథనశక్తి ప్రస్ఫుట మవుతుంది. అంతేకాదు, ఉత్తమ కథకుడుగా దర్శనమిస్తాడు. జీవిత నాటకం ఇందులో ఎంతో సుకుమారంగా చిత్రించబడింది. ఇదొక్కటే కాదు వినోదినిలోని విశిష్టత. ప్రేమకు కామమునకూ నడుమవున్న సంబంధాన్ని రవీంద్రుడీ నవలలో సహానుభూతితో అభివర్ణించడం గమనింపదగిన అంశం. రవీంద్రుని నవలలలో కానవచ్చే స్త్రీ పాత్ర

లన్నిటిలోకి వినోదిని తలమానిక అనవచ్చు. వినోదిని పాత్రచిత్రణ సజీవంగాను, వాస్తవిక దృష్టితోను చేయబడినట్లు విదిత మవుతుంది."

## కథా సారాంశం

యువ వితంతువైన వినోదిని రాజలక్ష్మి ఇంట నుండటానికి వచ్చింది. రాజలక్ష్మి తోటికోడలు అన్నపూర్ణ. కొడుకు మహేంద్రుడు కోడలు ఆశాలత. మహేంద్రుని మిత్రుడు బిహారీ. చిన్నతనం నుండి ఆసరా లేనివాడవడంచే రాజలక్ష్మి ఇంటిలోని వ్యక్తిగా చెలామణి అవుతున్నాడు. అవివాహితుడు.

వినోదిని స్ఫురద్రూపిణి. పైగా కలుపుగోలు తనంగల యౌవనవతి. అందుచే బిహారీకి, మహేంద్రునకు అత్యంతాకర్షణీయంగా ఉండేది. కుంకుమ బొట్టు తప్ప తక్కిన వన్నీ ధరించుకుని మురిసేది; మురిపించేది. ఇంటా బైటా కూడ పనుల్ని చక్కగా చక్కబెట్టేది. ఆశాలత అమాయకురాలు. ఎంత అమాయకురాలంటే తన భర్త విషయాల్లో కూడ వినోదిని సలహాల్ని స్వీకరించేది. ఈ పరిచయం వల్ల మహేంద్రుని మనసు వినోదిని వైపు మళ్ళింది. మహేంద్రుడు మోహపరవశుడనీ, బిహారీ ప్రేమపాత్రుడనీ వినోదిని గ్రహించింది. ఒకానొక సమయంలో మహేంద్రుడు వినోదినిని తన దాన్నిగా జేసికోవడానికి ప్రయత్నించాడు. కానీ, వినోదిని బిహారీని గూర్చి తపన పడింది. మహేంద్రుని మనసు మారి మోహమనే తెరతొలగి ఆశాలత వైపు దారితీసింది. బిహారీ వినోదినిని పెళ్ళాడాలనుకున్నాడు. కాని తనవల్ల అతనికి కళంకం వస్తుందని ఆమె అంగీకరించలేదు. ఆమె అన్నపూర్ణతో కాశీకి ప్రయాణమైంది.

వినోదిని అడుగడుగునా తప్పటడుగు వేస్తుందా! అనే కుతూహలం పాఠకుని పట్టుకుని ముందుకు తీసికుని పోతుంది. ఆమెలో చెలరేగే సుడిగాలులకు మన హృదయాలు కంపించకుండగా నుండవు.

శైలి

ఇందు వేదుల భాష చక్కని చిక్కని వ్యావహారికంలో సాగింది. మచ్చునకు —

"అత్తయ్యా! మీరిట్లా అంటే నన్ను మీరు పరాయి దానినిగా భావిస్తున్నారనుకోవలసి వస్తుంది" అన్నది వినోదిని.

రాజలక్ష్మి ఆదరముతో "అయ్యో తల్లీ! నీవంటి కావలసినవాళ్ళు నా కెక్కడ ఉన్నారమ్మా?" అన్నది.

'ధర్మపాలుడు'లో సరళ గ్రాంథిక భాష వాడిన వేదుల ఇందులో వ్యావహారిక భాష నుపయోగించారు. సొంత నవలలు లేకపోయినా అనువాద నవలా సాహిత్యంలో తమ స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు వేదుల.



# గౌతమీ కోకిల వేదుల సాహిత్య సమీక్ష

## VI నా ట క ము లు

నాటకంలోని శిల్ప రచనా వైశిష్ట్యాన్ని బట్టి 'నాటకాంతం హి సాహిత్యమ్' అనే ఆర్యోక్తి పుట్టింది. ఈ సూక్తి పఠనవిషయంలోనే కాదు; రచనా విషయంలోను వర్తిస్తుంది. అనగా రఘువంశాది కావ్యాలు చదివిన పిమ్మట అభిజ్ఞాన శాకుంతలాది నాటకాల లోతుల నరయడం వంటిదే శ్రవ్య కావ్య నిర్మాణంలో ఆరితేరి, దృశ్య కావ్య నిర్మాణానికి పూనుకోవడం. ఇది సంస్కృతాభ్యాసమున పరంపరగా వచ్చిన సాధారణ క్రమం.

అయితే లేడికి లేచిందే పరుగన్నట్లు ముందుగా కొన్ని కైతలు వ్రాసినా వేదుల శ్రీకారం చుట్టిన గ్రంథం నాటకమే. పువ్వుపుట్టగానే పరిమళిస్తుందంటే ఇదే. ఆ శ్రీకారం 'రాణా ప్రతాపసింగు'. తరువాత 'కాలేజి గరల్' అనే స్వతంత్ర సాంఘిక నాటకాన్ని వ్రాశారు. పిమ్మట బెంగాలీ నుండి 'నవాన్న' నాటకాన్ని అనువదించారు. మధ్యమధ్య కొన్ని భాసనాటకాలాంధ్రీకరించారు.

## 1. రాణా ప్రతాపసింగు

### పుట్టు పూర్వోత్తరాలు

రాణా ప్రతాపసింగు మేవాడ్ ప్రభువైన రాణా ఉదయసింగ్ కుమారుడు. అక్బర్ 1567లో మేవాడ్ రాజధానియైన చిత్తోడ్‌ను ముట్టడించాడు. ఉదయసింగ్ ఆరావళీ పర్వత శ్రేణికి పారిపోయి అటు ఉదయపూర్ అను నూతన రాజధానిని నిర్మించుకున్నాడు. తండ్రి అనంతరం రాణా అయిన ప్రతాపసింగ్ అక్బర్ జీవిత కాలంలోనే అష్టకష్టాల కోర్చి మేవాడ్ రాజ్యాన్ని తిరిగి వశం చేసుకున్న స్వాతంత్ర్య పిపాసి. ఈ రాణా ప్రతాప సింహుని గుణాధిక్య

మంమన్న అభిమానమే గ్రంథకర్తను నాటక రచనకు ఉన్ముఖుని జేసింది. సాహితీసమితి సభాపతులైన శ్రీ శివశంకర శాస్త్రిగారిచే ఆంధ్రీకరింపబడ్డ 'రసపుత్ర జీవన సంధ్య'యనే బాంగ్లా నవల నుండి కొద్ది భాగాన్ని గైకొని రచించిన అయిదంకాల నాటకం. పూర్వనాటక లక్షణాల నన్నింటిని ఉపలక్షించి ఈ గ్రంథం రచింపబడలేదు కనుక సహృదయ పాఠకులిన్ని గూడ ఆ దృష్టితో పరిశీలింప వద్దని పీఠికలో గ్రంథకర్త విన్నవించు కోవడం జరిగింది. అనగా భారతీయ నాటక లక్షణాలైన నాందీ ప్రస్తావనలు, అర్థోపక్షేపకాలు, భరత వాక్యాదు లిందు లేవని భావం. అయితే అంకాన్ని కొన్ని రంగాలుగా విభజించే పాశ్చాత్య పద్ధతి గ్రహింపబడింది. రంగ విభజనకు పరమ ప్రయో జనం నాటక ప్రదర్శనానుకూలత. అంక విభజనం లాగే రంగ విభజనం కూడ కాల, ప్రదేశ, అవస్థా భేదాన్ని బట్టి ఉంటుంది. ఈ నాటకంలో ప్రథమ, ద్వితీయ, తృతీయాంకాలు రెండేసి రంగాలు గాను, చతుర్థ పంచమాంకాలు మూడేసి రంగాలుగను విభజింపబడ్డాయి. ఇందు మాతృదేశ స్వాతంత్ర్యానికై రాణా ప్రతాపుడు తన సర్వస్వాన్ని త్యాగ మొనర్చిన విధానం సన్నివేశోచిత సందర్భాను సారంగా వ్యక్తీకరింపబడింది.

## కథా సంగ్రహం

కమల్మీరు దుర్గంలో రాణా ప్రతాప సింగు ఎదురుగా నున్న బిజిలీ పతితో మాతృదేశ స్వాతంత్ర్య సంపాదనకై తన నిశ్చయాన్ని చెప్పుచుండుటతో నాటక మారంభ మవుతుంది. అదే సమయంలో సామంతాదులు దేవీ సింగు, దుర్జయ సింగు, తేజ సింగు మరికొందరు ప్రవేశించి తమ ప్రభు భక్తిని ప్రకటించు కుంటారు. వారందరూ అక్బరు నెదిరించడానికి 'హల్దిఘాటే' ఉత్తమమైన ప్రదేశంగా నిర్ణయించు కుంటారు. తరువాత అరావళీ పర్వత ప్రాంతంలో ఒక కొండవాగు ప్రక్క ప్రతాపసింహుడు రక్త సిక్త దేహుడై బాధపడుతూ

ఉంటాడు. అన్నయైన ప్రతాపునితో భేదించి అక్బరును చేరిన సూక్త సింగు పశ్చాత్తప్తుడై క్షమాభిక్ష నర్థించడానికి రావడం, క్షమించడం జరిగింది. తరువాత ఆనాటి యుద్ధంలో వీరస్వర్గ మలంకరించిన యోధులను గూర్చి పరితపించుటతో ప్రథమాంకం ముగిసింది.

ఒక కొండచరియ ప్రదేశంలో తేజసింగు, దేవీసింగు కుమారుడైన చందన సింగు, భిల్ల నాయకుడైన భీమచాందు ముగ్గురూ మాన సింహుని సజాతీయ రక్తదాహాన్ని గూర్చి, మహారాణావారి ధైర్య కవచాన్ని గురించి చర్చించుకోవడంతో ద్వితీయాంకం ఆరంభ మవుతుంది. నా సోదరి మిమ్మల్నే ప్రేమిస్తుందనీ, కాని దుర్జయసింగు ఆమెను పెండ్లి చేసికోవాలని మా తండ్రిగారిని బలవంతం చేస్తున్నాడని చందనసింగు తేజసింగుతో చెప్పి వెళ్ళిపోతాడు. భీమదుర్గ మందలి ఉద్యానవనంలో దేవీసింగు కుమార్తెయైన పుష్పకుమారి చారణ వేషధారియైన తేజసింగును తేజసింగు గురించి అడుగుతుంది. అతడు తేజసింగు ఇచ్చిన ఉంగరమని ఆమె కలంకరిస్తాడు. ద్వితీయాంకం పూర్తవుతుంది. ఆరావళీ పర్వతప్రాంతంలో రాణా ప్రతాప సింగు, దేవీసింగు, మానసింగుల సంభాషణతో తృతీయాంక మారంభ మవుతుంది. అక్బరు పాదుషా సార్వభౌమత్వాన్ని అంగీకరించుట శ్రేయస్కరమని. మానసింగు వారిరువురకు నచ్చచెప్ప యత్నిస్తాడు. అప్పుడు దేవీసింగొసగిన సమాధానం

"భౌతిక సుఖమునకై ఆత్మస్వాతంత్ర్యము గోల్పోవుట మానవ లక్షణము గాదు.

పరులంజేరియు మానహీనుడయి సేవంచేసి వేయేడులు
ర్వర జీవించుటకన్న : నేయర ముహూర్తంబైన స్వాతంత్ర్య వి
స్ఫురితుండై భుజవిక్రమార్జిత యశఃపూర్ణుండునై జీవముల్
భరియింపంగడు మేలు, చచ్చియును చావంబోడు వాడెన్న డున్
అంత ప్రతాపసింగు

"నా స్వాతంత్ర్యగానమీ యారావళీ పర్వతమందే యా జన్మాంతము ప్రతిధ్వనించు గాక" "అక్బరు నాకెన్నటికైన, స్వామి గాని, బంధువు గాని కాజాలడు" "శిశోదియా వంశీయులు స్వతంత్రులై యుండవలెను. లేదా స్వర్గస్థులు కావలయును."

"కీర్తి గౌరవముల తలక్రిందు జేసి
పాదుషాకడ నే తలవంప గలనె?" అని తన జీవిత ధ్యేయాన్ని నొక్కి వక్కాణిస్తాడు. మానసింగు నిర్గమనానంతరం తేజసింగు వచ్చి సూర్యమహలు, భీమదుర్గం మొగలుల స్వాధీన మయ్యాయని చెప్తాడు. మహారాణావారి కుటుంబం భిల్లగహ్వరానికి తీసుకొని రాబడిందని తెలియడంతో రాణా అక్కడకు చేరుకుంటాడు. రాణి పాటేశ్వరీదేవి రాణాతో మాట్లాడుతుండగా వారి పిల్లల్ని ఆడిస్తున్న పుష్పకుమారి అంగుళీయకాన్ని భిల్లకన్య అపహరించుక పోతుంది. ఈ సంగతి తెలియని పుష్పకుమారితోపాటు పాటేశ్వరీదేవి వెదుకుతుండగా తృతీయాంకం ముగుస్తుంది. అక్బరు కొలువు కూటంలో ఉదయపూర్ రాణా తప్ప తక్కిన వారందరు రాజభక్తితో ఉన్నారని మానసింగు చెప్పడంతో చతుర్థాంకం ప్రారంభమైంది.

సెలయేటి ఒడ్డున కూర్చున్న పుష్పకుమారి చెంతకు తేజసింగు వచ్చి దుర్జయసింగును ప్రేమించుచుంటివని అనగా నేను రాఠోడు వంశీయుడైన తేజసింగునే ప్రేమిస్తున్నానని సమాధాన మిస్తుంది. అలాగయితే చారణకుమారు డిచ్చిన అంగుళీయకం ఏదంటాడు. దురదృష్టం వల్ల పోగొట్టుకున్నానని బాధ పడ్తుంది ఆమె. దుర్జయసింగుకు నీ విచ్చితివని వక్కాణిస్తాడు తేజసింగు. పుష్పకుమారి ఏడుస్తుంది. తరువాత ప్రతాపుడు మొదలగు వారందరు సింధునదీ ప్రాంతానికి పోవడానికి సన్నద్ధులవుతారు. ఇంతలో ధనరాసులు లభించడంతో ఆ ప్రయత్నం మానుకుంటారు. సైన్య సమీకరణ భారాన్ని సూర్తసింగువారిపై ఉంచడంతో చతుర్థాంకం ముగుస్తుంది.

ఆగ్రాలోని ఆలోచనామందిరం. ప్రతాపుని [illegible] గూర్చి మానసింగు ఎంత చెప్పినా అక్బరు యుద్ధము వలదంటాడు. అంతేకాక ప్రతాపుని సందర్శించుటకు తన ఆస్థాన కవియైన పృథ్వి రాజు కనుమతి ఇస్తాడు. పృథ్విరాజు

మరచి పోయితి సత్యమేదో
మరచి పోయితి ముక్తియేదో
మరచి పోయితి మాతృసేవా
మహిత ధర్మంబున్ పు. 227

అని పాడుతూ ప్రవేశిస్తాడు.

సెలయేటి దరినున్న పుష్పకుమారి వద్దకు వచ్చిన తేజసింగు ఆమెతో క్షమించమంటాడు. ఆమె మీ పాదదాసినని పలికి ఆ [illegible] కీయకం సంగతి మీకెట్లు తెలిసిందని అడుగుతుంది. [illegible] దొంగిలించిందని చెప్పి ఆ ఉంగరాన్ని ఆమెకిస్తాడు. వారిద్దరూ [illegible] రాణాదంపతులకు నమస్కరించడానికి వెళ్ళడంతో నాటకం ముగుస్తుంది.

## నాటక వైశిష్ట్యం

ఈ నాటకం వేదులచే 1924లో రచించబడింది. అంటే అప్పటికి కవిగారి వయస్సు 24 సంవత్సరాలు లోపే. దీన్ని రంగస్థలంపై ప్రదర్శించినట్లు తెలుస్తుంది.

"తెలికిచర్ల వెంకటరత్నం గారు 1926లో [illegible] ఈ నాటక ప్రదర్శనము చేయించారు."[1]

ఉద్యమాలకు స్పందించే హృదయం గలవారు వేదుల. కనుకనే ఆనాటి స్వాతంత్ర్యోద్యమానికి ఉపబలకంగా ఈ రచన [illegible] అనలిట్టి చారిత్రక కథా వస్తువుని గ్రహించి నాటకీకరించడంలోనే

1. కవి-సన్మానము ప్రతిభ ననస. - [illegible]

కవికి గల స్వాతంత్ర్య పిపాస వ్యక్తమవుతుంది. ఈ నాటక రచనపై స్వాతంత్ర్యోద్యమ ప్రభావం, భావ కవితా శాఖలలో ఒకటైన ప్రణయ కవితా ప్రభావం పడుగు పేకలా అల్లుకుని ప్రసరించింది. ఇందున్న దేశభక్తి ప్రబోధక వాక్యాల్లో కొన్ని.

"స్వాతంత్ర్యమునకై పోరాడి ప్రాణము లర్పించుటయే నాకు మోక్షము" ప్రతాపసింగు. పు 10

"దేశము దాస్యాంధ కారమున మునిగి, వైభవమును, ప్రతిష్ఠను గోల్పోవు నపుడు హృదయము గల వాడెవ్వడూరకుండగలడు."
బిజిలీపతి పు. 12

"దేశము కొరకై స్వాతంత్ర్యము కొరకై యెవ్వడు తన రక్తము చే యుద్ధ భూమిం దడుపునో వాడే కీర్తి కాయుడు. శాశ్వతుడు."
ప్రతాపసింగు. పు 20

"దేశమున పరుల విజృంభణ మెక్కువగుచున్న యీ యవసరమున నెల్లవారో కటియై రానున్న దుర్దశ నాప వలయును."
దేవీసింగు. పు 26

"సర్వ భారతీయ లోకము అంతః కలహములచే పౌరుష హీనమై తనంత తానే టూపు మాయుచున్నది." ప్రతాపసింగు. పు 30

"భౌతిక సుఖముకై యాత్మ స్వాతంత్ర్యము గోల్పోవుట మానవ లక్షణము గాదు." దేవీసింగు. పు 108

"అసహాయ స్థితి యందున్న దేశమునకై సేవచేయు భాగ్యము దైవ నియమితులగు కొందరికి మాత్రమే లభించును. అట్టి స్వార్థ త్యాగులు దేశమున కలంకారములై యుందురు. అక్బరు. పు 201

"కవులు స్వతంత్రులు. వారిని కట్టి వేయగల బంధము లింత వరకెవ్వరికిని లభింపలేదు." అక్బరు. పు 213

ఇందలి పాటలు భావ కవితా ప్రభావంతో పొటమరించాయి.

ఈ పాటలన్నీ కించిత్ పరిణామంతో 'దీపావళి'లో ప్రవేశించాయి. నాటకంలోని పద్యపుష్పాలు కవితా పరిమళాన్ని గుబాళిస్తున్నాయి. మచ్చున కొకటి.

వాడు ధనంబు లేదు, ఘన పౌరుషవాసన తగ్గుబాటు నం
గూడదు, కాంతి గౌరవము కొంచెముగాదు, యశఃపరాగమున్
వీడదు; కాలయోగమున విచ్చుట మానియు రాలిపోదు, రా
ఠోడు కుల ప్రసూన మెపుడున్ భవదంఘ్రుల బూజసేయుటన్

సందర్భానుసారముగా ప్రయోగించే సూక్తులు, జాతీయాలు, అలంకారాలు వేదుల ప్రతిభా పాండిత్యాల్ని సువ్యక్తీకరిస్తాయి.

## సూక్తులు

"గొడ్డలి కొనర్చు తన సాయమే తన నాశనమునకు కారణమగుచున్నదను నూహ వృక్షమునకు గలుగదు." పు. 57

"సింగము కడుపున సింగమే పుట్టును." పు 59

"దుఃఖమెరుంగని హృదయములు దుర్బలములు." పు 65

"మన వ్రేలితో మన కంటిని బొడిచియే పరులు ముందునకు వచ్చుచున్నారు." పు. 56

## జాతీయములు

మనసు రాయి జేసికొనుట, కడుపుపండినది, ఉగ్గుపాలతో పోయుట, ప్రతాపుని నుదుటనే పొద్దుపొడుచుట, ఆపదలు కాపురముండుట.

## అలంకారములు

"విరియ బూచిన తురాయి చెట్టువలె గాయములచే నీ యొడలెంత యెఱ్ఱవారి పోయినది." ప్రతాపసింగు పు. 38

"స్వాతంత్ర్య భానూదయమునకు ప్రభాత సంధ్యారాగరేఖ వంటి నీ రక్తోజ్జ్వల కుంతముతో నన్ను వధింపుము." సూక్తసింగు పు42

"మంచు తెరగప్పిన పుష్పనికుంజ మట్టు లీగీత మెంత మధుర భావ గర్భితమై యున్నది."  పుష్పకుమారి పు 92

ఇందలి రచన వ్యావహారిక సన్నిహిత సరళ గ్రాంథికభాషలో సాగింది. అయితే రాణావారి పిల్లలు మాటాడునపుడు మాత్రం వ్యావహారికం ఉపయోగింపబడింది. మూడవ బిడ్డ

అమ్మా! నారొట్టె పిల్లి ఎత్తుకొని పోయింది!  పు 138

ఇందలి పుష్పకుమారీ తేజసింగుల ప్రణయగాథ షేక్స్పియర్ వ్రాసిన 'ఒథెల్లో' నాటకాన్ని కొంతవరకు తలపింపజేస్తుంది. 'ఒథెల్లో' నాటకంలో నాయకుడైన 'ఒథెల్లో' తన ప్రేయసియైన 'డెస్డెమోనియా'కు జేబురుమాలు బహూకరించుట జరిగింది. ఈ నాటకంలో తేజసింగు తన ప్రియురాలగు పుష్పకుమారికి అంగుళీయక మొసంగుట జరిగింది. ప్రేయసు లిరువురూ ప్రియులొసంగిన ప్రేమ చిహ్నాల్ని పోగొట్టుకున్నవారే. జాతి సంప్రదాయాన్ని బట్టి చిహ్నాలు వేరువేరై ఉండొచ్చు. ఇరువురు ప్రియులు ప్రేమ చిహ్నాల్ని పోగొట్టుకున్న ప్రియురాండ్రని శంకించినవారే. అయితే ఇది సుఖాంతంగా, అది దుఃఖాంతంగా పరిణమించాయి.

సంతుకాంతం వరకు ప్రేక్షకుల్లో ఉత్సుకతను రేకెత్తించుటకై పుష్పకుమారీ తేజసింగుల ప్రణయగాథను వేదుల బాగుగా ఉపయోగించుకున్నారు. మొత్తంమీద అణి మెరుంగు ముత్యాల వంటి పరమ మనోజ్ఞ భావ బంధురాలైన పద్యాలున్నాయి. కమనీయ పరిమళ శోభిత పుష్పాల వంటి మధుర పదవిలసిత గీతాలున్నాయి. ప్రేక్షకుల మనస్సుల నురూగ్రత లూగించే సన్నివేశాలున్నాయి. సన్నివేశోచిత సంభాషణల్లో చక్కని సూక్తుల, జాతీయాల, అలంకారాల గుబాళింపు ఉంది. ఇంత పరమ మేదుర మాధురీవిధిని తీర్చిదిద్దారు. కనుకనే అవధాని గారిలా అన్నారు.

"వారి రాణా ప్రతాప నాటకము సహజ సంభాషణములతో గూడిన రసవద్రూపక రాజము"[1]

## 2. ఎక్స్ కాలేజి గరల్

వేదుల నాటకాలలో 'ఎక్స్ కాలేజి గరల్' ఒకటి. ఇది స్వతంత్ర సాంఘిక నాటకం. కాని దీని పూర్తి ప్రతి లభింపలేదు. లభించిన ప్రతియైనా చెదల కడుపు నిండగా మిగిలింది. కన్యాశుల్కాన్ని నిరసించడం ఇందలి వృత్తాంతం. ఇందులో పద్యాలున్నాయి; పాటలున్నాయి. రామప్ప పంతులు, మోహన్, భానుమూర్తి, హేమలత, సుగుణ మొదలైన పాత్రలున్నట్లు తెలుస్తుంది. ఈ క్రింది సంభాషణను బట్టి వరుడు ముసలివాడనియు, కుమార్తెకు, భార్యకు ఇష్టం లేకున్నా తండ్రి రామప్ప పంతులు సంబంధాన్ని ఖాయం చేస్తున్నాడని తెలుస్తుంది.

హేమలత : (తల్లికడకు వచ్చి నిలువబడి) అమ్మా! అమ్మా! ఆ ముసలి తాతీల్దారు.

రత్తమ్మ : మొన్న మనయింటికి వచ్చిన ముసలివాడా? అయ్యో! అయ్యో కాటికి కాళ్ళుచాచుకున్న వానికి కన్నతల్లిని కట్టిపెట్టుటకు మీ మనసెట్లు ఒప్పుకొనుచున్నదండీ!

రామప్ప పంతులు: జమీందారీ సంబంధము. ఎంత భాగ్యవంతుడను కొన్నావు? అంతకన్న మంచి సంబంధము జన్మలో తేలేము.

రత్తమ్మ : అయ్యో! అయ్యో! మతిపోయినది మీకు.

రామప్ప పంతులు: మతిమంతుడను గనుకనే మంచి సంబంధము తెచ్చినాను.

ముసలి మగని కడకు వెళ్ళుతూ హేమలత తండ్రినుద్దేశించి కన్యాశుల్కం వల్ల ఎంతమంది కన్యలు ఉసూరుమంటున్నారో యున్న

---

1. విశిష్ట సభ్యుల ప్రశంస - పుట 46

పాంక్యాలివి.

తగవు గాదిచటు నిల్వగనాకు నింకపై
　　సెలవిమ్ము పోయివచ్చెదను తండ్రి!
ఏను నోచిన నోములీ పాటివైయుండ
　　నీవు చేసిన దోషమేమి యుండు
అనుభవింపక తప్పదయ్యె పురాకృత
　　పాప ఫలం బెంతవారికైన
నావంటి భాగ్యహీనకు దండ్రివై యున్ని
　　యుగచాట్ల పాలైతివయ్య నీవు

ఎందరెందరు కన్యకలీ దురంత
శుల్కమును నురిజిక్కి యుసూరుమనరు? పు. 51

చివరకు కన్నకూతుర్ని అమ్ముకున్నందులకు పశ్చాత్తప్తుడైన రామప్పపంతులు ఆవేదనతో పలుకుతున్న పలుకులు.

జంతువులంగోసి యమ్మె కసాయివోలె
కన్న బిడ్డల దెగనమ్ముకొన్న యట్టి
మానవ పిశాచములకు ఆత్మ ప్రశాంత
యేని, సుఖమేని, యశమేని యెట్లు కలుగు? పు. 52

ఇందు షెల్లీ మహాకవికి సంబంధించిన ఆంగ్లవాక్యములు కూడ ఉన్నాయి.

"The fountains mingle with the River
And the rivers with the Ocean".

"'కాలేజి గరల్' అను వారి సాంఘిక నాటకము సరళమయ్యు సంస్కారశోభితమై సహృదయ హృదయానందము సంధానించినది" అని దివాకర్ల వారిచే పొగడ్తగన్న ఈ నాటకము పూర్తిగా లభింపక పోవడం దురదృష్టమే.

## 3. నవాన్న *

వీరి నాటకాల్లో మరియొకటి నవాన్న నాటకం. ఇది వంగ భాష నుండి అనూదితమైన గ్రంథం.

“సమకాలపు ప్రజా జీవితములో పడుగు పేకగా కలిసి ఇమిడి ఉంటేనే నాటక పరిచయము జనుల మనస్సులోని చైతన్యానికి ధారాళమైన ఒక పరిణామాన్ని ఇస్తుంది.” ఇది ఈ పుస్తకానికి గల పీఠికకు మొదటి వాక్యం.

దీన్ని బట్టి మూల రచయిత తనకు కొంచెం ముందున్న సమకాలిక ప్రజా జీవితాన్ని ఈ గ్రంథంలో ప్రతిబింబింప జేసినట్లు తెలుస్తుంది. భారతదేశ విభజన సమయంలో సంభవించిన మత కల్లోలాలు, బెంగాలు కరువు కాటకాలు ఇందలి ఇతివృత్తం.

కాలం సానుకూలంగా సాగనప్పుడు సామాన్య రైతులు భూస్వాముల కబంధ హస్తాల్లో ఇరుక్కిపోయారు. కరువు కాటకాల్లో వారికున్న కొద్దికొండ్రను సమర్పించుకున్నారు. చివరకు బికారులై, భిక్షుకులై, పారవేసిన ఎంగిలి విస్తరాకుల్లోని మెతుకుల కోసం కుక్కలతో పోటీ పడ్డారు. చేతులు మార్చుటకు యువతుల అమ్మకం, నల్లబజారుల రహస్యాలు కళ్ళకు కట్టినట్లు ప్రకటింప బడ్డాయి. సమష్టి కృషి ద్వారా కరువు కాటకాలు అధిగమింపవచ్చని నాటకం యొక్క ముఖ్య హితోపదేశం. చతుర్థాంకంలో షేకు సాహెబును [illegible] సన్మానం చేయుటద్వారా మత సామరస్యాన్ని బోధిస్తుంది. కొత్త బియ్యంతో చక్రపొంగలి తయారు చేయుమని దయాలు రాధికతో అంటాడు. ఆమె నవాన్న ఉత్సవం రోజున తప్పక తయారు చేస్తా

* ఇది నేషనల్ బుక్ ట్రస్టు ఇండియా వారి ఆధ్వర్యాన క్రింద తెలిగించుట జరిగింది. 29-7-78 నాటికి ఈ అనువాదాన్ని [illegible] నట్లు లిఖిత ప్రతివల్ల తెలుస్తుంది. మూలకర్త విజన భట్టాచార్య

నంటుంది. నవాన్న ఉత్సవంతో నాటకం ముగుస్తుంది. నవాన్న ఉత్సవంతో ముగిసిన ఈ నాటకానికి నవాన్న నామధేయం అన్వర్థంగా ఉంది. ఇందలి ఒక గేయం

ఎదపై గుడ్డకు కరువైపోతే ఇంతి సిగ్గు పడిపోదా
భార్య మాన సంరక్షణ చేసే బాధ్యత మగనిది కాదా
పండిన ధాన్యం నేలరాలితే ఎండును కన్నుల నీరు
గట్టిగ నాగలిపట్టి దున్నితే మట్టిని పండు బంగారు పు 108

అనువాద విషయం

వేదుల దీన్ని మక్కికి మక్కిగా అనువదించారు. తెలుగు నుడి కారంపుసొంపు బీరు పోకుండా వ్యావహారిక భాషలో రచించిన గ్రంథం.

## 4. భాస నాటకములు

"భాషాసు రమ్యా గైర్వాణీ, తస్యాం కావ్యం మనోహరమ్।
తత్రాపి రూపకం రమ్యం, తత్ర భాసకవేః కృతిః॥"[1]

అని ప్రఖ్యాతి పొందిన భాసమహాకవి కవికుల గురువైన కాళిదాసు కంటె పూర్వుడు. "ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవి పుత్రాదీనా" మని ఇతని ప్రశంసను కాళిదాసు గావించడమే పై వ్యాఖ్యానికి ప్రమాణం. ఇట్టి భాసునినాటకాలు ఇరవయ్యో శతాబ్దపు మొదటి దశకంలో వెలుగులోకి రావడం ఆశ్చర్యాస్పదమైన విషయం. 1909వ సంవత్సర ప్రాంతంలో మహా మహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రుల వారు తిరువనంతపురం ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార పక్షమున వీటిని ప్రకటించారు. దీనితో వీరికి భాసనాటక ప్రకటన కర్తలని ప్రశస్తి వచ్చింది. అప్పటి నుండి తెలుగులో వీటి యనువాదం సాగుతునే ఉంది. అయితే ఈ యనువాద కర్తల్లో ప్రథములైన

1. సంస్కృత కవి జీవితము – పుట 67

మానవల్లి రామకృష్ణ కవిగారు భాసనాటకాలు ముద్రణ రూపాన్ని పొందకముందే అనగా తాళపత్ర ప్రతులాధారంగా ఆంధ్రీకరించారు. వేటూరి, చిలకమర్తి, దీపాల ఇత్యాదు లాంధ్రీకర్తలు. వీరిలో భాస నాటకాన్ని పూర్తిగా తెనిగించిన వారు చిలకమర్తివారు మాత్రమే.

ఇక భాసుని రచనలుగా విద్వాంసులు పేర్కొన్న నాటకాలు పదమూడు. అవి కర్ణభారము, దూతఘటోత్కచము, మధ్యమ వ్యాయోగము, బాలచరితము, అవిమారకము, స్వప్నవాసవదత్తము, ప్రతిజ్ఞా యౌగంధరాయణం, పంచరాత్రము, దూతవాక్యము, ఊరుభంగము, అభిషేకనాటకము, చారుదత్తము, ప్రతిమానాటకములు. తరువాత కాలంలో పరిశోధన మూలంగా 'యజ్ఞఫలము' వెలుగులోకి వచ్చింది.

భాసుడు రామాయణ, భారత, భాగవత, లౌకిక గాథల నుండి కథాసూత్రాన్ని గ్రహించి, దానికి తన అద్భుత కల్పనా ప్రతిభను జోడించి, రసవత్తరంగా రూపక నిర్మాణం గావించాడు. ఈ నాటకాలకు విశిష్టమైన ఖ్యాతి రావడానికి కారణాన్ని శ్రీ ఎన్. సి. ఎస్. వెంకటా చార్యులు గారిలా వ్రాశారు.

"భాషచేతను శైలిచేతను భాసుని కవిత్వము మృదుమధురము. వర్ణనలు మనోజ్ఞములు. భాసుని రచనలో ముఖ్య లక్షణములు రెండు. ఒకటి పతంజలి వాక్యముల వంటి చిన్న చిన్న వాక్యములు. అవి మిక్కిలి సహజముగా, సూటిగా శ్రోతల హృదయముల బ్రవేశించును. రెండు రంగస్థల పఠనానుకూలమైన సులభ, సహజ, సుందర శ్లోక రచన. ఈ రెండు లక్షణములును శ్రోతల నాకర్షించి రంగోపజీవులకు విజయము చేకూర్చి భాసనాటకములకు యావద్భారత వ్యాప్తి తెచ్చి పెట్టినవి."[1]

1. 'భాసుడు' సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము_7 పుట 5.

ఇట్టి భాసనాటకాల అనూన మాధుర్యమానోజ్ఞకానికి ముచ్చటపడ్డ వేదుల 1956 నుండి వీటి అనువాదానికి పూనుకున్నారు. అవధానంలో అనువాదాన్ని అలవోకగా చేసే అలవాటున్న వీరికిది మంచినీళ్ళప్రాయం. అలాగని తెలిగించడమంటే మూలంలో ఉన్న ప్రతీపదానికి తెలుగుపదం వచ్చేటట్లు చేయడంకాదు. అలా అనుకోవడం కంటె అవ్యక్తత వేరే ఉండదు. ఒక్కొక్క భాషకు ఒక్కొక్క రకమైన మర్యాద లుంటాయి. తూచాలు తప్పక తెలిగించడం పెట్టుకుంటే ఈ భాషా మర్యాదలు మంట గలిసి పోతాయి. మర్యాదలు పోకుండా తేట తెలుగులో కర్ణభారం, దూతవాక్యం, బాలచరితం, దూత ఘటోత్కచం అనే వాటిని భాస హృదయావిష్కార మయ్యేటట్లు అనువదించారు.

## అ. కర్ణభారం ♦

భాస రూపకాల్లో అత్యల్ప కథా భాగం కలది కర్ణభారం. కర్ణుడు సేనాధిపతిత్వాన్ని వహించి యుద్ధభూమిలో ప్రవేశిస్తూ ఉంటాడు. ఆ సమయంలో ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి సహజ కవచ కుండలాల్ని యాచించి గైకొని పోవడం ముఖ్య కథాంశం.

### భాసుడు చేసిన మార్పులు

వ్యాస భారతంలో అస్త్ర విద్యా సంపాద నార్థియైన కర్ణుడు పరశురామునితో 'నేను బ్రాహ్మణుడ'నని పలికి అసత్యవాది అయ్యాడు. కర్ణభారంలో కర్ణుడు పరశురామునితో 'నేను క్షత్రియుడను గాను' అని అంటాడే కాని 'బ్రాహ్మణుడను' మాట ఎత్తడు. తాను సూతపుత్రుడగుటచే 'క్షత్రియుడను గాను అను మాటలో అసత్యం లేదు. ఎందుచేత నంటే అప్పటి కతనికి తన జన్మ వృత్తాంతం తెలియదు. మూలమున

♦ ఇది ఒక్కటియే కావలి విశ్వోదయ కళాశాల మాగ్జైనులో ముద్రింప బడింది తక్కినవి అసూర్యం పశ్యలుగా ఉండి పోయాయి.

పాండవు లరణ్యవాస సమయంలో ఇంద్రుడు కర్ణుని కవచకుండలాల్ని యాచించినాడు. కర్ణభారమున ఆ పని యుద్ధభూమిలో జరిగింది. మహాభారతంలో కర్ణుడు ఇంద్రుని విమల యను శక్తిని యాచించినట్లు తెలుస్తుంది. భాస నాటకంలో దేవదూత ద్వారా పంపిన విమల యను శక్తిని గ్రహించడానికి కర్ణుడు నిరాకరిస్తాడు. బ్రాహ్మణ వచనంపైగల గౌరవ భావంతో స్వీకరిస్తున్నట్లు కల్పించుట కర్ణుని శీలానికి వన్నె తెచ్చింది.

వ్యాసుని శల్యుడు కఠినభాషి, ఉత్సాహ వినాశి, వాచాలుడు.
భాసుని శల్యుడు సంలాపి, ఉదార మనస్కుడు, స్వామి హితాభిలాషి.

## నామౌచిత్యం

కర్ణుని యుద్ధోత్సాహ భంజక భార పరంపర ఇందలి వస్తువు. మొదట హృదయ పరితాపం, జననీగురు సంఘటించిన వార్తన స్మరణ, పరశురామ శాప వృత్తాంతం, అశ్వాదు లననుకూలంగా నుండుట, ఇంద్రుడు కవచ కుండలాల్ని అర్థించికొని పోవుట ఇందలి కథా భాగాలు. ఒకదానిపై నొకటి గోటి చుట్టుపై రోకటి పోట్లల్లా, ఉత్సాహ భంజక భార వృత్తాంత పరంపర కల్గియుండుటచే 'కర్ణభార' మను శీర్షిక ఔచితీ శోభితం.

## అనువాద విధానం

మూలం —

కర్ణః — దృష్టం మే [illegible] భగవన్!
యాతః క్షిప్రం గజానాం మహామాత్యలోకే
రాజేంద్ర నాశి మమ రణే తో వాహ వద్యః ।
విప్రేంద్ర పాద రజసాం వహితృ స్వాశిః
కర్ణో భవన్తం అహమేష నమస్కరోమి॥ 16వ శ్లోకము

శక్రః — (ఆత్మగతమ్) కిం ను ఖలు మయావక్తవ్యం, యది దీర్ఘాయుర్భవేతి వక్ష్యే దీర్ఘాయు ర్భవిష్యతి. యది న వక్ష్యే మూఢ ఇతి మాం పరిభవతి. తస్మా దుభయం పరిహృత్య కిం ను ఖలు వక్ష్యామి! భవతు దృష్టమ్. (ప్రకాశమ్) భో కర్ణ! సూర్య ఇవ, చంద్ర ఇవ, హిమవాన్ ఇవ, సాగర ఇవ తిష్ఠతు తే యశః. పు 17

అనువాదం

కర్ణుడు — మహాత్మ! ఎంతో సంతోషము
రాజ మకుట మణి విరాజిత పాదుడై
యవనిలో గృతార్థుడనగ బరగి
విప్రపద రజః పవిత్ర శీర్షుడు కర్ణ
డొగి నమస్కరించు చున్నవాడు

ఇంద్రుడు — (తనలో) ఇప్పుడితని నేమని యాశీర్వదింతును? దీర్ఘాయు రస్తని యందునా? దీర్ఘాయు వగునేమో? ఏమియు బలుకక యూరకుందునా నను మూఢుడనని తిరస్కరించునేమో? ఈ రెండును గాక మరేమందును? ఆఁ....దారి కన్పించినది. (ప్రకాశముగా) కర్ణా! సూర్య చంద్రులవలె, హిమవత్సాగరముల వలె నీకీర్తి నిలుచుగాక.

## అనువాద విశేషం

మూలంలో ఉన్న వసంత తిలక వృత్తం అనువాదంలో మూల పదాలతో, పూర్ణభావంతో ఆటవెలది ఒళ్ళో ఒదిగి కూర్చుంది. మూలంలో 'విప్రేంద్ర పాద రజసాతు పవిత్రమౌళిః'అని విడిగా ఉన్న సమాసాల్ని వేదుల 'విప్ర పద రజః పవిత్ర శీర్షుడు'అని ఒకే సమాసంగా కూర్చడం కర్ణుని గొప్పతనాన్ని వ్యంజించే శిల్పం. సంస్కృతంలో 'నమస్కరోమి' అని ఉత్తమ పురుషలో ఉంటే అనువాదంలో 'నమస్కరించు చున్నవాడు' అని ప్రథమ పురుషలో పలుకుట కర్ణుని వినయాతిశయాన్ని వ్యక్తం చేస్తుంది. ఉత్తమ పురుష-ఆత్మోత్కర్ష ద్యోతకం కదా! మూలగద్యంలో సూర్య ఇవ, చంద్ర ఇవ, హిమవాన్ ఇవ, సాగర ఇవ అనుదాన్ని

అనువాదంలో సూర్యచంద్రులవలె, హిమవత్సాగరములవలె అనుటచే వచనానికి సారళ్యానికి భంగంలేని బింకం చేకూరింది.

## ఆ. దూతవాక్యం

ఇది ఏకాంత రూపకం. ఇతివృత్తం ప్రసిద్ధం. నాయకుడు ధీరోద్ధతుడు. రసం వీరం. స్త్రీ నిమిత్తం కాని మహారణం. కనుక ఇది వ్యాయోగ లక్షణ యుక్తం.

### కథా సంగ్రహం

మంత్రశాలలో దుర్యోధనుడు రాజులందరితో సమాలోచించి సైన్యాధిపతిగా భీష్మాచార్యుల్ని అభిషేకించుట, పురుషోత్తముడైన నారాయణుడు రాయబారిగా వచ్చాడని కాంచుకీయుడు చెప్పినా; అతడు ప్రత్యుత్థానం చేయకుండా చిత్రపటాల్ని చూచుట, తరువాత తన అనుమతిపై ప్రవేశపెట్టబడిన దూతయైన వాసుదేవుడ్ని దుర్యోధనుడు పాండవుల్ని అడుగుట, దాయభాగం అడిగిన కృష్ణుడ్ని సుయోధనుడు నిందించి తృణాన్ని కూడ ఈయనని పలుకుట, కురువంశం కొద్దికాలంలో నాశనం కాబోతుందన్న కృష్ణుడ్ని బంధించమని దుర్యోధనుడు దుశ్శాసనాదుల్ని పురి గొల్పుట, వాసుదేవుడు విశ్వరూపాన్ని దాల్చుట, వాసుదేవుడ్ని బంధింపబోయిన రాజులు పాశబద్ధులై పడిపోవుట, కృష్ణుడు చక్రాన్ని పిలిచి సముదాచారం కాదని పంపివేయడం, అతడు వెళ్ళబోయే సమయంలో ధృతరాష్ట్రుడు ప్రవేశించి కాళ్ళపై బడటం, ప్రసన్నుడవు అగుమని కోరిన ధృతరాష్ట్రునితో సరేయని చెప్పి కృష్ణుడు వెడలిపోవుట ఇందలి కథాంశాలు.

### భాసుడు చేసిన మార్పులు

భారతంలో ధృతరాష్ట్రుడు చక్రవర్తి. రాయబార సందర్భంలో సభలో నారదాది ఋషులున్నారు. భాస నాటకంలో చక్రవర్తి దుర్యోధనుడు. సభలో కౌరవులు సామంత రాజులు దక్క అన్యులు లేరు.

భారతంలో దుష్ట వ్యక్తిగా నున్న దుర్యోధనుడ్ని భాసుడు ధీరోద్ధతునిగా చిత్రించాడు.

## అనువాద విధానం

మూలం —

వాసుదేవః — కృష్ణా పరాభవ భువా రిపు వాహినీభ
కుంభ స్థలీ దళన తీక్ష్ణ గదాధరస్య।
భీమస్య కోపశిఖినా యుధి పార్థపత్రి
చండానిలైశ్చ కురువంశవనం వినష్టమ్॥ 14వ శ్లో

అనువాదం —

అరిసేనా గజకుంభ నిర్దళన తీవ్రాటోప దీవ్యద్గదా
ధరుడౌ భీముని ద్రౌపదీ పరిభవోద్యత్ క్రోధ దావాగ్నినా
నర దివ్యాస్త్ర చయ ప్రభంజన వితానంబుల్ రగుల్కొల్పనీ
కురు వంశాటవి యెల్ల దగ్ధమగుబో ఘోరాజి శీఘ్రంబుగన్

## అనువాద విశేషం

పై వసంత తిలకం గజగర్భంలో ఇమిడి పోయింది. శ్లోకంలో భీమునికి పరాక్రమ వ్యంజకంగా దీర్ఘసమాసం వాడబడింది. ఇందలి సమాస గత ధ్వనిని దృష్టిలో ఉంచుకుని భీమునికి, ద్రౌపది అవమానాగ్నికి, అర్జుని అస్త్రాలకు సమాస త్రయాన్ని వాడి పద్యానికి మరింత వాడీ, వేడీ తీసుకుని వచ్చారు వేదుల. మూల శిల్పాన్ని తెలుసుకున్న రచన గనుక పద్యం సారవంతంగా ఉంది. ఇందు పద్య విద్యా రహస్య ముంది.

### ౩. బాలచరితము

ఇది అయిదంకాల నాటకం. నాయకుడు ధీరోదాత్తుడు. అంగిరసం వీరం. కరుణ రౌద్రాదు లంగములు.

## కథా సంగ్రహం

ప్రథమాంకం :- అర్ధరాత్రి అయింది. వసుదేవుడు దేవకీదేవి నుండి శిశువును తీసుకున్నాడు. రెండు పాయలైన యమునా నదిని దాటాడు. అటుకు నందగోపుడు రావాలని కోరకున్నాడు. నందుడు మృత శిశువుతో వచ్చాడు. వసుదేవుడు తనచేతిలోని శిశువును అతని కిచ్చాడు. అతని చేతిలోని మృత శిశువును దీసుకుని మధురానగరానికి బయలుదేరాడు. దారిలో మృత శిశువు బ్రతుకుతుంది. ఆ శిశువును దేవకీదేవి చేతికిస్తాడు.

ద్వితీయాంకం :- కాంచుకీయుడు ప్రవేశించి కంసునితో భూమి కంపించిందనగా అతడు కారణ మడుగుతాడు. వాడు తిరిగి వచ్చి దేవకీదేవి ప్రసవించిందంటాడు. కంసుని ఆజ్ఞపై భటులు స్త్రీ శిశువుని తీసుకుని వస్తారు. కంసు డా శిశువును నరికి వేయగా సగ భాగంపైకి పోగా, సగభాగం క్రింద పడ్తుంది. అంతట పరవారంతో కాత్యాయని ప్రవేశించి కంస కుల నాశనానికి పుట్టానని నిష్క్రమిస్తుంది.

తృతీయాంకం :- దామోదరుడు, సంకర్షణుడు హల్లీసక నృత్త బంధ మాడుతుంటారు. ఇంతలో గోపకుడు ప్రవేశించి అరిష్ట వృషభు డనే రాక్షసుడు వస్తున్నాడని అంటాడు. రాక్షసుని చంపి వేయగా దామకుడు పరుగెత్తుకుని వస్తాడు. అతడు యమున మడుగులో కాళీయుడనే మహాసర్పం పైకి వచ్చిందని చెప్తాడు. దాని పొగరణచ డానికి కృష్ణుడు వెళ్తాడు.

చతుర్థాంకం :- కాళీయుని ఏ ప్రాణికి ప్రమాదం చేయకుండే ట్లు శాసించి అక్కడ నుండి పంపివేస్తాడు. కంసుని ఆజ్ఞపై మధురా నగరంలో జరుగబోయే ధనుర్మహమనే మహోత్సవానికి సంకర్షణ దామోదరులు బయలు దేరుతారు.

పంచమాంకం :- దామోదరుడు మధురానగరంలో ప్రవేశించి మదగజాన్ని, ధనుశ్శాలాధ్యక్షుడ్ని చంపుతాడు. కంసుని ఆజ్ఞతో

యుద్ధానికి వచ్చిన చాణూర ముష్టికుల నిద్దరినీ దామోదర సంకర్షణులు చంపుతారు. పిమ్మట దామోదరుడు కంసుని చంపివేయగా ఉగ్రసేనుడు రాజగుటతో నాటకం సమాప్తమవుతుంది.

## భాసుడు చేసిన మార్పులు

భాగవతంలో శ్రీకృష్ణుడు దేవకీదేవుల అష్టమ సంతానమై యుండగా బాల చరితంలో సప్తమ సంతానంగా మార్చబడింది. యశోదకు మృతశిశువు జన్మించుట, ప్రసవ వేదనచే ఆమె మూర్ఛిత అగుట, మృతశిశువుని పూడ్చడానికి వచ్చిన నందగోపుడ్ని వసుదేవుడు కలిసి కోవడం, బాలకృష్ణుడ్ని నందగోపుని కిచ్చి మృత శిశువుని తీసుకుని వసుదేవుడు మధురానగరానికి బయలుదేరడం, దారిలో మృత శిశువు బ్రతకడం అనేది భాసుడు కల్పించిన విశేషాలు. బాలక్రీడల్లో శ్రీకృష్ణుడు గోపికలతో నెరపిన వినోద శృంగార చేష్టలిందులో లేవు. శ్రీకృష్ణ జననం నుండి కంసవధ వరకున్న చరితం ఇందలి ఇతివృత్తమవడంచే బాల చరితం అనే నామధేయం నాటకానికి పెట్టబడింది.

## అనువాద విధానం

మూలం

వసుదేవః — ఏషా దేవకీ

హృదయే నేహ తతాప్రంగైర్ద్విధా భూతేవ గచ్ఛతి।
యథా నభసి తోయే చ చంద్రలేఖా ద్విధాకృతా॥ 12వ శ్లో

వసుదేవుడు — ఈ దేవకి

సలిలముల యందు నాకాశ తలమునందు
రెండుగా గానబడు చంద్రరేఖవోలె
సుతుని కడ హృదయ మ్మొండు చోట తనువు
గా ద్విధా భూతయై యీమె కానుపించు

## అనువాద విశేషము

ఎగుడు దిగుళ్ళు లేకుండా మూల శ్లోక భావం టంక మత్తికినట్లు తేటగీతిలో అమరింది. మూల విధేయమయ్యీ స్వతంత్ర పద్యంగా ఉండడం వేదుల విశిష్టత.

## ౬. దూత ఘటోత్కచము

ఇది ఏకాంత రూపకం. ధృతరాష్ట్రునికడకు ఘటోత్కచుడు శ్రీకృష్ణుని రాయబారిగా వెళ్ళుట ఇందలి ఇతివృత్తం. పూర్వ గ్రంథాల్లో ఎక్కడా లేని విషయం. అంటే పూర్తిగా భాస కల్పితం. రూపక లక్షణాల చే 'వ్యాయోగము'నకు చెందుతుంది. అట్లని ఉత్సృష్టాంక లక్షణాలు లేకపోలేదు. వీర కరుణాలు ఇందలి రసాలు.

## కథా సంగ్రహం

అభిమన్యుని చావునకు జయద్రథుడు కారకుడయ్యాడని భటుని ద్వారా విన్న ధృతరాష్ట్రుడు 'అతడు చచ్చినాడన్న మాటే' అని అంటాడు. ఆ మాట విన్న దుస్సల యేడుస్తుంది. ఆమెను గాంధారి ఓదారుస్తుంది. ఇంతలో దుర్యోధనాదులు వచ్చి నమస్కరిస్తారు. ఆశీర్వదింపని ధృతరాష్ట్రుడ్ని వారు కారణ మడుగుతారు. దానివల్ల ప్రయోజనం శూన్యమని అత డర్జునుని పరాక్రమాన్ని ఉగ్గడిస్తాడు. ఇంతలో భటుడు ప్రవేశించి అర్జునుని ప్రతిజ్ఞను చెప్తాడు. అర్జునాస్త్రాలిక మిమ్ము పీడవని చెప్తున్న ధృతరాష్ట్రుని సాన్నిధ్యానికి ఘటోత్కచుడు వచ్చి, నమస్కరించి చక్రాయుధుడు సందేశ మంపినాడంటాడు. అది ఏమని అడగ్గా పుత్ర దుఃఖాగ్నికి ప్రాణాలు ఆహుతి గాకుండా నీ యాత్మకు బలం చేకూర్చుకోమనేది శ్రీకృష్ణ సందేశమని ఘటోత్కచు డంటాడు. అంత ధృతరాష్ట్రుడు రాజు లందరిని అర్జునుడు చంపినట్లు భావించవచ్చు అంటాడు. పిదప దుర్యోధనాదులకు ఘటోత్కచునకు వివాదం జరుగుతుంది.

ఘటోత్కచుడు తానిప్పుడు దూతను కానని వాళ్ళను యుద్ధానికి రమ్మంటాడు. అతడ్ని ధృతరాష్ట్రుడు శాంతింప జేస్తాడు. యుద్ధంలో సమాధానమిస్తానని దుర్యోధనుడు శ్రీకృష్ణుడికి ప్రత్యుత్తరం పంపుతాడు. ఘటోత్కచుడు శ్రీకృష్ణుని కడసారి సందేశం వినిపించి వెళ్ళిపోతాడు.

అనువాద విధానం

మూలం

ధృతరాష్ట్రః- ఏకా కులేఽస్మిన్ బహు పుత్రనాథే
లబ్ధానుతా పుత్ర శతాద్విశిష్టా।
సా బాంధవానాం భవతాం ప్రసాదాత్
వైధవ్య మశ్లాఘ్య మవాప్స్యతీతి॥ 16వ శ్లోకము

అనువాదం

ధృతరాష్ట్రుడు

పలువురు పుత్రులున్న కురువంశము నందొక కూతురెట్టులో
కలిగెను సూర్య రాత్మజలకన్న విశేష గుణాఢ్య, యిప్పుడా
మెలతకు నాత్మబంధులగు మీ దయచేత ఘటిల్లనుండె నె
వ్వలన భరింపరానిదగు భర్తృవినా దురవస్థయిమ్మెయిన్

మూలంలో ఎత్తిపొడుపుగా వాడబడ్డ 'భవతాం ప్రసాదాత్' అనేదానికి 'మీదయచేత' అనే అనువాదం మూలకర్త హృదయాన్ని తెలుసుకున్న కవే చేయగలడు. మూలానుసరణంగా సలక్షణంగా రచన సాగిందనడానికి ఇది ఉదాహరణం.

ఇట్లు మూల భావానికి అటుపోటుల్లేని అనువాదాన్ని సరళ సుందరంగా సాగించడంలో జితకాశి వేదుల. ఇట్లు చక్కని చిక్కనైన భాషలో సాగిన ఈ భాస నాటకానువాదాల్ని వెలుగులోకి తేవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## గౌతమీ కోకిల వేదుల సాహిత్య సమీక్ష

### VII ఇతర గ్రంథములు

ఇంతవరకు చర్చించిన గ్రంథాలే కాక విజయప్రభ, బాల సాహిత్యం, రామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర అను గ్రంథాల్ని వేదుల వ్రాశారు. ఈ మూడు గ్రంథాలు 'ఇతర గ్రంథములు' అను పేర గుది గుచ్చబడ్డాయి.

### 1. విజయ ప్రభ ♦

అర్జునునికి గల ఏకాదశ నామాల్లో 'విజయు'డనేది ఒకటి.

"ఎట్టి వారినైన నెదిరిన బోర జ
యంబు గొనుట విజయు డండ్రు నన్ను"[1]

విజయుని యొక్క ప్రభ విజయప్రభ. ప్రభయనగా దీప్తి. విజయుని జీవిత విశేష ఘట్టాల్ని ప్రధానంగా కథావగత భంజకం కాకుండగా మనోరంజకంగా సాగించిన రచన. అనగా విజయుని దీప్తియే ముఖ్యంగా నడిచిన 'భారతకథ'యని భావం. ఇది 23 శీర్షికలుగా విభజింపబడింది. పాండవ జననం, విద్యాభ్యాసం, విద్యా ప్రదర్శనం మొదలైనవి.

బాల బాలికలకు సుబోధకమైన శైలిలో, జాతీయ విశిష్టమైన వ్యావహారిక భాషలో, ఉత్సుకతను రేకెత్తించే కథనంతో భారత కథను కరతలామలకం చేయాలనే ఉద్దేశంతో వ్రాయబడింది. కథా

---

♦ దీన్ని వేదుల 1958లో వ్రాశారు. 12-11-58 ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక దీపావళి సంచికతో 'విజయ ప్రభ' సీరియల్ ప్రారంభమైంది, 7-1-59న వెలువడ్డ సంచికతో ముగిసింది. మొత్తం తొమ్మిది సంచికల్లో వచ్చింది. 1. విరాటపర్వ-చతుర్థాశ్వాసం 141 ప.

కథనంతోపాటు చక్కని వర్ణనలిందు చోటు చేసుకున్నాయి. పాండురాజు నుద్దీపింపజేసిన వసంత వర్ణన.

"వసంతకాలం వచ్చింది. చెట్లు చేమలు చిగిర్చి, పూచి రను పండువు చేస్తున్నవి. కమ్మని వాసనలతో పైరు గాలులు వీస్తున్నవి. గున్నమామిళ్ళ చిగుళ్ళు మేసి కోయిలలు హాయిగా పాడుతున్నవి. తుమ్మెదలు ఆడుతూ పాడుతూ చెట్టు చెట్టుకు పోతున్నవి. సృష్టిలో ఎక్కడ చూచినా వికాసమూ, ఆనందమూ వెల్లివిరిసి పోతున్నది. ప్రకృతిలో కనిపిస్తున్న చైతన్యమూ సౌందర్యమూ చూడడంతోనే పాండురాజు మనసులో ఎన్నడు లేని మోహంవికారం కలిగింది. ఒంటి నిండా పూలు అలంకరించుకొని పూచిన పూదీవెలాగున్న మాద్రిని చూసి అతడు మనసు పట్టలేక ఆమెను కౌగిలించు కున్నాడు."

ఇట్లు మనోరంజకమైన వర్ణనలతో చెపికింపైన ముద్దులు మూట గట్టే వ్యావహారిక భాషలో రచింపబడింది.

కాని ఇట్టి విశిష్టమైన 'విజయప్రభ' గ్రంథ రూపంలో రాక పోవుట ఆంధ్ర సారస్వతానికి, మీదు మిక్కిలి బాలసాహిత్య సరస్వతికి కొంచెం వెలితి అనక తప్పదు.

## 2. బాలసాహిత్యం

వేదుల వంగభాషనుండి అనువదించిన గ్రంథాలలో నిదియొకటి. దీని మూల రచయిత విశ్వకవి రవీంద్రుడు. ఈయన సాహిత్యసృష్టి వైవిధ్య విలసితం. పెద్దల కోసమే కాక పిన్నల కొరకును కలాన్ని నడపాలన్న ఆశయు మాయనది. ఆ ఆశయం తోడనే బాల బాలికల హృదయాల్ని ఆకర్షించే వివిధ విషయాల్ని తీసుకుని వివిధ రీతుల్లో రచనలు గావించారు. ఆ రచనల నుండి లీలా మజుందార్, క్షితీశ్‌రాయ్ అనువారు మేలైన వాటిని కొన్నింటిని ఏర్చికూర్చారు. ఆ ఏర్చి కూర్చిన గ్రంథానువాదమే ఈ బాలసాహిత్యం. ఇందు గ్రంథానికి

ముందు రవీంద్రుని జీవిత కథ పొందు పరచబడింది. దీని మూల రచయిత లీలా మజుందార్. తదనువాదకులు కాటూరి వెంకటేశ్వరావుగారు.

పెద్దల కోసం వ్రాసిన రచనలు పిల్ల లక్ష్యం చేసికొనేటంత అందుబాటులో ఉండవు. కాని పిల్లల్ని దృష్టిలో ఉంచుకుని సృష్టించిన సాహిత్యం పెద్దలకు కూడ ఉపయోగ పడుననుట సామాన్య విషయం. పలురకాలైన కవితలు, కథలు, నాటికలు గల కలగూరగంప పుస్తక గ్రంథం. ఇందు 72 శీర్షికలతో నున్న రచనలున్నాయి.

## అనువాద విధానం

రవీంద్రుడి రచనల్ని రసమయాంధ్రంలోనికి అనువదించిన విధానానికి ఉదాహరణంగా ఒకటి. 'కురిసె వాన' అను శీర్షికలో నున్న గేయంలో కొంత భాగం.

పగటి వెలుతు రంతరించె
భానుబింబ మస్తమించె
ముద్దులాడ చందమామ
మొయిలు గ్రమ్మె గగనసీమ
మబ్బుపట్టె మబ్బుమీద
రంగుతేరె రంగుమీద
కోవెలలో కంచుగంట
కొసరి మోగె వెంటవెంట
ముసురు పట్టె అవలివైపు
ముసుగు పడియె చెట్లతోపు పు. 22

రసవంతంగా సంవిధాన విశిష్టంగా సాగింది యనువాదం. త్రిశ్రగతిని నడుచుటచే దీని అందం ఇనుమడించింది. దీనికి తోడు ప్రతి పాదద్వయానికి వాడిన అంత్యప్రాసవల్ల తత్సౌందర్యం కన్పడి

ముబ్బడి అయింది. ఈ విధ లక్షణాలతో అనేక గేయాలున్నాయి. మచ్చున కింకొకటి. ఇది 'దానిపేరు మోతి బిలము' అను శీర్షికతో నున్న గేయం లోనిది.

సిటికాకి గంతు వేసి
ఎగిరిపోవు మింటికేసి
లకుముకి పిట్ట బుడుంగున
రివ్వున పడును మడుంగున

ఇందు 'బుడుంగున–మడుంగున' అనడంలో ఒక అనిర్వచనీయమైన శబ్దమాధుర్యం పాఠకుల హృదయకోశమంతా అలముకుంటుంది.

గీతాంజలిలో గల ఒక విశిష్ట గీతానికి ఇందు 'ప్రార్థన' అను శీర్షికతో ఉన్న గేయ మొకటి ఉంది. పాదానికి 12 మాత్రలు.

| | |
|---|---|
| Where the mind is without fear and the head is held high; | చిత్త మెచట నిర్భయమో<br>శిర మెచ్చట ఉన్నమితమొ, |
| Where knowledge is free; | ఎచట జ్ఞాన మందరిదో |
| Where words come out from the depth of truth; | వెలువడునో వాక్కులెచట<br>హృదయము లోలోనుండియె |
| .... .... .... | .... .... .... |
| .... .... .... | .... .... .... |
| Into that heaven of freedom my father, let my country awake. | తండ్రీ ఆ సుస్వతంత్ర<br>స్వర్గమ్మున మేల్కొల్పుము<br>సర్వ భారతావనిని పు 176 |

అనువాద విధానం తెలియడానికి ఆంగ్లాంధ్రాల్ని రెండింటిని ఎదురెదురుగా ఇవ్వడం జరిగింది. అనువాద గేయం ఆరు మాత్రలకు విరుగుతూ నడిచింది కనుక రూపక తాళం. ప్రౌఢమూ, నిగూఢమూ అయిన గీతాంజలిలో గీతం ఇందులో చోటు చేసికోవడం వింతగా

ఉండవచ్చు. అనువాద గేయం గూఢత్వపు ముసుగు తొలగించుకుని అర్థ సౌలభ్యంతో బాలురు పాడుకోవడానికి వీలుగా ప్రార్థనగీతమైంది. 'బాల సాహిత్యము' అను గ్రంథనామం సార్థక మయింది.

ఇలా వేదుల గేయ రచనలో పలు పోకడలు పోయారు. ఇక ఈ గ్రంథంలో ఒకేచోట తేటగీతులతో, ఆటవెలదులతో ఉన్న ఖండిక ఉంది. అంటే పుస్తకం మొత్తంమీద పద్యాలున్న ఖండిక ఇది ఒక్కటే. దీని శీర్షికనామం మస్తక విక్రయం. ప్రారంభ మిది.

ఇలను లేడు కోస లేశున కెనవచ్చు
నృపతి యన్న యశము నిండె జగతి
బ్రతికి చెడిన వారి కతడు శరణ్యమ్ము
తల్లి దండ్రి దీనతతి కతండు పు. 285

కోసలరాజు దీనుల పాలిటి తల్లి, తండ్రి. అతనికి సాటి ఎవరు లేరని కీర్తి తెచ్చుకున్నాడు. ఈ వదంతి విని సహించలేని కాశీరాజు కోసల దేశంపై దండెత్తాడు. యుద్ధంలో ఓడిన కోసల రాజు అడవికి పారిపోయాడు. తరువాత లోకానికి బంధువైనవానితో వైరం తెచ్చుకున్న వాడు నగుడు కాడని లోకులనుకొనే వార్త రాజు చెవిని పడింది. ఆ మాట విన్న కాశీరాజు లోక మెవ్వని కోసం బాధపడుతుందో వానిని ఉంచరాదనుకున్నాడు. దానితో కోసలుని పట్టి తెచ్చి ఇచ్చిన వానికి వేయి వరహాలు పసదనాన్ని చాటించాడు. కోశలేశుడడవులో తిరుగుచుండగా సముద్రంలో ఓడ మునిగిపోయిన వర్తకు డొకడు కోసల దేశానికి దారి చూపుమన్నాడు. రాజు కారణ మడిగాడు. వర్తకు డిలా అన్నాడు.

కోసలేశ్వరు డమిత దయా సముద్రు
డనదలకు దిక్కు దీనుల కాప్తబంధు

వసుచు నింటింట నాతని యశము వింటి
అతని వాకిట బడియుండ నరుగు చుంటి
అటకు దారి చూపించి పుణ్యమున బొమ్ము పు 287, 288

అంత కోసలరాజు తెరువరికి తెరువు చూపిస్తానని కాశీరాజు సభకు వచ్చి ఇలా అన్నాడు.

విపిన మందున్న కోసలాధిపుడ నేను
బచ్చితడు నన్ను పణముకై పట్టి తెచ్చె
ఎవడు నను దెచ్చునో వానికిత్తునన్న
బహుమతి యొసంగు మీపేద వర్తకునకు పు. 288

అంత కాశీరాజు

ప్రాణ మర్పించి నను జయింపంగ నిట్టి
పన్నుగడ పన్నితీ వెంత వాడవోర
నీ తలపు సాగనిత్తునో? నీ సరణిసె
ఓడి నిన్ను గెల్చెద నేటి యుద్ధమందు పు. 289

అని జీర్ణవస్త్రుడైన కోసలుని సింహాసనంపై కూర్చుండ బెట్టి, అతని మాసిన తలపై రాజ మకుటు ముంచాడు.

ఇందలి పద్యాలన్నీ మీగడ తరకలు. ఈ విధంగా చెప్పవలసి వస్తే ప్రతి గేయాన్ని, ప్రతి కథానికను, ప్రతి నాటికను ఉదాహరింప వలసి వస్తుంది. పంచదార చిలుకను ఎక్కడ కొరికినా తీపిగానే ఉంటుంది. ఇది అనువాదం కాబట్టి, మీదు మిక్కిలి బాలసాహిత్యం కాబట్టి – సులభమగు శైలి, జాతీయమగు పలుకుబడి, స్వతంత్ర రచన అనేటట్లు ఉండడం కావలసిన విషయాలు.

## 3. రామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర ♦

రామకృష్ణుని జననం మొదలు నిర్యాణం వరకు ఈ గ్రంథంలో వివరింప బడింది. ఇందులోని ప్రకరణాల సంఖ్య 24. కొన్ని ప్రకరణాలకు మాత్రమే మహామారి, రామకృష్ణుడు, మధురబాబు మొదలైన శీర్షిక నామాలున్నాయి. దీనిలో బ్రహ్మపదార్థం, నిష్కామ కర్మ ఇత్యాది వేదాంత విషయాల వివరణ లున్నాయి.

నిష్కామ కర్మను గూర్చి బంకించంద్ర ఛటర్జీతో రామకృష్ణ పరమహంస చెప్పినట్లు ఇరవై ఒకటో ప్రకరణంలో ఇలా ఉంది.

"సంసారి నిష్కామభావముతో ఎవరికైనా దానము చేస్తే అది తనకోసమే కాని పరోపకారము కోసము కాదు. సర్వభూతములందూ ఈశ్వరుడున్నాడని, మానవులకే కాక సర్వజీవులకూ సేవ చేయడము తన కోసమే కాని పరోపకారము కోసము కాదు. గౌరవాన్ని గానీ, కీర్తిని గానీ, స్వర్గాన్ని గానీ, మరే ప్రతిఫలాన్ని గానీ కోరకుండా భూతముల కన్నిటికీ సేవ చేయడమే నిజమైన నిష్కామ కర్మ. దాని వల్లనే మేలు కలుగుతుంది. దాని వల్లనే భగవత్ సాక్షాత్కారము కలుగుతుంది."

ఇలా నిగూఢమైన విషయాలు అరటి పండొలిచి చేతిలో పెట్టి నట్లు ఉన్నాయి.

ఇంతటితో గ్రంథాల ప్రస్తావన ముగిసింది. ఇక మిగిలింది వారి వ్యాస సాహిత్యం.

---

♦ వేదుల అముద్రిత గ్రంథాల్లో ఇది ఒకటి. వీరు 8-10-67న ఈ రచన కుపక్రమించినట్లు లిఖిత ప్రతివల్ల తెలుస్తుంది. వ్రాతలో సుమారు 150 పుటల గ్రంథం.

# VIII వ్యాసములు

వేదుల కవిగా మాత్రమే లోకానికి ఎరుక. వారిని విమర్శకులుగా ఎరింగినవారు అరుదు. వారి వ్యాసాలు పుస్తకరూపంలో రాకపోవడం దీనికి కారణం. ఈ వ్యాసాల్ని మూడు విధాలుగా వింగడింప వచ్చు.

అ వివరణాత్మక వ్యాసాలు ఆ పీఠికా వ్యాసాలు
ఇ ప్రసంగ వ్యాసాలు

## అ. వివరణాత్మక వ్యాసములు

ఒక విషయం గురించిగాని, ఒకవ్యక్తిని గురించిగాని చర్చింపబడ్డ వ్యాసం. వేదుల వ్యాసాలలో 'హాస్యము', 'వీరేశలింగం పంతులుగారి కృషి' అనేవి దీనికి చెందుతాయి.

### 1 హాస్యము[1]

ఈ వ్యాసాన్ని వ్రాయడానికి కారణాన్ని వారే ఇలా చెప్పారు.

"తెలుగులో చక్కని హాస్యము బయలుదేరడానికి ఒడుదుడుకులు లేని దారి చూపినవారు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు. వాడుక భాష వాడుకోవడమునకు భయము తీరిన తర్వాతనే రచయితలు చాలామంది బయలుదేరారు. ఇప్పుడు దేశములో గ్రాంధిక భాషతో గంతులు వేసేవారు కొద్దిమంది. ఇప్పుడు వ్రాస్తున్న వారిని బట్టి శ్రీ రామమూర్తి పంతులుగారి శ్రమ సఫలమయిందని చెప్పవచ్చు. కన్యాశుల్కము, బ్యారిష్టరు పార్వతీశము వంటి గ్రంథాలు మనకు లభించడానికి శ్రీ పంతులు గారి పరిశ్రమే కారణము. అందుకోసమే వారి సప్తతితమ వార్షికోత్సవానికి ఈ వ్యాసము వ్రాయడము మంచిదని తోచింది."

---

1. వ్యాస సంగ్రహం పు 327-337

చక్కని హాస్యం తెలుగులో బయలుదేరడానికి వాడుక భాష వాడుకోవడానికి భయం తీర్చుటద్వారా గిడుగు రామమూర్తి పంతులు గారు కారకులని వేదుల విశ్వాసం. నిజంకూడ అంతే. హాస్యం గురించి చాల విపులంగా చర్చించిన వ్యాసం. హాస్య ప్రయోజనం, నవ్వుల భేదాలు, నవ్వు పుట్టడానికి హేతువులు చెప్పబడ్డాయి. నవ్వుల్లోని భేదాల్ని, ఉదాహరణ పూర్వకంగా చెప్పారు. అనంతరం తెలుగులో హాస్య కావ్యాలు వెలువడక పోవడానికి కారణాలు వక్కాణించారు. చిట్టచివరగా పానుగంటి, చిలకమర్తి, గురజాడ వీరి హాస్యాన్ని గురించి; చాటుధారల, నవలల, కథలలోని హాస్యాన్ని గూర్చి చర్చింపబడింది.

ఈ వ్యాస రచనా సందర్భంలో వీరు చేసిన సిద్ధాంతాలు, విసిరిన విసురులు, ప్రత్యేకంగా గుర్తుంచుకోవడం అవసరం కనుక వాటిలో కొన్ని ఇవి.

"చమత్కారము స్ఫురించే టప్పుడు కూడా నవ్వలేని వాడు హృదయము లేనివాడో, జబ్బువాడో అయి ఉంటాడు."

"హాస రుచి తెలియనివాడి బతుకు దీపపు సెమ్మావంటిది."

"నవ్వించడ మంటే వెక్కిరించడము కాదు. బుద్ధికీ, హృదయానికీ గిలిగింతలు పెట్టేది నిజమైన హాస్యము"

"లలితమైన హాస్యము ప్రియురాలి దంతక్షతమువలె ఉంటుంది."

"వేషములో చేష్టలలో వికారము కనబరచి నవ్వించడముఅంత కష్టమైన పనికాదు. నాటకాలలో, వీథి భాగోతాలలో, పగటివేషాలలో దీని ప్రభావ మెక్కువ. కాని ఇది తరగిన వంకాయ వంటిది. చూస్తుండగానే కసరెక్కిపోతుంది."

"చమత్కారముగా మాట్లాడ గలవారు చాలామంది వ్రాయవలసి వచ్చినప్పుడు సహజమైన తమ శక్తివైచిత్రి చూపలేరు. దానికి కారణము రచనకూ జీవితానికీ సంబంధము లేకపోవడమే."

"ఛందో బద్ధమైన ప్రతిదీ కవిత్వము కానట్లే వెక్కిరింపు ప్రతిదీ హాస్యము కాదు''

"'శుక్లపక్షము' పుస్తకాల జాబితాలో చేరడమునకే గాని మరొక ప్రయోజనము దీనికి లేదు.''

"హాస్య ప్రధానములైన కావ్యాలు మన తెలుగులో తక్కువ కావడానికి కారణము సంప్రదాయ దాస్యము. బానిసలకు స్వాతంత్ర్య రుచి ఎలా తెలుస్తుంది.''

''దాస్యము వల్లనే మన వాఙ్మయము కూడా వెర్రితలలు వేసిన తోటకూర చెట్టు అయిపోయింది.''

''సరియైన దారి తొక్కితే హాస్యదేవతకు ఆలయము కట్టించవలసిన వాడు.'' (కూచిమంచి జగ్గకవి)

''వీరి (పానుగంటివారి) భాష ముదురు బెండకాయ పాకపు గ్రాంథికము.''

ఇవియన్నీ వేదుల వారి నిష్కృష్టమైన అభిప్రాయాలు. ఇందు ఉదాహరించిన గ్రంథాలు వారి బహుగ్రంథ పరిచయానికి తార్కాణం. ఈ వ్యాసంలో జానపద సాహిత్యంలోని హాస్యాన్ని స్పృశింపక పోవడం లోపమే.

## 2. వీరేశలింగం పంతులుగారి కృషి[1]

అజ్ఞానం చేత, ఆచార దాస్యం చేత కుళ్ళిపోయిన సంఘ శరీరానికి ముందుగా చికిత్స చేసినగాని దేశానికి అభ్యుదయం ఉండదని నడుం కట్టి విప్లవ రంగంలో దూకిన వ్యక్తి వీరేశలింగమని వేదుల వర్ణించారు. మరలా ఇలా అన్నారు.

''ఏటి కెదురీదడానికి వెనుదియ్యని స్వభావము గలవాడూ,

1. ''పంతులుగారి కృషి - పు 14, 15

సాహిత్యానికి ప్రజలందరూ వారసులని నమ్మినవాడూ, అభ్యుదయ నిరోధకమైన ఎంతటి ఆచారానికైనా లొంగిపోని వాడూ గదా వీరేశలింగం గారు.''

వేదుల దృష్టిలో వీరేశలింగం రచనల్లో ప్రధానమయింది, శాశ్వతమైంది ఆంధ్ర కవుల చరిత్రం. ఈ రచనకై వారు పడ్డా వ్యయ ప్రయాసలకు తెలుగుజాతి తరతరాలుగా ఋణపడి ఉందని శాస్త్రిగారి అభిప్రాయం.

### 3. 'నామ "—" రహితము'[1]

పిఠాపురం యువరాజా శ్రీ రావు వేంకట మహీపతి గంగాధర రామారావుగారు రచించిన నామ రహిత గ్రంథానికి 'నామ"-"రహితం' అను శీర్షికతో రచించిన సమీక్ష వ్యాసమిది. గ్రంథ నామాన్ని గూర్చి వేదులిలా అన్నారు.

"ఈ గ్రంథానికి పేరు పెట్టలేదు. దేనికైనా వ్యవహారము కోసమే పేరు పెడతాము మనము. కవ్యుద్దిష్టము స్పష్టముగా అవగాహన కావడమునకు గ్రంథమునకు నామకరణము అవసర మంటారు కొందరు. కావలసినవారు పేర్కొనడమునకు అయినా గ్రంథానికి పేరు పెట్టడము వ్యవహార ధర్మము అంటారు మరి కొందరు. అయితే నామ రహితమనేదే ఈ గ్రంథానికి పేరు అని చెప్పవచ్చును. వివిధావస్థలలో కవికి కలిగిన భావాల సంపుటము ఈ గ్రంథము. వస్త్వైక్యము లేనప్పుడు పేరు పెట్టడము వలన వచ్చే ఫలము లేదు."

గ్రంథకర్త గ్రంథానికి పేరు పెట్టక పోవడానికి కారణాన్ని, ఔచిత్యాన్ని వెల్లడించారు. అలాగే గ్రంథ ముద్రణాన్ని గూర్చి, గ్రంథకర్తయైన రామారావు గారి సాహితీ సంపద, రచనా కుశలత, రసజ్ఞతల గురించి వ్యక్తీకరించారు.

---

1. ప్రతిభ. సం. 6

## ఆ. పీఠికా వ్యాసములు

గ్రంథాలకు పీఠికారూపంలో వ్రాయబడ్డ వ్యాసాలీ కోవకు చెందుతాయి.

### 1. కళ్యాణ కింకిణి - ప్రవేశిక

ప్రముఖ కవియైన మల్లవరపు విశ్వేశ్వరరావు గారి కళ్యాణ కింకిణికి 'ప్రవేశిక' పేరు మీదగా వ్రాసిన పీఠిక. మొదట దీని నామౌచిత్యాన్ని ఇలా వివరించారు.

"దీనికి ఈ పేరు పెట్టడములో విశేషము లేకపోలేదు. ఆ విశేషము కళ్యాణ శబ్దములో—

వారి (గోపాలరెడ్డి బెజవాడ) కళ్యాణ సమయాన ఈ 'కళ్యాణ కింకిణి'ని పరిణయోపహారము చేశాడు ఈ కవి కుమారుడు. ఈ కళ్యాణము రెడ్డిగారికీ, కృతి కన్యకకు కూడా—

మరో విశేషము, ఈ కావ్యసృష్టికి ఆవేశము కల్గించినది భావనా జగత్తులోని ఒక స్త్రీ. ఆమె అమృత సౌందర్యమయి. అమర సంగీత నిత్యానంద సంధాయిని. కవనంలో కలగీత మంజు భాషలు, భువనాలందలి సుందరోజ్జ్వల శ్రీలూ, ప్రతిబింబించిన ఈ కావ్యకాంత కూడ అటువంటిదే. మధుర స్వనమూ, మంజుల సౌందర్యమూ ఒలికించేదే అలంకార విశేషమైన కళ్యాణ కింకిణి కూడా. ఆ [illegible] శబ్దము ఈ కృతికి పేరు కావడము హృదయంగమమూ, కావ్యాత్మ వ్యంజకము కూడా—"

కావ్య శీర్షిక సార్థకత్వ సౌందర్యాల్ని ఉగ్గడించడంలో వేదులకు పీఠిక రచనలో గల మెలకువ వ్యక్తమవుతుంది. ఈ సందర్భమందే కవి యొక్క ప్రత్యేకతని ఈ విధంగా వక్కాణించారు.

"కవికి పదునైన హృదయము ఉండాలి. ఉంటేనేకాని దేనినీ ఆవేశముతో అనుభవించలేడు. ఎప్పుడూ కవిహృదయము సౌందర్యము

కోసము అన్వేషిస్తూ ఉంటుంది. లోకము పరిగణించని అల్పాల్ప వస్తువులో కూడా కళాదర్శకుడైన కవికి సౌందర్యానుభూతి దొరుకుతుంది. ఆ అనుభవానికి రూపకల్పన చేస్తుంది సహజమైన భావన. ఆ రూప కల్పన ఎంత సౌందర్యమయము అవుతుందో కవి సృష్టికి అంత విశిష్టత సమకూరుతుంది. అనుభవాన్ని సౌందర్యముతో పొదిగి, నిత్యనూతనమూ, కళామయమూ చేయడమే కవి సృష్టికి ప్రయోజనము."

ఇలాటి విశిష్ట వాక్యాలు కవితాతత్త్వం తెలిసిన ఒక మహా విమర్శకుని కలం నుండి మాత్రమే వెలువడుతాయి. తరువాత గ్రంథంలో గల ఒక్కొక్క ఖండిక వైశిష్ట్యాన్ని గూర్చి సంక్షిప్తంగా వెల్లడించారు.

## 2. పంచవటి - ప్రస్తావన

శిష్యుని పుస్తకానికి వేదుల 'ప్రస్తావన' రూపంలో ఇచ్చిన ఆశీర్వచనం ఇది. "'శిష్యా దిచ్ఛేత్ పరాజయం' అనుకొన గల్గిన నేను కృతార్థుడ"నని ఆనందపడ్డారు. శిష్యుని పేరు మాగాపు సత్యానందం. గ్రంథం పంచవటి. తన్మూలకర్త శ్రీ మైథిలీ శరణగుప్త.

# ఇ. ప్రసంగ వ్యాసములు

సభల్లో, ఆకాశవాణిలో గావించిన ఉపన్యాసాలు ఈ కోవకు చెందుతాయి. ఇవి ముద్రితాలు, అముద్రితాలు అని రెండు రకాలు.

## ముద్రితాలు

## 1. నా గొప్ప రచన[1]

పలురకాల ఫలాల, పుష్పాల రాశిలో ఇది గొప్పదని ఎలా చెప్పగలం అనే ఎత్తుగడతో ఈ వ్యాసం అరంభమైంది. ఏ చెట్టు

---

1. భారతి, జనవరి 1944.

గొప్పది? అన్న అక్బరు ప్రశ్నకు ప్రత్తిచెట్టని వీరబలుని సమాధానం ప్రయోజనం ఉద్దేశించి చెప్పిందనీ, కవి రచన ప్రయోజనానికి అతీతమని వక్కాణించారు. రచనలో గొప్పతనాన్ని నిర్ణయింపవలసిన వ్యక్తి సహృదయుడే కాని, రచయిత కాదని తీర్మానించారు. తల్లికి సంతానం మీదున్న అప్యాయమే కవికి తన రచనలపైనుండి గుణాన్నే కాని దోషాన్ని వ్యక్తం కానీయ దన్నారు. కనుక కవి తనకిష్టమైన దాన్ని చెప్పగలడు గాని ఏది గొప్పదో చెప్పలేడనడం సత్యశోభితమైన సారాంశం.

ఈ సందర్భంలో కవి రచన కుపక్రమించే విధానాన్ని శాస్త్రి గారిలా వివరించారు.

"కవి సృష్టికర్త. జగత్సృష్టిలోని శబ్దమో రూపమో గంధమో రసమో స్పర్శో ఏదో ఒకటి హృదయానికి అపూర్వమైన అనుభవావేశాన్ని కలిగిస్తుంది. ఆ ఆవేశము భావస్థిగత పొంది ఊహగా పరిణమిస్తుంది. ఆ ఊహకు విశ్వజనీనత కలగడానికి ఒక రూపము కల్పించి, జీవముపోసి, ఆనందిస్తాడు కవి. తాను పొందిన మధురానుభవమును ఇతరులకు కూడా కలగడానికి పదాలతో సొగసుగా దాన్ని చిత్రిస్తాడు. అదే రచన. అనుభవించి ఊహించిన రచన నిత్యానందము ఇస్తుంది. ఊహించి అనుభవించిన రచన ఆనందాభాసము కలిగిస్తుంది."

తరువాత 'ఆషాఢ మేఘము' వ్రాయడానికి ముందు కలిగిన అనుభవాన్ని వివరించారు. వెనకటి దానికంటె ఇప్పటి రచన గొప్పగా ఉందని ఎప్పటికప్పు డనుకోవడం కవి లక్షణ మన్నారు. కథా శరీరాన్ని ఆశ్రయించని భావాలకు మాధుర్యమే కాని సౌందర్యం ఉండదట. భావ మౌక్తికాల్ని భక్తి సూత్రానికి గుచ్చి ముక్తావళి తయారుచేశాను కాని భక్తుని సృష్టించ లేకపోయానని తమ రచనలపై అసంతృప్తిని వ్యక్తం చేశారు.

## 2. తిక్కన[1]

'మన్మథ మన్మథా' యని కేతన తన దశకుమార చరిత్రలో తిక్కన్నని సంబోధించడాన్ని బట్టి అతడు రూపసి అన్నారు. 'తిక్క చమూపా' అనే సంబోధనాన్ని బట్టి తిక్కన వైదికు (వేదవేత్త) డైనా యోధుడు కూడ కావడంవల్ల భారత యుద్ధాన్ని నైపుణ్యంతో కన్నులకు కట్టినట్లు రసోచితంగా వర్ణించాడని వ్యాస ప్రారంభంలో చెప్పారు. భారతం వర్ణాశ్రమ ధర్మ పరిపాలనోద్దేశంతో రచింపబడిందనీ, తిక్కన కల్పించిన భారత పాత్రలు తెలుగువారికి అమితాత్మీయా లయ్యాయని ఉగ్గడించారు. కవితకు శిల్పం అని పేరుపెట్టింది తిక్కన అనీ, అతడు మహాశిల్పి అనీ, వాని శిల్పకళాకోవిదత్వం విరాట పర్వంలో వ్యక్త మవుతుందనీ శాస్త్రిగారు సందర్భాను సారంగా ఆయా పర్వాలలోని పద్యాల్ని ఉదాహరిస్తూ ఉపన్యసించారు.

## 3. మన సాహిత్యంలో మార్పులు[2] *

వేదుల ఈ వ్యాసంలో చెప్పిన ముఖ్యాంశాలు.

సాహిత్యం నదీ ప్రవాహం. ఎత్తుపల్లాల్ని బట్టి, అటుంకాల ననుసరించి ప్రవాహగతి మారుతుంది. అట్లే ప్రజల అవసరాల్ని బట్టి, కాలానుసరణంగా సాహిత్యం నడుస్తుంది. ప్రపంచాన్నంతటినీ ఏకం చేసే ప్రధాన సాధనం సాహిత్యమే. ప్రజలకోసం సాహిత్యంకాబట్టి వారి ఆశయాల, ఆచారాల, ఆదర్శాల అభిరుచుల్ని బట్టి ఎప్పటికప్పుడు సాహిత్య గతి మారక తప్పదు. సంస్కృత వ్యామోహాన్ని ప్రతిఘటించి నన్నయ తెచ్చిన మార్పు భారతాంధ్రీకరణం. పలుకుబడిలోనే కాక ఛందస్సులో కూడ మార్పు తెచ్చినవారు శైవకవులు. తెలుగు

---

1. వేదులవారి ఉపన్యాసం - కవిత్రయ కవితా వైజయంతి 25-3-45
2. అభ్యుదయ, మార్చి 1947. * దీన్ని శ్రీ కె. వి. రమణారెడ్డిగారు పంపించారు. వారికి నా కృతజ్ఞతలు.

నుడికారానికి ప్రాధాన్యమిచ్చినవారు తిక్కనాదులు. ధర్మం కోసమో, దేశం కోసమో, మతం కోసమో ఆత్మార్పణ చేసిన మానవ వీరులకు స్థానం కల్పించిన వారు శ్రీనాథాదులు.

మత ప్రబోధం కోసం సాగిన మన సాహిత్యం కాలం మారి పరదేశీయుల తాకిడి కారణంగా నా జాతి, నా దేశం, నా మతం అనే అభిమానం ప్రజలకు కలిగించవలసిన అవసరం ఏర్పడింది. అందుచేతనే సాహిత్య క్షేత్రంలో వీరులు ప్రవేశించారు. తరువాత స్వాతంత్ర్య పోరాటం చోటు చేసుకుంది. కుల, మత, వర్ణద్వేషాలతో మానవత్వం కోలుపోయిన మానవ జీవితంలో శాంతి సౌఖ్యాలు నెలకొల్పి అభ్యుదయ పథంలో నడిపించేది సాహిత్యమే.

## 4 జానపద సాహిత్యం[1]

వ్యాస ప్రారంభంలో తెలుగు జాతికి సంస్కృతంపై వ్యామోహం వల్ల తెలుగు సాహిత్యం తెలుగు ప్రజల జీవిత కల్లోలాల కమ్మని గానానికి ప్రతిధ్వని కాలేదన్నారు వేదుల. సాంఘిక జీవితానికి, మతానికి గల ఎడతెగని సంబంధమే దానికి కారణమంటూ ఇంకా ఇలా అన్నారు.

"సర్వతోముఖమైన జాతి జీవిత వికాసముతో నిండి తొణికిసలాడవలసిన సాహిత్యము మత ప్రయోజనము సాధించడానికి మాత్రమే ఉపయోగపడింది. భారతము కాని, పురాణాలు కాని, ప్రబంధాలు కాని ఆ మార్గాన్నే ధర్మప్రబోధంతో ప్రజలకు వాకట్టు కనుకట్టు కట్టినవి. మహర్షులూ, దేవతలూ, మానవాతీతులూ మన సాహిత్య రంగములో పాత్రలై వెలిశారు. సామాన్య మానవ జీవితానికి ఆ సాహితి కూడా 'అగ్నిశిఖయు బోలె నంటను డాయను, జూడరాని యట్టి' శుద్ధాంత కాంత అయింది.... ఇతి వృత్తములో, భాషలో,

1. సుభాషిణి, ఏప్రియల్ 1951.

ఛందస్సులో కొంత కొత్త మార్పు వచ్చినా మత ప్రచారమే ముఖ్య ప్రయోజనముగా పెట్టుకోవడము వల్ల శైవ కవుల సాహిత్య సృష్టి కూడా తెలుగుజీవిత మధుర కల్లోల గానాన్ని ఆలపించ లేకపోయింది."

తరువాత కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మున్నగు వాటిని పేర్కొంటూ జానపద సాహిత్యానికి, అందలి పాత్రలకి గల సన్నిహిత సంబంధాన్ని ఇలా వ్రాశారు.

"ఆ సాహిత్యములో మన జాతి జీవిత చరిత్ర, మన ఆచార వ్యవహారాలూ, మన కుటుంబాల కష్ట సుఖాలూ, మన పోకడలూ, మన వాలకాలూ, మన అనుభవాలూ, మన అభిరుచులూ, మన ఆశయాలూ, మన ఆదర్శాలూ ఇన్నెందుకు అందులో మనది కానిది ఏదీ లేదు. మనదైనది ఏదీ లేకపోలేదు........ ప్రజా హృదయాన్ని రసోద్రిక్తము చేసి, ఉర్రూత లూగించే ఆ కథలూ, ఆ పాటలూ మన సాహిత్య భాండారములోని వజ్రాల తునకలు, రత్నాల నగలు, బంగారు రేకులు. ఆ సాహిత్య సృష్టిలోని పాత్రలు మనవంటివారే.... మాటల్లో, భావాల్లో, చేతల్లో, వారికీ మనకీ భేదము లేదు."

చివరగా బొబ్బిలి కథలోని ధర్మారాయని రాయబారం, గంగా వివాహంలో గంగా పార్వతుల సంవాదం, సుభద్రసారె మొదలైన గాథల్ని ఉదాహరణ పూర్వకంగా వివరించారు.

## 5 జంఘాల శాస్త్రి[1]

ఇది పానుగంటి లక్ష్మీనరసింహంగారి 'జంఘాల శాస్త్రి'ని గూర్చి వేదుల ప్రసంగించిన వ్యాసం. మొదట సాక్షి సంఘంలో సభ్యుల్ని పేర్కొని, అందు విమర్శకుడే జంఘాల శాస్త్రి అనీ, అతని పేరు సార్థక మైందనీ తెలిపారు. జంఘాలు డంటే వేగంగా నడిచేవాడు. కాళ్ళు అరిగేటట్లు దేశదేశాలు తిరుగుటే పనిగా పెట్టుకున్న వాడు. కనుక

1. కృష్ణాపత్రిక 18-10-1952

సార్థకమే. కైలాస శిఖరం మొదలు కన్యాకుమారి వరకు తిరిగాననీ అతడే చెప్పుకున్నాడు. సాక్షి సంఘంలో పాత్రలు పానుగంటివారి సృష్టి. వారు వచన రచనలో, పాత్ర సృష్టిలో కొత్త పుంతలు తొక్కి భాషకు, జాతికి మహోపకారం చేశారని వెల్లడించారు. సాక్షి వ్యాస రచనా సందర్భంలో వారి మనసులో నున్న వ్యక్తి ఆంగ్లభాషలో 'ఎడిసన్' అని వక్కాణించారు జంఘాల శాస్త్రి లోకానుభవం, అతడు వేసిన వేషాలు, నమ్మకాలు, వక్తృత్వ ప్రతిభ, అక్షరమైత్రి ద్వారా గద్యానికి తెచ్చిన పద్యపు సొగసులు, రామాయణంపైగల అభిమానం, స్త్రీలపైగల అభిప్రాయాలు, వాడుక భాషపై జల్లిన దుమ్ము వీటిని గూర్చి వివరించారు.

## 6. సాహిత్యం - హృదయ పరివర్తనం[1]

ఉపన్యాసానికి ముందు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారిని గూర్చి ఇలా ముచ్చటించారు. తెలుగుజాతి నిద్రాణంలో ఉన్నప్పుడు మహాను భావులు పుట్టినచోటు ఈ బృందావనం. ఇది బందరుకు పూర్వనామం. ముట్నూరి ఆంధ్రజాతి వైతాళికులు. జాతీయత అంటే తెలియని రోజుల్లో ఓనమాలు నేర్పారు. తరువాత లోకంలో సామాన్యుని దృష్టి, కవిదృష్టి భిన్నాలనీ, ఆ భేదమే మానవజాతికి కవి యిచ్చిన అమృత సందేశమనీ, అట్టి సందేశం ద్వారా మానవజాతిలో హృదయ పరివర్తనం కలిగించాలనీ ఉద్ఘాటించారు. మానవజాతి హృదయ పరిణామ పరిపక్వతలకు దోహదం చేయగలిగేది ఒక్క సాహిత్యమే అనీ, మానవజాతికి నిజమైన సంస్కారం కలగాలంటే ప్రజానీకంలో సాహిత్య ప్రబోధం జరగాలనీ ఈ క్రింది వాక్యాలతో ఉపన్యాసాన్ని ముగించారు.

"కవిత్వం అందరికీ తెలియాలట! తెలియటం ఎట్లా? అసంభవ

1. కృష్ణాపత్రిక 2-5-1958

మైన విషయం. హృదయ సంస్కారం ఉంటేనే గాని కవి కావ్యంలో పొదిగిన విషయం తెలియదు. అలౌకిక మైన రసానుభూతి కల్పిస్తాడు కవి. తద్వారా లోకానికి ఆనందం కలుగుతుంది."

## 7. ఎర్రన్న[1]

నన్నయ తిక్కనలనే రెండు మహాసర్రివంతుల్ని కలిపిన అంతర్వాహిని వంటి వారెర్రనగారు. ఎర్రన అరణ్య పర్వ శేషాన్ని నన్నయ కవితారీతులతో పూరించారు. ఉత్తర హరివంశం, నృసింహ పురాణాల రచనా సమయానికి తిక్కన మీద మోజు కలిగింది. స్త్రీ వర్ణనలో ఎర్రన ఔచిత్యం పాటించి, ఉదాత్తత చూపించారని లక్ష్యంగా రుక్మిణీ సౌందర్య వర్ణనాన్ని విశదీకరించారు. ప్రకృతి వర్ణనలో ఎర్రన ముందు ఇంకొక కవిని చెప్పడానికి వీల్లేదని ఉపన్యాసం ముగించారు.

## 8. కవి అనంతరం నిలిచేదే కవిత్వం[2]

నవ్య కవిత్వాన్ని నానా విధాలుగా నగుబాట్లు చేయదలచిన వారే బహిష్కారథం పడుతున్నారంటే కాలానుగుణంగా వస్తున్న మార్పుని గ్రహించడమే కారణం. పాత - కొత్తల మేలు కలయికతో సంఘాన్ని చైతన్యవంతం చేసే కవిత్వానికీ, సారసత్వానికీ ఎప్పుడూ మహోన్నత స్థానం ఉంటుంది.

## అముద్రితాలు

పత్రికల్లో కాని మరెక్కడా ముద్రితం కాని ప్రసంగ వ్యాసాలు ఇందులో చేరతాయి.

---

1. జమీన్ రైతు. వర్ధమాన సమాజం_నెల్లూరు.
2. ఈనాడు, 30-4-67. విజ్ఞాన సమితి నిర్మాతలు మూర్తి శ్రీగారిచ్చారు.

## 1. కవితా పరిణామ దృష్టి[1]

ఆంధ్రకవిత్వం నన్నయతో ఆరంభమైంది. అతని దృష్టి ప్రసన్న కథా కలితార్థయుక్తి; అక్షర రమ్యత. ధర్మబోధకు ఈ తీరైన రచన ఎంతైనా అవసరం. సుగమంగా కథా రూపంలో జాతి నుత్తేజపరచుట ఆనాటి కావ్య లక్షణం. ఆనాటి ఆ ఆదర్శ నిర్వహణకు సంస్కృత పురాణ, ఇతిహాసానువాదం సాహిత్య సమర్చనా తత్పరులకు కర్తవ్య మైంది. 15వ శతాబ్దిదాకా ఎడనెడ కొత్త కల్పనలున్నా ఆ తీరైన రచనలే సాగాయి. ధూర్జటి కాలానికి నత్కీరుని కథలో శివుడు పేర్కొన్న పదబంధం, అలంకారం, రసం ఇత్యాదులు కావ్య లక్షణాలు కావచ్చు. ఇంచుమించు అదే కాలంలో ఉన్న భట్టుమూర్తి 'కేవల కల్పనా కథలు' అనడాన్ని బట్టి స్వతంత్ర కల్పనలు లేనట్టు అర్థమవుతుంది. 19వ శతాబ్దిలో సాంఘికంగా, మత విషయికంగా, రాజకీయంగా, సాహిత్యకంగా కొట్టవచ్చినట్లు మార్పు కన్పిస్తుంది. చతుర్విధ పురుషార్థాల్లో ధర్మమోక్షాలు వదలి అర్థకామాలవైపు లోకం మొగ్గుతుంది. వసుధైక కుటుంబ లక్ష్యాన్ని సాధించడానికి సాహిత్య మొకటే శరణ్యం. కనుకనే 'విశ్వశ్రేయః కావ్యమ్' అనే సూక్తి పుట్టింది.

ఉదాత్తకవిత వస్తువు నాశ్రయించి ఉంటుంది. మను చరిత్రలో సిద్ధునితో ప్రవరుడు 'మీ మాటలు మంత్రంబు'లన్నాడు. 'అభ్యాగతః స్వయం విష్ణుః' అనేది ఆర్యోక్తి. మంత్రం ఈశ్వరాధీనమ్. విష్ణువు వాక్కులు మంత్రాలు. విష్ణువు పాదాలున్న చోటు ప్రయాగ. విష్ణు పాదోద్భవగంగ. మంత్రములు, ప్రయాగ, గంగ అన్న శబ్ద ప్రపంచం వెనుక ఉన్న అర్థాన్ని గమనించాలి. అదియే విశేషం. అందరికీ అర్థం కావాలనే లక్ష్యం కుదరదు. ఇదీ ఈ వ్యాస సారాంశం.

---

1. 15-5-74న వ్రాయబడింది. డా. పోచిరాజు శేషగిరిరావుగారి వల్ల లభించింది. వారికి నా కృతజ్ఞతలు.

## 2. నా సాహిత్య యాత్ర[1]

ఇందులో వేదుల విద్యాభ్యాసం, తొలిపద్యం, మలుపద్యం, అవధానాలు, పోడూరి సంఘటన అనే విషయాలున్నాయి.

## 3. మా గురుదేవులు[2]

ఈ వ్యాసంలో తమ గురుదేవులైన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి వద్ద అంతేవాసిత్వం గురించి ఉంది. దీనిలో వారి గురుభక్తికి శాశ్వత తార్కాణమైన పద్యం ఉంది.

అది కవిత్రయంబొక మహాకవిగా జనియించి యొక్కకేల్
మీద సమస్త భారత సమీకరణం బొనరించినట్టి శ్రీ
పాద కవీంద్రు మ్రొక్కెదను వాగ్వనితా కరపల్లవ ద్వయీ
వాదిత కచ్ఛపీస్వర సబాంధవ బంధుర వాగ్విలాసుసిన్

## 4. నా ఆత్మకథ

ఇందులో వేదుల బాల్యం, అవధాన విశేషాలు ఉన్నాయి.

## 5. నన్నెచోడుని కవితావైభం – ఈ వ్యాసం లభించలేదు.

## వ్యాసాల ప్రత్యేకత

వేదుల సహజంగా కవులగుటవల్ల చెప్పే విషయం కవితా స్ఫోరకంగా ఉంటుంది.

"'అతి వాస్తవిక కవిత' అనేపేర ఒక క్రొత్తపాయ బయలుదేరి నవ్యసాహితీ ప్రవాహములో కలుస్తుంది. సాహితీ వాహిని నీరసించి రసపిపాసువులకు విసుగు పుట్టించిన కాలములో, ఏదో నవజీవనము ప్రసాదించడమునకు ప్రతీచిని ఈ పాయ బయలుదేరింది. ఎక్కడ పుట్టినా ఎలా పెరిగినా తెలుగు సారస్వతక్షేత్రాలకు దీని చలవనేటికి

1. 15-5-74 }
2. 12-12-74 } ఈ రెండు శ్రీ పి. ఎస్. భట్టుగారి ద్వారా లభించాయి. వారికి నా కృతజ్ఞతలు.

లభించింది. దీని పాలిటి తెలుగు భగీరథుడు శ్రీ శ్రీనివాసరావు, తెలుగు యువకవులు ఎందరో ఆ పాయలో మునిగి ఓలలాడు తున్నారు."

దీనిలో ప్రతివాక్యం అలంకారికంగా సాగింది. ఇట్టిదే ఇంకొకటి.

"ఈ సాహిత్యము గ్రాంథికము కాదు. ఆనోటా ఆనోటా పడి అది జాతితోపాటు బ్రతుకుతూ వస్తున్నది. దానికి వారసులు జానపదులు. పల్లెటూరి రచ్చబండలే దానికి నైమిశారణ్యము. బిచ్చగాళ్ళూ, స్త్రీలు, దాసరులు, చెంచెతలు, జంగాలు మొదలైనవారు దానికి సూతులు"

కనుకనే వీరి వచన రచనలు కవితా పేటికలు అనవలసి వస్తుంది. వీరి వాక్య రచన కూడ విశిష్టమైంది. చిన్న చిన్న తునకలు తునకలుగా వాక్యా లుంటాయి. వాక్య రచనలో డొంక తిరుగుడుండదు.

"జానపద సాహిత్యాన్ని గూర్చి ఎంత చెప్పినా తరగదు. అందులో మన చరిత్ర ఎంతో ఉన్నది. మన సంస్కృతి ఎంతో ఉన్నది. అది మన బ్రతుకు పండిన బంగారు పంట. అది మన సాహిత్య భాండారములోని ఆణిముత్యాల కుప్ప."

ఇట్లు భావాన్ని ముక్కుకు సూటిగా చెప్పడంలో, చక్కని వ్యావహారిక భాష నుపయోగించడంలో శాస్త్రిగారి విశిష్టత వ్యక్తమవుతుంది. వీరి వ్యాసాల్లో అక్కడక్కడ, ఎత్తిపొడుపులు చమత్కారాలు కనిపిస్తాయి.

"మన శతక కర్తలు కొంచెము హాస్యప్రియులు. వీథి భాగవతాల గంతులకు అలవాటుపడిన హాస్యలక్ష్మికి ఛందో నాట్యము నేర్పారు. అయినా బండికి కట్టిన గానుగెద్దు వాలకము వచ్చింది."

బండికి కట్టిన గానుగెద్దు వాలక మనడం ఆయనకే చెల్లింది.

"ఏ విషయములోనైనాసరే మార్పును ఒప్పుకోని పెద్దలు ఈ గ్రంథ ముద్రణాన్ని చూడడముతోనే కళ్ళు పెద్దవి చేసి ముఖము చిట్లిస్తారు. ఇది పిఠాపురము యువరాజావారి రచన అని తెలియడము

తోనే చిరునవ్వు తెచ్చిపెట్టుకొనే ధైర్యవంతులు వారు."

చిరునవ్వు తెచ్చి పెట్టుకునే ధైర్యవంతులనడంలోనే ఉంది చమత్కారం.

"జంఘాల శాస్త్రికి పిల్లలున్నారో లేదో తెలియదుకాని పెళ్ళాము మాత్రమున్నది. ఇతడు వింత వింత స్వప్నాలతో కలవరించేటప్పుడు మేలుకొల్పడానికి మాత్రమే ఆ ఇల్లాలు వచ్చేది. ఉన్నచోట తినక, తిన్నచోట నిద్రపోక తిరుగుతూ ఉపన్యాసాలిచ్చే శాస్త్రికి అర్థాంగితో అంతకన్నా సంబంధ ముండడము అనవసరము."

ఇలా చిటిపొటి వాక్యాలతో, నుడికారపు సొంపుతో, మధ్యమధ్య ఎత్తిపొడుపులతో పాఠకుని హృదయాన్ని పట్టుకుని తనవెంట తీసుకుని పోయే రచన చేయుటలో వేదుల సిద్ధహస్తులు.

ఇంతటితో వేదుల సర్వసాహిత్య సమీక్ష సమాప్త మయింది. ఇక మిగిలింది ఆంధ్ర సాహిత్యంలో వారి పీఠం.



## IX వేదుల సాహిత్య పీఠం

### అవధాన సాహిత్యం

నూనూగు మీసాల నూతన యౌవనోదయ యౌగపద్యంగా శతావధానాలు నల్లేరుపై బండి నడకగా సాగించిన వ్యక్తి వేదుల. అవధాన సాహిత్యంలో ఆయన స్థానం భద్రమనడానికి వారు పూరించిన సమస్యలు, పద్యరూప శ్లోకానువాదాలు తార్కాణాలు. తరువాత ఆశుకవితా సన్యాసం తీసుకున్నారు శాస్త్రిగారు. ఈవిషయంలో ఆయన వేగాతి వేగోక్తికి స్వస్తిచెప్పి రమ్యాక్షర క్షోణికి పయనించిన రాయప్రోలు వారి కోవలోకి వస్తారు.

### నవ్యాంధ్ర సాహిత్యం

అచ్చమైన కవిగా వేదుల తలెత్తుకుని భావ కవిత్వ రంగంలో ప్రవేశించడమే చారిత్రక ప్రాధాన్యం కల సంఘటన. దీనికి ప్రధాన ప్రేరకులు కృష్ణశాస్త్రి. గోరుచూచి బొమ్మవేయగల ప్రతిభావంతుడు వేదుల. అంచేత ఆంగ్లకవుల భావనా విశేషాల్ని మిత్రుల ద్వారా అవగతం చేసుకుని భావ కవిగా అగ్ర పీఠానికి ఎక్కగలిగాడు. ఇలా కాకపోతే శ్రీపాద వారసునిగా మిగిలిపోయేవాడు. అప్పుడు మనం ఇంత ఆలోచింపవలసిన పని ఉండేది కాదు. అయితే కృష్ణశాస్త్రి ప్రభావం వేదులపై ఆదిలో ద్యోతమానమైనప్పటికీ ఆయన స్వీయ ప్రతిభ చిత్కాణంగా ఉదీయమానమై దానిని ద్వితీయ స్థానానికి నెట్టేసింది. తద్వారా వేదుల గంభీరమూర్తి విస్పష్టంగా దర్శనమిచ్చింది.

అయితే వారి స్థాన మెట్టిదన్నప్పుడు కొంత తర్జన భర్జన తప్పదు. ఈ విషయంలో విశ్వనాథ

"ఆంగ్లేయ సారస్వతంలో 'గ్రే'యెటువంటి స్థానాన్ని సంపాదించు

కొన్నాడో వేదుల కవి అట్లాంటిది సంపాదించుకొన్నాడు."[1] అని వక్కాణించారు. ఆంగ్ల సాహిత్యంలో 'గ్రే' విద్వత్కవి. కవితా కృషి బహుస్వల్పమైనా అత్యుత్తమ స్థానాన్ని అలంకరించిన కొన్ని పద్యాలు వ్రాశాడు. ఇతని గ్రంథం 'ఎలిజీ రిటెన్ ఇన్ ఎ కంట్రీ చర్చియార్డ్'. ఇది ఉత్తమ స్థాయికి చెందిన శోకయుత ఖండకావ్యం. ఉత్తేజకరమైన, శ్రావ్యమైన భాష ఈతని సొమ్ము. జబ్బుమనిషి. మొత్తం మీద 'గ్రే'తో కొన్ని పోలిక లుండడాన్ని బట్టి 'విశ్వనాథ' ఇలా అని ఉండవచ్చు. కాని 'గ్రే' కంటె వేదుల సాహిత్య పరిధి విస్తృతం.

వేదుల స్థానం మరింత తేట తెల్లం కావాలంటే తెలుగు కవులతో పోల్చిన వారి వాక్యా లవసరం.

"నవ్య సాహిత్య సంసార ప్రసక్తిలో వేలు మడచి లెక్కపెట్ట వలసి వస్తే చట్టున సుబ్బారాయత్రయం, సత్యనారాయణ ద్వయం, కృష్ణ ద్వయం, ఇతి శ్రీశ్రీగా, సాహిత్య స్పృహయాళువు ప్రతి వాడున్ను లెక్క పెడతాడు."[2] అని ఇంద్రగంటివారు

సత్యనారాయణ ద్వయంలో ఒకరు విశ్వనాథవారు; మరియొకరు వేదులవారు. వేదుల స్థానాన్ని ఇంకా స్పష్టంగా తేలుస్తున్న వాక్యాలు.

"'పురా కవీనాం గణనాప్రసంగే' అన్నట్లు భావకవులను లెక్కించ వలసి వస్తే కృష్ణశాస్త్రి వెనువెంటనే వేదులవారు గుర్తుకొస్తారు."[3] అను ఈ శ్రీకాంత శర్మగారి వాక్యానుసారం వేదుల కృష్ణశాస్త్రిగారి తరువాత వెన్వెంటనే గణింపదగిన వ్యక్తిగా కన్పిస్తారు.

కొందరు విమర్శకులకు సర్వకవితా సంభారములందు కృష్ణ శాస్త్రిగారే అగ్రగణ్యులనే భావన ఉంది. కాని అది సరికాదు. కొన్నింట

1. న.సా.స.వా. అధ్యక్షోపన్యాసం భారతి. ఏ. 1940
2. ఇంద్రగంటి 'వేదులవారి దీపావళి' భారతి. ఏ. 1938.
3. సాహిత్య పరిచయం పుట 69

కృష్ణశాస్త్రి అడుగు జాడల్లో వెళ్ళిన వేదుల కొన్ని ఉత్తమ లక్షణాలతో ముందుకు చొచ్చుకు పోయారు. వీ రిరువరి కవిత్వాన్ని గూర్చి సంపత్ రాఘవాచార్యులుగారు ఇలా అన్నారు.

"ఆయన (వేదుల) రచనలలో కృష్ణశాస్త్రిలో లేని చిక్కణత్వం కనిపిస్తుంది. మాటలో బరువూ, సంప్రదాయచ్ఛాయ ఉంటాయి. కృష్ణ శాస్త్రికున్నంత ఆంగ్ల సాహిత్య పరిచయబలం లేనందువల్ల ఆయనలో కనిపించినంత ప్రత్యేకత, ప్రత్యగ్రత ఈయనలో కనిపించవు. కాని సంస్కృత వాణీసౌకుమార్యం అతని రచనలోని ప్రత్యేక గుణం."[1]

ఈ మాటల్ని బట్టి రచనలో చిక్కణత్వం, సంప్రదాయ చ్ఛాయ, సంస్కృత వాణీ సౌకుమార్యం వేదుల విశిష్ట లక్షణాలుగా భావించవచ్చు. ఇంతే కాక 'స్పష్టత'ని వేదుల విశిష్టతగా చెప్తున్న శ్రీకాంత శర్మ గారి వాక్యాలివి.

"వారసత్వం లెక్కకు వస్తే కృష్ణశాస్త్రిగారి మార్గాన్నే విజయవంతంగా – అవసరమైతే మెరుగులు దిద్దుకుంటూ నడిచిన కవి ఈయన. ఎంతగా అనుభూతికి అంకితమై రచనలు చేసినా, సహజంగా ఉన్న సంప్రదాయ పద చిత్రణ ధోరణి శ్రీ వేదులను అస్పష్టత నుండి రక్షించింది."[2]

వేదుల కబ్బిన సంప్రదాయ పదచిత్ర ధోరణి అస్పష్టతా దూషణకు గురైన భావకవిత నుండి రక్షించిందని పై అభిప్రాయం. రాయప్రోలు, దేవులపల్లి వారల కంటె వీరి కవిత్వం సౌలభ్యం, సారళ్యం కలిగి ఉంటుందంటున్న కాటూరి వాక్యాలు

"శాస్త్రి గారికి ఇంగ్లీషు రాకపోవడం మంచిదే అయిందేమో. కాబట్టే వారి కవిత రాయప్రోలు, దేవులపల్లి వారల కవిత కంటె,

---

1. ఖండ కావ్యము–భావ కవిత్వము విజ్ఞాన సర్వస్వము. పుట 783
2. సాహిత్య పరిచయం. పు 69

అందరికీ ఎక్కువ హృదయంగమంగా వుంటుందనుకొంటాను. ఎంతో సహృదయత్వముంటే తప్ప దేవులపల్లి వారి కావ్యముల ఔన్నత్యం బోధపడదు. వేదులవారి పట్ల ఆ చిక్కు లేదు. నవ్య సాహిత్యానికి సౌలభ్యమూ, సారళ్యమూ సమకూర్చి వేదుల వారు గౌతమీ కోకిల మని పేరు పొందారు.''[1]

ఇంచుమించు ఇదే తీరులో భావించిన వారు ఇంకా ఉన్నారు.

"కాటూరి వారన్నట్లు రాయప్రోలు వారికి గల ఆంగ్ల కవితా పరిచయము వేదులవారికి లేదు. రవీంద్రుణ్ణి అనుసరిస్తూ అయితేనేం; ఆంగ్ల కవుల్ని అనుసరిస్తూ అయితేనేం రాయప్రోలు వారు 'ముసుగె గాని మోము గానగరాని' మార్మిక కవిత్వం వ్రాశారు. సత్యనారాయణ శాస్త్రి గారు చేసిన పండిత గురు శుశ్రూష వారి రచన మీదికి మంచు తెరను దిగనియ్యకుండా కాచింది.''[2] అని శ్రీపాదవారు,

"భావకవులయ్యు వీరు గూఢతా మార్మికతల నాశ్రయించినట్లు గానరాదు. చెప్పదలచిన దానిని, నిష్కృష్టముగ, అసందిగ్ధమగు భాషలో చెప్పుట వారి ప్రత్యేకత.''[3] అని కాకర్లవారు అన్నారు.

ఈ పై వాక్కుల్ని బట్టి రాయప్రోలు, కృష్ణశాస్త్రి వీరికంటె భిన్నమైన స్పష్టత అనేది వేదుల ప్రత్యేకతను వెల్లడించే విశిష్టగుణాల్లో ఒకటి అని తెలుతుంది.

వేదుల విశిష్ట కవితా గుణాల్లో మరొకటి మాధుర్యం. దీన్ని గురించి విశ్వనాథవారి మాటలు

"పద్య రచనలో పరమమైన సౌందర్యం తెచ్చిన వాడే కవి, అని - ఆ Blackie (Scotland లో ఉన్న Greek భాషా పండితుడు)

---

1. "కవి—సన్మానము" ప్రతిభ, న.న.స. పుట 325, 326
2. అర్ధ శతాబ్దపు ఆంధ్ర కవిత్వము భారతి. జూలై 1963 పుట 3
3. అధునికాంధ్ర కవితా సమీక్ష. పుట 235

ఉద్దేశం అయినట్లు తెలుస్తుంది. దీని ప్రకారం శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు 'కవి' అన్న శబ్దానికి తగినంతగా ఎవ్వరూ తగరు. ఆయన రచనలోనిది వడబోసిన తియ్యదనం....... అది (మాధుర్యం) శ్రీ వేదులలో కనిపించినంత మధుర మధురంగా మరియొకచోట లేదనే నా ఉద్దేశం''[1] ఈ వాక్యాల్ని బట్టి పరమ మాధుర్య భరితంగా రచన చేయడం అనేది వీరి విశిష్టత.

అది అలా వుండగా, భావ కవులు ప్రేయసీ ఆరాధనలో పడి సమాజాన్ని మర్చి పోయారన్న సమ్మెట దెబ్బ వంటి నిందొకటుంది. అయితే ఇది వేదుల విషయంలో వర్తించదని ఆయా సందర్భాల్లో చెప్పబడింది. దీనికి కాగడా, కాంక్ష ఇత్యాదుల్ని తార్కాణింపవచ్చు.

వేదుల కవితకు మరియొక విశిష్ట గుణం వేదన. ఈ వేదనలో కృత్రిమత్వం ఉండదు. మిగిలిన భావ కవుల కంటె ఈయనలో వేదనా తీవ్రత మిన్న. దానికి కారణం అది వారి నిజ జీవితం నుండి వెలువడుట. అనగా స్వీయ జీవితంలో అనుభవించిన వేదన కవితగా మారింది. "Best poetry is always autobiographical" అను సూక్తికిది లక్ష్యం. కనుకనే

"జీవితం దుర్భరంగా తోచినప్పుడు ఆ కుములుతూవున్న వేదననంతా పొడుకుని ఓదార్పు చెందాడు. అందుచేతను 'షెల్లీ' పలికినట్టు ఈయన అతి తీయని కవిత్వం ఏ తీరని వేదననో కలవరపెడుతుంది."[2] అని ముద్దు కృష్ణగారు

"వేదనామయ కవితకు మరో పేరు వేదుల''[3] అని కడియాలవారు

''కృష్ణశాస్త్రి కవిత కంటె వేదుల కవిత వేదనా భూయిష్ఠం''[4] అని జి. రామమోహన్‌రావుగారు వక్కాణించారు.

---

1. "కవి_సన్మానము" ప్రతిభ, న.న.స. పుట 317
2. వైతాళికులు పుట 296 3. తెలుగు కవితా వికాసం పుట 43
4. ''వేదుల వేదన'' భారతి, జ. 1969 పుట 36

మరియు 'దీపావళి'లో వ్యక్తిగతమైన వేదన మాత్రమే కాదు; విధి వెక్కిరింతలో దెబ్బతిన్న దురదృష్టవంతుల సుకుమార హృదయ పరితాపం కూడ చోటు చేసుకుంది.

"వేదులవారి కవిత్వంలో 'కరుణైక ముగ్ధుల యగాథ హృదంతర బాష్ప మాధురి' అభివ్యక్త మయింది."[1] అని దేశిరాజు కృష్ణశర్మగారి అంతర్యామి దే నేమో!

పద్య సాహిత్య మందే కాక, గేయ సాహిత్యంలో కూడ వారి కలం పసుగులు తీసింది. 'జయము హిమగిరి మణి కిరీటా!, ఈ సముద్ర తటాన, ఓ దివ్య గాయకా!' ఇత్యాదులు గేయ సాహిత్య ప్రపంచంలో వారి కీర్తి పతాకలు.

ఇక శైలి విషయానికి వస్తే నృత్యగీతానునయము, ద్వార తోరణాస్థానము, మధు ప్రవాన ప్రయాణవేళ మొదలైన కర్ణ పేయమైన సంస్కృత సమాసాల్ని ధారాళంగా ప్రయోగించడంతోపాటు, 'చెక్కిన నెలరాల చెరసాల, తూరుపు పైడి మోసాల మ్రోల' ఇటువంటి తెలుగు సమాసాల్ని సృజించిన భాషా విదగ్ధు డాయన.

ఆయన వైశిష్ట్యాన్ని ఉగ్గడిస్తున్న దేవులపల్లి ప్రభాకరరావుగారి మాటలు.

"ప్రచారం తక్కువయినా ప్రశస్త్యం అధికంగా ఉన్న కవీశ్వరుడు........ కేవలం ప్రతిభావ్యుత్పత్తులతో, ఉన్నత భావ గాంభీర్యంతో, ప్రసన్నమైన కవితా శైలితో సృజనాత్మక లోకంలో ఉదాత్త శిఖరాలను అందుకున్న మహాకవి వేదుల."[2]

ఇంతేకాక కథారచయితగా, నాటక కర్తగా, బెంగాలీ సాహిత్యానువాదకునిగా, భాస నాటకాంధ్రీకరణ కర్తగా ఆంధ్ర సాహిత్యంలో వేదుల స్థానం మొక్కవోనిది.

---

1. 'శ్రీ వేదులవారి దీపావళి' సుభాషిణి, ఏ. 1951 పుట 50
2. చెప్పుకోదగ్గ మనుషులు పుట 105

# గౌతమీ కోకిల వేదుల సాహిత్య సమీక్ష

## X ఉపసంహృతి

వేదుల ఆబాల్య ప్రవాసి. శ్రీపాదవారి అంతేవాసి. దేవులపల్లి సహవాసి. నాలుగు పదుల వయసు దాటినగాని తమ కుటుంబానికి నలుబది యెకరాల భూమి ఉందని తెలియని పెద్ద మనిషి. కనుక ఏకాకియై గ్రాసవాసో దైన్యాన్ని అనుభవించిన మహా మనీషి.

ఈయన జీవిత చరిత్ర నేటివారి కెవరికో గాని తెలియదు. అదీకాక ఒక కవి జీవిత, దేశ, కాల పరిస్థితుల ప్రభావం తద్రచనలపై ఉంటుంది. ఆ కారణంగా వారి సాహిత్య పురోగమన నైపథ్యాన్ని సంగ్రహంగా, జీవిత చరిత్రతోపాటు ఆయన వ్యక్తిత్వాన్ని విశదంగా వివరించాను.

నూనూగు మీసాల నాడె 'శతావధాని' అన్న మాటయే కాని తత్సంబంధ పద్యాలు నామ మాత్రానికైన లోకానికి తెలీదు. అయితే నా కృషి ఫలించి పూరించిన సమస్యలు, శ్లోకాలకు ఆశూక్త పద్య రూపానువాదాలు కొన్ని లభించాయి. వాటిని సందర్భాను సారంగా ఉటంకించాను. ఒండు, రెండు గ్రంథాంతంలో అనుబంధించాను.

కవిగారి కవితా విహంగం రెక్క విప్పుకుంటున్న తొలి నాళ్ళలో వెలువడ్డ కవితా ఖండికల్ని సేకరించాను. వాటిని తొలి రచనలు అనే పేరుతో విషయ చర్చ గావించాను.

వేదుల్ని యావదాంధ్రం 'గౌతమీ కోకిల'గా కొండాడుటకు కారణమైన అద్వితీయ కావ్యం 'దీపావళి'ని, కవితా వైవిధ్యానికి ఆలవాలమైన ద్వితీయ కావ్యం 'ముక్తఝరి'ని కలిపి వస్త్వైక్యాన్ని బట్టి కవితల్ని విభజించి, విశదీకరించిన విషయం ఈ సిద్ధాంత వ్యాసానికి ఆయువుపట్టు. మరియు 'ముక్తఝరి' సంతరించుకున్న కవితా శక్తిని వ్యక్తీకరించాను.

ఈ రెండు ఖండ కావ్యాల్లో చేరని చెల్లాచెదురై చెదురు మదురుగా నున్న ముద్రితాముద్రిత ఖండికల్ని 'శేష కవితలు'అనే పేర చేర్చి చర్చించాను.

వేదుల పద్యవిద్యా ప్రవీణులే కాదు. కథాకథన దక్షులని నిరూపించే 'వేదులవారి కథలు'అను గ్రంథంలోని విశేషాలు వివరించాను.

శాస్త్రిగారు ఆబాల్యమభ్యసించిన సంస్కృతాంధ్రాలే కాక నిత్య విద్యార్థి అగుటచే ఆయన యౌవనంలో బెంగాలీ, వార్ధక్యంలో కన్నడం నేర్చుకున్నారు. బెంగాలీ నేర్చుకున్నందుకు ఫలంగా కొన్ని నవలలు, నాటకాలాంధ్రీకరించి, రవీంద్రుడు మొదలగు వారి వైశిష్ట్యాన్ని తెలుగువారి కందించారు. వీటి అన్నింటి అనువాద వైఖరిని వెల్లడించాను.

వేదుల పుట్టుకవియే గాని పుట్టి కవియైన వారు కారు గనుక ఆగని కలము చూపు కైవాలుచున్న ప్రాయంలో 'భాసనాటకాల' వైపు మరలించారు. కర్ణభారం తక్క తక్కినవి మూడు అముద్రితాలు. అందుచే అనువాద నైపుణ్యాన్ని ఉదాహరణ పూర్వకంగా ఉగ్గడించాను

బాల సాహిత్యానికి అలంకారాలైన 'విజయప్రభ', 'బాల సాహిత్యము'లతోపాటు 'రామకృష్ణ పరమహంసజీవిత చరిత్ర' ను జేర్చి 'ఇతర గ్రంథము' లను పేర విషయ వివరణ గావించాను.

సాహితీ ప్రియంభావుకుల ఉపయోగార్థం గ్రంథ రూపంలో రావలసియున్న వారి వ్యాసాల్ని వ్యాసములు, ప్రసంగములు, పీఠికలుగా విభజించి వివేచించాను.

ఒక మహాకావ్యం వ్రాయగల గాఢ ప్రతిభా విశిష్టులైన వేదుల వారి కాలాన్ని అనారోగ్య మొకటి, 'భరమైతోచు కుటుంబ రక్షణకు' సంపాదనార్థమై అనువాద కార్య నిమగ్నత్వ మింకొకటి మ్రింగి వేశాయి. అది ఆంధ్ర సాహిత్య రసజ్ఞుల దురదృష్టం. కాని వారి కీర్తి కెత్తిన పతాకగా 'దీపావళి' ఒకటి చాలు.

జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః



# అనుబంధము - I

## అవధాన పద్యములు

శ్లోకము

యదిందో రన్వేతి వ్యసన ముదయం వా నిధిరపా
ముపాధి స్తత్రాయం జయతి జనికర్తుః ప్రక్రృతితా।
అయం కః సంబంధో యదనుహరతే తస్య కుముదం
విశుద్ధాః శుద్ధానాం ధ్రువ మనభిసంధి ప్రణయినః॥

అనర్ఘ రాఘవమ్. మురారి–ప్రథమాంకః శ్లో 48

ఆనువాదము

సోముడు సత్కళా విభవ శోభితుడై వెలుగొంద నాత్మజ
ప్రేమను పొంగిపోవుట గభీర పయోధికి సాజ మట్టి పొ
త్తేమియు లేని యీ కలువ యేల ముదించునో! ప్రేమ ముగ్ధులౌ
సాముల చేత నీ ముదభిసంధి ఘటిల్లదె యెట్టి వారికిన్.

సమస్య :- మబ్బును జూచి చెర్వు జల మెవ్వండైన వర్జించునా!

పరమన్నన్ నిజమో అబద్ధము సుఖ ప్రాధాన్యమో, కష్ట ని
ష్ఠురమో యెవ్వడెరుంగు నెట్టెదుట సంశోభించు ప్రాపంచ కో
త్తర సౌఖ్యానుభవమ్ము కాదని తనూ తాపమ్ము మైనుంట సం
బరమా, మబ్బును జూచి చెర్వు జల మెవ్వండైన వర్జించునా!



# అనుబంధము - II

## కాల క్రమానుగుణంగా వేదుల గ్రంథాలు

1924 రాణా ప్రతాపసింగు

1927 అపరాధిని

1929 ధర్మపాలుడు

1935 వేదులవారి కథలు

1937 దీపావళి

- ఎక్స్ కాలేజి గరల్

1959 విజయప్రభ

1961 వినోదిని

1962 భాస నాటకాలు

- 1 కర్ణభారము

- 2 దూత వాక్యము

- 3 బాల చరితము

- 4 దూత ఘటోత్కచము

1967 బాల సాహిత్యము

1968 ముక్తఝరి

1968 రామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర

1973 నవాన్న



# అనుబంధము - III

## ఉపజీవికా గ్రంథాలు - ఆంధ్ర గ్రంథాలు


1. అప్పారావు, గురజాడ : గురజాడ రచనలు-కవితల సంపుటం 1984
2. అప్పారావు, గురజాడ : కన్యాశుల్కం 1985
3. అమరేంద్ర (చతుర్వేదుల నరసింహశాస్త్రి): "నవ్యాంధ్ర సాహిత్యంలో భావకవితా విన్యాసం" తెలుగులో పరిశోధన 1983
4. కృష్ణశాస్త్రి, దేవులపల్లి : వ్యాసావళి-1 1982
5. కృష్ణశాస్త్రి, దేవులపల్లి : కృష్ణపక్షము 1983
6. కృష్ణశాస్త్రి, దేవులపల్లి: "పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము" సారస్వత వ్యాసములు_1 1969
7. గంగప్ప, ఎస్ : సాహిత్య సుధ 1981
8. గోపాల కృష్ణమూర్తి, నందుల : ఋతు సూక్తము 1978
9. చంద్రరావు, చోడగిరి : హృదయ వీణ 1968
10. చంద్రశేఖర్, ఎస్జీడి : భావ కవులు-భక్తితత్త్వం 1983
11. చంద్రశేఖరరావు : చంద్రం వ్యాసావళి 1974
12. జానకీరామ్, ఆచంట : సాగుతున్న యాత్ర-1 1962
13. జానకీరామ్, ఆచంట ; సాగుతున్న యాత్ర_2 1963
14. జాషువ, గుర్రం : గబ్బిలము తే. లే.
15. తిక్కన : ఆంధ్ర మహాభారతము_విరాట పర్వము 1971
16. నన్నయ : ఆంధ్ర మహాభారతము-ఆది పర్వము 1971
17. నరసింహశాస్త్రి, నోరి : సారస్వత వ్యాసములు 1979
18. నాగయ్య, జి. : తెలుగు సాహిత్య సమీక్ష 1985
19. నారాయణరావు, వెల్చేరు : తెలుగులో కవితా విప్లవాల స్వరూపం 1978
20. నారాయణరెడ్డి, సి. : ఆధునికాంధ్ర కవిత్వము 1967
21. నిర్మలాదేవి, ఎన్. : దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహితీ సౌరభం 1985
22. పెద్దన, అల్లసాని : మనుచరిత్ర 1960

23. ప్రకాశరావు, శివలెంక : భావకవులు-ప్రతిభా విస్ఫూర్తి 1927
24. ప్రభాకరరావు, దేవులపల్లి : చెప్పుకోదగ్గ మనుషులు 1983
25. ముద్దుకృష్ణ : వైతాళికులు 1972
26. రాఘవేంద్రరావు, జె. వి. : "కాల్పనిక వాదం"
ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు 1982
27. రాఘవాచార్యులు, సంపత్ : "ఖండ కావ్యము-భావ కవిత్వము"
విజ్ఞాన సర్వస్వము 1959
28. రామనాథశాస్త్రి, ధారా : ఆంధ్ర వాఙ్మయము-కృష్ణ కథ 1982
29. రామమోహన్‌రాయ్, కడియాల : తెలుగు కవితా వికాసం 1982
30. రామమోహన్‌రాయ్, కడియాల : కృష్ణశాస్త్రి కవితా వైభవం 1984
31. రామలింగారెడ్డి, కట్టమంచి : ముసలమ్మ మరణం 1900
32. రామానుజరావు, దేవులపల్లి : సారస్వత నవనీతము 1955
33. రామారెడ్డి, ముకురాల : "భావ కవిత-ప్రణయం"
తెలుగు సాహిత్య వికాసం 1979
34. లక్ష్మీకాంతం, పింగళి : గౌతమ వ్యాసములు 1964
35. లక్ష్మీకాంతం, పింగళి : ఆంధ్ర సాహిత్య చరిత్ర 1974
36. లక్ష్మీకాంతం, పింగళి : సాహిత్య శిల్పసమీక్ష 1981
37. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; లక్ష్మీరంజన వ్యాసావళి 1970
38. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; సం. ఆంధ్రదేశ చరిత్ర-భూగోళ
సర్వస్వము 1974
39. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; "తెలుగు వాఙ్మయము"
విజ్ఞాన సర్వస్వం 1959
40. లలిత కుమారి, డి. ; ఆధునికాంధ్ర కవితాతత్త్వము 1980
41. వసుంధరాదేవి పి. ; వేదుల దీపావళి-ఒక పరిశీలన 1981-82
42. వీరభద్రరావు, కొత్తపల్లి ; తెలుగు సాహిత్యముపై
ఇంగ్లీషు ప్రభావము 1926
43. వీరరాఘవస్వామి, త్రిపురారిభట్ల ; ఏకోత్తరశతి 1963

# అనుబంధము - I

## అవధాన పద్యములు

శ్లోకము

యదిందో రన్వేతి వ్యసన ముదయం వా నిధిరపా
ముపాధి స్తత్రాయం జయతి జనికర్తుః ప్రకృతితా।
అయం కః సంబంధో యదనుహరతే తస్య కుముదం
విశుద్ధాః శుద్ధానాం ధ్రువ మనభిసంధి ప్రణయినః॥
అనర్ఘ రాఘవమ్. మురారి-ప్రథమాంకః శ్లో 48

అనువాదము

సోముడు సత్కళా విభవ శోభితుడై వెలుగొంద నాత్మజ
ప్రేమను పొంగిపోవుట గభీర పయోధికి సాజ మట్టి పా
త్రేమియు లేని యీ కలువ యేల ముదించునో! ప్రేమ ముగ్ధలౌ
సాముల చేత నీ ముదభిసంధి ఘటిల్లదె యెట్టి వారికిన్.

సమస్య :- మబ్బును జూచి చెర్వు జల మెవ్వండైన వర్జించునా!

పరమన్నన్ నిజమో అబద్ధమొ సుఖ ప్రాధాన్యమో, కష్ట ని
ష్ఠురమో యెవ్వ డెరుంగు నెట్టెదుట సంశోభించు ప్రాపంచ కో
త్తర సౌఖ్యానుభవమ్ము కాదని తనూ తాపమ్ము మైనుంట సం
బరమా, మబ్బును జూచి చెర్వు జల మెవ్వండైన వర్జించునా.



# అనుబంధము - II

## కాల క్రమానుగుణంగా వేదుల గ్రంథాలు

1924 రాణా ప్రతాపసింగు

1927 అపరాధిని

1929 ధర్మపాలుడు

1935 వేదులవారి కథలు

1937 దీపావళి

- ఎక్స్ కాలేజి గరల్

1959 విజయప్రభ

1961 వినోదిని

1962 భాస నాటకాలు

- 1 కర్ణభారము

- 2 దూత వాక్యము

- 3 బాల చరితము

- 4 దూత ఘటోత్కచము

1967 బాల సాహిత్యము

1968 ముక్తఝరి

1968 రామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర

1973 నవాన్న



# అనుబంధము - III

## ఉపజీవికా గ్రంథాలు - ఆంధ్ర గ్రంథాలు


1. అప్పారావు, గురజాడ : గురజాడ రచనలు-కవితల సంపుటం 1984
2. అప్పారావు, గురజాడ : కన్యాశుల్కం 1985
3. అమరేంద్ర (చతుర్వేదుల నరసింహశాస్త్రి): "నవ్యాంధ్ర సాహిత్యంలో భావకవితా విన్యాసం" తెలుగులో పరిశోధన 1983
4. కృష్ణశాస్త్రి, దేవులపల్లి : వ్యాసావళి-1 1982
5. కృష్ణశాస్త్రి, దేవులపల్లి : కృష్ణపక్షము 1983
6. కృష్ణశాస్త్రి, దేవులపల్లి: "పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము" సారస్వత వ్యాసములు-1 1969
7. గంగప్ప, ఎస్ : సాహిత్య సుధ 1981
8. గోపాలకృష్ణమూర్తి, నందుల : ఋతు సూక్తము 1978
9. చంద్రరావు, చోడగిరి : హృదయ వీణ 1968
10. చంద్రశేఖర్, ఎస్జీడి : భావ కవులు-భక్తితత్త్వం 1983
11. చంద్రశేఖరరావు : చంద్రం వ్యాసావళి 1974
12. జానకీరామ్, ఆచంట : సాగుతున్న యాత్ర-1 1962
13. జానకీరామ్, ఆచంట ; సాగుతున్న యాత్ర-2 1963
14. జాషువ, గుర్రం : గబ్బిలము తే. లే.
15. తిక్కన : ఆంధ్ర మహాభారతము-విరాట పర్వము 1971
16. నన్నయ : ఆంధ్ర మహాభారతము-ఆది పర్వము 1971
17. నరసింహశాస్త్రి, నోరి : సారస్వత వ్యాసములు 1979
18. నాగయ్య, జి. : తెలుగు సాహిత్య సమీక్ష 1985
19. నారాయణరావు, వెల్చేరు : తెలుగులో కవితా విప్లవాల స్వరూపం 1978
20. నారాయణరెడ్డి, సి. : ఆధునికాంధ్ర కవిత్వము 1967
21. నిర్మలాదేవి, ఎన్. : దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహితీ సౌరభం 1985
22. పెద్దన, అల్లసాని : మనుచరిత్ర 1960

23. ప్రకాశరావు, శివలెంక : భావకవులు-ప్రతిభా విస్ఫూర్తి 1987
24. ప్రభాకరరావు, దేవులపల్లి : చెప్పుకోదగ్గ మనుషులు 1983
25. ముద్దుకృష్ణ : వైతాళికులు 1973
26. రాఘవేంద్రరావు, జె. వి. : "కాల్పనిక వాదం"
ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు 1982
27. రాఘవాచార్యులు, సంపత్ : "ఖండ కావ్యము-భావ కవిత్వము"
విజ్ఞాన సర్వస్వము 1959
28. రామనాథశాస్త్రి, ధారా : ఆంధ్ర వాఙ్మయము-కృష్ణ కథ 1982
29. రామమోహన్‌రాయ్, కడియాల : తెలుగు కవితా వికాసం 1982
30. రామమోహన్‌రాయ్, కడియాల : కృష్ణశాస్త్రి కవితా వైభవం 1984
31. రామలింగారెడ్డి, కట్టమంచి : ముసలమ్మ మరణం 1900
32 రామానుజరావు, దేవులపల్లి : సారస్వత నవనీతము 1955
33. రామారెడ్డి, ముకురాల : "భావ కవిత-ప్రణయం"
తెలుగు సాహిత్య వికాసం 1979
34. లక్ష్మీకాంతం, పింగళి : గౌతమ వ్యాసములు 1964
35. లక్ష్మీకాంతం, పింగళి : ఆంధ్ర సాహిత్య చరిత్ర 1974
36. లక్ష్మీకాంతం, పింగళి : సాహిత్య శిల్పసమీక్ష 1981
37. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; లక్ష్మీరంజన వ్యాసావళి 1970
38. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; సం. ఆంధ్రదేశ చరిత్ర_భూగోళ
సర్వస్వము 1974
39. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; "తెలుగు వాఙ్మయము"
విజ్ఞాన సర్వస్వం 1959
40. లలిత కుమారి, డి. ; ఆధునికాంధ్ర కవితాతత్త్వము 1980
41. వసుంధరాదేవి పి. ; వేదుల దీపావళి_ఒక పరిశీలన 1981_82
42. వీరభద్రరావు, కొత్తపల్లి ; తెలుగు సాహిత్యముపై
ఇంగ్లీషు ప్రభావము 1986
43. వీరరాఘవస్వామి, త్రిపురారిభట్ల ; ఏకోత్తరశతి 1963

44. వెంకటరామనరసింహం, కాకర్ల ; అధునికాంధ్ర కవితా సమీక్ష 1982
45. వెంకటాచార్యులు, ఎన్.సి.ఎస్. ; "భాసుడు" సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము 1964
46. వేంకట కవి, చేమకూర ; విజయ విలాసము 1962
47. వేంకటావధాని, దివాకర్ల ; విశిష్ట సభ్యుల ప్రశంస 1972
48. వేంకటావధాని, దివాకర్ల ; ఆంధ్ర వాఙ్మయ చరిత్రము 1977
49. వేమన ; వేమన పద్యములు 1960
50. శివశంకరశాస్త్రి, తల్లావజ్ఝుల ; "శివ శంకరుల సింహావలోకనము" కృష్ణపక్షము 1983
51. శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి ; సాహిత్య పరిచయం 1973
52. శ్రీనివాసరావు, శ్రీరంగం ; "ముత్యాల సరం" సారస్వత వ్యాసములు 1971
53. శ్రీనివాసరావు, శ్రీరంగం ; శ్రీశ్రీ వ్యాసాలు 1983
54. శ్రీరామ అప్పారావు, పోణంగి ; తెలుగు నాటక వికాసము 1967
55. సత్యనారాయణ, విశ్వనాథ ; భ్రష్టయోగి 1970
56. సత్యనారాయణ, విశ్వనాథ ; కేదారగౌళ 1972
57. సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల ; ఆంధ్రరచయితలు 1973
58. ,, ; మధునాపంతుల సాహిత్య వ్యాసాలు 1984
59. సాంబశివరావు, గోపరాజు ; ఆంగ్ల సాహిత్య చరిత్ర 1968
60. సీతారామయ్య, కురుగంటి ; నవ్యాంధ్ర సాహిత్యవీథులు 1942
61. సుబ్బారెడ్డి, మద్దూరి ; తెలుగులో జాతీయోద్యమ కవిత్వం 1982
62. సూర్యనారాయణశాస్త్రి. మల్లాది ; సంస్కృత కవిజీవితము 1950
63 సోమశేఖరశర్మ, మల్లంపల్లి ; విజ్ఞాన సర్వస్వము 1967
64. సోమసుందర్, ఆవంత్స ; కృష్ణశాస్త్రి కవితాత్మ తే. లే.
65 హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి ; "గౌతమీ సాహిత్య – భావాభ్యుదయ రేఖలు" తూ.గో.జిల్లా. రచయితలు ప్రత్యేకసంచిక 1972
66. హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి ; గౌతమీ గాథలు 1981

## సంస్కృత గ్రంథాలు

1. కాళిదాసు ; మేఘ సందేశః 1958
2. కాళిదాసు ; కుమార సంభవమ్ 1969
3. జయదేవుడు ; ప్రసన్న రాఘవమ్ 1972
4. భర్తృహరి ; సుభాషిత త్రిశతి 1986
5. భవభూతి ; మాలతీ మాధవమ్ 1954
6. భవభూతి ; ఉత్తర రామ చరిత నాటకమ్ 1970
7. భాసుడు ; భాసనాటక చక్రమ్
8. మురారి ; అనర్ఘ రాఘవమ్ 1960
9. శ్రీమద్భగవద్గీత ; గోరఖ్‌పూర్ 1976
10. శ్రీహర్షుడు ; నైషధీయ చరితమ్ 1971

## హిందీ గ్రంథాలు

1. నరేంద్ర, సంపా ; భారతీయ సాహిత్య కోష్ం 1981
2. మాఖన్‌లాల్, చతుర్వేదీ ; 'పుష్పకీ అభిలాషా' యుగచరణ్ 1956

## ఆంగ్ల గ్రంథాలు

1. Encyclopedia of Americana 1927
2. Rabindranath Tagore, Gitanjali 1985
3. Shakespeare : Othello
4. Shelly, The complete poetical works of P.B. Shelly 1935

## పత్రికలు

అనసూయ, అభ్యుదయ, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు, ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక, ఉదయిని, కృష్ణాపత్రిక, జమీన్‌రైతు, జయంతి, జ్వాల, ప్రతిభ, భారతి, శారద, సుభాషిణి, దిన పత్రికలు ఆంధ్రపత్రిక, ఈనాడు మొదలగునవి.


—o—